శ్రీరస్తు Andhra Bhagavata

శ్రీమదాంధ్రభాగవతము.

# సప్తమస్కంధము.

టీకాతాత్పర్యసహితము.



Saptama Skandha



చెన్నపురి:

వావిళ్ల: రామస్వామిశాస్త్రులు అన్డ్సన్స్ వారిచే

ప్రకటితము.



**1913.**



శ్రీ రామాయ నమః

# సప్తమస్కంధము.

## టీకాతాత్పర్యసహితము.



మద్విఖ్యాతిలతా
క్రామితరోదోంతరాళ కమనీయమహా
జీమూతతులితదేహా
శ్యామలరుచిజాల రామచంద్రనృపాలా. 1

టీ. శ్రీమ...రాళ=సంపద్యుక్తమైన కీర్తియనెడు తీఁగచే నల్లుకోఁబడిన భూమ్యాకాశముల మధ్యములు గలవాఁడా, కమనీయ...జాల=అందమైన పెద్ద మబ్బులతోఁ బోల్పఁబడిన దేహమందలి నల్లని కాంతులు గల, రామచంద్రనృపాలా=శ్రీరామచంద్ర మహారాజా.

తా. కీర్తి పూరములచే దిక్కులను నింపినవాఁడా, మబ్బును బోలిన నల్లని మేని రంగు గలవాఁడా, ఓ శ్రీరామచంద్ర మహారాజా.

వ. మహనీయగుణగరిష్ఠు లగునమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ
వ్యాఖ్యానవైఖరీసమేతుం డయినసూతుం డిట్లనియె నట్లు
ప్రాయోపవిష్టుం డయినపరీక్షిన్నరేంద్రుండు శుకయోగీం
ద్రు నవలోకించి. 2

టీ. మహా...ష్ఠులు=గొప్ప గుణములచే మిన్నలైనవారు, నిఖిల... తుండు=ఎల్లపురాణములను వివరించు ధోరణిగలవాఁడు, ప్రాయోపవిష్టుఁడు =ప్రాయోపవేశము చేసినవాఁడు,(అన్నపానములు విడిచి మరణమున కెదురు చూచుచుండుట ప్రాయోపవేశము.)

తా. ఉత్తమగుణములు గల యా శౌనకుఁడు మున్నగు మునులకు ఎల్ల పురాణములను జక్కఁగా వివరింపనేర్చిన సూతుఁ డిట్లు చెప్పెను. అట్లు ప్రాయోపవేశము నొందిన పరీక్షిత్తు శుకమహర్షిని జూచి. (పైపద్యముతో నన్వయము.)

సీ. సర్వభూతములకు సముఁడు నెచ్చెలి ప్రియుం
డైన వైకుంఠుఁ డనంతుఁ డాద్యుఁ
డింద్రుని కొఱకు దైత్యేంద్రుల నేటికి
విషముని కైవడి వెదకి చంపె
నసురులఁ జంపంగ నమరులచేఁ డన
కయ్యెడిలాభ మేమైనఁ గలదె
నిర్వాణనాథుండు నిర్గుణుం డగుతన
కసురులవలని భయంబుఁ బగయుఁ

ఆ. గలుగనేర వట్టిసుగుణుఁడు దైత్యుల జంపి
సురలఁ గాచు చునికి చోద్య మనుచు
సంశయంబు నాకు జనియించె మునినాథ
ప్రజ్ఞ మెఱసి తెలియఁ బలుకవయ్య. 3

టీ. నెచ్చెలి=ముఖ్యస్నేహితుఁడు, వైకుంఠుఁడు = విష్ణువు, అనంతుఁడు=తుదలేనివాఁడు, దైత్యేంద్రులు=రక్కసుల దొరలు, విషముఁడు, కుపితుఁడు, అసురులు = రాక్షసులు, అమరులు = దేవతలు, నిర్వాణనాథుండు=మోక్షమునకుఁ బ్రభువు, చోద్యము = అచ్చెరువు, మునినాథ = మునులకుఁ బెద్దయైనవాఁడా.

తా. మునీశ్వరా! అన్నిజంతువులకు సమానుఁడు, నెయ్యుఁడు, బంధువు నైన విష్ణు వింద్రునికొఱకై రాక్షసుల నెల్లరను, మోసకాని విధమున నేల చంపెను. రాక్షసులను జంపి దేవతలను కాపాడిన దనకేమి లాభము? ఎల్ల జీవులకు ముక్తినిచ్చు విష్ణువునకు రాక్షసుల వలన భయము, విరోధము కలుగునా లేదే. అట్టివాఁడయ్యును మమకారము గలవానివలె రాక్షసులఁ జంపుట దేవతల మనుపుటయుఁ జూడఁ జిత్రముగా నున్నది. దీనివలన నాకు సందియము గలుగుచున్నది. నీ యెఱిఁగినంతవట్టు నా సంశయమును దీర్చి విష్ణుకథలు చెప్పుము.

వ. అనిన శుకుఁ డిట్లనియె. 4

శా. సంప్రశ్నము వర్ణనీయము గదా నిక్కంబు రాజేంద్ర ల
క్ష్మీసంభావ్యునిసచ్చరిత్రము మహాచిత్రంబు చింతింపఁ ద
ద్దాసాఖ్యానము లొప్పు విష్ణుచరణధ్యానప్రధానంబు లై
శ్రీసంధానము లై మునీశ్వరవచోగేయమానంబు లై. 5

టీ. సంప్రశ్నము = అడుగుట, వర్ణనీయము = మెచ్చుకొనఁదగినది. నిక్కంబు=నిజము, లక్ష్మీ...త్రము, లక్ష్మిచే సేవింపఁదగిన విష్ణుని మంచి కథ, తద్దాసాఖ్యానములు=ఆవిష్ణునిభక్తుల కథలు, విష్ణు...బులు=విష్ణువు పాదముల చింతనమే ముఖ్యధర్మముగాఁ గలవి, శ్రీసంధానములు=శుభప్రదములు, మునీశ్వర...నంబులు=మునుల వాక్కులచే వర్ణింపఁబడునవి.

తా. పరీక్షిన్మహారాజా! చాల మంచిప్రశ్న మడిగితివి. నీ వనినది నిజమే. విష్ణునికథలు ఆశ్చర్యములైనవి. విచారింపఁగా విష్ణుభక్తుల కథలును అట్టివే. వానికి విష్ణుని పాదసేవనమే ముఖ్యము. అవి వినువారికి సకల సంపదలను ఇచ్చును. మునులు ఎల్లప్పుడు వానిని పాడుచుందురు.

క. చిత్రంబులు త్రైలోక్యప
విత్రంబులు భవలతాలవిత్రంబులు స

న్మిత్రంబులు మునిజనవన
చైత్రంబులు విష్ణుదేవుచారిత్రంబుల్. 6

టీ. విష్ణు...త్రంబుల్ = శ్రీహరికథలు, త్రైలోక్య పవిత్రంబులు= ముల్లోకములలో పావనములైనవి, భవ...బులు = సంసారపుఁ దీఁగెలకు కొడవండ్లవంటివి, సన్మిత్రంబులు=మంచివారలఁ బ్రేమించునవి, ముని...బులు=మును లనునడవులకు చైత్రమాసములు (చైత్రము అడవిని వికసింపఁ జేసినట్లు ఇవి ముని మానసముల నలరించును.)

వ. నరేంద్రా కృష్ణద్వైపాయనునకు నమస్కరించి హరికథనంబులు సెప్పెద వినుము వ్యక్తుండు గాక గుణంబులు లేక ప్రకృతిం జెందక భవంబుల నొందక పరమేశ్వరుండు దన మాయవలన నయినగుణంబుల నావేశించి బాధ్యబాధకత్వంబుల నొందు నతండు గుణరహితుండు సత్త్వరజస్తమంబులు ప్రకృతిగుణంబు లాగుణంబులకు నొకొక్క కాలంబున హానివృద్ధులు గల వాయీశ్వరుండు సత్త్వంబున దేవఋషులను రజోగుణంబున నసురలను దమోగుణంబున యక్షరక్షోగణంబులను విభజించె సర్వుండు పెక్కుపలం గానంబడియు నొక్కరుండయున తెఱంగున నద్వితీయుండును సర్వగతుండయ్యును భిన్నుండు గాఁడు సత్త్వాదు లయినపెద్దలు దమలోనం బరమాత్మస్వరూపంబున నున్నయీశ్వరు నివ్విధంబున నెఱుంగుదురు జీవాత్మకుఁ బరుం డైనసర్వమయుండు తనమాయచేత విశ్వంబు సృజియింపం గోరి రజంబును క్రీడింపం గోరి సత్త్వంబును నిద్రింపం గోరి తమంబును నుత్పాదించి చర మైనకాలంబును సృజియించు నాకాలంబున సర్వదర్శనుం డయినయీశ్వరుండును గాలాహ్వయుండును

నై హరి సత్త్వగుణం బయిన దేవానీకంబునకు వృద్ధియు రజ
స్తమోగుణము లయిన రాక్షసులకు హానియుం జేయుచుండు. 7

టీ. కృష్ణద్వైపాయనునకున్ = వేదవ్యాసునకు, హరికథనంబులు = విష్ణునికథలు, వ్యస్తుండు, కనఁబడువాఁడు, ప్రకృతి = మాయ, భవంబులు = పుట్టువులు, ఆవేశించి = చొచ్చి, బాధ్యబాధకత్వంబులన్ = బాధింపఁదగినది బాధించువాఁడు అను భావములను, గుణరహితుఁడు = గుణములు లేని వాఁడు, ప్రకృతి గుణంబులు = మాయాగుణములు, దేవ ఋషులను = దేవులను, ఋషులను, అసురులను = రాక్షసులను, యక్ష రక్షోగణంబులను = యక్షులయు రాక్షసులయు గుంపులను, విభజించెన్ = వేఱుచేసెను, పెక్కుడలన్ = పలుతావుల. ఒక్కరుండు = ఒకఁడు, సర్వగతుండు = అన్నిటి యందు నున్నవాడు, భిన్నుండు = వేఱైనవాఁడు, తత్త్వవిదులు = నిజ మెఱిఁగినవారు, సర్వదర్శనుండు = అన్నిటిని గాంచువాఁడు, కాలాహ్వయుండును = కాలుఁడను పేరుగలవాఁడు, దేవానీకంబునకున్ = దేవతలమూఁకకు, వృద్ధి = పెంపు, హాని = నాశము.

క. జననాయక యీయర్థము
ఘనయశుఁడగు ధర్మజునకుఁ గ్రతుకాలమునన్
మును నారదుండు సెప్పెను
వినిపించెద వినుము చెవులు విమలత నొందన్. 8

టీ. జననాయక = రాజా, ఈయర్థము = ఈసంగతి, ఘనయశుఁడు = దట్టమైనకీర్తిగలవాఁడు, క్రతుకాలమునన్ = యజ్ఞము సేయువేళయందు, మును = పూర్వము, విమలత = పావనత్వము.

తా. పరీక్షిన్మహారాజా! ఇప్పుడు నీ వడిగినసంగతినే ధర్మరాజు యజ్ఞము చేయునప్పుడు నారదుఁడాతని కుపదేశించెను. దానినే నీకుఁ జెప్పెద వినుము. విని చెవులపండువు చేసికొనుము.

వ. మున్ను ధర్మరాజు సేయు రాజసూయయాగంబున బాలుండైన శిశుపాలుండు హరిని నిందించి నిశితనిర్వక్రచక్రధారాదళితమస్తకుండయి తేజోరూపంబున వచ్చి హరిదేహంబు సొచ్చినం జూచి వెఱఁగుపడి ధర్మజుండు సభలోనున్న నారదుం జూచి యిట్లనియె. 9

టీ. హరిని = విష్ణువును, నిశిత...కుండు = వాఁడియగు గుండ్రని చక్రముయొక్క అంచులచేఁ బ్రద్దలు చేయఁబడిన తల గలవాఁడు, వెఱఁగుపడి = ఆశ్చర్యమునంది.

ఆ. ఎట్టివారికైన నేకాంతులకునైన
వచ్చి చొరఁగ రాని వాసుదేవు
తత్త్వమందుఁ జేదిధరణీశుఁ డహితుఁడై
యెట్లు సొచ్చె మునివరేణ్య నేఁడు. 10

టీ. ఏకాంతులకున్ = అంతరంగ భృత్యులకును, చొరఁగన్ = ప్రవేశించుటకు, రాని.. మందు = అలవికాని విష్ణుతత్త్వమందు, చేదిధరణీశుఁడు = చేదిదేశ ప్రభువగు శిశుపాలుఁడు, అహితుఁడు = పగవాఁడు, మునివరేణ్య = మునులలో మిన్నయగువాఁడా.

తా. నారదా! ఏలాటివారికైనను, ఎంత యంతరంగభక్తులకును, సులభముగా ప్రవేశించుటకు వీలుగాని విష్ణుతత్త్వమునందు పగవాఁడైన ఈ శిశుపాలుఁడు ఐక్యమొందినాఁడే. ఇది యెట్లు? సెలవిండు.

ఉ. వేనుఁడు మాధవుం దెగడి విప్రులు దిట్టిన భగ్నుఁడై తమో
లీనుఁడు గాఁడె తొల్లి మఱి లిప్తుఁడు చైద్యుఁడు పిన్ననాఁటనుం
డేపని మాధవున్ వినసహింపఁడు భక్తి వహింపఁ డట్టివాఁ
డేవిధప్రభావమున నీపరమేశ్వరునందుఁ జొచ్చెనో. 11

టీ. తొల్లి = మునుపు, వేనుఁడు = ఒకరాజు, మాధవున్ = విష్ణుని, తెగడి = దూషించి, విప్రులు = బ్రాహ్మణులు, తిట్టినన్ = శపింపఁగా, భగ్నుఁ

డై = కూలినవాఁడై, తమోలీనుఁడుకాఁడే = నరకమునఁబడఁడా, మదలిప్తుఁడు=పొగరుగొని యున్నవాఁడు, చైద్యుఁడు = శిశుపాలుఁడు, పిన్ననాఁటనుండేనిన్ = చిన్నతనమునుండియు, సహింపఁడు, ఓరువఁడు, ఏనిబిడప్రభావమునన్ = ఏపూర్ణమైన మహిమవలన, చొచ్చెనో = ప్రవేశించెనో.

తా. మునీంద్రా! మునుపు వేనుఁడనురాజు క్రొవ్వి విష్ణు దూషణము చేసి, బ్రాహ్మణులు శపింపఁగా చచ్చి నరకమునఁ బడలేదా, ఈ పొగరుబోతుమాత్రము అంతకంటె తక్కువవాఁడా, వీఁడు పుట్టినదిమొదలు విష్ణువునందు భక్తి సేయఁడు సరిగదా పేరుకూడ విననొల్లఁడే. ఇట్టి దురాత్ముఁడు ఏమహిమచే కృష్ణునిలో నైక్యమొందెను?

మ. హరిసాధింతు హరిన్ గ్రసింతు హరిప్రాణాంతంబునొందింతు
దాహరికిన్ వైరినటంచువీఁకపటురోషాయత్తుఁడై యెప్పుడుం
దిరుగుం బ్రువ్వదునోరు ప్రీలిపడ దాదేహంబు దాహంబుతో
నరకప్రాప్తియునొందఁ డేక్రియ జగన్నాథుం బ్రవేశించెనో.

టీ. సాధింతున్ = ఓడింతును, గ్రసింతున్ = మ్రింగుదును, ప్రాణాంతంబున్ = ప్రాణనాశమును, వైరిన్ = శత్రువును, పటు...త్తుఁడై = స్ఫుటమైన కోపము గలవాఁడై, ప్రువ్వదు = పుచ్చిపోదు, ప్రీలిపడదు = విఱిగి కూలదు, దాహంబుతోన్ = యాతనతో, నరకప్రాప్తియున్ = నరకమందుటను, ఏక్రియన్ = ఏలాగున, జగన్నాథున్ = జగదీశ్వరుఁడగు విష్ణువును.

తా. అయ్యా! వీఁడు విష్ణువు నోడింతును. కృష్ణునిఁ బట్టుకొందును. వానిఁ జంపెదను. విష్ణువు నాకు పరమశత్రువు అనుచు చలము బూని తిరుగుచుండునే వీనినోరు పుచ్చలేదే. వీని దేహము తునకలు కాలేదే. వీఁడు మహాబాధతో పాపమునఁ బడిపోవక కృష్ణునిలో చేరనాఁడే దీని కేమి హేతువు?

వ. అదియునుం గాక దంతవక్త్రుండును వీఁడును నిరంతరంబు
గోవిందు నింద సేయుదురు నిఖిలజనులు సందర్శింప నేఁడు

వీనికి విష్ణుసాయుజ్యంబు కలుగుట కేమిహేతువు వినిపింపుము పవనచలితదీపశిఖయునుంబోలె నాహృదయంబు సంచలించుచున్న దనిన ధర్మనందనునకు నారదుం డిట్లనియె. దూషణభూషణతిరస్కారంబులు శరీరంబునకుం గాని పరమాత్మకు లేవు శరీరాభిమానంబునం జేసి దండవాక్పారుష్యంబులు హింస యై తోఁచు కతంబునను నేను నాయది యనియెడువైషమ్యంబును భూతంబులకు శరీరంబునందు సంభవించు నభిమానంబు బంధంబు నిరభిమానుం డై వధించినను వధంబు గాదు కర్తృత్వ మొల్లనివానికి హింసయు సిద్ధింపదు సర్వభూతాత్మకుం డైనయీశ్వరునికి వైషమ్యంబు లేదు గావున. 13

టీ. దంతవక్త్రుండు=శిశుపాలునితమ్ముఁడు, నిరంతరంబు=ఎల్లప్పుడు, గోవిందుని = కృష్ణుని, సందర్శింపఁగా = చూచుచుండఁగా, విష్ణుసాయుజ్యంబు=విష్ణువుయందైక్యముగుట, పవనచలితదీపశిఖయునుంబోలె=గాలికి కొట్టుకొను దీపపుకొనవలె, హృదయంబు=మనస్సు, సంచలించుచున్నది = కలఁతనొందుచున్నది, దూషణ... బులు=తెగడుట పొగడుట అవమానించుటయు, దండవాక్పారుష్యంబులు=ఒకరిని శిక్షించుట కఠినముగా మాటలాడుట, వైషమ్యంబు=వికారము, నిరభిమానుండు=అభిమానము లేనివాఁడు, వధంబు=చంపుట, కర్తృత్వము=చేయువానిభావము, ఒల్లనివానికి = ఇష్టపడనివానికి, సిద్ధింపదు=కలుగదు, సర్వభూతాత్మకుఁడు = ఎల్లజంతువుల యాకారము దాల్చినవాఁడు, వైషమ్యంబు=భేదభావము.

ఆ. అలుక నైనఁ జెలిమి నైనఁ గామంబున
నైన బాంధవమున నైన భీతి
నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁ డగుహరిఁ
జేర వచ్చు వేఱు సేయఁ డతఁడు.

టీ. అలుక=కోపము, చెలిమి = స్నేహము, కామము = కోరిక, బాంధవము=చుట్టరికము, భీతి=భయము, తగిలి=పూని, అఖిలాత్ముఁడు= సర్వభూత స్వరూపుఁడు.

తా. విరోధమునఁగాని విహితమునఁగాని కోరికచేఁగాని, చుట్టరికముచేతఁగాని, భయమువలనఁగాని, విడువక హరినామస్మరణము జేసినచో సర్వరూపుఁ డగువిష్ణువు తానై దగ్గఱఁ జేరును. వేఱు సేయఁడు.

క. వైరానుబంధనంబునఁ
జేరినచందమున విష్ణుఁ జిరతరభక్తిం
జేరఁగ రా దని తోఁచును
నారాయణభక్తియుక్తి నాచిత్తమునన్. 15

టీ. వైరానుబంధనంబునన్=విరోధముయొక్క పూనికతో, చేరిన చందమునన్=పొందినట్లు, చిరతరభక్తిన్=చాలకాలము చేయఁబడిన భక్తిచేత, నారాయణభక్తియుక్తిన్=భగవంతుని యందుఁ గలభక్తియోగమువలన.

తా. ధర్మరాజా! పగగొని సాధించి విష్ణువును జేరునంత త్వరగా భక్తివలన విష్ణుసాయుజ్యము దొరకదని నామనము. ఇది నేను చాలరోజులుగా విష్ణునియందు భక్తిగలిగి, అనుభవమువలన చెప్పినమాట.

క. కీటకముఁ దెచ్చి భ్రమరము
పాటవమున బంభ్రమింప భ్రాంతం బై
తత్కీటకము భ్రమరరూపముఁ
బాటించి వహించుఁ గాదె భయయోగమునన్. 16

టీ. భ్రమరము = తుమ్మెద, కీటకమున్ = పురుగును, పాటవమునన్=దిట్టతనముతో, బంభ్రమింపన్=తిరుగగా, భ్రాంతంబు = కలవరపడినది, భ్రమరరూపమున్ = తుమ్మెదయొక్క యాకారమును, పాటించి= విడువకచూచి, భయయోగమునన్ = భయముయొక్క సంబంధముచేత, వహించున్=తాలుచును.

తా. తుమ్మెద యొక పురుగును బట్టికొని, ఝూంకారము సేయుచు తిరుగఁగా నాపురుగు భ్రాంతి నొంది, భయముతో నా తుమ్మెదనే విడువక చూచి తానుగూడ తుమ్మెద యగుటలేదా.

వ. ఇవ్విధంబున.

శా. కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు భక్తి నేము నిటు చక్రిం గంటి మెట్లైన ను
ద్దామధ్యానగరిష్ఠుఁ డైనహరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా. 18

టీ. కామోత్కంఠతన్ = మన్మథవికారమువలని యుబ్బునఁ, వైరక్రియా సామగ్రిన్ = విరోధపుఁజేఁతలబలమున, శిశు...పతుల్ = శిశుపాలుఁడు మున్నగు రాజులు, సంబంధులు = చుట్టములు వృష్ణులున్ = యాదవులును, ఏము = మేము, చక్రిన్ = (చక్రమును ధరించిన) విష్ణువును, కంటిమి = పొందఁగలిగితిమి. ఉద్దామధ్యాన గరిష్ఠుఁడు = మించిన ధ్యానముచే గొప్పవాఁడు, ధాత్రీశ్వరా = ధర్మరాజా.

తా. ధర్మరాజా! మన్మథవికారముచే గోపికలును, ప్రాణభయముచే కంసుఁడును, విరోధముచే శిశుపాలుఁడు మొదలగు రాజులును, దాయాదులై యాదవులును, బంధుప్రీతిచే మీరును, భక్తిచే మేమును, నిరంతర ధ్యానముచేసి విష్ణుసాయుజ్యమును బడయలేదా! ఎట్లైన నేమి విడువక స్మరించినచో నాతనిం బొందవచ్చును.

వ. మఱియుం బెక్కండ్రు కామద్వేషభయస్నేహసేవాతిరేకంబులఁ జిత్తంబు హరిపరాయత్తంబుగాఁ జేసి సద్గతిం జెందిరి హరి నుద్దేశించి క్రోధాదులై న యేనింటిలోపల నొక్కటి యైన వేనునికి లేనినిమిత్తంబున నతండు వ్యర్థుం డయ్యె

మీతల్లి చెలియలికొడుకు లయినశిశుపాలదంతవక్త్రులు
తొల్లి విష్ణుమందిరద్వారపాలకులు విప్రశాపంబునఁ బదభ్ర
ష్టులై భూతలంబునం జన్మించి రనిన విని యుధిష్ఠిరుండు
నారదున కిట్లనియె. 19

టీ. పెక్కండ్రు=అనేకులు, కామ... బులన్=కోరిక విరోధము భయము చెలిమి కైంకర్యము వీనియాశ్రయములచేత, హరిపరాయత్తంబు= విష్ణువునందు లీనమైనది, విద్విషుఁడు = అవిష్ణువు దెలకను, ఉద్దేశించి కూర్చి, క్రోధాదులు=కోపము మొదలగు వైదును, వేనునికిన్ = అనుచానునకు, వ్యర్థుఁడు=ప్రయోజనములేనివాఁడు, తొల్లి=మునుపు, విష్ణు...కులు=విష్ణుని వాకిటి కావలివారు, విప్రశాపవశంబునన్=బ్రాహ్మణ శాపమునంజేసి, పద భ్రష్టులు=ఆ కావలి యుద్యోగమునుండి తొలఁగినవారు.

తా. ఇంకను ఎందఱో చెలిమివలననో విరోధముననో కోరికలవ నో భయమువలననో సర్వకాలము ధ్యానించి హరిని పొందిరి. నీవు చెప్పిన వేనునకు ఈకామాదులలో నొక్కటియు లేదుగాన వాఁడు చెడిపోయెను. మీ పినతల్లి కొడుకులగు ఈ శిశుపాల దంతవక్త్రులు మునుపు వైకుంఠములో విష్ణుని వాకిటఁ గాపుండువారే. బ్రాహ్మణుల తిట్టువలన వారు ఆపదవిని పోఁగొట్టుకొని భూమిలోఁ బుట్టిరి. అనఁగానే ధర్మరాజు నారదు నడుగు చున్నాఁడు.

మ. అలుగంగారణ మేమి విప్రులకు మున్నావిప్రు లెవ్వారు ని
శ్చలు లేకాంతులు నిర్జితేంద్రియులు నిస్సంసారు లీశానువ
ర్తులు వైకుంఠపురీనివాసు లన విందుర్ వారి కెబ్భంగినీ
ఖలజన్మంబులు వచ్చె నారద వినం గౌతూహలంబయ్యెడిన్.

టీ. అలుగన్=కోపించుటకు, విప్రులు=బ్రాహ్మణులు, నిశ్చలులు= చపలతలేనివారు, ఏకాంతులు=అంతరంగభక్తులు, నిర్జితేంద్రియులు = ఇంద్రి

యముల నణఁచినవారు, నిస్సంసారులు=సంసారమెఱుఁగనివారు, ఈశాను వర్తులు=పరమేశ్వరుని ననుసరించువారు, వైకుంఠపురీనివాసులు=వైకుంఠమున నుండువారు, ఎబ్భంగిన్=ఏలాగున, ఖలజన్మంబులు నీచజన్మములు? కౌతూహలంబు=వేడుక.

తా. నారదా! వీరికి బ్రాహ్మణు లేల శాపమిచ్చిరి? ఆ బ్రాహ్మణు లెవరు? ఈ ద్వారపాలురు స్థిరచిత్తులు. విష్ణునకు అంతరంగభక్తులు. ఇంద్రియనిగ్రహము కలవారు. సంసారవర్జితులు. విష్ణుధ్యానైకరతులు వైకుంఠమును విడువకుందు రని వింటిమి. అట్టి పుణ్యులకు ఈ నీచజన్మమేల కలిగెనో నాకు వినవలె నని యున్నది. వినిపింపుఁడు.

వ. అనిన నారదుం డిట్లనియె నొక్కనాఁడు బ్రహ్మమానసపుత్త్రు లైన సనకసనందనాదులు దైవయోగంబున భువనత్రయంబు నందును సంచరించుచు నైదాఱేండ్ల ప్రాయంపుబాలకులభావంబున దిగంబరులయి హరిమందిరంబునకు వచ్చిచొచ్చునెడ మొగసాల నున్నపురుషు లిరువురు వారలం జూచి. 21

టీ. బ్రహ్మమానసపుత్త్రులు=బ్రహ్మమనస్సునఁ బుట్టినకొడుకులు, సనక...దులు=సనకసనందనసనత్కుమారసనత్సుజాతులు, భువనత్రయంబు=ముల్లోకములు, ప్రాయము=ఈడు, దిగంబరులు=దిక్కులు బట్టలుగాఁగల వారు,(బట్టలులేనివారు), హరిమందిరంబునకున్=విష్ణునిలయమునకు, చొచ్చు నెడన్=చొరునప్పుడు, మొగసాలన్=వాకిటి ముందట.

క. డింభకుల ననర్గళవి
స్రంభకుల రమాధినాథసల్లాపసుఖా
రంభకుల ముక్తమానస
దంభకులం జూచి నీక తత్తిమి రధీశా. 22

టీ. డింభకులన్ = బాలురను, అన...కులన్ = అడ్డులేని విష్ణుభక్తి గలవారలను, రమా...కులన్=విష్ణుని సంభాషణసుఖమునకు యత్నిం

చుచున్న, ముక్త...కులన్ = విడువఁబడిన మనస్సునందలి డంబముగల వారలను, చొరఁగన్ = ప్రవేశించుటకు, అధీశా = ధర్మరాజా.

తా. యుధిష్ఠిరమహారాజా! వారలు విష్ణువునం దత్యంతభక్తిగలిగి హరితో సల్లాపము సేయ వేఁకపడినవారై, రాఁగా, శుద్ధచిత్తులైన యా బాలరూపుల చేరనీయక తటిమివేసిరి.

క. వారించినతమకంబున
వారించుక నిలువ లేక వడిఁ దిట్టిరి దా
వారికుల నసురయోని న
వారితులై పుట్టుఁ డనుచు వసుధాధీశా.

టీ. వారించినతమకంబునన్ = తమనడ్డగించినవారనునాత్రముతో, వారు = సనకాదులు, ఇంచుక = కొంచెము, నిలువలేక = సహింపఁజాలక, వడిన్ = వేగముగా, దావారికులన్ = వాకిటికావలివారిని, అసురయోనిన్ = రాకాసిజన్మమున, అవారితులు = మానుపఁబడనివారు, వసుధాధీశా = పుడమిఱేఁడా.

తా. రాజా! వారు లోపలఁ జేరనీయలేదని ఆసనకాదులు కోపించి వారిని రాక్షసజన్మ మెత్తుఁ డని శపించిరి.

వ. మఱియు నాపిన్నపెద్దలు వారలం జూచి మీర లీయెడ నుండ నర్హులు గారు నారాయణచరణమూలంబు విడిచి రజస్తమోగుణులై రాక్షసయోనిం బుట్టుం డని శపియించిన వారు నాశాపవశంబునఁ బదభ్రష్టులై కూలుచు మొఱలిడిన నమ్మహాత్ములు దయాళువులై క్రమ్మఱం గరుణించి మూఁడుజన్మంబులకు వైరంబున భగవత్సన్నిధానంబు గలిగెదు మని నిర్దేశించి చని రివ్విధంబున శాపహతులై హరిపార్శ్వచరులైన పురుషు లిరువురు హిరణ్యకశిపు హిరణ్యా

త్తు లన దితికి జన్మించి రందుఁ గనిష్ఠుండై నహిరణ్యాక్షుని హరి వరాహరూపంబున సంహరించె నగ్రజుండగు హిరణ్యకశిపుండు నరసింహమూర్తి యగు శ్రీహరిచేత విదళితుండయ్యె నతనికొడుకు ప్రహ్లాదుండు తండ్రిచేత హింసితుండయ్యును నారాయణపరాయణుండై శాశ్వతుండయ్యె రెండవభవంబునఁ గైకసి యనురాక్షసికి రావణకుంభకర్ణులయి సంభవించిన విశ్వంభరుండు రఘుకులంబున రాఘవుండయి యవతరించి వారల వధియించె నమ్మహాత్ముని పరాక్రమంబులు మార్కండేయఋషివలన నెఱింగెదవు తృతీయజన్మంబున మీతల్లి చెలియలికి శిశుపాలదంతవక్త్రు లన నుద్భవించి. 24

టీ. ఆపిన్నపెద్దలు=ఈశైశవ బాలురయ్యు జ్ఞానమున పెద్దలగు, సనకాదులు ఈయెడన్=ఈచోటున, అర్హులు=తగినవారు, నారాయణచరణమూలంబు=విష్ణునిపాదములయందును, రజస్తమోగుణులై=రజోగుణముతమోగుణము గలవారై, రాక్షసయోనిన్=రాక్షసుల గర్భమందు, పదభ్రష్టులు = అధికారచ్యుతులు, మొఱ=విన్నపము, ఆమ్మహాత్ములు = మహానుభావులగు నా సనకాదులు, దయాళువులు = దయగలవారు, క్రమ్మఱన్ = మరల, కరుణించి = దయచేసి, సన్నిధానంబు = సమీపము, నిర్దేశించి=నిర్ణయించి చనిరి = వెళ్లిరి, ఇవ్విధంబునన్ = ఈలాగున, శాపహతులు = తిట్టుచేఁ గూలినవారు, హరిపార్శ్వచరులు = విష్ణునొద్ద మెలఁగువారు, కనిష్ఠుండు = చిన్నవాఁడు, వరాహరూపము = పందిమేను, సంహరించెన్ = చంపెను, అగ్రజుండు=పెద్దవాఁడు, (ముందుపుట్టినవాఁడు) విదళితుండు= చీల్పఁబడినవాఁడు, హింసితుండు = బాధంపఁబడినవాఁడు, శాశ్వతుఁడు= ఎల్లప్పుడు ఉండువాఁడు, రెండవభవంబునన్ = రెండవపుట్టుకయందు, విశ్వంభరుండు = జగత్తులను బ్రోచువాఁడు, రఘుకులంబునన్ = రఘు

రాజువంశమున, రాఘవుండు = రాముఁడు, వధియించెన్ = చంపెను, తృతీయ జన్మంబునన్ = మూఁడవపుట్టుకలో, ఉద్భవించి = పుట్టి.

శా. వక్రత్వం బెటు లేక పాయనిమహావైరంబుతో నిత్యజా
తక్రోధస్మరణంబులన్ విదళితోద్యత్పాపసంఘాతులై
చక్రచ్ఛిన్న శిరస్కులై మునివచశ్శాపావధిప్రాప్తులై
చక్రిం జెందిరి వారు పార్శ్వచరులై సారూప్యభావంబునన్.

టీ. వక్రత్వంబు=వంకర, కొంఱత, పాయని మహావైరంబుతోన్ = వీడనిగొప్పపగతో, నిత్య...బులన్ = ఎప్పుడు పుట్టుచున్న కోపములతలంపుల తో, విద...తులై = పోఁగొట్టఁబడిన పుట్టుచున్న పాపములరాసులుగల వారై, చక్రచ్ఛిన్న శిరస్కులు=చక్రముచే నఱకఁబడిన తలలు గలవారు, ముని...ప్తులై = సనకాదులశాపము చివరను బొందినవారై, చక్రిన్ = విష్ణువును, పార్శ్వచరులు= చెంతనుండువారు, సారూప్యభావము=ఒక్క రూపు గలుగు ధర్మము.

తా. ఇట్లు విడువని విరోధముతో హరిని ప్రతిఘటించి వారు సర్వ పాపములును వీడి విష్ణుచక్రముచేఁ దలలు తెఉుగఁబడినవారలై సనకాదుల శాపము దీఱి విష్ణుసారూప్యమును బొందిరి.

వ. అనిన విని ధర్మనందనుం డిట్లనియె. 26

క. బాలున్ హరిపదచింతా
శీలున్ సుగుణాలవాలు శ్రీమన్మేధా
జాలున్ సంతోషింపక
యేలా శిక్షించె రాక్షసేంద్రుం డనఘా. 27

టీ. అనఘా = పాపములేనినారదా, రాక్షసేంద్రుండు = రాక్షసుల రాజు, బాలున్ = శిశువును, హరి పదచింతా శీలున్ = విష్ణుపాద చింతనము సేయువానిని, సుగుణాలవాలున్ = మంచిగుణములకు పాదైన వానిని, శ్రీమన్మేధాజాలున్=సంపద్యుక్తమైన బుద్ధులు గలవానిని.

తా. నారదా! హిరణ్యకశిపుఁడు, పసివాఁడు నారాయణ చరణ స్మరణ సేయువాఁడు, మంచిగుణములు గలవాఁడు, మంచిబుద్ధి గలవాఁడు నగు కొడుకును ప్రేమింపక ఎందులకు దండించెను ?

క. పరిభూతవ్యథనంబులు
నిరుపమసంసారజలధినిర్మథనంబుల్
నరకేసరికథనంబులు
పరిరక్షితదేవయక్షఫణిమిథునంబుల్. 28

టీ. నరకేసరికథనంబులు = నరసింహమూర్తికథలు, పరిభూతవ్యథనంబులు = పోఁగొట్టఁబడిన బాధలు గలవి, నిరుపమ...నంబుల్ = తులలేని సంసారసాగరమును మథించునవి, పరి...నంబుల్ = కాపాడఁ బడిన దేవతలు యక్షులు నాగులు వీరిజంటలు గలవి.

తా. నరసింహమూర్తి కథలు సమస్తబాధలను బోఁగొట్టును. అంతము లేనిసంసారసముద్రమును నశింపఁజేయును. తమగానము చేసినదేవతలు యక్షులు పన్నగులు వీరిని రక్షించునవి.

వ. మునీంద్రా వినిపింపు మనిన నారదుం డిట్లనియెఁ గమలోదరుచేతం దనసహోదరుండు హతుం డయ్యె నని విని హిరణ్యకశిపుండు రోషశోకదందహ్యమానమానసుం డయి ఘూర్ణిల్లుచు నాభీలదావదహనజ్వాలాకరాళంబు లయిన విలోకనజాలంబుల గగనంబునం బొగ లెగయ నిరీక్షించుచుఁ దట్టిల్లతాంకుర సంకాశ ధగద్ధగిత దంత సందష్ట దశనచ్ఛదుండును నడభ్రి భయంకర భ్రుకుటితఫాలభాగుండును నిరంతరాక్రాంతదురంతవైరవేగుండును నై మహాప్రభాజాల జటాలం బగుశూలంబుఁ గేల నందుకొని సభామండపంబున నిలువంబడి త్రిమస్తక త్రిలోచన శకుని శంబర శతబాహు నము

చిహయగ్రీవ పులోమ విప్రచిత్తిప్రముఖు లైనదైత్యదానవుల
నాలోకించి యిట్లనియె. 29

టీ. కమలోదరుచేతః = విష్ణువుచేత, తనసహోదరుండు, తన తమ్ముఁడు, హతుండు=చంపఁబడినవాఁడు. రోష...సుండు= కోపము దుఃఖము వీనిచేఁ గాల్పఁబడిన చిత్తము గలవాఁడు, ఘూర్ణిల్లుచుః = కలవరము నొందుచు, ఆభీల...కరాళంబులు = క్రూరములగు కార్చిచ్చుమంటలవలె భయముఁ గొల్పునవి, విలోకనజాలంబులః = చూపుల్ల పంక్తులచేత, గగనంబు = ఆకసము, నిరీక్షించుచుః = చూచుచు, తటిల్లతా... దుండు = మెఱపుతీఁగెల కొనలవలె ధగధగ మనుచున్న కోఱలచేఁ బెదవులు కొఱికికొనువాఁడు, ఆదభ్ర.. గుండును = మిక్కిలి భయముగలిగించు బొమముడిగల నొసలు గలవాఁడు, నిరంత... వేగుండు=సందులేక క్రమ్మిన దుఃఖావసాన మైన విరోధముచేత నైనతొందరగలవాఁడు. మహా...టాలంబు= గొప్పమంటలతు ట్లైలచేఁ జడలుగట్టినదగు, త్రిమస్తక=మూఁడుతలలుగలవాఁడు, త్రిలోచన=మూఁడుకన్నులుగలవాఁడు, శతబాహు=నూఱు చేతులవాఁడు, హయగ్రీవ=గుఱ్ఱపుతలవాఁడు, దైత్య=దితిసంతతి, దానవ=దనువుసంతతి.

శా. నాకుం దమ్ముఁడు మీకు నెచ్చెలి రణన్యాయైకదక్షుండు బా
హాకుంఠీకృతదేవయక్షుఁడు హిరణ్యాక్షుండు వానిః మహా
సౌకర్యాంగము దాల్చి దానవవధూసౌకర్యముల్ నీఱు గా
వైకుంఠుండువధించిపో యెనఁటయీవార్తాస్థితిః వింటిరే. 30

టీ. నెచ్చెలి=ప్రియమిత్రుఁడు, రణ...క్షుండు = యుద్ధపుమర్మముల నెఱిఁగినవాఁడు, బాహా...యక్షుఁడు=బాహువులచే నొంపఁబడిన దేవతలు యక్షులు గలవాఁడు, హిరణ్యాక్షుండు=బంగారు కన్నులు గలవాఁడు, మహాసౌకర్యాంగము=మిక్కిలి చులకనగు నొడలు, దానవవధూ సౌకర్యముల్ =రాక్షసవనితల సుఖములు, నీఱు గాః=బూడిద యై నశించఁగా, వైకుంఠుండు=విష్ణువు, ఈవార్తాస్థితి=ఈకబురు సంగతిని.

తా. రాక్షసులారా! నాయీ దమ్ముఁడు మీకు స్నేహితుఁడు, యుద్ధమూల మర్మ మెఱిఁగినవాఁడు, బాహుబలముచే దేవతలను యక్షులను సైతము జయించినవాఁడు నగుహిరణ్యాక్షుని విష్ణువు వరాహరూపుఁడై రాక్షసస్త్రీల సౌఖ్యములు బూడిద యగునట్లు చంపిపోయెనఁట. ఇది యెట్లున్నదో విన్నారుగదా.

చ. వనముల నుండుఁ జొచ్చు మునివర్గములోపల ఘోణిగాఁడునం
జనన మెఱుంగ రెవ్వరును జాడ యొకింతయు లేదుతన్నడా
సినమఱి డాయు వెంటఁబడి చిక్కక చిక్కఁడు వీనినొక్కకీ
లున మన మెల్ల లోఁబడక లోఁబడఁ బట్టుకొనంగవచ్చునే.

టీ. వనములన్ = అడవులయందు, మునివర్గము = మునులగుంపు ఘోణి = పంది, జననము = పుట్టుక, జాడ = ఒక మార్గము, డాసినన్ = దగ్గఱకుఁ బోగా, డాయున్ = సమీపించును, వెంటఁబడి చిక్కక = వెటనంటి యాశ్రయింపక, చిక్కఁడు = దొరకఁడు, ఒక్కకీలునన్ = ఒకయుక్తిచేత, లోఁబడక = వెనుదీయక, లోఁబడన్ = చిక్కునట్లు.

ఈ విష్ణువు అడవులలో ముక్కు మూసికొని జపము సేయు మునులలో దూఱును. నిజముగా వరాహముగాఁడు. వీనిపుట్టుక యెవ్వరికిఁ దెలియదు. ఒక నీతిలేదు. తన్నెవరైనఁ జేరినచో వారల నిఁక విడువఁడు. వెన్నంటి యాశ్రయించినగాని స్వాధీనుఁడుగాఁడు. వీనిని మనమెల్లరముగలసి యొక్క యొత్తున వేనుదీయక పోరి పట్టుకోఁ గలమా?

తా. ఈ విష్ణువు అడవిలో జపము సేయు మునులలో దూఱును. వాస్తవముగా పంది గాడు. వీనిపుట్టుక యిట్టిదని యెవ్వరికిఁ దెలియదు. ఎవరైన వానిచెంతకుఁ బోదురా ఇఁకవారిని మరల రానీయఁడు. తన్నెంతో ఆశ్రయించినఁగాని ఒకరికిఁ జిక్కఁడు. వీనిని మనమందరము కలసి యెటైనను చిక్కఁచుకోఁగలమా?

సీ. భుజశక్తి నాతోడఁ బోరాడ శంకించి
మున్నీట మునిఁగిన మునుఁగుఁ గాక
యలయించి పెనఁగునాయచలసంభ్రమమున
కెఱఁగి వెన్నిచ్చిన నిచ్చుఁగాక
జగడంబు సైఁపక సౌకర్యకాంక్షి వై
యిలక్రింద నీఁగిన నీఁగుఁగాక
క్రోధించి యటుగాక కొంతపౌరుషమున
హరిభంగి నడరిన నడరుఁ గాక

ఆ. కఠినశూలధారఁ గంఠంబు విదళించి
వానిశోణితమున వాఁడి మెఱసి
మత్సహోదరునకు మహిఁ దర్పణము సేసి
మెఱసి వత్తు మీకు మేలు దెత్తు. 32

టీ. భుజశక్తిన్ = బాహుబలముచేత, పోరాడన్ = యుద్ధము చేయుటకు, శంకించి = జంకి, మున్నీటన్ = సముద్రములో, అలయించి = బడలఁజేసి, పెనఁగు...మునను = పోరునాగట్టి పూనికను ఎఱఁగి = తలవాంచి, వెన్నిచ్చినన్ = వీఁపుజూపిన. జగడంబు = పోరాటము, సైపక = సహింపఁజాలకఁ సౌకర్యకాంక్షి=సుకమును (పందియాకారమును), గోరినవాఁడై, ఇలక్రిందన్=భూమియడుగున, ఈఁగినన్=దూరినను, క్రోధించి = కోపపడి, పౌరుషమునన్ = పరాక్రమముతో, హరిభంగిన్ = సింహమువలె, అడరినన్=డీకొనినను, కఠిన శూలధారన్= గట్టిశూలపుటలుగుచే, కంఠంబు = మెడ, విదళించి తునిమి, వానిశోణితమునన్ వానినెత్తురుతో, వాఁడి=మగంటిమి, మెఱసి=చెలఁగి, మత్సహోదరునన్=నాతమ్మునకు, మహిన్=భూమిమీఁద,తర్పణము = నివాపోదకమును, మెఱసి=ప్రకాశించి.

తా. వాఁడు బాహుబలమున నాతో నెదిరింపలేక సముద్రములోఁ దుమికినఁగానీ, గాసిచేసి పోరునాస్థైర్యమున కోడి, పాఱిపోయినఁగానీ, నాతోఁ బోరుపెట్టుకోఁజాలక, భూమిక్రింద దూరిపోయినఁగానీ అలాగునగాక ఎటులైనను నావాఁడిశూలముచే వానిమెడ ద్రెంచి, వానిరక్తముతో నాతమ్మునికిఁ దర్పణముచేసి జయమునందివచ్చి మీ కానందము గలిగింతును.

క. ఖండితమూలద్రుమమున
నెండినవిటపములభంగి నితఁడు వడిన నా
ఖండలముఖ్యులు వడుదురు
భండనమున నితఁడు దమకుఁ బ్రాణము లగుటన్. 33

టీ. ఖండితమూలద్రుమమునన్ = వేళ్లునఱికినచెట్టుయందు, విటపములు=కొమ్మలు, పడినన్=త్రెళ్లఁగా, భండనమునన్=యుద్ధమందు, ఆఖండల ముఖ్యులు=ఇంద్రుఁడు మొదలగువారు. ఇతఁడు=ఈవిష్ణువు, పడుదురు.

తా. నే నితనిఁ బరిమార్చితినేని నిఁక నింద్రుఁడు మున్నగువారు తమకు విష్ణువే ప్రాణముగాన మొదలుతెగిన చెట్టుకొమ్మలవలె నిరాధారులై నిర్జీవులై పడిపోవుదురు.

సీ. పొందు దానవులార భూసురక్షేత్రసం
గత మైనభూమికి గములు గట్టి
మహిఁ దపస్స్వాధ్యాయమౌనవ్రతస్థుల
వెదకి ఖండింపుఁడు విష్ణుఁ డనఁగ
నన్యుఁ డొక్కఁడు లేఁడు యజ్ఞంబు వేదంబు
నతఁడె భూదేవక్రియాదిమూల
మతఁడె దేవర్షిపిత్రాదిలోకములకు
ధర్మాదులకు మహాధార మతఁడె

తే. యేస్థలంబుల గోభూసురేంద్రవేద
వర్ణధర్మాశ్రమంబులు వరుస నుండు
నాస్థలంబులకెల్ల మీ రరిగి చెఱచి
దగ్ధములు సేసి రండు మీదర్ప మొప్ప. 34

టీ. దానవులార=రాక్షసులారా, భూసురక్షేత్రసంగత = బ్రాహ్మణక్షేత్రములతోఁ గూడిన గములు=గుంపులు,మహిన్=భూమిలో,తప...స్థులన్=జపము వేదపాఠము మౌనవ్రతముగలవారిని,ఖండింపుఁడు=త్రుంచుఁడు,అన్యుఁడు=ఇతరుఁడు, భూదేవక్రియాదిమూలము=బ్రాహ్మణులు సేయు కార్యములు మొదలగువానికి, హేతువు, దేవ...లకున్=దేవఋషి పితృవులు మొదలగువారిలోకములకు, ధర్మాదులకున్ = ధర్మార్థకామములకు, మహాధారము=గొప్పటెంకి, గోభూ...మంబులు = గోవులు బ్రాహ్మణులు వేదములు కులములు ఆచారములు, వరుసన్=క్రమముగా, ఆస్థలంబులకు= ఆయాచోట్లకు, అరిగి=వెళ్లి, చెఱచి=పాడుసేసి, దగ్ధములు=కాల్పఁబడినవి. దర్పము=గర్వము, ఒప్పన్=వెలయఁగా.

తా. రాక్షసులారా! వెడలుఁడు. మీరు గుంపులై బ్రాహ్మణక్షేత్రములతోఁ గూడ భూమి నరికట్టి జపము వేదపాఠము మౌనవ్రతము గలవారల వెదకి వెదకి చంపుఁడు. విష్ణువనఁగా వేఱుగా లేఁడు. యజ్ఞములు వేదములు అతఁడే. బ్రాహ్మణులయొల్ల కర్మలకు నతఁడే కారణము. దేవాదిలోకములకు ధర్మము మొదలగువానికి నతఁడే ఆధారము, ఇంతయేల ఎక్కడ గోవులు బ్రాహ్మణులు వేదములు కులములు ఆచారములు వరుసగా నుండునో అక్కడకంతయు వెళ్లి వానియొప్పు సెఱచి కాల్చి రండు.

వ. అని యిట్లు నిర్దేశించిన దివిజమర్దననిర్దేశంబులు శిరంబుల ధరియించి రక్కసులు పెక్కండ్రు భూతలంబునకుం జని. 35

టీ. నిర్దేశించినన్=ఆజ్ఞచేయఁగా,దివిజమర్దననిర్దేశంబులు=దేవాంతకుఁడగుహిరణ్యకశిపునిమాటలను, పెక్కండ్రు= ఎక్కువమంది, భూతలంబునకున్=భూమిమీఁదికి.

సీ. గ్రామ పుర క్షేత్ర ఖర్వట ఖేట ఘో
 షారామ నగ రాశ్రమాదికములు
గాల్చి కొలఁకులు గలఁచి ప్రాకారగో
 పుర సేతువులు ద్రవ్వి పుణ్యభూజ
చయములు ఖండించి సౌధ ప్రపా గేహ
 పర్ణశాలాదులు పాడు చేసి
సాధుగోబ్రాహ్మణసంఘంబులకు హింస
 గావించి వేదమార్గములు సెఱచి
ఆ. కుతల మెల్ల నిట్లు కోలాహలంబు గా
దైత్యు లాచరింపఁ దల్లడిల్లి
నష్టమూర్తు లగుచు నాకలోకము మాని
యడవులందుఁ జొచ్చి రమరవరులు. 36

టీ. గ్రామ=ఊళ్లు, పుర=పట్టణములు, క్షేత్ర=పొలములు, పుణ్యదేశములు, ఖర్వట=పాళెములు, ఖేట = చిన్నపల్లెలు, ఘోష = గొల్లపల్లెలు, ఆరామ = తోఁటలు, నగర = రాజధానులు, ఆశ్రమ = మునులుండుచోట్లు, కొలఁకులు=మడుఁగులు, కలఁచి=చెఱచి(రొంపిజేసి), ప్రాకార =ప్రహరీలు, గోపుర = బురుజులు, సేతువులు=ఆనకట్టలు, పుణ్యభూజచయములు=పుణ్యవృక్షములగుంపులను, సౌధ = మేడలు, ప్రపా=చలివేంద్రలు, గేహ=ఇండ్లు, పర్ణశాల = ఆకుటిండ్లు, సాధు = సజ్జనులు, గో=గోవులయొక్క, బ్రాహ్మణ=ద్విజులయొక్క, సంఘంబులకున్=సమూహములకు, హింస=వధము, వేదమార్గములు=వేదముత్రోవలు, కుతలము=భూప్రదేశము, కోలాహలంబు=సంకులము, దైత్యులు = రాక్షసులు, తల్లడిల్లి=బెగడుపడి, అమరవరులు=మేటివేల్పులు, నష్టమూర్తులు=స్వరూపనాశము జెందినవారు, నాకలోకము=స్వర్గమును, మాని=విడిచి అడవులందున్=వనములలో, చొచ్చిరి=ప్రవేశించిరి.

తా. ఇట్లు రాక్షసులందఱు పల్లెలు పట్టణములు దేవాలయములు కోటలు పేటలు గొల్లమందలు ఆశ్రమములు రాజధానులు కాల్చి, బావులు గూండ్లు పూడ్చి, కోటలు గోపురములు కూలఁద్రోసి, గట్టులు త్రవ్వి, దేవతావృక్షముల నఱికి, మేడలు చలివెందరలు, ఆకుటిండ్లు పాడుచేసి, సజ్జనులను, గోవులను, బ్రాహ్మణులను జంపి, వేదములఁ జిక్కుపఱిచి, యిట్లు భూమియంతయు చీకాకుపఱుప, దేవతలు భయపడి స్వరూపనాశముఁ జెంది, స్వర్గము విడిచి పాఱిపోయి యడవులలోఁ దూఱిరి.

వ. అంత హిరణ్యకశిపుండు దుఃఖితుండై మృతుండయినసోదరునకు నుదకప్రదానాదికార్యంబు లాచరించి యతనిబిడ్డల శకుని శంబర కాలనాభ మహోత్కచ ప్రముఖుల నూఱడించి వారలతల్లితోఁ గూడ హిరణ్యాక్షునిభార్యల నందఱ రావించి తమతల్లి యైన దితి నవలోకించి యి ట్లనియె. 37

టీ. అంతన్=తర్వాత, దుఃఖితుండు = వ్యసనపడినవాఁడు, సోదరునకున్ = తమ్మునకు, ఉదకప్రదానాది కార్యంబులు=నీళ్లు విడుచుట మొదలగును తరక్రియలు, బిడ్డలన్ = కొడుకులను, ప్రముఖులన్ = మొదలగువారిని, అవలోకించి = చూచి.

శా. సీరాగారనివిష్టపాంథులక్రియన్ నిక్కంబు సంసారసంచారుల్ వత్తురు కూడి విత్తురు సదా సంగంబులేదొక్కచో శూరుల్ వోయెడిత్రోవఁ బోయెనుభవత్పూనుండుతల్లీమహాశూరుం డాతఁడు తద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్.

టీ. సంసారసంచారులు = సంసారమునఁ దిరుగువారు, నీరాగారనివిష్టపాంథులు = చలివేంద్రలోఁగలియు బాటసారులవలె, నిక్కంబు = నిజము, సంగంబు = కలయిక, మహాశూరుండు = గొప్పమగఁటిమిగలవాఁడు. తద్వియోగమునకున్ = వానిపోకకు, శోకింపన్ = దుఃఖింపఁగా.

తా. అమ్మా! నీకొడుకుకొఱ కేల యేడ్చెదవు? భ్రాంతిమాత్రమేగాని యీసంసారమునఁ గొడుకులన నెవరు? తల్లియన నెవరు? వీరికేమిసంబంధము? వీరందఱు చలివెందరలో జనులు గుంపుగూరి తొలఁగిపోవుచుండునట్లు ఈసంసారమునఁ బితృభ్రాత్రాదినామధారులై యొక్కచోఁ జేరుదురు. పోవునప్పు డెవరి తెన్ను వారిదే. ఒకరికొఱ కొకరు ఎదురుచూడరు. నీకొడుకు వీరులు పోయెడుదారినిబోయెను. వాఁడు గొప్పవీరుఁడు. వానికై శోకింపకుము.

సీ. సర్వజ్ఞుఁ డీశుండు సర్వాత్ముఁ డవ్యయుం
డమలుండు సత్యుఁ డనంతుఁ డాఢ్యుఁ
డాత్మరూపంబున నశ్రాంతమును దన
మాయాప్రవర్తనమహిమవలన
గుణములఁ గల్పించి గుణసంగమంబున
లింగశరీరంబు లీలఁ దాల్చి
కంపితజలములోఁ గదలెడిక్రియఁ దోఁచు
పాదపంబులభంగి భ్రామ్యమాణ
ఆ. చక్షువుల ధరిత్రి చలితయై కానంగఁ
బడినభంగి వికలభావహితుఁ
డాత్మమయుఁడు గంపితాంతరంగంబునఁ
గదలినట్లు తోఁచుఁ గదలకుండు. 39

టీ. సర్వజ్ఞుఁడు = అన్నియుఁ దెలిసినవాఁడు, ఈశుండు = ప్రభువు. సర్వాత్ముఁడు=సర్వవ్యాపి, అవ్యయుఁడు = నాశమెఱుఁగనివాఁడు, అమలుండు = నిర్మలుఁడు, సత్యుఁడు = నిత్యుఁడు, అనంతుఁడు = పారములేనివాఁడు, ఆఢ్యుఁడు = అంతటనిండినవాఁడు. ఆత్మరూపంబునన్ = తన మేనితోడ, అశ్రాంతమును = ఎప్పుడును, మాయా...హిమ = మాయతోఁగూడియుండు సామర్థ్యము, గుణసంగమంబు=గుణములచేరిక, లింగశరీరంబు = సూక్ష్మదేహమును, లీలన్ = మెలఁకువతో, తాల్చి = ధరించి,

కంపితజలములోఁ = కదలెడినీటిలో, పాదపంబులు = చెట్లు భ్రామ్యమాణచక్షువులకు = తిరుగుడుకన్నులవారిని, ధరిత్రి = భూమి, చలిత = కదలునది, వికలభావరహితుఁడు = అపాయములేనివాఁడు, ఆత్మమయుఁడు = ఆత్మస్వరూపుఁడు, కంపితాంతరంగంబునకు = కదలెడిమనస్సున.

తా. అన్నియెడలను సర్వరూపుఁడై నాశములేనివాఁడై సత్యుఁడైనదేవుఁడు ఆత్మస్వరూపముతో జగముల నిండి, తనమాయచే సత్త్వరజస్తమము లనుగుణములఁ బుట్టించి, యాగుణములతోడ లింగశరీరము నొంది, కదలు నీటిలోఁ గదలునట్లు దోఁచుచెట్లవలె చపలమైనచిత్తములోఁ దాను కదలిన ట్లగపడుఁగాని వానికి కదలికయే లేదు.

వ. అమ్మా యివ్విధంబున లక్షణవంతుండు గానియీశ్వరుండు లక్షితుండై కర్మసంసరణంబున యోగవియోగంబుల నొందించు సంభవవినాశశోకవివేకావివేక చింతాస్మరణంబులు వివిధంబు లీయర్థంబునకుఁ బెద్దలు ప్రేతబంధుయమసంవాదం బనునితిహాసంబును నుదాహరింతురు వినుండు చెప్పెద నుశీనరదేశంబునందు సుయజ్ఞుం డనురాజు గలం డతండు శత్రువులచేత యుద్ధంబున నిహతుం డయి యున్నయెడ. 41

టీ. అవ్వా = అమ్మా, లక్షణవంతుండు = గుణములుకలవాఁడు, లక్షితుఁడు = కనఁబడినవాఁడు, కర్మసంసరణంబులకు = కర్మముకలనను దానిచే నగుసంసారమువలనను, యోగవియోగంబులకు = కలియుట, పాయుటలవలనను, సంభవ...బులు = పుట్టుట, చచ్చుట, దుఃఖము, తెలివి, తెలివి లేమి, యోచన, తలఁపులు, వివిధంబులు = పలువిధములు, ఈయర్థంబునకు = ఈసంగతికి, ప్రేత...దంబు = చచ్చినవాని చుట్టములకు యమునకు నైనసంభాషణము, ఇతిహాసంబు = చరిత్రము, నిహతుండు = చంపఁబడినవాఁడు.

సీ. చిరిఁగినబహురత్నచిత్రవర్మముతోడ
రాలినభూషణరాజితోడ

భీకరబాణనిర్భిన్నవక్షముతోడఁ
దఱచు గాఱెడుశోణితంబుతోడఁ
గీర్ణమై జాఱినకేశబంధముతోడ
రయరోషదష్టాధరంబుతోడ
నిమిషహీనంబైననేత్రయుగ్మముతోడ
భూరజోయుతముఖాంబుజముతోడఁ

ఆ. దునిసి పడినదీర్ఘదోర్దండములతోడ
జీవరహితుఁ డగునుశీనరేంద్రుఁ
జుట్టి బంధుజనులు సొరిది నుండఁగ భయా
క్రాంత లగుచు సతినికాంతలెల్ల. 14

టీ. చిరిఁగిన...రత్నము = చినిఁగిన అనేకరత్నములచేఁ గూర్పఁబడిన సొగసైనకవచము, ఘనాభరణరాజి = సొమ్ములబారు, భీకర...వక్షము= భయముగలిగించుబాణములచేఁ జీల్పఁబడినఱొమ్ము, శోణితంబు=నెత్తురు. కీర్ణము = చిక్కువడినది, కేశబంధము = జుట్టుముడి, రయ...రంబు = కసికొలఁది కొఱుకఁబడిన పెదవి, నిమిషహీనములు = ఱెప్పపాటులేనివి, నేత్రయుగ్మము = కన్నుదోయి, భూరజ...జము = నేలదుమ్ము గమ్మిన తామరవంటిముఖము, జీవరహితుఁడు=ప్రాణములఁబాసినవాఁడు, భయాక్రాంతలు = భయముచే నాక్రమింపఁబడినవారు.

తా. కవచము పేలికలై పోఁగా సొమ్ములన్నియు రాలి, బాణఘాతములచే ఱొమ్ముపగిలి, నెత్తురు గాఱుచుండ, కేశముల ముడి సడలి నేలఁబారలాడఁగా, కోపముచేఁ బెదవిఁగొఱుకుచు, మిడిగుడ్లుబడి, నేలదుమ్మంతయు మొగమున నిండఁగా, భుజములు తెగి చచ్చిపడియున్న అసురుఁజూని వాని చుట్టములందఱు చుట్టుముట్టుకొనియుండఁగా, వానిభార్యలు చూచి భయమందినవారు.

శా. స్రస్తాకంపితకేశబంధములతో సంఛిన్నహారాళితో
హస్తాబ్జంబులుసాఁచిమోఁదికొనుచున్ హానాథయంచున్ బహు
ప్రస్తావోక్తులతోడ నేడ్చిరి వగం బ్రాణేశుపాదాలపై
నస్తోక స్తనకుంకుమారుణవికీర్ణాస్రంబు వర్షించుచున్. 42

టీ. స్రస్తా...ములు = జాఱిపోఁవలుచున్నకొప్పులు, సంఛిన్నహారాళి = తెగినహారములు, హస్తాబ్జంబులు = కేలుఁదామరలు, మోదికొనుచున్ = బాఁదుకొనుచు, హానాథ=అయ్యోప్రియుఁడా, ప్రస్తావోక్తులు= ఆసమయమువకుఁ దగినదీనాలాపములు, ప్రాణేశుఁడు = మగఁడు, అస్రం=స్రంబున్=విస్తారమై చనుల యందలికుంకుమచే నెఱ్ఱనై కాఱుచున్న కన్నీళ్లను వర్షించుచున్ = కురియుచు.

తా. కొప్పులు వీడిపడఁగా, మెడలోనిపండలు తెగి పోఁగా బాఁఱలుసాఁచి మొత్తుకొనుచు, మగనికాళ్లమీఁదఁబడి కన్నీరు వరదలు కాఁగా అయ్యో ప్రియుఁడా యని బహుదీనముగా నేడ్చిరి.

మ. అనఘా నిన్ను నుశీనరప్రజల కర్థానందసంధాయిఁగా
మును నిర్మించినబ్రహ్మ నిర్దయతఁ నున్మూలించెనే వీరికిం
దనయశ్రేణికి మాకు దిక్కు గలదే ధాత్రీశ నీబోఁటికిం
జనునే పాసి చనంగ భ్రాతృజనులన్ సన్మిత్రులం బుత్రులన్.

టీ. అనఘా = పాపములేనివాఁడా, అర్థానందసంధాయి = ఇష్టవస్తువులను సంతోషమును ఇచ్చువాఁడు, నిర్దయతన్ = కరుణలేకపోవుటచే, ఉన్మూలించెనే = నశింపఁజేసెనా, వీరికిన్ = ఈప్రజలకు, తనయశ్రేణికిన్=నీకొడుకులకు, దిక్కు = ప్రాపు. ధాత్రీశ = రాజా, భ్రాతృ = తోఁబుట్టువులు, మిత్రులు = చెలిమికాండ్రు.

తా. ప్రియా! బ్రహ్మ నిన్ను ఉశీనర దేశమువారికి నిక్షేముగా బుట్టించి, ఇంతలోనే ఓరువ లేక కరుణవీడి, చంపుకపోయెఁగదా, అయ్యో! ఇఁ

కనీజనులకు మాకు మాబిడ్డలకు నెవరుదిక్కు? రాజా నీవంటివానికి ఇట్లు ఆశ్రయించినమమ్ము తోడులను బిడ్డలను విడిచిపోవుట తగునా?

మ. జనలోకేశ్వర నిన్ను బాసిన నిమేషంబుల్ మహాబ్దంబులై
చను లోకాంతరగామివై మరల కీచందంబునన్ నీవు వో
యిన మేమెట్లు చరింతుమొల్లముగ దాయీలోకవృత్తంబు నేఁ
డనలజ్వాలలఁజొచ్చివచ్చెదము నీయంఘ్రిద్వయింజూడఁగన్.

టీ. జనలోకేశ్వర=మనుష్యలోకమునకుఁ బ్రభువువైనవాఁడా, నిమేషంబుల్ ఈ ఱెప్పపాటుకాలములు, మహాబ్దంబులు=దివ్యవర్షములు, లోకాంతరగామివి=మఱియొకలోకమునకుఁ బోయినవాఁడవు, ఈచందంబునన్=ఈలాగున, లోకవృత్తంబు=లోకమండలినడవడిని, అనలజ్వాలలు = నిప్పుమంటలు, అంఘ్రిద్వయి = పాదములజంట.

తా. ప్రియుఁడా ! నిన్ను విడచి యొక్కనిముసమేని యొకదివ్యవత్సరముగా నుండును. నీ విట్లు పరలోకమునకుఁ బోయి మరల రాకపోయిన మే మెట్లు బ్రతుకుదుము, మాకీప్రపంచముజోలి వద్దు. ఇప్పుడే నీతోఁగూడ నగ్గిలోఁ బడి చచ్చి నిన్ను గలసికొందుము.

వ. అని యిట్లు రాజభార్యలారాజశవంబు డగ్గఱి విలపింపం బ్రొద్దు గ్రుంకెడుసమయంబున వారలవిలాపంబులు విని బ్రాహ్మణబాలకుండై యముండు సనుదెంచి ప్రేతబంధువులం జూచి యిట్లనియె. 45

టీ. రాజభార్యలు = రాజుపెండ్లాలు, శవంబు = పీనుఁగు, విలపింపన్ = ఏడువఁగా, బ్రాహ్మణబాలకుఁడు = బ్రాహ్మణులపిల్లకాయ, చనుదెంచి = వచ్చి, ప్రేతబంధువులు = పీనుఁగుచుట్టములు.

ఉ. మచ్చిక వీరికెల్ల బహుమాత్రముఁజోద్యము దేహి పుట్టుచుం
జచ్చుచు నుండఁ జూచెదరు చావక మానెడువారిభంగి నీ

చచ్చినవాని కేడ్చెదరు చావున కొల్లక డాఁగ వచ్చునే
యెచ్చటఁ బుట్టె నచ్చటికి నేఁగుట నైజము ప్రాణికోటికిన్.

టీ. మచ్చిక = చనువు, బహుమాత్రము = మిక్కిలి, చోద్యము= చిత్రము, దేహి = జీవుఁడు, డాఁగన్ = దాఁగుకొనుటకు, ప్రాణికోటికిన్ = జంతుజాలమునకు, నైజము = స్వభావము.

తా. వీరిమోహము జూడ వింతగా నున్నది ఎప్పుడును జీవులు పుట్టుట చచ్చుట చూచుచునేయుందురు. అందఱు చచ్చువారే ఒక్కరును బ్రతుకరు అనియు నెఱుఁగుదురు. కాని తాము చావనివారివలె చచ్చినవారికోసము ఏడ్చుచుందురు. ఎవరైననుసరే చావకుండ దాఁగఁగలరా. ఎల్లభూతములకు ఎచ్చటనుండి పుట్టెనో అచ్చటికి వెళ్లుట స్వభావము.

క. జననీజనకులఁ బాసియు
ఘనవృకములబాధ వడక గడుఁ బిన్నల మై
మనియెద మెవ్వఁడు గర్భం
బున మును పోషించె వాఁడె పోషకుఁ డడవిన్.

టీ. జననీజనకులన్ = తల్లిదండ్రులను, పాసి = వీడి, ఘనవృకములు=పెద్దతోఁడేండ్లు; క్రూరమృగములు, కడున్=మిక్కిలి, పిన్నలు= కూనలు, మనియెదము = బ్రతికెదము, గర్భంబునన్ = తల్లికడుపులో, మును = మునుపు, పోషించెన్ = కాపాడెనో.

తా. తల్లిదండ్రులు వదలివేసినను, కొన్ని జంతువులు, అడవిలో క్రూరమృగముల పాలుగాక బ్రతుకుటలేదా. తల్లికడుపులో నుండఁగా నెవఁడు రక్షించెనో వాఁ డడవిలోమాత్రము ఏల రక్షింపఁడు?

క. ఎవ్వఁడు సృజించుఁ బ్రాణుల
నెవ్వఁడు రక్షించుఁ ద్రుంచు నెవ్వఁ డనంతుం
డెవ్వఁడు విభుఁ డెవ్వఁడు వాఁ
డివ్విధమున మనుచుఁ బెనుచు హేలారతుఁ డై. 48

టీ. ప్రాణులన్ = జంతువులను, సృజించున్ = పుట్టించునో త్రుంచున్ = చంపునో, అనంతుండు = నాశములేనివాఁడు, విభుఁడు = ప్రభువు. మనుచున్ = బ్రికించును, పెనుచున్ = వృద్ధిఁజేయును.

తా. ఈయెల్లజీవులను ఎవఁడు పుట్టించునో రక్షించునో సంహారించునో, ఎవని కంతములేదో, ఎవఁడు అంతట వ్యాపించి ప్రభువై యుండునో వాఁడే యిట్లు జీవులఁ బ్రిదికింపను పెంపను జాలును.

ఆ. ధనము వీథిఁ బడిన దైవవశంబున
నుండుఁ బోవు మూల నున్న నైన
నడవి రక్ష లేనియబలుండు వర్ధిల్లు
రక్షితుండు మందిరమునఁ జచ్చు. 49

టీ. దైవవశంబునన్ = విధివశమువలన, ధనము, వీథిన్ = త్రోవలో, మూలన్ = ఇంటిమూలయందు, రక్ష = పోషణము. అబలుఁడు= దుర్బలుఁడు, వర్ధిల్లున్ = వెలయును, మందిరమునన్ = ఇంటిలో,రక్షితుండు = కాపాడఁబడినవాఁడు.

తా. దైవవశమున వీథిలోఁ బాఱవేసినవస్తువులైనను. దొరకును మూల నున్న నిక్షేపమైనను పోవును. అడవిలో దిక్కులేనివాఁడు ప్రబలును. ఇంటిలో సురక్షితుఁడు చచ్చును. దీనికంతయు దైవమే కారణము.

క. కలుగును మఱి లేకుండును
గలభూతము లెల్లఁ గాలకర్మవశము లై
నిలువఁడు ప్రకృతిం దద్గుణ
కలితుఁడుగాఁ డాత్మమయుఁ డగమ్యుఁడు దలఁపన్. 50

టీ. కలభూతములెల్లన్ = ఉన్నజంతువులన్నియు, కాలకర్మవశములు = కాలమునకుఁ గర్మమునకు లోఁబడినవి, కలుగును = పుట్టును, లేకుండును=నశించును, ఆత్మమయుఁడు=ఆత్మస్వరూపుఁడు, ప్రకృతిన్=

దేహమున, నిలువఁడు, తద్గుణకలితుఁడు = ఆదేహధర్మములను ముదిమి సెఱపు వీనితోఁగూడుకొనఁడు, తలఁపన్ = విచారింపఁగా, ఆత్మమయుఁడు = ఆత్మస్వరూపుఁడు ఆగమ్యుఁడు = పొందరానివాఁడు.

తా. జంతువులన్నియు కాలకర్మసంబంధమునఁ బుట్టుచు చచ్చుచు నుండును. ఆత్మదేహమందు శాశ్వతుఁడుగాఁడు. జరామరణాది దేహధర్మములు ఆయాత్మకు లేవు. ఆతఁ డిట్టివాఁ డని మన మూహింపఁజాలము.

సీ. పాంచభౌతిక మైనభవనంబు దేహంబు
పురుషుండు దీనిలోఁ బూర్వకర్మ
వశమున నొకవేళ వర్తించు దీపించుఁ
దటి ద్వైన నొకవేళఁ దలఁగి పోవుఁ
జెడనేని దేహంబు సెడుఁ గాని పురుషుండు
సెడఁ డాతనికి నింతచేటు లేదు
పురుషునికిని దేహపుంజంబునకు వేఱు
గాని యేకత్వంబు కాన రాదు
ఆ. దారువుల వెలుంగు దహనునికై వడిఁ
గాయములఁ జరించు గాలిభంగి
నాశలీన మైననభముచాడ్పున వేఱు
దెలియ వలయు దేహిదేహములకు.

టీ. పాంచభౌతికము = పంచభూతముల (నిప్పు నీళ్లు మన్ను గాలి ఆకసముల) వలనఁ గల్పింపఁబడిన, భవనంబు=ఇల్లు, దీపించున్ = ప్రకాశించును, చేటు = నాశము, దేహపుంజంబు=దేహములరాశి, ఏకత్వంబు = ఒక్కటియగుట, దారువులన్=కట్టెలయందు, దహనునికై వడిన్ = నిప్పువలె, కాయములు = శరీరములు, నాశలీనము = కాఁడలోన్న, నభము= ఆకసము, దేహిదేహములకున్=దేహమునకును, పురుషునకును.

తా. దేహమనఁగాఁ భూమిమొదలగుపంచభూతములతోఁ జేయఁబడినయిల్లు. దీనిలో జీవుఁడుపూర్వకర్మవశమున వర్తించును. ఒకప్పుడు దీనిని విడచిపోవును. ఒకవేళ దేహము నశించునే గాని దేహి నశింపఁడు. అతనికి చావులేదు. ఎన్నిరీతులఁ జూచినను పురుషునకు దేహమునకు భేదమే కాని యైక్యము సిద్ధింపదు. ఆరెంటికిని, కట్టెలు వానిలోనినిప్పు, శరీరములు వానియందలిగాలి, కాఁడ దానిలోనిసందు. వలెనె, వే అని యెఱుఁగనగును.

వ. అని మఱియు నిట్లనియె.

సీ. భూపాలకుఁడు నిద్రవో యెడి నొం డేమి
విలపింప నేటికి వెఱ్ఱులార
యెవ్వాఁడు భాషించు నెవ్వాఁ డాకర్ణించు
నట్టివాఁ డెన్నఁడో యరిగినాఁడు
ప్రాణభూతుం డైన పవనుఁ డాకర్ణింప
భాషింప నేరఁడు ప్రాణిదేహ
ములకు వేఱై తాను ముఖ్యుఁ డై యింద్రియ
వంతుఁడై జీవుండు వలను మెఱయఁ

ఆ. బ్రాభవమున భూతపంచకేంద్రియమనో
లింగదేహములను లీలఁ గూడు
విడుచు నన్యుఁడొకఁడు విభుఁడు దీనికి మీరు
వొగుల నేల వగలఁ బొరల నేల.

టీ. వెఱ్ఱులార, భూపాలకుఁడు = రాజు, ఒండు = ఇతరము, విలపింపన్ = ఏడువఁగా, బాషించున్ = పలుకునో, ఆకర్ణించున్ = వినునో, అరిగినాఁడు = పోయినాఁడు, ప్రాణభూతుండు = ప్రాణమైన, పవనుఁడు = వాయువు, ప్రాణిదేహములకు = జీవునకు దేహమునకు, వేఱై = భిన్నుఁడై, ముఖ్యుఁడై = ప్రధానుఁడై, ఇంద్రియవంతుఁడు = ఇంద్రియములు

కలవాఁడు, వలను మెఱయన్ = నేలు పుమీఱఁగా, ప్రాభవమునన్ = ఐశ్వర్య ముతో, భూత... దేహములన్ = ఐదుభూతములు, త్వగాదీంద్రిములు, మనస్సు, లింగశరీరము వీనిని, లీలన్ = వేడుకతోన్, కూడును = కలయును, విడుచున్ = సడలును, అన్యుఁడు=ఇతరుఁడు, విభుఁడు = ప్రభువు, పొగులన్ = శోకింపఁగా, వగలన్ = దుఃఖములయందు.

తా. ఓపిచ్చివారలారా! రాజు నిద్రబోవుచున్నాఁడు. వేఱేమున్నది? మీ రెండుల కట్లేడ్చెదరు? ఈదేహమందుండి పలుకువాఁడు వినువాఁడు ఎప్పుడో పోయినాఁడు. ఇఁక నిప్పుడిందులోనున్న గాలి మాట్లాడనేరదు. వినలేదు. ప్రాణులు దేహము వీనికంటె ప్రధానుఁడై యింద్రియములు గలిగి చైతన్యము గలిగి, సామర్థ్యముతో, పంచభూతములును ఇంద్రియములు మనస్సు సూక్ష్మదేహము వీనిలోఁజొచ్చుచుఁ బోవుచుండువాఁడు మనకుఁ గానరాఁడు. ఈమాత్రమునకు మీ రిటు లేడ్చుట మొత్తుకొనుట యెందుకు.

క. ఎందాఁక నాత్మ దేహము
నొందెడు నందాఁక గర్మయోగము లట్లైఁ
జెందవు మాయాయోగ
స్పందితులై రిత్త జాలిఁ బడ నేమిటికిన్. 54

టీ. ఆత్మ = జీవుఁడు, ఎందాఁకన్ = ఎంతసేపు, దేహమున్ = శరీరమును, కర్మయోగములు = కర్మసంబంధములు, ఆటనైన్ = ఆమీఁద, చెందవు = అంటవు, మాయాయోగస్పందితులై = మాయయొక్క కూడికచేఁ బొరపడినవారలై, రిత్త = ఊరక, జాలిన్ = దైన్యమును, పడన్ = ఏమిటికిన్ పొందుటయేల.

మ. చెలులుం దల్లులు దండ్రులాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారుని
ర్మలగేహంబులటంచుఁ గూర్తురు మహామాయాగుణభ్రాంతులై
కలలోఁ దోచినయర్థముల్ నిజములే కర్మానుబంధంబులం
గలుగున్ సంగములేక మానుఁ బిదపం గర్మాంతకాలంబునన్.

**తా.** చెలులన్ = మిత్రులును. ఆత్మజులు = కొడుకులు, సంసేవ్యుల్ = ప్రభువులు సతుల్ = భార్యలు, చారునిర్మలగేహంబులు=అందమై మలినములేని యిండ్లును, మహామాయాగుణ భ్రాంతులై = కూర్తురు= ప్రేమింతురు, తోఁచినయర్థముల్ = అగపడినవస్తువులు, కర్మానుబంధంబులన్=కర్మసంబంధములచేత, సంగము=చిక్కు, కలుగు, కర్మాంతకాలంబునన్=కర్మలుతీఱిపోవునప్పుడు, పిదపన్=చివరను, మానున్=నివర్తించును.

తా. మాయకు లోనైనమనుజులు తల్లి, తండ్రి, స్నేహితుఁడు కొడుకులు, రాజులు, భృత్యులు, భార్యలు, మేడలు, నని వారిని ప్రేమింతురు. అది వట్టిపిచ్చి. కలలో నగపడినవస్తువులు నిజములగునా? కర్మమువలన వీనిసంబంధము కలుగును. కర్మములు వదలిన నీచిక్కు వీడును.

**వ.** మఱియు మాయాగుణప్రపంచంబు నెఱింగెడుతత్త్వజ్ఞులు నిత్యానిత్యంబులం గూర్చి సుఖదుఃఖంబులం జెంద రజ్ఞులు కొందఱు యోగవియోగంబులకు సుఖదుఃఖంబుల నొందుదురు తొల్లి యొక్కమహాగహనంబున విహంగంబులకు నంతకభూతుం డైనయెఱుకు గలఁ డతం డొక్కనాఁడు ప్రభాతంబున లేచి వాటం బైనవేఁటతమకంబున. 50

టీ. మాయాగుణప్రపంచంబు = మాయయొక్కగుణము లైనదేహగేహాదులను, తత్త్వజ్ఞులు = నిజ మెఱింగినవారు, నిత్యానిత్యంబులు = శాశ్వతమును భంగురమునుగూర్చి, అజ్ఞులు = తెలియనివారు, యోగవియోగంబులు = సంయోగవియోగములు, విహంగంబులకున్ = పక్షులకు, అంతకభూతుండు = యమునివంటివాఁడు, ఎఱుక = బోయ, ప్రభాతము= వేకువ, వాటము=ఉల్లాసకరము. వేఁటతమకంబునన్ = వేఁటయందలికోరికతో.

**క.** వల లురులు జిగురుఁగండెలుఁ
జలిదియుఁ జిక్కంబు ధనువు శరములుఁ గొనుచుం

బులుఁగులఁ బట్టెడువేడుక
నలుకుడు వెడలంగఁ గదలి యడవికిఁ జనియెన్. 57

టీ. వలలు, ఉరులు, జిగురుఁగండెలు=బంకపూసినదారపుఁగండెలు, చలిది=చద్ది, ధనువు=విల్లు, శరములు=బాణములు, కొంచున్=తీసుకొని, పులుఁగులన్=పక్షులను, పట్టెడువేడుకన్, అలుకుడు=చప్పుడు.

తా. వలలు, ఉరిత్రాడులు, బంకన బూసిదారపుకండెలు, చద్దియన్నపుమూట, పక్షులచిక్కము, విల్లు, అమ్ములును, తీసుకొని, పక్షులఁ బట్టుటకై పెద్దగొడచేయుచు నడవికి వెళ్లెను.

వ. అట్లడవికిం జని తత్ప్రదేశంబునందు. 58

క. కట్టలుకఁ దడుకుచాటునఁ
బిట్టల నురికోలఁ దిగిచి బిఱుసున ఱెక్కల్
వట్టి విఱిచి చిక్కములోఁ
బెట్టుచు విహరించె లోకభీకరలీలన్. 59

టీ. కట్టలుకన్=ఎక్కువచలముతో, తడుకుచాటునన్=కంచెలమాటున, తడక=పిట్టలఁబట్టువానియొక సాధనము, ఉరికోలన్=ఉచ్చుకఱ్ఱతో, తిగిచి=లాఁగి, బిఱుసునన్=కఱుకుఁదనముచేత, లోకభీకరలీలన్=జగద్భయంకరమైన విలాసముతో.

తా. క్రోధముమీఱ కంచెలచాటునఁ బొంచియుండి, కొసను ఉరితగిలించినకఱ్ఱతోఁ బక్షులను బట్టి లాఁగి దయమాలి, ఱెక్కలు విఱిచి చిక్కములో వేసికొనుచు భయమును గొల్పుచు సంచరించెను.

వ. మఱియు నానావిధంబు లగుశకుంతంబుల నంతంబు నొందించుచు సకలపక్షిసంహారసంరబ్ధుండైనలుబ్ధకుండు దనముందటఁ గాలచోదితంబై సంచరించుచున్నకులింగపక్షి మిథునంబు గనుంగొని యందుఁ గులింగి నురిం దిగిచి యొక్కచిక్కంబులో వైచినం జూచి దుఃఖించి కులింగపక్షి యిట్లనియె. 60

టీ. నానావిధంబులు=పలుతెఱఁగులు, శకుంతంబులు = పక్షులు, అంతము=చావు, సకల...రబ్ధకుండు=అన్నిపిట్టలను, హాతము సేయు పూన్కిగలవాఁడు, ఐనలుబ్ధకుండు=ఐయినయెఱుకువాఁడు, కాలచోదితంబు=కాలము చేఁ ద్రోయఁబడినది, కుళింగము=అఁడుపిచ్చుక, దుఃఖించి=వాపోయి.

చ. అడవుల మేఁత మేసి మన మన్యుల కెన్నఁడు నెగ్గు సేయ కె
క్కడ విహరింప నేఁ డకట కట్టిఁడిబ్రహ్మ కిరాతుచేతిలోఁ
బడు మని వ్రాసెనే నుదుటఁ బాపపుదైవముకంటె కింతయె
క్కుడుబరు వయ్యెనే బ్రతుకు గోమలియే మననేర్తుఁ జెల్లరే.

టీ. అన్యులకున్=ఒరులకు, ఎగ్గు = కీడు, విహరింపన్=క్రీడ సేయుచుండఁగా, కట్టిఁడిబ్రహ్మ=కౄరమైనదైవము, నుదుటన్=నొసటిమీఁద, కోమలి=ప్రియురాలా, చెల్లరే=ఔరా.

తా. ప్రియురాలా! మనము అడవులలో మేఁతమేసి మడుఁగులలో నీరుఁ దావి యుండుదుముకాని ఎవరికి ఎన్నఁడును కీడుఁగోయమే. కౄరపు బ్రహ్మ యీబోయవాతఁ బడుమని నీతలలో వ్రాసెఁగాఁబోలు? అయ్యో యీమాలదైవముకంటె కింత బరువైతివిగదే, ఔరా! నేనేమందును.

క. ఒకమాటు మనల నందఱఁ
బ్రకటించి కిరాతువలలఁ బడఁ జేయక ని
న్నొకటిన్ వలఁ బడఁ జేసిన
వికటీకృతదక్షు నైనవిధి నే మందున్. 62

టీ. ప్రకటించి = బయలుచేసిచూపి. కిరాతువలలన్ = బోయవాని యురులలో, వికటీకృతదక్షుము = ఎగుదిగుడుపనులు సేయ నేర్పరియగు, విధిన్ = దైవమును, ఏమందున్.

తా. అయ్యోకాంతా! బిడ్డలతోఁగూడ, మనలనందఱును కిరాతుని పాలు సేయక, నిన్నొక్కదానినే యేల చంపుకపోయెనే. ఎచ్చుతగ్గుపనితనములో గట్టివాఁ డగు దైవము నేమందును?

ఉ. ఱెక్కలు రావు పిల్లలకు ఱేపటి నుండియు మేఁత గానమిం
బొక్కుచు గూఁటిలో నెగసి పోవఁగ నేరవు మున్ను తల్లియీ
దిక్కున నుండి వచ్చునని త్రిప్పనిచూడ్కుల నిక్కి నిక్కి న
ల్దిక్కులుఁ జూచు చున్న వతిదీనత నెట్లు భరింతు నక్కటా.

టీ. పొక్కుచుఁ = ఏడ్చుచు, త్రిప్పనిచూడ్కులఁ = త్రిప్పలేని చూపులతో, నిక్కినిక్కి = ఉబికియుబికి, అతిదీనతఁ = మిగులజాలితో అక్కటా = అయ్యో, భరింతుఁ = సైపఁగలను.

తా. ఇంకను పిల్లలకు ఱెక్కలు రాలేదు. రేపటినుండి మేఁత లేదు గాన ఏడ్చుచు గూఁడువదలిపోలేవు. వెనుక తల్లియీచోటుననుండి వచ్చునని గుఱుతుతోఁ దలలెత్తి జాలిగా నాలుగుప్రక్కలఁ జూచుచున్నవి. అయ్యో యీదుఃఖ మెట్లోర్వఁ గలను.

వ. అని యివ్విధంబున.

క. కుంఠితనాదముతోడను
గంఠము శోషింప వగచు ఖగమును హననో
త్కంఠుం డైనకిరాతుఁ డ
కుంఠితగతి నేసె నొక్కకోలం గూలన్. 65

టీ. కుంఠితనాదముతోడఁ = సన్నగిలినధ్వనితో, కంఠము = గొంతు శోషింపఁ = ఎండఁగా, వగచుఖగమును = ఏడుచుపిచ్చుకను, హననోత్కంఠుఁడు = చంపఁబూనినవాఁడు, అకుంఠితగతిఁ = అడ్డులేని పోకతో, ఒక్కకోలఁ = ఒకబాణముతో, కూలఁ = చచ్చునట్లుగా, ఏసెఁ = కొట్టెను.

తా. ఇట్లు గొంతు ఎండిపోవఁగా హీనస్వరముతో నేడుచునామగపిచ్చుకను చంపవేడుక గలబోయ ఒక్కబాణముతో నడ్డులేక నేలమీఁదఁ బడఁగొట్టెను.

క. కాలము వచ్చిన శబరుని
కోలను ధరఁ గూలె ఖగము ఘోషముతోడం
గాలము డాసిన నేలం
గూలక పో వశమె యెట్టి గుణవంతులకున్. 66

టీ. కాలము = అదును, ఖగము = పిచ్చుక, శబరునికోలను = ఎఱుకువానిబాణమువలన, ఘోషముతోడన్ = అఱపుతో, ధరన్ = భూమిమీఁద, కూలెన్, డాసినన్ = సమీపింపఁగా, ఎట్టిగుణవంతులకున్ = ఎట్టిపరాక్రమాదిగుణములు గలవారికైనను, కూలక = చావక, పోవ శమె = తప్పించుకొనశక్యమా.

తా. ఇట్లు తా నెంతసేపు బ్రదుకునో తెలియక, తనపెండ్లముకోస మేడుచుపక్షి కాలము సమీపించఁగా నే బోయవానిచేతిలో నప్పుడు చచ్చెఁ గదా. ఎంతవారికైనను, కాలము దాకొనినప్పుడుఁ చావకుండ తప్పుకొన శక్యమా.

ఉ. కావున మీరు చచ్చుతఱిఁ గానరు చచ్చి ధరిత్రిఁ బడ్డధా
త్రీవిభుదేహముం గదిసి దీనత నేడ్చువ నేల పొందు చిం
తావతులార వత్సరశతంబుల కైన నిజేశుచక్కికిం
బోవుట దుర్లభంబు మృతిఁ బొందినవారలు సేర వత్తురే.

టీ. చచ్చుతఱిన్ = చనిపోవువేళను, కానరు = ఎఱుఁగరు. ధరిత్రిన్ = నేలమీఁద, పడ్డధాత్రీవిభుదేహమున్ = పడినరాజుకళేబరమును, కదిసి = కౌఁగిలించుకొని, దీనతన్ = పేదఱికముతో, చింతావతులార = దుఃఖవంతులైనరాజుభార్యలారా, వత్సరశతంబులకున్ = ఎన్నినూఱులయేండ్లకైనను, నిజేశుచక్కికిన్ = మీమగనియొండకు, దుర్లభంబు = సంభవింపనిది, మృతిన్ = మరణమును, పొందినవారలు = చెందినమనుజులు, చేర వత్తురే = మరల దగ్గఱకు వచ్చెదరా.

తా. కనుక మీరు రాజాచావున కేడుతురే గాని మీ రెప్పుడు చత్తురో యెఱుఁగరు. ఈరాజాశవముమీఁదఁ బడి యెందుల కేడ్చెదరు? లేచిపొండు! ఇట్లు ఎన్నిదినంబులయేడ్చినా మీ మగఁడున్న చోటుజేరలేరు. పిచ్చివారలారా! చచ్చినవారు మరల బ్రతికివత్తురా.

వ. అని యిట్లు కపటబాలకుండై క్రీడించుచున్న యమునియుపలాలనాలాపంబులు విని సుయజ్ఞునిబంధువులెల్ల వెఱఁగుపడి సర్వప్రపంచంబు నిత్యంబు గాదని తలంచి శోకింపక సుయజ్ఞునికి సాంపరాయికకృత్యంబులు సేసి చని రంత నంతకుం డంతర్హితుం డయ్యె నని చెప్పి హిరణ్యకశిపుండు దనతల్లిని దమ్మునిభార్యలం జూచి యిట్లనియె. 68

టీ. కపటబాలకుండు = మాయపిల్లకాయ, క్రీడించు = విహరించు, ఉపలాలనాలాపంబులు = ఓదార్పుమాటలను, వెఱఁగుపడి = వెల్లఁబోయి, సత్యంబు = ఎప్పుడునుండునది, సాంపరాయికకృత్యంబులు = యుద్ధమునఁజచ్చినవారికిఁ జేయవలయు నుత్తరక్రియలు, అంతకుండు = యముఁడు, అంతర్హితుండయ్యె = కానరాకుండఁబోయెను.

క. పరు లెవ్వరు దా మెవ్వరు
పరికింపఁగ నేక మగుట భావింపరు త
త్పరమజ్ఞానము లేమిని
బరులును నే మనుచుఁ దోఁచుఁ బ్రాణుల కెల్లన్. 69

టీ. పరులు = ఇతరులు, పరికింపఁగన్ = చక్కఁగా విచారించినచో, ఏకము అగుట = ఒక్కటియే అగుట, భావింపరు = గమనింపరు, ప్రాణులకున్ = జీవులన్నిటికిని, తత్పరమజ్ఞానము లేమిన్ = దానివిషయమైన యుత్తమజ్ఞానము లేనందువలన, పరులును, ఏము, అనుచున్, తోఁచును.

తా. తామనఁగా నెవరు? అన్యు లనఁగా నెవరు? అన్నియు నొక్కటియే యనియెఱుఁగరు. జంతువులకు దానివిషయమై తెలివిలేదు గావున తాము వారు వనెడి భ్రమలోఁ బడియెదరు.

వ. అని తెలియం బలికిన హిరణ్యకశిపునివచనంబులు విని దితి కోడండ్రునుం దానును శోకంబు మాని తత్త్వవిలోకనంబు గలిగి లోకాంతరగతుం డైనకొడుకునకు వగవక చని యె నని చెప్పి నారదుండు ధర్మనందనున కిట్లనియె. 70

టీ. తెలియన్ = బోధనడునట్లు, తత్త్వవిలోకనంబు = న్యాయదృష్టి, లోకాంతరగతుండు = ఒండులోకమున కేఁగినవాఁడు.

క. అజరామరభావంబును
ద్రిజగద్రాజ్యంబు నప్రతిద్వంద్వము దో
ర్విజితాఖిలశాత్రవమును
గజరిపుబలమును హిరణ్యకశిపుఁడు గోరెన్. 71

టీ. అజరామరభావంబును = ముదిమి చావులేకుండుటయు, త్రిజగద్రాజ్యంబు = ముల్లోకముల దొరతనము, అప్రతిద్వంద్వము = తనకెదిరించువాఁడు లేమియు, దోర్వి... త్రవమును = బాహుబలముచే గెల్వఁబడిన యెల్లపగతులుగలుగుటను, గజరిపుబలమును = సింహమువంటిపరాక్రమమును.

తా. అంతట హిరణ్యకశిపుఁడు తనకు ముదిమి చావు లేకుండుటయు, ముల్లోకములను దొరతనము తనకెదురాడువారు లేకపోవుటయు, శత్రువిజయమును, సింహపరాక్రమమును తన కుండవలె నని కోరెను.

వ. ఇట్లు గోరి మందరాచలద్రోణికిం జని యందుఁ గాలిపెను వ్రేల నేల నిలువంబడి యూర్ధ్వబాహుండయి మిన్ను చూచుచు వాఁడిమయూఖంబులతోడి ప్రళయకాలభానుండునుంబోలె దీర్ఘజటారుణప్రభాజాలంబుతోడ నెవ్వరికిం దేఱి

చూడ రాక పరమదారుణంబైనతపంబు సేయుచుండె ని
ర్జరులు నిజస్థానంబుల నుండి రంత. 72

టీ. మందరాచలద్రోణికిన్=మందర పర్వతము కొప్పునకు, పెనుద్రేలన్=బొట్టనవ్రేలుతో, ఊర్ధ్వబాహుండు=చేతులు పైకెత్తినవాఁడు, మిన్ను=ఆకసము, వాఁడిమయూఖంబులు=చురుకైనయెండలు, ప్రళయకాలభానుండు=ప్రళయకాలమందలిసూర్యుఁడు, దీర్ఘ.. జాలంబు=పొడవులైనజడల యెఱ్ఱనిరంగులసమూహము, తేటి=మొగముపైకెత్తి, పరమదారుణంబు=మిగుల వేఁడియైనది. నిర్జరులు=వేలుపులు, నిజస్థానంబులు=తమతమనెలవులు.

మ. అదరెం గుంభిని సాద్రియై కలఁగె నేడంభోనిధుల్ దారకల్
చెదరెన్ సగ్రహసంఘులై దిశలు విచ్ఛిన్నాంతలై మండెఁ బె
ల్లదరెన్ గుండెలు జంతుసంహతికి నుగ్రాచారదైత్యేంద్రమూ
ర్ధదిశోద్ధూతసధూమహేతిపటలోదంచత్తపోవహ్నిచేన్.

టీ. ఉగ్రా...వహ్నిచేన్ = దారుణప్రవర్తనముగల రాక్షసరాజు యొక్క తలలోనుండి లేచిన పొగతోడిమంటలతోఁ బొంగుచున్నతపస్సనెడు నగ్నిచేత, కుంభిని = భూమి, సాద్రి = పర్వతములతోఁగూడినది, ఏడంభోనిధుల్ = ఏడుసముద్రములు, కలఁగెన్ = పంకిలములయ్యెను, తారకల్ = చుక్కలు, చెదరెన్, దిశలు, సగ్రహసంఘులు = గ్రహములగుంపులతోఁగూడినవి, విచ్ఛిన్నాంతలు = చీలినయంచులుగలవి, జంతుసంతతికిన్ = జంతువులగుంపులకు, గుండెలు, పెల్లు = మిక్కిలి, అదరెన్.

తా. అతిదారుణమైనప్రవర్తనగల తపస్సు జేయునాహిరణ్యకశిపుని తలలోనుండిపుట్టినతపముయొక్క మంటలకు కొండలతోడ భూమి కలఁకెను. సముద్రములు కలఁతనొందెను. గ్రహములతోఁగూడ చుక్కలు చెదరిపోయెను, దిక్కులుబీఁటలువాసి మండసాగెను. అన్నిజంతువులకు గుండెలు కొట్టుకొనసాగెను.

వ. ఇట్లు త్రైలోక్యసంతాపకరం బైనదైత్యరాజతపోవిజృంభణం బు సైరింపక నిలింపులు నాకంబు విడిచి బ్రహ్మలోకంబున కుం జని లోకేశ్వరుం డయినబ్రహ్మకు వినతు లయి యిట్లని విన్నవించిరి. 74

టీ. త్రైలోక్య...కరంబు = ముల్లోకములకు తాపమును గలిగించు చున్నది, దైత్య...ణంబు=రాక్షసులకురాజగు హిరణ్యకశిపుని తపముపెంపును, సైరింపక = ఓర్వఁజాలక, నిలింపులు = దేవతలు, నాకంబు = స్వర్గము. లోకేశ్వరుఁడు = ఎల్లలోకములకు నేలిక, వినతులు = మ్రొక్కిన వారు.

క. దితికొడుకుతపము వేఁడిమి
నతితప్తుల మైతి మింక నలజడి నమరా
వతి నుండ వెఱతు మెయ్యది
గతి మాకును దేవదేవ కారుణ్యనిధీ. 75

టీ. కారుణ్యనిధీ = దయకు నెలవైనవాఁడా, అతితప్తులము = మిక్కిలిక్రాఁగినవారము, అలజడిని=భయముచేత, అమరావతిని=దేవతల రాజధానియందు, దేవదేవ = దేవతలకెల్లదేవుఁడా, మాకు, గతి = దిక్కు, ఎయ్యది.

తా. దయగలయో బ్రహ్మ, హిరణ్యకశిపుని తపస్సుయొక్క వేఁడిమివలన మాఁడిపోయినారము. ఇఁక మాకు భయమెత్తినది. స్వర్గములో నుండుటకుఁ మాకు గుండె తాళదు. స్వామీ. మా కిఁక నేమిదిక్కు ?

మ. శంకాలేశము లేదు దేవ త్రిజగత్సంహారముం దేవతా
సంకోచంబును వేదశాస్త్రపదవీసంక్షేపముం లేక యే
వంకన్ జేతు నటంచు దుస్సహతపోవ్యావృత్తి చిత్తంబులో
సంకల్పించె నిశాచరుండు ప్రతిసంస్కారంబు చింతింపవే.

టీ. దేవ = స్వామి, శంకాలేశము = కొంచెమనుమానమును, త్రిజగత్సంహారము = మూడులోకముల రూపుమాపుటయు, దేవతాసంక్షోచంబు = దేవతలనణచుటయు, వేద... సంక్షేపము వేదశాస్త్ర మార్గములు పాడుసేయుటయు, చాలన్ = మిగుల, ఏవంకన్ = ఏవైపునను, నిశాచరుండు = రాక్షసుడు, దుస్సహతపోవ్యాప్తి = ఇతరులకోర్వరాని తపస్సుయొక్క వ్యాపారమును, చిత్తంబులోన్ = మనమున, సంకల్పించెన్ = తలపెట్టెను, ప్రతిసంస్కారంబు = దానినిశమింపజేయు నుపాయమును, చింతింపవే = యోచింపుమా.

తా. దేవా! మూడు లోకములను నాశనము జేతును. దేవతలను రూపుమాపుదును. ఎచ్చటను వేదశాస్త్రముల పేరు వినబడకుండ జేసెదను. అనియీతపస్సునకు బూనినాడు. వాడంతయు జేయ నున్నాడు. ఇందుల కేయనుమానము లేదు. దీని కేమైన బదులుసేత యోజింపుము.

శా. నీ వేరీతిఁ దపోబలంబున జగన్నిర్మాణముం జేసి యీ
దేవాధీశులకంటె నెక్కువసిరిం దీపించి తిబ్భంగిఁ దా
నీవిశ్వంబు తపస్సమాధిమహిమన్ హింసించి వేఱొక్కవి
శ్వావిర్భావకశక్తి మదిలో నర్థించినాఁ డీశ్వరా. 77

టీ. ఈశ్వరా = దేవా, ఏరీతిన్ = ఏవిధముగా, తపోబలంబునన్ = తపముకలిమిచేత, జగన్నిర్మాణమున్ = లోకములసృష్టిని, దేవాధీశులు = దేవతల యధిపతులు, ఎక్కుడుసిరిన్ = మించినయైశ్వర్యముతో, దీపించితి = ప్రకాశించితివో, ఇభ్భంగిన్ = ఈలాగుననే, తాను = హిరణ్యకశిపుడు, ఈవిశ్వంబు = ఈప్రపంచము, తపస్సమాధిమహిమన్ = తపోనియమముయొక్క బలముచేత, వేఱొక్క... శక్తి = మఱియొకప్రపంచమును బుట్టించుసామర్థ్యమును, అర్థించినాడు = కోరియున్నాడు.

తా. స్వామీ! యీహిరణ్యకశిపుడు నీవు తపోబలమున నెట్లుదేవతలనందఱిని మించి లోకములను సృజించితివో అలాగున ఇప్పుడున్న ప్ర

పంచమును హతముజేసి తానొకక్రొత్తప్రపంచమును నిర్మింపఁగోరి, ఈతపస్సు ప్రారంభించినాఁడు.

వ. అదియునుం గాక కాలాత్ములగుజీవాత్మల కనిత్యత్వంబు గలుగుటంజేసి తపోయోగసమాధిబలంబునఁ దనకు నిత్యత్వంబు సంపాదింతు నని తలంచినాఁ డని మఱియు నిట్లనియె.

టీ. కాలాత్ములు=కాలస్వరూపులు, జీవాత్ములకున్=జీవునకు నాత్మకును, అనిత్యత్వంబు=స్థిరముకాకుండుట, తపో...బలంబునన్=తపస్సు యోగము సమాధి వీనిబలమున, నిత్యత్వంబు=శాశ్వతత్వము, సంపాదింతున్=సాధించెదను.

మ. భవదీయం బగునున్నతోన్నతమహాబ్రహ్మైకపీఠంబు సంస్తవనీయంబగుభూతియున్విభవము న్సౌఖ్యంబు సంతోషము న్భువనశ్రేణికి నిచ్చి దైత్యునితపస్స్ఫూర్తి న్నివారించియో భువనాధీశ్వర కావవే భువనముల్ పూర్ణప్రసాదంబునన్.

టీ. ఓ భువనాధీశ్వర = లోకరక్షకుఁడగునోదేవా, భవదీయంబు =నీది, ఉన్నతో...ఠంబు=అన్నిటికంటె గొప్పదగు సాటిలేని నీ సింహాసనమును, సంస్తవనీయంబు=కొనియాడఁదగినది, భూతి = సంపద, విభవము=ఐశ్వర్యము, సౌఖ్యము=సుఖము, భువనశ్రేణికిన్=లోకములకొఱకుగా, ఇచ్చి = వానికిచ్చి, దైత్యునితపస్స్ఫూర్తిన్ = రాక్షసుని తపస్సుయొక్క ఉద్రేకమును, నివారించి=మాన్పి, పూర్ణప్రసాదంబునన్=నిండుకరుణమై, భువనముల్, కావవే=కాపాడుమా.

తా. లోకనాయకుఁ డగునోదేవా, లోకక్షేమము గోరితివేని, అత్యున్నతమైన నీ పీఠముగానీ, నీ సంపదగానీ, ఐశ్వర్యముగానీ సౌఖ్యము, సంతోషము, వాఁడేది గోరిన దానినెల్ల లోకములకుగా నిచ్చి వానితపము మాన్పి లోకములను గాపాడుము.

వ. అని దేవతలు విన్నవించిన స్వయంభూతుండును భగవంతుఁ
డు నైన నలుమొగంబుల వేల్పుఁబోఁడ భృగుదక్షాదులతోఁ
డ మందరపర్వతంబునకు వచ్చి యందునియమయుక్తుండును
బిపీలికావృతమేదోమాంసచర్మరక్తుండును వల్మీకతృణవేణు
పటలపరిచ్ఛన్నుండును మహాతపఃప్రభావసంపన్నుండును
నై నీరంధ్రనిబిడనీరదనికరనివిష్టనీరజబాంధుండునుంబోలె
నివసించియున్న నిర్జరారాతిం జూచి వెఱఁగుపడి నగుచు
నిట్లనియె. 80

టీ. విన్నవించినః=మనవి సేయఁగా, స్వయంభూతుండు=తనంతనే పుట్టినవాఁడు, భగవంతుఁడు=షడ్గుణైశ్వర్యములు గలవాఁడు, నలుమొగంబులవేల్పుఁబోఁడ=నాలుగు మోములుగల దేవతలదొరఁ, బ్రహ్మ, నియమయుక్తుండు=తపోనియమముతోఁ గూడినవాఁడు, పిపీలికా...క్తుండును=చీములుపట్టిన మెదడుమాంసము తోలు నెత్తురు గలవాఁడు, వల్మీక...చ్ఛన్నుండు=పుట్టలు, గడ్డి దుబ్బులు, వెదురుగుమ్ములు వీనిచే నిండినవాఁడు, మహా...న్నుండు=గొప్ప తపోమహిమ గలవాఁడు, నీరంధ్ర...ధుండునుం బోలె=తెఱపిలేక మూఁగిన మబ్బులలోనున్న సూర్యునివలె, నిర్జరారాతి=దేవతలదాయ, వెఱఁగుపడి=నివ్వెఱఁగంది.

మత్తకోకిల. ఓసురారికులేంద్ర నీక్రియ నుగ్రమైనతపంబుముఁ
జేసి చూపినవారు లేరిఁకఁ జేయువారును లేరు నే
నీసమాధికి మెచ్చితిన్ విను నీయభీష్టము లిత్తు నా
యాస మేటికి లెమ్ము వేగ మహాత్మ కోరుము కోరికల్.

టీ. ఓ సురారికులేంద్ర=ఓరాక్షస సంఘములరాజా, నీక్రియన్=నీవలె, ఉగ్రము=భీతిగొలుపునది, మున్=ఇంతకుఁబూర్వము, ఇఁకన్=నీ వెనుక, నీసమాధికిన్=నీ నియమమునకు, అభీష్టములు = కోరికలు, ఆయాసము=శ్రమ, మహాత్మ=గొప్పశక్తికలవాఁడా, కోరికల్, కోరుము.

**తా.** ఓ రాక్షసరాజా, నీవలె నిట్లింతకుముందు లోకభయంకర మైనతపస్సు చేసినవారు లేరు. ఇక ముందుండఁబోరు. నేను నీతపో నియమమునకు నానందించితిని. నీ కోరిక లెల్ల నిత్తు లేచిరమ్ము. ఓఘనుఁడా ఏల యింకను బడలెదవు. వచ్చి యిష్టములఁ గోరికొనుము.

శా. దంశవ్రాతములు న్పిపీలికలు మేదశ్శ్రవ్యరక్తంబుల
న్నంశీర్ణంబులు సేసి పట్టి తినఁగా శల్యావశిష్టుండ వై
వంశచ్ఛన్నతృణావళీయుతమహావల్మీకమం దింద్రియ
భ్రంశం బింతయు లేక నీకు నిలువం బ్రాణంబు లెట్లుండెనో.

టీ. దంశవ్రాతములున్ = దోమలగుంపులును, పిపీలికలు = చీమలును, మేదశ్శ్రవ్యరక్తంబులన్ = మెదడును రక్తము కండలును, పట్టి = తివిచి, తినఁగాన్, శల్యావశిష్టుండవు = ఎముకలుమాత్రము మిగిలినవాఁడవు, వంశ... మందున్ = వెదుళ్లు గడ్డి మొలచిన పెద్దపుట్టలో, ఇంద్రియభ్రంశంబు = ఇంద్రియచలనము, ఇంతయున్ = కొంచెమును.

**తా.** రాక్షసా! యిట్లు దోమలు చీమలు నెత్తురు కండలుఁ బీఁకికొని తినఁగా నెముకలు మిగిలి వెదుళ్లు గడ్డిమొలచినపుట్టనడుమ నింద్రియములను బిగఁబట్టి నీ వెట్లింతకాలము బ్రతికియుంటివో చిత్రముగా నున్నది.

ఉ. ఉత్సుకతం జలాన్నముల నొల్లక యీక్రియ నూఱుదివ్యసం
వత్సరముల్ శరీరమున వాయువులు న్నిలుపంగ వచ్చునే
యుత్సవమయ్యె మాకు మము నుగ్రతపంబున గెల్చితీవు నే
వత్సలత న్నినుం గదియ వచ్చితిఁ గోరిక లెల్ల నిచ్చెదన్.

టీ. ఉత్సుకతన్ = మక్కువతో, జలాన్నములన్ = అన్నోదకములను, ఒల్లక = కోరక, ఈక్రియన్ = ఇట్లు, నూఱుదివ్యసంవత్సరముల్ = నూఱుదివ్యవర్షములు, మాకున్, ఉత్సవము = సంతోషము, ఉగ్రతపంబునన్ = భయంకరతపమువలన, వత్సలతన్ = ప్రేమతో, కదియన్ = చేరఁగా.

తా. నిశాచరేంద్రా! తపముమాట నటుపెట్టుము. అన్నము నీళ్లు లేక నూరేండ్లు ఇట్లు ప్రాణవాయువులనైన నిలుప వశమా నీ చరిత్రముఁ జూడ మా కత్యంత సంతోషము గలిగించెను. తపస్సుచే నీవు మమ్ము గెల్చినావు. నే నత్యంత ప్రేమతో నిన్ను జూడవచ్చితిని. నీ కోరినదెల్ల నిచ్చెదను. లెమ్ము.

వ. అని పలికి వనమక్షికాపిపీలికాభక్షితం బైన రక్షోవిభుని దేహం బుమీఁదం గమండలుజలంబులు ప్రోక్షించిన నద్దానవేంద్రుఁడు కమలాసనకరకమలకమనీయకనకమయదివ్యాఘోఘుకమండలునిర్గతనిర్మలనీరధారాబిందుసందోహసంసిక్తసకలాంగుండై నిక్షేపంబు చాలించి సాంద్రకీచకసంఘాతసంఛాదితవామలూరుమధ్యంబు వెలువడి మహాప్రభావబలసౌందర్యతారుణ్యసహితుండును వజ్రసంకాశదేహుండును దప్తసువర్ణవర్ణుండును నై నీరసేంధననికరనిర్గతవహ్నియుంబోలె వెలుంగుచుం జనుదెంచి. 84

టీ. వన...తంబు=అడవియీఁగలచేతను గండుజీమలచేతను భక్షింపఁ బడినది, రక్షోవిభుని దేహంబుమీఁదన్=హిరణ్యకశిపునియొడలిమీఁద, కమండలు జలంబులు=కుండికలోనినీళ్లు, ప్రోక్షించినన్ = చల్లఁగా, దానవేంద్రుఁడు=హిరణ్యకశిపుఁడు, కమలాసన...గుండై...బ్రహ్మచేతితో నందమైన బంగారుకమండలువునందుండి యెత్తి చల్లఁబడిన పావనములైన నీటిధారల బొట్లచేఁ దడసిన యెల్లశరీరముగలవాఁడై, సాంద్ర...మధ్యంబు= దట్టంపువెదురుటడవిచేఁ గప్పఁబడిన పుట్టనడుమనుండి, మహా...సహితుండు=గొప్పమహిమ బలము అందము ప్రాయము వీనితోఁ గూడినవాఁడు, వజ్ర...హుండు=వజ్రమువంటి శరీరము గలవాఁడు, తప్త...ర్ణుండు=పుటము వెట్టిన బంగరువంటి మేనిరంగు గలవాఁడు, నీర...వహ్ని=ఎండినకట్టెలోనుండి వెలువడునిప్పు, వెలుంగుచున్=ప్రకాశించుచు, చనుదెంచి=వచ్చి.

మ. దివిజానీకవిరోధి మ్రొక్కెఁ గని వాగ్దేవీమనోనేతకున్
సవిశేషోత్సవసంవిధాతకు నమస్సంత్రాతకు న్సత్తపో
నివహాభీష్టవరప్రదాతకు జగన్నిర్మాతకుం ధాతకున్
వివిధప్రాణిలలాటలేఖనమహావిద్యానుసంధాతకున్.

టీ. దివిజానీకవిరోధి = దేవతాసైన్యములశత్రువు, వాగ్దేవీమనోనేత = సరస్వతీప్రాణేశ్వరుఁడు, సవి...ధాత = అతిశయమైనయానందమునిచ్చువాఁడు, నమత్సంత్రాత = మ్రొక్కువారిం గాపాడువాఁడు, సత్తపో ... దాని = మంచి తపస్సులు జేసినవారికి కోరికలనిచ్చువాఁడు, జగన్నిర్మాత = లోకములఁ బుట్టించువాఁడు, వివిధ... ధాత = సమస్తజంతువుల తలవ్రాఁతల వ్రాయువిద్యలో గట్టివాఁడు, ధాతకున్ = బ్రహ్మకు.

తా. సరస్వతికి భర్తయు, ఆనందము నిచ్చువాఁడును, మ్రొక్కిన వారినిఁ గాదనక రక్షించువాఁడును, మంచి తపస్సుజేసినచో మించినవరము లిచ్చువాఁడును, లోకములఁ బుట్టించినవాఁడును, జంతువుల నొసలవ్రాఁతల వ్రాయుపని గలవాఁడు నగు బ్రహ్మకు నమస్కరించెను.

వ. ఇట్లు దైత్యేశ్వరుండు దివి నున్న హంసవాహనునకు ధరణీతలంబున దండప్రణామంబు లాచరించి సంతోషబాష్పసలిలసంవర్ధితపులకాంకురుం డై యంజలి నేసి కంజగర్భునిమీఁద దృష్టి యిడి గద్గదస్వరంబున నిట్లని వినుతించె. 83

టీ. దైత్యేశ్వరుండు = రాక్షసులదొర, దివిన్ = ఆకాశమందు, హంసవాహనునకున్ = బ్రహ్మకు, ధరణీతలంబునన్ = భూమిమీఁద, దండప్రణామంబులు, కఱ్ఱవలె సాగిమ్రొక్కుటలను, ఆచరించి = చేసి, సంతోష... కురుండు = ఆనందమువలనఁ బుట్టిన కన్నీళ్లచేఁ బెరిగిన గగుర్పాటులు గలవాఁడు, అంజలి = దోసిలి, కంజగర్భుఁడు = బ్రహ్మ, దృష్టి = చూపు, గద్గదస్వరంబునన్ = డగ్గుత్తికతో, వినుతించెన్ = స్తోత్రముచేసెను.

సీ. కల్పాంతమున నంధకారసంవృత మైన
జగము నెవ్వాఁడు దనసంప్రకాశ
మున వెలిగించుచు మూఁడుభంగుల రజ
స్సత్త్వతమోగుణసహితుఁ డగుచుఁ
గల్పించు రక్షించుఁ గడపటఁ బ్రహరించు
నెవ్వాఁ డాద్యుఁడు సర్వహేతు వగుచు
శోభితుం డై స్వయంజ్యోతియై యొక్కట
విలసిల్లు నెవ్వాఁడు విభుత మెఱసి
ఆ. సమయ మయిన మానసప్రాణబుద్ధీంద్రి
యములతోడ నెవ్వాఁ డలఘుమహిమ
నడరు నట్టిసచ్చిదానందమయునకు
మహితభక్తి నే సమస్కరింతు. 87

టీ. కల్పాంతమునన్ = ప్రళయమునందు, అంధకారసంవృతము = చీఁకటి గ్రమ్మినది, సంప్రకాశము = వెలుతురు, మూఁడుభంగులన్ = మూఁడు ప్రకారముల చేత, రజ... సహితుఁడు = రజస్సు, సత్త్వము, తమోగుణము వీని తోఁ గూడినవాఁడు, కల్పించున్ = పుట్టించును, ప్రహరించున్ = చంపును, ఆద్యుఁడు = మొదలిటివాఁడు, సర్వహేతువు = అన్నిటికిఁ గారణభూతుఁడు, శోభితుండు = ప్రకాశించువాఁడు, స్వయంజ్యోతి = తనకుఁదా వెలుంగునది, ఒక్కటన్ = ఏకముగా, విలసిల్లున్ = ప్రకాశించును, విభుత = ఠీవి, మానస... ములు = మనస్సు ప్రాణములు బుద్ధి ఇంద్రియములు, అలఘుమహిమన్ = గొప్ప సామర్థ్యముతో, అడరున్ = విజృంభించునో, సచ్చిదానందమయుఁడు = త్రికాలాబాధ్యుఁడు, జ్ఞానరూపుఁడు, ఆనందరూపుఁడునైన, మహితభక్తిన్ = పూజ్యమైనభక్తితో, ఏను, నమస్కరింతున్ = మ్రొక్కెదను.

తా. ఎవఁడు ప్రళయకాలమునఁ జీఁకటిఁగ్రమ్మినలోకమును తనవెలుం గున వెలింగించునో, ఎవఁడు మూఁడగురజస్సత్త్వతమోగుణములచే లోక ములను పుట్టించి, పెంచి, నశింపఁజేయుచుండునో, ఎవఁ డన్నిటికి మొద లును మూలకారణమో, ఎవఁడు తనకుఁ దా వెలుంగుచు కేవలుఁడై యుండు నో, ఎవఁడు కాలముచొప్పున మానస ప్రాణ బుద్ధి ఇంద్రియములు గలవాఁ డుగాఁదోఁచునో, మహామహిమతోఁడ నెవ్వరికిని గోచరముకాక మెలఁగు నాసచ్చిదానంద రూపునకు నే మ్రొక్కెదను.

వ. దేవా నీవు ముఖ్యప్రాణం బగుటంజేసి ప్రజాపతివి మనో బుద్ధి చిత్తేంద్రియంబులకు నధీశ్వరుండవు మహాభూతగణంబు లకు నాధారభూతుండవు త్రయీతనువునం గ్రతువులు విస్త రింతువు సకలవిద్యలు నీతనువు సర్వార్థసాధకులకు సాధనీ యుండవాత్మనిష్ఠాగరిష్ఠులకు ధ్యేయం బగునాత్మవు కాల మయుండవై జనులకు నాయుర్నాశంబు సేయుదువు జ్ఞాన విజ్ఞానమూర్తి వాభ్యంతరహితుండ వంతరాత్మవు మూఁడు మూర్తులకు మూలం బగుపరమాత్మవు జీవలోకంబునకు జీ వాత్మవు సర్వంబును నీవ నీవు గానిది లేశంబును లేదు వ్య క్తుండవు గాక పరమాత్మవై పురాణపురుషుండవై యనం తుండవై ననీవు ప్రాణేంద్రియమనోబుద్ధిగుణంబుల నంగీకరిం చి పరమేష్ఠిపదవిశేషంబున నిలిచి స్థూలశరీరంబునంజేసి యింతయుం బ్రపంచింతువు భగవంతుండ వైననీకు మ్రొక్కె ద నని మఱియు నిట్లనియె. 88

టీ. ముఖ్యప్రాణంబు=సూత్రాత్మ, ప్రజాపతి = ప్రజలకు జననహే తువు, అధీశ్వరుండవు=ప్రభుండవు, మహాభూతగణంబులకున్=గొప్పజీవరా సులకు, ఆధారభూతుండవు=ఆధారమైనవాఁడవు, త్రయీతనువునన్=వేద

త్రయ మనుశరీరముతో, క్రతువులు=యజ్ఞములు, విస్తరింతువు=ప్రబలఁజేయుదువు, సర్వార్థసాధకుఁడ=అన్ని పనులు చక్కఁబెట్టుకొనువానికి, సాధనీయుండవు = ఆశ్రయింపఁదగినవాఁడవు, ఆత్మనిష్ఠాగరిష్ఠులకుఁ = బ్రహ్మనిష్ఠయందుఁ గుదిరిక గలవారలకు, ధ్యేయము = ధ్యానింపఁదగినది, అగు నాత్మవు=ఐన యాత్మవు, కాలమయుండవు = కాలస్వరూపివి, ఆయుర్నాశంబు=జీవితకాలముయొక్క హరణము, జ్ఞానవిజ్ఞానమూర్తివి, ఆద్యంతరహితుండవు=మొదలు తుదలేనివాఁడు, అంతరాత్మవు = లోపలిచైతన్యమవు, లేశంబు=కొంచెము, వ్యక్తుండవు=తెలిసికోఁదగువాఁడవు, పురాణ పురుషుండవు=ఆదిమూర్తివి, అనంతుఁడవు=అంతములేనివాఁడవు, ప్రాణేంద్రియమనోబుద్ధి గుణంబులఁ, అంగీకరించి = ఒప్పుకొని, పరమేష్ఠి పదవిశేషంబునఁ=పరాత్పరుఁడనుపేరుతోడ, స్థూలశరీరము = బాహ్యదేహము, ప్రపంచింతువు=విస్తరింతువు.

క. కోరినవారలకోర్కులు
నేరుపుతో నిచ్చి మనుప నీక్రియ నన్యుల్
నేరరు కరుణాకర నేఁ
గోరెద నీవిచ్చెదేనిఁ గోరిక లభవా. 89

టీ. కోరినవారలకోర్కులు, ఇచ్చి, మనుపఁ = సంరక్షించుట కొఱకు, నీక్రియఁ = నీవలె, అన్యుల్.= ఇతరులు, కరుణాకర-దయకుఁ బుట్టినచోటైనవాఁడా, అభవా= పుట్టుకలేనివాఁడా.

తా. దేవా! కోరినవారికి కోరినదెల్ల నిచ్చుటలో నీకు సరియగువారులేరు. నీవు నే నడిగినదెల్ల నిచ్చెదవేని నేఁ గోరికొందును.

శా. గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములం దమఃప్రబలభూరిగ్రాహరక్షోమృగ
వ్యాళాదిత్యనరాదిజంతుకలహావ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువు లేనిజీవనము లోకాధీశ యిప్పింపవే. 90

టీ. లోకాధీశ = జగత్ప్రభూ, కుంభినిన్ = భూమియందు, అంబువులన్ = నీళ్లలో, ఆకాశస్థలిన్ = అకాశముమీఁద, రేలన్ = రాత్రులయందును, ఘస్రములన్ = పగళ్లయందు, ప్రబల...వ్యాప్తిన్ = చీఁకటియందును, గొప్పగొప్పజలజంతువులు, రాక్షసులును, క్రూరమృగములు, పాములు, దేవతలు, మానవులు మొదలగువారితోడి పోరాటము సంభవించినప్పుడును, సమస్తాస్త్రశస్త్రములన్ = అన్నిరకములఅస్త్రశస్త్రములచేతను, మృత్యువులేనిజీవనము=చావులేనిబ్రదుకు, ఇప్పింపవే.

తా. దేవా! గాలియందు నేలయందు, నిప్పులలోను, నీళ్లలోను, ఆకాశమందు, దిక్కులయందు, రాత్రులయందు, పగళ్లయందు, చీఁకటియందు, జలజంతువులు, రక్కసులు, క్రూరజంతువులు, పాములు, దేవతలు, మనుష్యులు, మొదలగుజంతువులతోడి యుద్ధమందును, అన్నివిధముల అస్త్రశస్త్రములవలనను గూడ చావకుండ బ్రదుకు నట్లనుగ్రహింపుము.

వ. అని మఱియు రణంబులందుఁ దన కెదురు లేనిశౌర్యంబును లోకపాలుర నతిక్రమించుమహిమయును భువనత్రయవిజయంబును హిరణ్యకశిపుండు గోరిన నతనితపంబునకు సంతోషించి దుర్లభంబు లయినవరంబు లన్నియు నిచ్చి కరుణించి విరించి యి ట్లనియె. 91

టీ. రణంబులు= యుద్ధములు, తనకు, మహిమ=సామర్థ్యము, భువనత్రయజయంబును=ముల్లోకముల విజయమును, దర్లభంబులు=పొందశక్యముకానివి, కరుణించి=దయచేసి, విరించి=బ్రహ్మ.

శా. అన్నా కశ్యపపుత్త్ర దుర్లభము లీయర్థంబు లెవ్వారికిన్
ము న్నెవ్వారలుఁ గోర రీవరములన్ మోదించితిన్ నీయెడన్
నన్నుం గోరిన వెల్ల నిచ్చితిఁ బ్రవీణత్వంబుతో బుద్ధిసం
పన్నత్వంబున నుండుమీ సుమతి వై భద్రైకశీలుండవై.

టీ. అన్నా=వత్సా, కశ్యపపుత్త్రి=కశ్యపునికొడుకగుహిరణ్యకశిపూ, ఈయర్థంబులు=నీవుకోరిన యీకోర్కులు, ఎవ్వారికిన్=ఎవరికైనను, దుర్లభములు=పొందరానివి, మున్ను=పూర్వము. మోదించితిన్=సంతసించితిని, ప్రవీణత్వంబుతోన్=నేరుపుతో, బుద్ధిసంపన్నత్వంబునన్=జ్ఞానము కలిమితో, సుమతివి = మంచిబుద్ధిగలవాఁడవు, భద్రికశీలుండవు = శుభస్వభావము గలవాఁడవు.

తా. నాయనా! హిరణ్యకశిపూ, నీవు నన్నడిగినవెల్ల నెవరికిని దొరకవు. వీనినిదివఱకు ఎవరును గోరియెఱుఁగరు. నీయెడఁ గరుణించి యివన్నియు నిచ్చితిని. నేరుపుగలిగి, జ్ఞానవంతుఁడవై శుభమందే దృష్టిగలిగి ప్రవర్తింపుము. పొమ్ము.

వ. అని యిట్లమోఘంబు లయినవరంబు లిచ్చి దితినందనుచేతం
బూజితుండై యరవిందసంభవుండు బృందారకసందోహవం
ద్యమానుం డగుచు నిజమందిరంబునకుం జనియె నివ్విధమ్ము
న నిలింపారాతి వరపరంపరలు సంపాదించుకొని. 93

టీ. అమోఘంబులు = సఫలములైనవి, దితినందనుచేతన్=హిరణ్యకశిపునిచేత, అరవిందసంభవుండు = తామరలోఁ బుట్టినవాఁడు, బ్రహ్మ, బృందారక...నుండు = దేవతలగుంపులచే మ్రొక్కఁబడినవాఁడు, నిజమందిరంబు=తనయిల్లు, నిలింపారాతి= దేవతలకు పగతుఁడు, వరపరంపరలు=వరముల సమూహములు.

క. సోదరుఁ జంపినపగ కై
యాదర మించుకయు లేక యసురేంద్రుఁడు గం
జోదరుపై వైరము దు
ర్మాదరతుం డగుచుఁ జేసె మనుజాధీశా. 94

టీ. మనుజాధీశా=రాజా, అసురేంద్రుఁడు = హిరణ్యకశిపుఁడు,

సోదరుఁ=తమ్ముని, ఆదరము=భక్తి, ఇంచుకయుఁ=కొంచెమున్ను, కంజోదరుపైఁ=విష్ణువుమీఁద, దుర్మాదరంతుండు=చెడ్డమదముగలవాఁడై.

తా. రాజా! ఇట్లు హిరణ్యకశిపుఁడు కోపించి తనతమ్ముని జంపినాఁడని నీమాలి విష్ణునిమీఁద విడువనిపగను బూనెను.

సీ. ఒకనాఁడు గంధర్వయూథంబుఁ బరిమార్చు
దివిజుల నొకనాఁడు తెరలఁ దోలు
భుజగుల నొకనాఁడు భోగంబులకుఁ బాపు
గ్రహముల నొకనాఁడు గట్టివైచు
నొకనాఁడు యక్షుల నుగ్రత దండించు
నొకనాఁడు విహగుల నొడిసిపట్టు
నొకనాఁడు సిద్ధుల నోడించి బంధించు
మనుజుల నొకనాఁడు మద మడంచుఁ

తే. గడిమి నొకనాఁడు కిన్నర ఖచర సాధ్య
చారణ ప్రేత భూత పిశాచ వన్య
సత్త్వ విద్యాధరాదుల సంహరించు
దితితనూజుండు దుస్సహతేజుఁ డగుచు. 95

టీ. దితితనూజుండు=హిరణ్యకశిపుఁడు, దుస్సహతేజుఁడు=సైఁపరాని విక్రమముగలవాఁడు, గంధర్వయూథంబున్ = గంధర్వుల సమూహమును, పరిమార్చుఁ = చంపును, దివిజులఁ = దేవతలను, తెరలఁ తోలుఁ=చెదరిపోవునట్లు తఱుమును. భుజగులఁ=నాగలోకవాసులను, గ్రహములఁ=సూర్యుఁడు మొదలగు గ్రహములను, ఉగ్రతఁ=క్రౌర్యముతో, విహగులఁ=పక్షులను, కడిమిఁ=ధైర్యముతో, కిన్నర=అశ్వముఖులు, ఖచర=గగనచరులు, సాధ్యులు, చారణులు, వన్యసత్త్వ=అడవిజంతువులు.

తా. ఇట్లు రాక్షసుఁడు తేఱిచూడరాని విక్రమముగలవాఁడై ఒకనాఁడు గంధర్వులను జావఁగొట్టును. ఇంకొకనాఁడు దేవతలఁ దఱుమును.

ఒకప్పుడు నాగుల నిడుమగుడుపును. ఒకవేళ నవగ్రహములఁ గట్టివేయును. ఒకసమయమున యక్షులను తీవ్రముగా బాధించును. ఒకప్పుడు పక్షులఁ బోనీయక పట్టుకొనును. ఒకనాఁడు సిద్ధులను గెలిచి చెఱఁబెట్టును. ఒకనాఁడు మనుజులను భయపెట్టును. ఒక్కొకనాఁడు కిన్నరులు ఖేచరులు చారణులు భూతప్రేత పిశాచములు అడవిమృగములు విద్యాధరులు వీరినిఁ జావ మోఁదుచుండును.

క. అట్టళ్లతోడఁ గోటలఁ
గట్టలుకం గూలఁద్రోచి క్రవ్యాదులతోఁ
జుట్టు విడిసి దిక్పాలుర
పట్టణములు గొనియె నతఁడు బలమున నధిపా. 96

టీ. అధిపా=రాజా=కోటలన్, అట్టళ్లతోడన్ = బురుజులతోఁగూడ, కట్టలుకన్=నిండుకోపముతో, క్రవ్యాదులతోన్=రాక్షసులతోఁగూడ, విడిసి=నిలచి, బలమునన్=లావుతో.

తా. రాజా! ఇట్లాహిరణ్యకశిపుఁడు ఎక్కువబలముతో రాక్షసులను వెంటఁదీసికొని, దిక్పాలురపట్టణములమీఁద నెత్తివచ్చి, కోటలను బురుజులను నేలఁగలిపి, వానిని లాగికొనియెను.

క. కృశలై సంప్రాపితదు
ర్దశలై సర్వంకషోగ్ర దైతేయాజ్ఞా
వశలై నిశలును దివములు
దిశ లెల్లను గట్టు వడియె దీనత ననఘా 97

టీ. అనఘా=పాపములేనివాఁడా, కృశలై=కృశించినవై, సంప్రాపిత దుర్దశలై=పొందింపఁబడిన హీన దశగలవై, సర్వం...వశలై = ఎల్లెడ నిండిన రాక్షసుల యుత్తరువులకు లోనై, నిశలను దివములున్ = రాత్రింబవళ్లు, దీనతన్=బీదతనముతో, కట్టువడియెన్.

తా. రాజా! దిక్కులన్నియు క్రమించి కోటబట్టి ఎక్కడజూచి నను రాక్షసులచే నిండి రాత్రియనక పగలనక వారి తలకు లోనై చాల నీచస్థితిలో నుండెను.

వ. మఱియు నద్దానవేంద్రుండు విద్రుమసోపానంబులును మరకతమణిమయ ప్రదేశంబులును వైడూర్యరత్నస్తంభ సముదయంబులును జంద్రికాసన్నిభస్ఫటిక సంఘటితకుడ్యంబులును బద్మరాగపీఠకనకకవాటగేహళీవిటంక వాతాయనంబులును విలంబమానముక్తాఫలదామవితానశోభితధవళపర్యంకంబులును వివిధ విచిత్రవిమానంబులును నిరంతరసురభికుసుమ ఫలభరితపాదప మహోద్యానంబులును హేమారవిందసౌగంధికబంధురసరోవరంబులును రమణీయరత్నప్రాసాదవిశేషంబులును మనోహరపరిమళశీతలమందమారుతంబులును మృదుమధురనినదకీరకోకిలకులకోలాహలంబులును గలిగి విశ్వకర్మనిర్మితంబై త్రైలోక్యరాజ్యలక్ష్మీశోభితంబైన మహేంద్రభవనంబు సొచ్చి. 98

టీ. విద్రుమసోపానంబులు=పగడపుమెట్లు, మర...దేశంబులు = మరకతమణులతోఁ గట్టిన చోటులును, వైడూర్య...యంబులు=వైడూర్యముల కంబముల బారులు, చంద్రికా...కుడ్యంబులు=వెన్నెలవంటి స్ఫటికములచేఁ గట్టినగోడలు, పద్మరాగ...నంబులు=పద్మరాగపుఁబీఁటలు, బంగారు తలుపులు, దర్వాజాలును, చూరుపట్టెలును, కిటికీలును, విలంబ...పర్యంకంబులును=వ్రేలాడుచున్న ముత్తెపుసరులచాందినీలచే నొప్పు తెల్లని పఱుపులును, వివిధ...నంబులు=నానావిధములై చిత్రములైన ఆకాశయానములును, నిరంతర...నంబులు సందులేక గుమగుమలాడు పూవులు పండ్లచే నిండినచెట్లుగల పెద్దపెద్దతోఁటలును, హేమా...వరంబులు=బంగారుకమలములు నిండిన కొలంకులు, రమణీయ...షంబులు=అందమైన రతనంపు మేడలు, మనోహ

ర...తంబులు=ఇంపైన సువాసనగలిగి చల్లనై మెల్లనైన గాడ్పులును, మృదు...లంబులు=సన్ననై తీయనైన పలుకులుగల చిలుకలయొక్కయు కోకిలలయొక్కయు గుంపుల కేకలును, విశ్వకర్మ నిర్మితంబు=దేవశిల్పిచేఁ జేయఁబడినది, త్రైలోక్య...తంబు=ముల్లోకముల రాజ్యలక్ష్మిచే నొప్పియున్నది, మహేంద్రధననంబు=దేవేంద్రుని సౌధము.

మ. దితిపుత్త్రుఁడుజగత్త్రయైకవిభుఁడై దేవేంద్రసింహాసనో
ద్ధతుఁడైయుండహరాచ్యుతాంబుజభవుల్ దప్పంగభీతిన్ సమా
గతులై తక్కినయక్షకిన్నరమహద్గంధర్వసిద్ధాదులా
నతులై కానిక లిచ్చికొల్తు రతనిన్ నానాప్రకారంబులన్.

టీ. జగత్త్రయైకవిభుఁడై = ముల్లోకములకుఁ దానొక్కఁడే రాజై, దేవేంద్ర...ద్ధతుఁడై=ఇంద్రునిపీఠమెక్కి గర్వించినవాఁడై, హరా...భవుల్=శివకేశవ హిరణ్యగర్భులు, తక్కిన=మిగిలిన, యక్ష...సిద్ధాదుల =యక్షులు కిన్నరులు దేవతలు గంధర్వులు సిద్ధులు మొదలగువారు, ఆనతులు=నమ్రులు, కానికలు= నజరులు, నానాప్రకారంబులన్ = పలువిధముల, కొల్తురు=సేవింతురు.

తా. ఇట్లు హిరణ్యకశిపుఁడు ముల్లోకములకుఁ దానొక్కఁడే రాజై, ఇంద్రపీఠమెక్కి క్రొవ్వియుండఁగా, బ్రహ్మ విష్ణు రుద్రులు దప్ప మిగిలిన దేవతలు మొదలుగా నందఱును వానికి తమ నేరుపుకొలఁది కానికలర్పించి సేవించుచుండిరి.

శా. ఏదిక్పాలురఁ జూచి నేఁడలుగునో యేదేవు బంధించునో
యేదిగ్భాగముమీఁదదాడి చనునో యేప్రాణులం జంపునో
యీదైత్యేశ్వరుఁడంచునొండొరులుదానింద్రాదులాస్థానభూ
వేదిన్ మెల్లన నిక్కిచూతురు భయావిర్భూతరోమాంచులై.

టీ. ఇంద్రాదులు ఆస్థానభూవేదిన్ = హిరణ్యకశిపుని సభామండపమునరుఁగు మీఁదనుండి, నేఁడు, దైత్యేశ్వరుఁడుఁ=ఈ హిరణ్యకశిపుఁడు

ఏదిక్పాలురన్, అలుగునో=కోపించునో, ఏదేవున్, బంధించునో=కట్టునో, ఏదిగ్భాగము మీఁదన్=ఏదిక్కుమీఁదికి, దాడిచనునో = దండు వెడలునో, ఏప్రాణులన్ = ఏజంతువులను, భయా ... మాంచులై = భయముచేఁ బుట్టిన గగుర్పాటు గలవారై, మెల్లనన్ = సద్దుచేయక, నిక్కి చూతురో=ఉబికిచూతురో.

తా. ఇంద్రాదులు వాని కొలువులో నుండి ఈరోజు వీఁడు కోపించి ఏదిక్పాలురమీఁదికి లేచునో, ఏదేవుని చెఱఁబెట్టునో, ఏవంకకు దండు వెడలునో, వీనిచేతిలో నిప్పేళ నేజంతువులకు మూడినదో, అని సందడి కాకుండ నొకరిమొగ మొకరు చూచుకొందురు.

సీ. కోలాహలము మాని కొలువుండుఁడీ సురలార
తలఁగి దీవింపుఁడీ తపసులార
ఫణు లెత్తకుఁడు నిక్కి పన్నగేంద్రములార
ప్రణతులై సనుఁడి దిక్పాలురార
గానంబు సేయుఁడీ గంధర్వపతులార
సందడిఁ బడకుఁడీ సాధ్యులార
యాడుఁడీ నృత్యంబు లప్సరోజనులార
చేరిక మ్రొక్కుఁడీ సిద్ధులార

తే. శుద్ధకర్పూరవాసిత సురభిమధుర
భవ్యనూతనమైరేయపానజనిత
సుఖవిలీనత నమరారి సొక్కినాఁడు
శాంతి లేదండ్రు నిచ్చలుఁ జారు లధిప. 101

టీ. అధిప=పరీక్షిన్మహారాజా, చారులు=హిరణ్యకశిపునియాస్థానములో మెలఁగువారు, నిచ్చలున్=ఎప్పుడును, అమరారి=హిరణ్యకశిపుఁడు, శుద్ధ...లీనతన్=మేలైన పచ్చకర్పూరముచే బరిమళించుచున్న సువాసగల

తీయనిదగు మంచి క్రొత్తసారాయిని త్రాగినకైపుచేత, సొక్కినాఁడు=మైమఱచియున్నాఁడు, శాంతి=నెమ్మది, లేదు. సురలార, కోలాహలము=అల్లరి, తపసులార=ఋషులారా, తలఁగి=దూరముగాఁబోయి, దీవింపుఁడీ=ఆశీర్వదించుఁడు, పన్నగేంద్రములార=పాములారా, నిక్కి = లేచి, ఫణులు=పడగలు, ప్రణతులై = వంగినవారై, చనుఁడీ = పొండు, సరికన్=వెంబడి, గుంపుగూడి, మ్రొక్కుఁడీ.

తా. రాజా! వాని యుద్యానమందలి నౌకరులు ఎప్పుడు జూచినను మారాజు కప్పురపుతాలిగల మాఁగినతీపిగల మేలైన క్రొత్తకల్లుత్రాగి యానందముచే నొడలెఱుఁగకున్నాఁడు. నెమ్మదిలేదు. దేవతలారా! సందడిలేక మీమీపనులు చూచుకొనుఁడు. ఋషులారా దూరముగా నిలచి తిన్నగా నాశీర్వచన మంత్రములఁ జదువుఁడు పాములారా పడగలెత్తవలదు. దిక్పాలకులారా వంగినడువుఁడు. గంధర్వులారా మీలోనిపుణులైనవారు చక్కగా పాడండి. సాధ్యులారా గందరగోళము సేయవలదు. అప్సరసలారా మీరు ఆడండి. సిద్ధులారా ఇట్టు దగ్గఱకు వచ్చి మ్రొక్కుఁడు. అని పలుకుచుందురు.

శా. లీలోద్యానలతానివాసములలో లీలావతీయుక్తుఁడై
హాలాపానవివర్ధమానమదలోలావృత్తతామ్రాక్షుఁడై
కేళిం దేలఁగ నేనుఁ దుంబురుఁడు సంగీతప్రసంగంబులన్
వాలాయంబుఁ గరంగఁజేయుదుము దేవద్వేషినుర్వీశ్వరా.

టీ. ఉర్వీశ్వరా=రాజా, నేనున్, తుంబురుఁడున్, దేవద్వేషిన్=హిరణ్యకశిపుని, లీలో...ములలోన్ = శృంగారపుఁబూఁదోఁటలయందలి తీఁగచప్పరములయందు, లీలావతీయుక్తుఁడై=భార్యయగులీలావతితోఁగూడినవాఁడై, హాలా...క్షుఁడై=కల్లుద్రాగుటచే మదమెక్కి గుండ్రములై యెఱ్ఱబాఱిన గ్రుడ్లుత్రిప్పుచు, కేళిన్ తేలఁగన్=విహరింపఁగా, సంగీతప్రసంగంబులన్=సంగీతపుఁజదురులతో, వాలాయంబున్=ఎల్లప్పుడు, కరంగన్=సంతసించునట్లు, చేయుదుము.

తా. రాజా, వాఁడు విహారవనములో పెండ్లముతోఁగూడి, కల్లు దాగి గర్విష్ఠుఁగాఁ జేసికొని త్రిప్పుచు క్రీడించుచుండగాఁ, తుంబురుఁడును నేనును మెల్లగా దగ్గరజేరి సంగీతమును బాడి మెప్పింతుము.

క. యాగములు బుధులు ధరణీ
భాగములం జేయుచుండఁ బఱతెంచి హవి
ర్భాగములు తాన కైకొను
జాఁగింపఁడు దైత్యుఁ డమరసంఘుంబునకుఁ. 103

టీ. దైత్యుఁడు, బుధులు=విద్వాంసులు, ధరణీభాగములఁ=భూభాగములమీఁద, యాగములు=యజ్ఞములు, పఱతెంచి=పరుగుతో వచ్చి, హవిర్భాగములు= యజ్ఞహవిస్సులను, కైకొనుఁ = హరించును, అమరసంఘుంబునకుఁ=దేవతలగుంపులకు, చాఁగింపఁడు=చెందనీయఁడు.

తా. రాజా! భూలోకమున పండితులందఱు అక్కడక్కడ యజ్ఞములు చేయుచుండఁగా పఱుగిడివచ్చి తానె కాఁజేయును. దేవతలకుఁ బోనీయఁడు.

సీ. సకలమహాద్వీపసహితశ్వంభరా
స్థలిసి దున్నక పండు సస్యచయము
కామధేన్వాదులకరణి నర్థులు గోరు
కోర్కులు గగనంబు కురియుచుండు
వననిధు లేమను వాహినీసందోహ
ములును వీచుల గిత్నములు వహించు
నుర్వీరుహంబులు నొక్క కాలంబున
నఖిలర్తుగుణముల నతిశయిల్లు
తే. నంబుసంపూరితద్రోణు లగుచు నొప్పఁ
బర్వతంబులు సర్వదిక్పాలవివిధ

గుణములెల్లను తానె కైకొనుచు దైత్య
విభుఁడు త్రైలోక్యరాజ్యసంవృద్ధి నుండ. 104

టీ. సర్వ...గుణములు=ఎల్ల దిక్పాలుల అధికారములు, తానె...కైకొనుచుఁ=గ్రహించుచు, దైత్యవిభుఁడు=రాక్షసరాజు, త్రైలో...వృద్ధిః=ముల్లోకముల దొరతనపుపెంపుతో, ఉండఁగా, సకల...స్థలిని=ఎల్ల లంకలతోడి భూమియందు, సస్యచయము = పైరులు, గగనంబు = ఆకాశము, కామధేన్వాదులకరణిః = కామధేనువు చింతామణి మొదలగువానివలె, అర్థులు=యాచకులు, ఘనఖనిధులు=సముద్రములు, వాహినీసందోహములును=నదులసమూహములును, వీచులః=తరంగములతో, ఉర్వీరుహంబులు=చెట్లు, అఖిల ఋతుగుణములు=ఎల్లఋతువుల గుణములచేతను, అతిశయిల్లు=మీఱును, పర్వతంబులు, అంబు ... ద్రోణులు = నీళ్లు నిండిన గుంటలు గలవై, ఒప్పుః=వెలయును.

తా. హిరణ్యకశిపుఁడు దిక్పాలురయధికారములను లాగుకొని త్రిలోకములకుఁ దానె రాజైయుండఁగా, భూమి దున్నకయే పండెను. ఆకాశము కామధేనువు మొదలగువానివలె కోరినదెల్లఁ గురియుచుండెను. ఏడు సముద్రములు ఎల్లనదులు తరంగములతో రత్నములఁ గుమ్మరించుచుండెను. చెట్లు ఆఱు ఋతువుల ధర్మములను పొందెను. పర్వతములమీఁది గుంటలన్నియు నెక్కుడఁ జూచినను జలమయములై యుండెను.

వ. ఇట్లు సకలదిక్కులు నిర్జించి లోకైకనాయకుం డై తనయిచ్ఛాప్రకారంబున నింద్రియసుఖంబు లనుభవించుచుం దనియక శాస్త్రమార్గంబు నతిక్రమించి విరించివరజనితదుర్వారగర్వాతిరేకంబున సుపర్వారాతి యైశ్వర్యవంతుండై పెద్దకాలంబు రాజ్యంబు సేయునెడ. 105

టీ. సుపర్వారాతి=దేవతలకు శత్రువగు హిరణ్యకశిపుఁడు, నిర్జించి=జయించి, లోకైకనాయకుండు=లోకముల కొక్కఁడైనప్రభువు, ఇచ్ఛాప్ర

కారంబునన్=చిత్తముకొలఁది, తనియక=తృప్తిబొందక, విరించి... లేకంబునన్=బ్రహ్మపరమువలనఁ గలిగిన అపరాని మదముపెంపుచేత, ఐశ్వర్యవంతుండు=దొరతనము గలవాఁడై.

ఉ. ఎన్నఁడు మాకుదిక్కుగల దెన్నఁడు దైత్యుని బాధమాను మే
మెన్నఁడు వృద్ధిఁ బొందఁ గల మెవ్వరు రక్షకులంచు దేవతా
కిన్నరసిద్ధ సాధ్యముని ఖేచరనాయకు లాశ్రయించి రా
పన్నగతల్పు భూరిభవబంధవిమోచను బద్మలోచనున్.

టీ. కిన్నర...నాయకులు=కిన్నరులు సిద్ధులు సాధ్యులు ఋషులు దేవతలు మొదలగువారిలో మేటులు, పన్నగతల్పున్=పాముపానుపుగాఁగల, భూరి...చనున్=భయంకరమైన సంసారబంధమునుండి విడిపించు, పద్మలోచనున్=తామరలవంటి నేత్రములుగల విష్ణువును, ఆశ్రయించిరి=చేరిరి.

తా. సిద్ధ విద్యాధరాదులందఱును, మాకిఁక నెప్పుడు దిక్కుగలుగును? ఎప్పుడు రాక్షసుని బాధ నివర్తించును? ఎప్పుడు బాగుపడుదుము? ఇప్పుడు మమ్ము గాపాడువా రెవరు? ఇట్లు కళవళపడుచు శేషశాయి సంసారబంధమును విడిపించువాఁడు నగుశ్రీవిష్ణువు నాశ్రయించిరి.

వ. ఇట్లు దానవేంద్రునియుగ్రదండంబునకు వెఱచి యనన్యశరణ్యులై రహస్యంబున నందఱుం గూడికొని. 107

టీ. ఉగ్రదండము=కఠినశిక్ష, అనన్యశరణ్యులు=వేఱుదిక్కులేనివారు, రహస్యంబునన్=ఏకాంతమందు, (వెల్లడియైనచో రక్కసుఁడు చావమోఁదునని భయము) కూడుకొని=చేరి.

ఉ. ఎక్కడ నున్నవాఁడు జగదీశ్వరుఁ డాత్మమయుండు మాధవుం
డెక్కడ కేఁగి శాంతులు మునీశులు భిక్షులు రారు క్రమ్మఱన్
దిక్కుల నెల్ల నెక్కుడు తుదిం జొర దిక్కగునట్టిదిక్కుకై
మ్రొక్కెద మేముహస్తయుగముల్ ముకుళించి మదీయరక్షకున్.

టీ. జగదీశ్వరుఁడు=లోకనాయకుఁడు, ఆత్మమయుండు = ఆత్మ స్వరూపి, మాధవుండు = లచ్చిమగఁడు, ఎక్కడఁ ఉన్నవాఁడు, శాంతులు=శమప్రధానమైన చిత్తముగలవారు, మునీశులు=మునినాథులు, భిక్షులు=విరాగులు, క్రిమ్మఱన్=మరల, ఎక్కుడు=మించినది, తుదన్=అంతమున, చేరన్=చేరుటకు, అట్టిదిక్కై=అలాటిప్రాపకై, ఏము, హస్తయుగము=చేజోడులను, ముకుళించి=జోడించి, మదీయరక్షకున్=మారక్షకుఁడైన, మొ్రక్కెదము.

తా. లోకనాథుఁడును ఆత్మరూపుఁడు నగుశ్రీవిష్ణు వెచట నున్నాఁడో, ఏచోటికిఁబోయిన మహాత్ములు మరల రారో. రక్షకులలో నెల్లమేటియై చివరకు పొందఁదగిన రక్షకుఁడైన విష్ణువునకు మేము మా క్షేమమునకై చేతులు జోడించి మొ్రక్కెదము.

వ. అని మఱియు నాహారనిద్రలు మాని చిత్తంబులు పరాయత్తంబులుగానీక సమాహితబుద్ధులై భగవంతుండును మహాపురుషుండును మహాత్ముండును విశుద్ధజ్ఞానానందమయుండును నైనహృషీకేశునకు నమస్కరించుచున్నయెడ మేఘరవసమానగంభీరనినదంబున దిశలు ప్రమోయించుచు సాధులకు నభయంబు గావించుచు దృశ్యమానుండు గాక పరమేశ్వరుం డైనహరి యిట్లనియె. 109

టీ. ఆహారనిద్రలు=అన్నము నిద్ర, పరాయత్తంబులు = వేఱువిషయములకరిగినవి, సమాహితబుద్ధులై=చక్కఁబఱచుకొనఁబడిన చిత్తముగలవారై, భగవంతుండును=షడ్గుణైశ్వర్యయుక్తుఁడు, మహాత్ముఁడు = అనిర్వాచ్యమైన స్వరూపముగలవాఁడు, విశుద్ధ...మయుండు = నిర్మలుఁడు, జ్ఞానరూపుఁడు, ఆనందరూపుఁడు, హృషీకేశుఁడు=ఇంద్రియములను శాసించువాఁడు, విష్ణువు, మేఘు...నినదంబు=మేఘధ్వని కీడైనగంభీరధ్వని, సాధులు=సజ్జనులు, దృశ్యమానుఁడు=చూడఁబడినవాఁడు, కానరానివాఁడు.

మ. భయముఞ్జెందకుఁడయ్య నిర్జరవరుల్ భద్రంబు మీ కయ్యెడుఁ
జయముఁ లాభము భూతసంతతికి మత్సందర్శనప్రాప్తి న
వ్యయమై చేసు నెఱుంగుదుం దితిసుత వ్యాపారభాషావిప
ర్యయముల్ గాలముగూడఁ జంపెదఁ జనుం డందాఁక మీ త్రోవలన్.

టీ. నిర్జరవరుల్=దేవతాశ్రేష్ఠులారా! భద్రంబు=శుభము, భూతసంతతికిన్=జంతుజాలమునకు, మత్సందర్శనప్రాప్తిన్=నాదర్శనములభించుట చేత, అవ్యయము=నాశములేనిది, ది...విపర్యయముల్=హిరణ్యాకశిపుని చేఁతలు మాటలు వీనియందుగల దుడుకుఁదనములు, కాలము, కూడన్ = ఒనఁగూడఁగా, అందాఁకన్=అంతదనుక.

తా. దేవులారా! భయమొందకుఁడు, మీకు మేలగును. నాదర్శనము దొరకనేని భూతములకు తెంపులేని విజయము లాభము దొరకును. హిరణ్యకశిపుఁడు మిమ్ములఁ బెట్టుకష్టములును, వాఁడు చేయుపనులు మాటలు అన్నియు నాకుఁ దెలియును. తటివేచి వానిం జంపెదను. అంతవఱకు మీ మీ త్రోవలఁ బోయి ఒదిగియుండి కాలము గడపుఁడు.

ఆ. శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు
గోవులందు విప్రకోటియందు
ధర్మపదవియందుఁ దగిలి నాయందు వాఁ
డెన్నఁ డలుగు నాఁడె హింస నొందు. 111

టీ. వాఁడు=హిరణ్యకశిపుఁడు, శుద్ధసాధులందున్=కపటములేని సజ్జనులయందు, సురలందున్=దేవతలయందును, శ్రుతులందున్=వేదములయందును, విప్రకోటియందున్=బ్రాహ్మణులసమూహమునందును, ధర్మపదవియందున్=ధర్మమార్గమందును. నాయందున్, తగిలి=పూని, ఎన్నఁడు, అలుగున్=ద్వేషించునో, హింసన్=మరణమును, ఒందున్=పొందును.

తా. వాఁడు ఎప్పుడు సాధువులను దేవబ్రాహ్మణులను వేదములను గోవులను ధర్మమును నన్నును ద్వేషించునో నాఁడే యంత మొందఁగలఁడు.

క. కన్నకొడుకు శమదమసం
పన్నుఁడు నిర్వైరుఁ డనక ప్రహ్లాదుని వాఁ
డెన్నఁడు రోషంబున నా
పన్నతఁ బొందించు నాఁడె పట్టి వధింతున్. 112

టీ. శమ...న్నుఁడు=శాంతి దాంతి గలవాఁడు, నిర్వైరుఁడు=విరోధములేనివాఁడు రోషంబునన్=క్రోధముతో, ఆపన్నతన్=కీడును, పట్టి, వధింతున్=చంపుదును.

తా. వాఁడు తనకొడుకైన ప్రహ్లాదుని తాఁ గన్నకొడుకనియు శమదమాదులు గలవాఁడనియు వైరమెఱుఁగనివాఁడనియుఁ జూడక ఎప్పుడు బాధపెట్టునో అప్పుడే వానిని బట్టి సంహరించెదను.

శా. వేధోదత్తవరప్రసాదగరిమన్ వీఁ డింతవాఁ డై మిమున్
బాధంబెట్టుచు నున్నవాఁ డని మదిన్ భావింతు భావించి నే
సాధింపం దఱిగాదు కావునఁ గడున్ సైరించితిన్ మీఁదటన్
సాధింతున్ సురలార నేఁడు సనుఁడా శంకింప మీ కేటికిన్.

టీ. సురలార=దేవతలారా, వేధో...గరిమన్=బ్రహ్మయిచ్చినవరములబలిమిని, భావింతున్ = తలఁచెదను, సాధింపన్ = నిగ్రహించుటకు, తఱి = సమయము, కడున్=మిక్కిలి, సైరించితిన్ = సహించితిని, మీఁదటన్=తర్వాత, సనుఁడు ఆ=వెళ్లండి, శంకింపన్=అనుమానింపఁగా, ఏటికిన్=ఏల.

తా. సురలారా వీఁడు బ్రహ్మయిచ్చినవరములచే గర్వించి యింతగా మిమ్ము బాధించుచున్నాఁడని తలఁచెదను. అందువలననే ఇప్పుడు వాని నేమి చేయుటకుఁ దోఁచక యూరకున్నాను. సమయము చూచి వానిని క్రమముగా హతముచేయుదును. సందేహము వలదు.

వ. అని యిట్లు దనుజమర్దనుండు నిర్దేశించిన పలింపులు గుంపు
లుగొని మ్రొక్కి రక్కసుండు మ్రగ్గుట నిక్కంబని తమతమ

దిక్కులకుం జనిరి హిరణ్యకశిపునకు విచిత్రచరిత్రులు నలువురు పుత్త్రు లుద్భవించి రందు. 114

టీ. దనుజమర్దనుండు=విష్ణువు, నిర్దేశించినన్=చెప్పఁగా, నిలింపులు=దేవతలు. ప్రస్ఫుట=చచ్చుట, నిక్కంబు=నిజము, విచిత్రచరిత్రులు=అబ్బురమైననడవడిగలవారు, ఉద్భవించిరి=పుట్టిరి, వారిలో

సీ. తనయందు నఖిలభూతములందు నొకభంగి
సమహితత్వంబున జరగువాఁడు
పెద్దలఁ బొడగన్న భృత్యునికైవడిఁ
జేరి నమస్కృతుల్ సేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన
మాతృభావము సేసి మఱలువాఁడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జింతించువాఁడు

తే. సఖులయెడ సోదరస్థితి జరపువాఁడు
దైవతము లంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు
లలితమర్యాదుఁ డైనప్రహ్లాదుఁ డధిప. 115

టీ. అధిప=ధర్మరాజా, లలితమర్యాదుఁడు=ఒప్పిదమైన సత్కారముగల. ప్రహ్లాదుఁడు=ప్రహ్లాదుఁడనుకొడుకు, అఖిలభూతములందున్=ఎల్లప్రాణులయందును, ఒకభంగిన్ = ఒక్కవిధముగా, సమవర్తనంబునన్=భేదములేనినడవడికతో, పెద్దలన్=సాధువులను, పొడగనన్=కాంచినచో, భృత్యునికైవడిన్=బంటువలె, కన్నుదోయికిన్=నేత్రద్వయమునకు, అన్యకాంతలు=ఇతరవనితలు, అడ్డంబు=ఎదురు, ధర్మవత్సలతన్=న్యాయబుద్ధితో, దీనులన్ = బీదలను, కావన్ = రక్షించుటకునై, సఖులయె

డక = స్నేహితులపట్టున, సోదరస్థితి=అన్నదమ్ములమర్యాద, లీలలందును = ఆటలయందును, బొంకులు=అసత్యములు.

తా. రాజా ఆనలుగురలో ప్రహ్లాదుఁ డనుకొడుకు పూజ్యాపూజ్యవివేకము గలిగి తనకు ఎల్లజంతువులను సమానముగాఁ జూచుకొనును. సజ్జనులను జూచినంతనే సేవకునివలె దగ్గఱకేఁగి మ్రొక్కును. పరస్త్రీలు కంటఁబడినచోఁ దల్లివలె భావించి తొలఁగిపోవును దిక్కులేనివారలఁ గాంచెనేని వారి తల్లిదండ్రులవలె రక్షించును. స్నేహితులను అన్నలు తమ్ములుగా భావించును. గురువులను దేవతలని యెన్నును. ఆటలలోనైనను అబద్ధమాడఁడు ఆయన యిట్టిగుణములు కలవాఁడు.

వ. మఱియును.

సీ. ఆకారజన్మవిద్యార్థవరిష్ఠుఁ డై
గర్వసంస్తంభసంగతుఁడు గాఁడు
వివిధమహానేకవిషయసంపన్నుఁ డై
పంచేంద్రియములచేఁ బట్టువడఁడు
భవ్యవయోబలప్రాభవోపేతుఁ డై
కామరోషాదులఁ గ్రందుకొనఁడు
కామినీప్రముఖభోగము లెన్ని గలిగిన
వ్యసనసంసక్తి నావంకఁ బోఁడు

ఆ. విశ్వమందుఁ గన్నవిన్న యర్థములందు
వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు
ధరణినాథ దైత్యతనయుండు హరిపర
తంత్రుఁ డై హతాన్యతంత్రుఁ డగుచు. 117

టీ. ధరణినాథ=రాజా, దైత్యతనయుఁడు=ప్రహ్లాదుఁడు హరిపరతంత్రుఁడై=విష్ణువునకు దాసుఁడై, హతాన్యతంత్రుఁడు=త్యజింపఁబడినయితర

విషయములు గలవాఁడు, అగుణ్=ఆకార...వరిష్ఠుఁడు=రూపము కులము చదువు ధనము వీనిలో గొప్పవాఁడు, గర్వ...తుఁడు=గర్వాతిశయముతోఁ గూడినవాఁడు, వివిధ...సంపన్నుఁడు=నానావిధములైన గొప్పసక్చందన వనితాదిభోగములుగలవాఁడు, సకలేంద్రియములు=త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనునైదింద్రియములు, భవ్య...వేతుఁడు=మంచిప్రాయము బలము దొరతనము వీనితోఁ గూడినవాఁడు, కామరోషాదులు=కామక్రోధాదులు, క్రందుకొనఁడు=చొఁరఁడు, కామినీ...ములు= స్త్రీలు మొదలయిన భోగములు, వ్యసనసంసక్తిన్ = తగులముచే, ఆవంకన్=ఆవైపునకు, విశ్వమందున్=ప్రపంచమందు, అర్థములందున్=వస్తువులయందు, సుస్థదృష్టి=స్థిరబుద్ధి, వాంఛ=కోరిక.

తా. రాజా ఇంకను నా ప్రహ్లాదుఁడు ఎల్లప్పుడు తనచిత్తము విష్ణువునందు జేర్చి యితరచింత మాని సౌందర్యము కులము చదువు ధనము గలిగియు గర్వపడఁడు. విస్తారమైనపూలు గంధము స్త్రీలుమొదలగునవిగలిగియు, ఇంద్రియాలోలుఁడు గాఁడు. ఎలప్రాయము శౌర్యము ఐశ్వర్యము గలవాఁడయ్యు కామక్రోధములఁ జేరనీయఁడు. స్త్రీలు మొదలగుభోగములెన్నియున్నను వానియెడఁదగిలియుండఁడు. ప్రపంచములోఁ జూచియు విన్నట్టివస్తువులకు వస్తుత్వమొప్పుకోఁడు. (నిజమని వానిని కోరఁడు.)

ఆ. సద్గుణంబు లెల్ల సంఘంబులై వచ్చి
యసురరాజతనయు నందు నిలిచి
పాసి చనవు విష్ణుఁ బాయనివిధమున
నేఁడుఁ దగిలి యుండు నిర్మలాత్మ. 118

టీ. నిర్మలాత్మ=శుద్ధచిత్తముగలరాజా, సద్గుణంబులు=మంచిగుణములు, సంఘంబులు=గుంపులు, అసుర...నందున్=ప్రహ్లాదునియందు, పాసి=వీడి, చనవు=పోవు, తగిలియుండున్=చెందియుండును.

తా. రాజా! మంచిగుణములన్నియు నొక్కఁడై ప్రహ్లాదునియందు జేరి యున్నవి. అవన్నియు నేఁటికి రేపటికిఁగూడ విష్ణువును వలె నాయనను విడువకుండును.

మ. పగవారైన సురేంద్రులున్ సభలలోఁ బ్రహ్లాదసంకాశులన్
సుగుణోపేతుల నెందు నే మెఱుఁగమంచున్ వృత్తబంధంబులం
బొగడం జొత్తురు సత్కవీంద్రులక్రియన్ భూనాథ మీబోఁటి స
ద్భగవద్భక్తులు దైత్యరాజతనయుం బాటించి కీర్తింపరే.

టీ. భూనాథ=రాజా, పగవారు=శత్రువులు, సురేంద్రులున్ = దేవతలున్ను, సభలలోన్=చదురులయందు, ప్రహ్లాదసంకాశులన్=ప్రహ్లాదుని బోలువారిని, సుగుణోపేతులన్=మంచిగుణములుగలవారిని, సత్కవీంద్రుల క్రియన్=గొప్పకవులవలె, వృత్తబంధంబులన్=పద్యములుపాటలు గాఁగూర్చినవానితో, పొగడంజొత్తురు=పొగడుటకారంభింతురు, మీబోఁటి... క్తులు = మీవంటియోగ్యులైనభాగవతపురుషులు, దైత్యరాజతనయున్ = ప్రహ్లాదుని, పాటించి=లక్ష్యముంచి, కీర్తింపరే=పొగడరా.

తా. రాజా! వానికి వంశపరంపరగా శత్రువు లగునింద్రాదులే ప్రహ్లాదునివంటిమహాత్ములు వేఱే లేరని వానిమీఁదఁ బద్యములు పాటలును గట్టి సభలలోఁ బాడుచుందురు. ఇఁక మీఁబోఁటిభాగవతవర్యు లాప్రహ్లాదుని బొగడనేరరా.

క. గుణనిధి యగుప్రహ్లాదుని
గుణము లనేకములు గలవు గురుకాలమునన్
గణుతింప నశక్యంబులు
ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్. 120

టీ. గుణనిధి=మంచిగుణములకు నిక్షేపము, గురుకాలమునన్=చాలకాలమునకైనను, గణుతింపన్ = వర్ణించుటకు, అశక్యంబులు = సాధ్యములు కావు. ఫణిపతికిన్=శేషునకు, బృహస్పతికిని, భాషాపతికిన్=బ్రహ్మకును.

తా. ఆ మహాత్ముని గుణములు ఇన్నియని చెప్ప నలవికాదు. వానిని ఎన్నాళ్లకైన సామాన్యులు వర్ణింపలేరు సరిగదా ఆదిశేషువు బృహస్పతి బ్రహ్మ మొదలగువారుకూడ వర్ణింపఁజాలరు.

వ. ఇట్లు సద్గుణగరిష్ఠుం డయినప్రహ్లాదుండు భగవంతుం డయిన వాసుదేవునియందు సహజ సంవర్ధమాన నిరంతర ధ్యానరతుం డై. 121

టీ. సద్గుణగరిష్ఠుండు = మంచి గుణములచే గొప్పవాఁడు, భగవంతుండు=షడ్గుణైశ్వర్యములతోఁ గూడినవాఁడు, సహజ...రతుండై=తనంతనే పుట్టి పెరిగిన గాఢమైనధ్యానమందుఁ దగిలినవాఁడై.

సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరినయట్లైన
చెలికాండ్ర నెవ్వరిఁ జేర మఱచు
నసురారి తనమ్రోల నాడినయట్లైన
నసురబాలురతోడ నాడ మఱచు
భక్తవత్సలుఁడు సంభాషించినట్లైనఁ
బరభాషలకు నూఱు పలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచినయట్లైనఁ
జొక్కి సమస్తంబుఁ జూడ మఱచు
తే. హరిపదాంభోజయుగ చింతనామృతమున
నంతరంగంబు నిండినట్లైన నతఁడు.
నిత్యపరిపూర్ణుఁ డగుచు నన్నియును మఱచి
జడత లేకయు నుండును జడునిభంగి. 122

టీ. అతఁడు = ప్రహ్లాదుఁడు, శ్రీవల్లభుఁడు = విష్ణువు, చేరినయట్లైనన్=కూడియున్నట్లు తోఁచినచో, చెలికాండ్రన్=నెయ్యురను, అసు

రాఁ=విష్ణువు, తనమ్రోలన్=తన చెంతను, అసురబాలురతోడన్=రాక్షసుల పిల్లకాయలతోడ, భక్తవత్సలుఁడు=భక్తులయందు ప్రీతి కలవాఁడు, సంభాషించినట్లైనన్=మాటలాడినట్లు తోఁచినచో, పరభాషలకున్=ఇతరులమాటలకు, మాఱు=బదులు, సురవంద్యున్ = (దేవతలచే మ్రొక్కఁబడగిన) విష్ణువును, చొక్కి=మైమఱచి, హరి...తమునన్=విష్ణువు పాదకమలముల ధ్యానమను నమృతముతో, అంతరంగంబు=హృదయము, నిత్యపరిపూర్ణుఁడు=ఎల్లప్పుడు నిండుకొనియుండువాఁడు, జడత=మోహము.

తా. రాజా! ఆప్రహ్లాదుఁడు విష్ణువు తనను జెందియున్నప్పుడు చెంతవారితోఁ జేరఁడు. శ్రీహరి తనయెదుట నాడునప్పుడు రాక్షసులబాలురతో నాడుకొనఁడు. అయన తనతో మాట్లాడుచున్నప్పుడు ఇతరులతో మాట్లాడఁడు. అయనను దనలో ధ్యానించునట్టున మైమఱచి వేఱెద్దియుంజూడఁడు. హరిధ్యానముచేతఁ జిత్తము నిండియున్నప్పు డాతఁడు అనంతపూర్ణుఁడై అన్నియును మఱచి, మోహము లేకున్నను పిచ్చివానివలె నగపడును.

శా. పానీయంబులుద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదసం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా.

టీ. భూవరా=రాజా, సురారిసుతుఁడు = ప్రహ్లాదుఁడు, పానీయంబులు=నీళ్లు, త్రావుచున్, కుడుచుచున్ = అన్నముందినుచు, భాషించుచున్=మాటలాడుచు, హాస...ద్రాదులు=నవ్వులు, వినోదములు, నిద్ర మొదలయినవి, లక్షించుచున్=చూచుచు, సంతత...నుండై = తెంపులేకుండ శ్రీహరి చరణకమల ధ్యానమను నమృతమును గ్రోలుటయందు ప్రీతి గలవాఁడై, ఏతద్విశ్వమున్=ఈబాహ్య ప్రపంచమును.

తా. రాజా! ప్రహ్లాదుఁడు, అన్నముదినుచు నీళ్లు ద్రావుచు, మాటలాడుచు, నవ్వుచు, వినోదపడుచు నిద్రబోవుచు ఎప్పుడైననుసరే ఏమఱక

శ్రీహరి ధ్యానమందు మగ్నమైనచిత్తము గలవాఁడై, యీప్రపంచమును మఱచి యుండును.

సీ. వైకుంఠచింతావివర్జితచేష్టుఁ డై
యొక్కఁడు నేడ్చు నొక్కచోట
నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁ డై
యుద్ధతుఁ డై పాడు నొక్కచోట
విష్ణుఁ డింతియ గాని వేఱొండు లే దని
యొత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుఁ డనునిధానముఁ గంటి నే నని
యుబ్బి గంతులువైచు నొక్కచోటఁ
ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయహర్షజనితబాష్పసలిల
మిళితపులకుఁ డై నిమీలితనేత్రుఁ డై
యొక్కచోట నిలిచి యూరకుండు. 124

టీ. వైకుంఠ...చేష్టుఁడై=విష్ణుధ్యానము లేని వ్యాపారము గలవాఁడై, అశ్రాంత...చిత్తుఁడై=తెంపులేని హరిధ్యానమందు నిలిపిన మనస్సు గలవాఁడై, ఉద్ధతుఁడు=ఆనందము నొందినవాఁడై, ఒత్తిలి=ఒదిగి, నలినాక్షుఁడు=విష్ణువు, అనునిధానము=అనునిధని, ఉబ్బి=పొంగి, ప్రణయ... నేత్రుఁడై=భక్తిచేఁ గలిగిన సంతోషమువలనఁ బుట్టిన కన్నీటితోఁ గలిసిన గగుర్పాటు కలవాఁడై, నిమీలిత నేత్రుఁడై=మూయఁబడిన కన్నులు గలవాఁడయి.

తా. రాజా, అతఁడొక్కచోట విష్ణుధ్యానము లభింపలేదని యొంటరిగా నేడ్చుచుండును, ఒక్కచోట విష్ణునియందు మనస్సు నిలిపి, యానందముతోఁ బాడుచుండును. విష్ణుఁడనఁగా నింతే వేఱులే దని యొక్కచో పగలఁబడి నవ్వుచుండును. ఒక్కయెడ నాకు విష్ణుఁ డనులిబ్బి దొరికెనని

పొంగి చిందులు ద్రొక్కును. ఒక్కచోట విష్ణునామ సంకీర్తనము సేయును. ఒకప్పుడు భక్తితాత్పర్యముతో నానందపడి కన్నీరు విడుచుచు నొలుడ గగుర్పొడవ కనులు మూసికొని మిన్నకుండును.

వ. ఇట్లు పూర్వజన్మ పరమభాగవత సంసర్గసమాగతం బైనముకుంద చరణారవింద సేవాతిరేకంబున నఖర్వనిర్వాణభావంబు విస్తరించుచు నప్పటప్పటికి దుర్జనసంసర్గనిమిత్తంబునం దన చిత్తం బన్యాయత్తంబు గానీక నిజాయత్తంబు సేయుచు నప్రమత్తుండును సంసారనివృత్తుండును బుధజనవిధేయుండును మహాభాగధేయుండును సుగుణమణిగణగరిష్ఠుండును బరమభాగవతశ్రేష్ఠుండును గర్మబంధలతాలవిత్రుండును బవిత్రుండును నైన పుత్త్రునియందు విరోధించి సురవిరోధి యనుకంప లేక చంపం బంపె నని పలికిన నారదునకు ధర్మజుం డిట్లనియె. 125

టీ. పూర్వ...గతంబు = తొలిబాముసంగలి యుత్తమభాగవతుల చేరికవలన లభించినది, ముకుంద...కంబునన్ = విష్ణుపాదసేవనాతిశయము వలన, అఖర్వనిర్వాణభావంబు = కొలఁతలేనియానందమును, విస్తరించుచున్ = పెంచుచు, దుర్జన...బునన్ = కాపురుషులచెలిమిచేత, అన్యాయత్తంబు = పరాధీనము, నిజాయత్తంబు = తనయధీనము, అప్రమత్తుండు = ఏమఱిక లేనివాఁడు, సంసారనివృత్తుఁడు = సంసారమును విడిచినవాఁడు, బుధజనవిధేయుండు = పండితులకు స్వాధీనుఁడు, మహాభాగధేయుండు = విష్ణుభక్తియను గొప్పకలిమి గలవాఁడు, సుగుణ...ష్ఠుండు = సుగుణము లనెడురత్నములచేఁ గొప్పవాఁడు పరమభాగవతశ్రేష్ఠుండు = యోగ్యులైన భక్తులలో నుత్తముఁడు, కర్మ.. విత్రుండు = కర్మబంధములను తీఁగలను గోడవలి వంటివాఁడు, పవిత్రుండు = పావనుఁడు, సురవిరోధి = హిరణ్యకశిపుఁడు, అనుకంప = దయ.

శా. పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడుఁ
మిత్రత్వంబున బుద్ధి సెప్పి దురితోన్మేషంబు వారింతు రే
శత్రుత్వంబుఁ దలంప రెట్టియెడ నాసాజన్యరత్నాకరుం
బుత్రుఁ లోకపవిత్రుఁ దండ్రి నెగులుం బొందింప నెట్లోర్చెనో.

టీ. జనకుల్ = తల్లిదండ్రులు, మిత్రత్వంబునన్ = చనవుతో, బుద్ధి = నీతి, దురితోన్మేషంబు = పాపచింతనమును, ఎట్టియెడన్ = ఎప్పుడున్ను, ఏశత్రుత్వంబున్ = ఏ విరోధమున్ను, తలంపరు, ఆసాజన్యరత్నాకరున్ = సాధుత్వమునకు నెలవగు నాప్రహ్లాదుని, లోకపవిత్రున్ = సర్వలోకపావనుని, తండ్రి, ఎగులున్ = కష్టమును, ఎట్లు, ఓర్చెనో = ఇష్టపడెనో.

తా. నారదా! లోకములోఁ దల్లిదండ్రులు కొడుకులకు తెలిసినను దెలియకున్నను రక్షింతురు. తెలియనిచోట్లను బుద్ధి చెప్పి దిద్దుదురు. వారి నెప్పుడును ప్రేమతోఁ బెనుపుదురుగాని శత్రుత్వము జూపరు ఇట్లేచటను వినమే. అట్టిసాధువును లోకపావనుఁ డగుకొడుకును తండ్రి యేల బాధించెనో. వానిని హింసించుటకు వాని కెట్లు సమ్మతమో తెలియదు.

ఉ. బాలుఁ బ్రభావిశాలు హరిపాదపయోరుహచింతనక్రియా
లోలుఁ గృపాళు సాధుగురులోకపదాసితఫాలు నిర్మల
శ్రీలు సమస్తసభ్యనుతశీలు విఖండితమోహవల్లికా
జాలు నదేల తండ్రి వడిఁ జంపఁగఁ బంపె మునీంద్ర చెప్పవే.

టీ. మునీంద్రా = నారదా, ప్రభావిశాలున్ = బ్రహ్మతేజమున వెలుఁగొందువానిని, హరి...లోలున్ = విష్ణుపాదకమలముల ధ్యానించు పనియందుఁ దగిలియున్నవానిని, కృపాళున్ = భూతదయ గలవానిని, సాధు...ఫాలున్ = సజ్జనులు గురువులు వీరల పాదములయందు నొసలు మోపువానిని, నిర్మలశీలున్ = మంచిమనస్సుగలవానిని, సమస్త...శీలున్ = ఎల్లసాధువులచేఁ బొగడఁబడిన నడవడి గలవానిని, విఖండిత...జాలున్ = త్రెంపఁబడినయజ్ఞానపుఁదీఁగెలు గలవానిని, వడిన్ = వేగముగా, చెప్పవే = చెప్పుమా.

తా. నారదా! పిన్నవాఁడును(కుఱ్ఱవాఁడు తప్పిదము జేసిన ఎఱుఁగక చేయును గాన మన్నింపఁదగుఁగాని దండింపఁ జనదు.) తేజోవంతుఁడును, విష్ణుభక్తిగలవాఁడును, సాధుగురుసేవ జేయువాఁడును, మంగళస్వభావము గలవాఁడును, సాధువులచే సైతము కొనియాడఁబడినప్రవర్తన గలవాఁడును, మోహపాశములను ద్రెంపినవాఁడును, ఇట్టికొడుకును కరుణలేక తండ్రి యేల చంపుమనెను. సెలవిండు.

వ. అనిన నారదుం డిట్లనియె. 128

శా. లభ్యంబైన సురాధిరాజపదమున్ లక్షింపఁ డశ్రాంతమున్
సభ్యత్వంబున నున్నవాఁ డబలుఁడై జాడ్యంబుతో వీఁడు వి
ద్యాభ్యాసంబునఁ గాని తీవ్రమతి గాఁ డంచున్ విచారించి దై
త్యేభ్యుం డొక్కదినంబునం బ్రియసుతున్ వీక్షించి సోత్కంఠుఁడై.

టీ. దైత్యేభ్యుండు=హిరణ్యకశిపుఁడు, లభ్యంబు=పొందఁదగిన, సురాధిరాజపదమున్=దేవేంద్రునియధికారమునుగూడ, లక్షింపఁడు, లెక్కసేయఁడు, అశ్రాంతమున్=ఎల్లప్పుడు, అబలుఁడై=మనోబలములేనివాఁడై, జాడ్యంబుతోన్=అవివేకముతో, సభ్యత్వంబునన్=పెద్దపెద్దపోఁకడలతో, వీఁడు=ఈకొడుకు, విద్యాభ్యాసంబునన్ కాని, విద్యనేర్చుకొనినఁగాని, తీవ్రమతి=చులుకైనబుద్ధిగలవాఁడు, ఒక్కదినంబునన్, ప్రియసుతున్=ముద్దుకొడుకును, వీక్షించి=చూచి, సోత్కంఠుఁడై=ప్రేమతోఁగూడినవాఁడై.

తా. హిరణ్యకశిపుఁడు తనకొడుకు నడవడి చూచి వీఁడు దేవేంద్ర పదవిదొరకినను లెక్క సేయఁడు. ఎప్పుడు చూచినను సోమరియై అవివేకముతోఁ దిరుగుచు వ్యవహారములు రాచకార్యములు మఱఁగి చెడిపోవుచున్నాఁడు. వీనిని బడిలో వేసి చదివించినఁగాని బుద్ధికి తేటగలిగి నాదారికి రాఁడు. అని తలఁచి యొక్కనాఁడు కొడుకను జూచి వేడుకపడినవాఁడయి.

క. చదువనివాఁ డజ్ఞుం డగుఁ
జదివిన సదసద్వివేకచతురత గలుగుం
జదువఁగ వలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ. 130

టీ. తండ్రీ=నాయనా, చదువనివాఁడు=చదువుకొననివాఁడు, అజ్ఞుండు=మంచిచెడ్డలెఱుఁగనివాఁడు, చదివినన్=చదువుకొన్నచో, సద...రత=మంచిచెడుగుల తారతమ్యము నిర్ణయించు తెలివి, కలుగున్, జనులకున్=ఎల్లవారికిని, చదువఁగన్ వలయున్=చదువుట ముఖ్యము, ఆర్యులొద్దన్=తగినగురువులచెంతను, చదివించెదన్=చదువుచెప్పించెదను, చదువుము.

తా. ఇట్లు ముద్దుగా దగ్గఱకుఁ బిలచి, నాయనా! చదువురానివాఁడు వట్టిమొద్దు. వాని కేమి తెలియదు. మనము చదువు కొంటిమా మంచి చెడ్డ అన్నియును చక్కఁగాఁ దెలిసికోవచ్చును. గనుక అందఱు చదువుకోవలసినదే. కావున నిన్ను మంచి యుపాధ్యాయులయొద్దికిఁ బంపెదను, చక్కఁగాఁ జదువుకొనుము.

వ. అని పలికి యసురలోక పురోహితుండును భగవంతుండును నయిన శుక్రాచార్యకొడుకులఁ బ్రచండవితర్కులఁ జండామర్కుల రావించి సత్కరించి యిట్లనియె. 131

టీ. అసురలోకపురోహితుండు=రాక్షసులకందఱకు పురోహితుఁడు, భగవంతుఁడు=షడ్గుణైశ్వర్యములు కలవాఁడు, ప్రచండవితర్కులన్=తీవ్రమైనవాదశాస్త్రము నెఱిఁగినవారలను, చండామర్కులన్=చండుఁడుమర్కుఁడు ననువారలను, రావించి=పిలిపించి, సత్కరించి=గౌరవించి.

శా. అంధప్రక్రియ నున్నవాఁడు వలుకం డస్మత్ప్రతాపక్రియా
గంధం బించుక లేదు మీరుగురువుల్ కారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలు మముం బాటించియీబా
లకున్, గ్రంథంబుల్ సదివించి శిక్షకుశలుం గావించి రక్షింపరే.

టీ. అంధపరిక్రియన్ = గ్రుడ్డివానితీరున, పలుకండు = మాతో మాట లాడఁడు, అస్మ...గంధంబు = నాపరాక్రమముపనులు వీనియెఱుకకొంచెము న్న, మీరు, మాకు, గురువుల్, కారుణ్యచిత్తుల్ = దయగలవారు, మనోబంధు ల్ = అంతరంగబంధువులు, మాకు, మాన్యులు = గౌరవింపఁదగినవారు, పెద్ద లు = అన్నివిధములగొప్పవారలు, మముః, పాటించి = అనుగ్రహించి, ఈబాల కున్ = ఈపిన్నవానిని, గ్రంథంబుల్ = మంచిపుస్తకములను, చదివించి, నీతి కుశలున్ = తెలివికలవానినిగా, కావించి = చేసి, రక్షింపరే = కాపాడుఁడు.

తా. అయ్యా యీకుఱ్ఱఁడు గ్రుడ్డివానివలె నున్నాఁడు. నాగొడవయే వీనికి పట్టదు, నాపరాక్రమము ఘనకార్యములు వీనియెుబ్బునైన నెఱుఁగ డు. మీరుమాకు అన్నివిధముల గురువులు పెద్దలు పూజ్యులు దయామయస్వ భావముగలవారు ఆత్మబంధువులు. మమ్మనుగ్రహించి యీపిన్నవానికిఁ జదువుసెప్పి పండితుని జేసి నన్ను కృతార్థుని జేయుట మీభారము.

వ. అని పలికి వారలకుఁ బ్రహ్లాదు నప్పగించి తోడ్కొని పొం డనిన వారును దనుజరాజకుమారుని గొనిపోయి యతనికి సవయస్కు లగుసహశ్రోతల నసురకుమారులం గొందఱం గూర్చి. 133

టీ. అప్పగించి = స్వాధీనముచేసి, తోడ్కొనిపొండు = తీసికొనిపొ వుఁడు, వారును = చండమర్కులును, దనుజరాజకుమారునిన్ = హిరణ్యకశిపుని కొడుకును, సవయస్కులు = ఒక్కయీడువారు, సహశ్రోతలు = కూడఁ జదువుకొనువారు, అసురకుమారులన్ = రాక్షసుల పిల్లకాయలను, కూర్చి = జతచేసి.

ఉ. అంచితభక్తితోడ దనుజాధిపుగేహసమీపముం బ్రవే శించి సురారిరాజసుతుఁ జేకొని శుక్రకుమారకుల్ పఠిం పించిరి పాఠయోగ్యములు పెక్కులుశాస్త్రములాకుమారుఁ డాలించి పఠించె నన్నియుఁ జలింపనివైష్ణవభక్తిపూర్ణుఁడై.

టీ. శుక్రకుమారకుల్ = శుక్రునికొడుకులు చండమర్కులు, అంచిత భక్తితోడన్ = ఒప్పిదమైన శ్రద్ధతో, దనుజాధిపు గేహసమీపమునన్ = హిరణ్యకశిపుని యింటిదాపునను, సురారిరాజసుతున్ = ప్రహ్లాదుని, చేకొని = చేరఁదీసికొని, పాఠయోగ్యములు = చదువవలసినవి, పెక్కులు = అనేకములు, శాస్త్రములు, పఠింపించిరి = వానిచేఁ జదివించిరి, ఆకుమారుఁడు = ప్రహ్లాదుఁడు, ఆలించి = గురువుల బోధవిని, చలింపని వైష్ణవభక్తిపూర్ణుఁడై = తొలఁగని విష్ణుభక్తిచేనిండినవాఁడై, అన్నియును = వారు చెప్పిన విద్యలన్నిటిని, పఠించెన్ = చదివెను.

తా. ఇట్లు చండమర్కులు రాజు నింటికిఁ బోయి ప్రహ్లాదుని బిలచికొనివచ్చి, వానికి నేర్పవలయు సమస్తశాస్త్రములు నేర్పిరి. వాఁడును విష్ణుభక్తిమాత్రము వీడక వారుచెప్పిన విద్యలన్నియును నేర్చుకొనుచువచ్చెను.

క. ఏపగిది వారు సెప్పిన
నాపగిదిం జదువుఁ గాని యట్టిట్టని యా
క్షేపింపఁడు తా నన్నియు
రూపించిన మిథ్య లని నిరూఢమనీషన్. 135

టీ. తాన్ = ప్రహ్లాదుఁడు, వారు = గురువులు, ఏపగిదిన్ = ఏతీరున, చెప్పినన్, అక్షేపింపఁడు = అడ్డుచెప్పఁడు, రూపించినన్ = విచారించినచో, మిథ్యలు = అసత్యములు, నిరూఢమనీషన్ = దృఢబుద్ధితో.

తా. ప్రహ్లాదుఁడు వారుచెప్పినదానికెల్ల నూఁకొట్టునుగాని అది యట్లు ఇది యిట్లు అని తిరుగఁబడఁడు. చక్కఁగ విచారింప నవన్నియు నసత్యము లని యెఱిఁగినవాఁడు గావున చెప్పినట్లు నేర్చుకొనెను.

శా. అంతం గొన్ని దినంబు లేఁగెన సురేంద్రారాతి శంకాన్విత
స్వాంతుం డై నిజనందనున్ గురువు లేజాడం బఠింపించిరో
భ్రాంతుం డేమి పఠించెనో యని సంభాషించి విద్యాపరి
శ్రాంతిం జూచెదఁగాక నేఁ డని మహాసౌధాంతరాసీనుఁడై.

టీ. అంతన్ = తర్వాత, ఏఁగినన్ = కదువఁగా, సురేంద్రారాతి = హిరణ్యకశిపుఁడు, శంకాన్వితస్వాంతుండై = అనుమానముగలిగినవాఁడై, నిజ నందనున్ = తనకొడుకును, గురువులు, ఏజాడన్ = ఏవిధముగా, పఠింపించిరో = చదివించిరో, భ్రాంతుండు = ఈవెఱ్ఱి, ఏమి = దేనిని, పఠించెనో = చదివెనో సంభాషించి = మాటలాడి, నేఁడు = ఈదినమున, విద్యాపరీక్షాంతిన్ = విద్యలయందలిపరిచయమును, చూచెదన్ కాక. అని. మహా...సీనుఁడై = పెద్ద మేడమీఁదఁ గూర్చున్నవాఁడై.

తా. తరువాత కొన్నినాళ్లకు హిరణ్యకశిపుఁడు, "పిల్లకాయను జదువఁబెట్టితిమి కదా. ఈవెఱ్ఱిబాగులవాఁడేమిచదువుకొన్నాఁడో, వారేమిచెప్పిరో సంగతియేమో తెలియదు" అని యనుమానపడి, వానిని వానిగురువులను పిలిచి నేఁడీయంశము విచారించి తెలిసికొనియెద నని యొకపెద్దమేడమీఁద నెక్కి కూరుచుండి.

ఉ. మోదముతోడ దైత్యకులముఖ్యుఁడు రమ్మనిచీరఁబంచెఁ బ్ర
హ్లాదకుమారకున్ భవమహార్ణవతారకుఁ గామరోషలో
భాదివిరోధివర్గపరిహారకుఁ గేశవచింతనామృతా
స్వాదకఠోరకుం గలుషజాలమహోగ్రవనీకుఠారకున్. 137

టీ. దైత్యకులముఖ్యుఁడు = రాక్షసకులమునకు మేటియగుహిరణ్యకశిపుఁడు, మోదముతోడన్ = సంతోషముతో, భవ...తారకున్ = సంసారమనుసముద్రమును దాఁటఁగలవాఁడు, కామ...హారకున్ = కామక్రోధాది శత్రువులనణఁచినవాఁడు, కేశవ...కఠోరకున్ = హరిధ్యానమనునమృతమునుద్రావుటచేనుక్కుమిగిలినవాఁడు, కలుష...కుఠారకున్ = పాపపుటడవులపాలిటిగొడ్డలి, ప్రహ్లాదకుమారకున్ = బాలుఁడగుప్రహ్లాదుని. రమ్మని, చీరఁబంచెన్ = పిలువనంపెను.

తా. హిరణ్యకశిపుఁడు మహానందముతోఁ గుమారుని విద్యలఁ జూచి సంతసింపఁగోరి, సంసారసముద్రము నీఁది గట్టెక్కినవాఁడును, కామ

క్రోధాదులవీడినవాఁడును శ్రీహరి చింతదప్ప వేఱెఱుఁగనివాఁడును, పాపా
టవులకు గొడ్డలియగు నా ప్రహ్లాదకుమారుని బిలువఁ బంచెను.

వ. ఇట్లు చారులచేత నాహూయమానుండై ప్రహ్లాదుండు
సనుదెంచిన. 138

టీ. చారులచేతన్ = బంట్లచేత, ఆహూయమానుండై, పిలుచుకొని తేరఁ
బడినవాఁడై, చనుదెంచినన్ = రాఁగా.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమే యుద్యోగమార్యౌఘసం
విత్సంపన్నుఁడ వైతివే చదివితే వేదంబులున్ శాస్త్రముల్
వత్సా రమ్మని చేరఁ జీరి కొడుకున్ వాత్సల్యసంపూర్ణుఁడై
యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపఁగన్.

టీ. దానవవిభుండు = హిరణ్యకశిపుఁడు, ఉత్కంఠ = ఎప్పుడు చూతు
నా విందునా యను నాత్రము, దీపింపఁగన్ = రేఁగఁగా, వాత్సల్యసంపూర్ణుఁ
డై = ప్రేమతోఁగూడినవాఁడై, కొడుకున్, వత్సా = నాయనా, రమ్ము అని
చేరఁజీరి = దగ్గఱకుఁబిలిచి, ఉత్సంగాగ్రమున్ = తొడపైభాగమును, చేర్చి =
పొందించి, ఉద్యోగము = నీ చేయుపని, ఉత్సాహ...యుతమే = ఉబుకుదిట్ట
తనము యోచనయుఁ గలదేనా, ఆర్య...న్నుఁడవు = మంచి తెలివిగలవాఁడ
వు. ఐతివే, వేదంబులున్, శాస్త్రముల్, చదివితే, అని యడిగెను.

తా. ఇట్లు హిరణ్యకశిపుఁడు వేడుకపడి, కొడుకును నాయనా రావో
యీ యని జేరఁదీసి తొడపైనెక్కించుకొని, ప్రేమతో నాయనా! నీవు చేయు
కృషి యుబుకు ధైర్యము యోచన గలిగి చేయుచున్నావా? చదువుకొని జ్ఞాన
ము సంపాదించినావా? వేదములు శాస్త్రములు పూర్తిగాఁ జదివినావా?
అని మొదలగు సంగతుల నడిగెను.

క. అనుదినసంతోషణములు
జనితశ్రమతాపదుఃఖసంశోషణముల్

తనయులసంభాషణములు
జనకులకుం గర్ణయుగళీసద్భూషణముల్. 140

టీ. జనకులకున్ = తండ్రులకు, తనయులసంభాషణములు = కొడుకుల ముద్దుపలుకులు, అనుదినసంతోషణములు = ఎల్లపుడు విసుకులేక యానంద ముగలిగించునవి, జనిత...మున్ = పుట్టినబడలికను సంతాపమును దుఃఖము ను దొలఁగించునవి, కర్ణయుగళీసద్భూషణముల్ = చెవులకు నలంకారములు.

తా. కొడుకులముద్దుమాటలు తండ్రులకు ఎన్నిసారులు విన్నను విసుగులేక యానందమును గలిగించును. ఎంతయాయాసము తాపము దుఃఖము గలిగియున్నను ఒక్కసారి కొడుకులపలుకులు విన్నచో నదిపోయును. అవియే వారి చెవులకు నలంకారములు.

వ. అని మఱియుఁ బుత్త్రునికెయ్యది భద్రంబై యున్నదని చెప్పు మనినం గన్నతండ్రికిఁ బ్రియనందనుం డిట్లనియె. 141

టీ. భద్రంబు = శుభమైనది. ప్రియనందనుండు = ముద్దుకొడుకు.

ఉ. ఎల్లశరీరధారులకు నిల్లనుచీఁకటినూతిలోపలం
ద్రెళ్లక వీరు నే మనుమతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వముం దనని దివ్యకళామయ మంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ.

టీ. నిశాచరాగ్రణీ = రాక్షసరాజా, తండ్రీ, ఎల్లశరీరధారులకున్ = ఎల్లదేహులకు, ఇల్లు, అను చీకఁటినూతిలోపలన్ = చీఁకటిబావిలో, ద్రెళ్లక = పడక, వీరును, ఏను, అను, మతిభ్రమణంబునన్ = చిత్తవైకల్యముచే, భిన్నులు = భేదజ్ఞానముగలవారు, అతని దివ్యకళామయము = ఆవిష్ణునియమానుషమైన విలాసముల స్వరూపముగలదే, ఉల్లము = చిత్తము, చేర్చి, తారు = తాము, మేలు = శ్రేయము.

తా. తండ్రీ! ఎల్లప్రాణులు ఇల్లను నీ చీకఁటి గోతిలోఁ బడియుండక వారు మేము వానిది నాయది యని పొరపాటుఁ జెందక, అంతయు

విష్ణువేకాని వేఱులే దని తలఁచి యాదేవుని చిత్తమునందు ధ్యానించుచు నడవులలో నుండినఁ గృతార్థులగుదురు.

వ. అని కుమారుండాడిన ప్రణిపతానురూపంబు లగు వినసల్లాపంబులు విని దానవేంద్రుండు నగుచు నిట్లనియె. 143

టీ. ఆడిన...పంబులు=పలికిన తనవిరోధియగు విష్ణునకుఁ బ్రీతికరములైన, సల్లాపంబులు = పలుకులు, విని, దానవేంద్రుండు = హిరణ్యకశిపుఁడు.

క. ఎట్టాడిన నట్టాడుదు
రిట్టట్టని పలుక నెఱుఁగ రితరుల శిశువుల్
దట్టించి యెవ్వరే మని
పట్టించిరొ బాలకునకుఁ బరపక్షంబుల్. 144

టీ. ఇతరులశిశువుల్=ఇరుగుపొరుగువారిపిల్లకాయలు, ఎట్లు = ఏలాగున, ఆడినన్=చెప్పిన, అట్లు = అవిధముగా, ఆడుదురు = పలుకుదురు, ఇట్లు అట్లు అని = ఈలాగు ఆలాగునని, పలుకన్ ఎఱుఁగరు=మాటాడఁజాలరు, ఎవ్వరు, దట్టించి=అదలించి, ఏమని=ఎట్లు; బాలకునకున్=కుఱ్ఱనికి, పరపక్షంబుల్=శత్రుపక్షములు, పట్టించిరో= నేర్పిరో.

తా. ఊరిలో పిల్లకాయలంపఱును ఎట్లు చెప్పినట్లు నేర్చుకొందురు. అది యట్లు ఇది యిట్లు అని యెదురుచెప్పరు. వీనికి ఎవరు ఏమి బెదిరించి నేర్పిరోకాని శత్రువుల కనుకూలములైన వాదములు బాగుగా పట్టినవి.

శా. నాకుంజూడఁగ జోద్యమయ్యెడిఁగదా నాతండ్రి యీబుద్ధి బా
లికుఁ లోపలఁ దోఁచెనో పరులు దుర్నీతుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ నలిపిరో యీదానవశ్రేణికిన్
వైకుంఠుండు కృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నేఁ కేటికిన్. 

టీ. నాతండ్రి = మానాయనా, ప్రహ్లాదా, చోద్యము = చిత్రము, ఈబుద్ధి=ఇట్టి విష్ణునియందలి భక్తి, తాన్=తనంతటనే, లోపలన్ = నీ

హృదయమున, పరుం=మనసు కానివారు, దుర్నీతులు=చెడుగఱపులు. పఠింపించిరో=చరివించినారా ? ఏకాంతంబునన్=ఎవరు లేనప్పుడు, భార్గవుల్=చండామర్కులు, పలికిరో, వైకుంఠుండు=విష్ణువు, ఈదానవ శ్రేణికిన్=ఈరాక్షసకోటికి, కృతాపరాధుండు=ద్రోహము చేసినవాఁడు, వర్ణింపన్=స్తుతించుటకు, నీకుఁ ఏటికిన్=ఎందుకు.

తా. ప్రహ్లాదా యేమిరా యీవింత! నీకిది నీయంతట నే గలిగినదా యెవరైన మనవిరోధు లిట్లుచెప్పుమనిరా ? లేక మీ గురువులు రహస్యముగా నీవిద్య నేర్పిరా ? ఎవరైన జెప్పనీ యిది సరికాదు. మనరాక్షసులకు నెప్పుడు విష్ణువు పరమద్రోహి. వానిపేరు దలఁపకుము.

మ. సురలం దోలుటయో సురాధిపతులన్ క్రుంకించుటో సిద్ధు
లం బరివేధించుటయో మునిప్రవరులన్ బాధించుటో యక్షకి
న్నరగంధర్వవిహంగనాగపతులన్ నాశంబు నొందించుటో
హరియంచు న్గిరియంచు నేల చెడ మోహాంధుండవై పుత్రకా.

టీ. పుత్రకా=కుమారా, సురలన్=దేవతలను, తోలుటయో=తఱుముటయో, సురాధపతులన్=ఇంద్రాదిదేవనాథులను, క్రుంకించుటో=అలయఁజేయుటయో, సిద్ధులన్. పరివేధించుటయో=పీడించుటయో, మునిప్రవరులన్=మునీశ్వరులను, బాధించుటో=బాధపెట్టుటో, యక్ష ... పతులన్=యక్షులు అశ్వముఖులు గంధర్వులు, పక్షులు, నాగలోకవాసులను, నాశంబున్=ప్రళయమును, మోహాంధుండవై=అజ్ఞానమునఁ గన్నెఱుఁగక, హరి గిరియంచున్. చెడన్, ఏల.

తా. నాయనా, ఇది యొక ఘనకార్య మనుకొన్నావా? మనరాక్షసవీరు లకిది యొకపనియా ? ఇదియేమి దేవతలను బాఱఁదోలుట యనుకొంటివా ? లేక వారినిబట్టి చావఁబాఁదుటయని తలఁచితివా ? సిద్ధులను వేధించుటా? మునులతాళముబట్టుటా? యక్షులు మున్నగువారిని రూపుమాపుటా? పిచ్చివానివలె హరి గిరి యనకు. మనము చేయవలయువాని నేర్వుము.

వ. అనినఁ దండ్రిమాటలకుఁ బురోహితు నిరీక్షించి ప్రహ్లాదుం డిట్లనియె మోహనిర్మూలనంబు సేసి యెవ్వనియందుఁ దత్పరులయి యెఱుక గలపురుషులకుం బరులు దా మనియెడు మాయాకృతం బయినయసద్గ్రాహ్యం బగుభేదంబు గానం బడ దట్టిపరమేశ్వరునకు నమస్కరించెద. 147

టీ. పురోహితుక్ = గురునికొడుకయినచదువులయ్యను, నిరీక్షించి = చూచి, మోహనిర్మూలనంబు = అజ్ఞాననాశనము, తత్పరులు = తవిలియుండు వారలు, ఎఱుకగలపురుషులు = తెలిసినవారు, మాయాకృతంబు = మాయచేలన గలిగినది, అసద్గ్రాహ్యంబు = తెలివిమాలినవారిచే నభ్యసింపఁబడినది.

శా. అజ్ఞుల్ గొందఱు నేము దామనుచు మాయాభేదిసర్వాత్మకుం బ్రజ్ఞాలభ్యు దురన్వయక్రమములన్ భాషింపఁగా నేర రా జిజ్ఞాసాపథమందు మూఢులు గదా చింతింప బ్రహ్మాదివే దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ దర్శింపఁగా నేర్తురే.

టీ. అజ్ఞుల్ = తెలియనివారు, సర్వాత్మకుక్ = సర్వరూపుని, ప్రజ్ఞాలభ్యుక్ = జ్ఞానముచేఁ బొందఁదగినవానిని, దురన్వయక్రమములన్ = చెడ్డ సంప్రదాయములచేత, భాషింపఁగాన్ = పలుకుటకు, చింతింపన్ = యోచింపఁగా, ఆజిజ్ఞాసాపథమందున్ = దానిం దెలిసికొనుపట్టున, బ్రహ్మాదివేదజ్ఞుల్ = వేదము లెఱిఁగిన బ్రహ్మమున్నగువారును, మూఢులుగదా = తెలియని వారుగదా, తత్పరమాత్మున్ = అట్టి పరాత్పరుని, విష్ణు, ఇతరుల్ = సాధారణులు, దర్శింపఁగాన్ = చూచుటకు, నేర్తురే = నేరుతురా.

తా. గురువరా! కొందఱుమూర్ఖులు తాముని పరులని మాయచే భేదబుద్ధిగలిగి, సర్వాత్మకుఁడు జ్ఞానమునకు స్వాధీనుఁడు నగువిష్ణునిసంప్రదాయశుద్ధిగా దర్శింపఁజాలరు. మూర్ఖులనవేల? వేదవాదులగు బ్రహ్మాదులు నయితము వాని నెఱుఁగరఁట. ఇఁక నితరులనఁగా నెంత.

తే. ఇను మయస్కాంతసన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశుసన్నిధి నావిధమునఁ
గరఁగు చున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తమ చిత్తంబు భ్రాంత మగుచు. 14)

టీ. బ్రాహ్మణోత్తమ = మంచి బ్రాహ్మణుఁడా, దైవయోగమునన్ చేసి = దైవగతివలన, చిత్తంబు = నామనస్సు, అయస్కాంతసన్నిధిన్ = సూదంటురాయియొద్ద, ఇనుము, ఎట్లు, భ్రాంతము = లోలము, తగులుకొనునది, అగున్ = అగునో, అవిధమునన్ = అలాగున, హృషీకేశుసన్నిధిన్ = విష్ణునిచెంత, భ్రాంతము = చలించునది, అగుచున్, కరఁగుచున్నది = ద్రవీభావమును బొందుచున్నది.

తా. ఉపాధ్యాయులుగారూ, అదియేమిదైవమహిమమోకాని నామనస్సు సూదంటుఱాయి యినుము తగులుకొన్నట్లు విష్ణునియందు దృఢముగాఁ బోయి చేరుచున్నది.

సీ. మందారమకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాది యై చొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరక
మరుగునే సాంద్రనీహారములకు

తే. నంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త

చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయు నేల. 150

టీ. వినుతగుణశీల=మంచిగుణములుగలవాఁడా,మందార...మునన్=కల్పవృక్షపుఁ బూవుదేనెల తీయఁదనమున, తేలుమధుపంబు = ఓలలాడు తుమ్మెద, మదనములకున్=మంగచెట్లమీఁదికి, పోవునే, నిర్మల...కలన్=శుభ్రమైనగంగాతరంగములయందు, తూఁగురాయంచ = తూఁగాడుహంస, తరంగిణులకున్ = నదులకు. చనునే = వెళ్లునా, లలిత...ఖాది =సుందరమైన మామిడిచిగురులనుమెక్కినది, సొక్కు=మైమఱచు,కుటజములకున్=కొడిశచెట్లకు, పూర్ణేందు...రకము = నిండుజాబిల్లివెన్నెలచే సలరిన వెన్నెలపులుఁగు, సాంద్రనీహారములకున్ = గట్టిమంచుగడ్డలమీఁదికి, అరుగునే= పోవునా, అంబు...చిత్తము=విష్ణుదివ్యపాదకమలము లధ్యాన మున్నదమ్ము తము ద్రావుట మిక్కిలి పెక్కువమున్నస్సు, ఏరీతి= ఏలాగున, ఇతరంబున్ = మఱియొకదానిని, చేరనేర్చున్ = పొందఁగలదు.

తా. గురూత్తమా, వేయిమాట లెందుకుగాని కల్పవృక్షములలో పూవుదేనెలు ద్రాగు తుమ్మెద మంగచెట్లను మెచ్చియైన చేరునా? గంగానదియొక్క అలలలోఁ దూఁగియాడు హంస మననదులలోనికి వచ్చునా? తీయనిమామిడిచిగురు దినుచున్న కోయిల కొడిశెచెట్లమీఁదికిఁ బోవఁగోరునా? పున్నమనాఁటి చంద్రుని వెన్నెలను ద్రావి తనిసినతీతువు మంచుపెళ్లలమీఁదికెప్పుడైన వెళ్లునా? అట్లే, శ్రీహరిధ్యానముచేఁ బరవశమైనమనస్సు ఎట్లు మఱియొకవంకకుఁ దిరుగునో చెప్పుఁడీ?

వ. అనిన విని రోషించి రాజసేవకుండైనపురోహితుండు ప్రహ్లాదుం జూచి తిరస్కరించి యి ట్లనియె. 151

టీ. రోషించి = కోపపడి, రాజసేవకుండు = రాజైన హిరణ్యకశిపునిచిత్తముప్రకారము సేవచేయువాఁడు, పురోహితుఁడు = శుక్రునికొడుకు, తిరస్కరించి = అదలించి.

ఉ. పంచశరద్వయస్కుఁడవు బాలుఁడ వించుక గాని లేవు భా
షించెదు తర్కవాక్యములు చెప్పినశాస్త్రములోనియర్థమొ
క్కించుకయైనఁ జెప్పవసు రేంద్రునిముందటమాకు నౌదలల్
వంచుకొనంగఁ జేసితివి వైరివిభూషణ వంశదూషణా. 152

టీ. వైరివిభూషణ = శత్రువులకు నలంకారమైనవాఁడా, వంశదూషణా = కులనాశకుఁడా, ప్రహ్లాదా, నీవు, పంచశరద్వయస్కుఁడవు = ఐదేండ్లవాఁడవు, బాలుఁడవు = కుఱ్ఱవాఁడవు, ఇంచుక = కొంచెము, తర్కవాక్యములు = తర్కములోనివాదములు, భాషించెదు = చెప్పెదవు, చెప్పిన...యర్థము. మేము నేర్పిన శాస్త్రములోనిసంగతి, ఒక్కించుకయైనన్ = కొంచెమైనను, మాకున్, అసురేంద్రునిముందటన్ = హిరణ్యకశిపు మహారాజుగారి యెదుట, ఔదలల్ = తలలు, వంచుకొనంగన్, చేసితివి.

తా. ఓకీ కులపాంసనా శత్రుహితుఁడా ప్రహ్లాదా! నీవుమాఁడ నయిదేండ్ల కుఱ్ఱవాఁడవు ఇంతలేవు ఏమో తర్కములంతయు మాటలాడెదవు. మేముకష్టపడి బోధించినశాస్త్రములోనిది ఒక్కటియుఁ జెప్పవు. రాజుగారి యెదుట మా కవమానము దెచ్చితివి. ఇఁకఁ జాలును.

చ. తనయుఁడు గాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడు దైత్యచం
దనవనమందుఁ గంటకయుతక్షితిజాతముభంగిఁ బుట్టినాఁ
డనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతి సేయుచున్నాడు దం
డనమునఁ గాని శిక్షలకు డాయఁడు పట్టుఁడు గొట్టుఁ డుద్ధతిన్.

టీ. వీఁడు = ఈప్రహ్లాదుఁడు, దానవభర్తకు = హిరణ్యకశిపునకు, తనయుఁడు = కొడుకు. దైత్యచందనవనమందు, రాక్షసులను మంచిగంధపుఁజెట్ల తోఁటయందు, కంటక యుతక్షితి జాతముభంగిన్ = ముండ్లచెట్టు మాదిరి, అనవరతంబు = ఎప్పుడును, రాక్షసకులాంతకున్ = విష్ణువును, ప్రస్తుతి = స్తోత్రము, దండమునన్ గాని = దండించినగాని, శిక్షలకున్ =

మానేర్పుచదువులపద్ధతులను, డాయఁడు = చేరఁడు, ఉద్ధతిన్ = ఆటోప ముతో, పట్టుఁడు = పట్టుకొనుఁడు, కొట్టుఁడు.

తా. హిరణ్యకశిపునకు వీఁడు శాత్రవుఁడుగాని కొడుకుగాఁడు నిర్మలమైన రాక్షసకులమను గంధపు తోఁటయందు ఈదుర్మార్గుఁడు తుమ్మచెట్టునుబోలి పుట్టినాఁడు, ఎప్పుడు రాక్షసకులము నాశనము సేయుచున్న విష్ణుని నుతించును. వీనిని కఠినముగా దండించినఁగాని మనదారికి రాఁడు. పట్టి కొట్టుఁడు.

క. ఈపాపనిఁ జదివింతుము
నీపాదము లాన యింక నిపుణతతోడం
గోపింతుము దండింతుము
కోపింపకు మయ్య దనుజకుంజర వింటే. 154

టీ. దనుజకుంజర = రాక్షసశ్రేష్ఠా, వింటే = వినవా, ఈపాపనిన్ = ఈకుఱ్ఱవానిని, చదివింతుము. నీపాదములు ఆన = నీయడుగులు ప్రమాణము, నిపుణతతోడన్ = కౌశల్యముతో, కోపింతుము, దండింతుము, కోపింపకుము అయ్య = ఆగ్రహింపకు మయ్యా.

తా. రాజా! కోపపడవలదు. ఇఁకమీఁద వీనిని గట్టిగా పట్టికొట్టి చదువు నేరుపఁగలము. నీయడుగులతోడు. నేరుపుగా వీని జదివింతుము.

వ. అని మఱియు నారాచపాపనికి వివిధోపాయంబులం గురోహితుండు వెఱపుఁ జూపుచు రాజసన్నిధిని బాసి తోడుకొనిపోయి యేకాంతంబున.

టీ. రాచపాపనికిన్ = రాజుకొడుకునకు, వివిధోపాయంబులన్ = నానాయుక్తులచేత, వెఱపు = భయము, చూపుచున్, రాజసన్నిధిన్ = రాజుసమక్షమును, పాసి = తొలఁగి, తోడుకొనిపోయి = తీసికొనిపోయి, ఏకాంతంబునన్ = రహస్యమందు.

క. భార్గవనందనుఁ డతనికి
మార్గము సెడ కుండఁ బెక్కు మాఱులు నిచ్చల్
వర్గత్రితయము సెప్పె న
నర్గళ మగుమతివిశేష మమరఁ నరేంద్రా. 156

టీ. నరేంద్రా = ధర్మరాజా, భార్గవనందనుఁడు = శుక్రునికొడుకు, అతనికిన్ = ఆప్రహ్లాదునకు. మార్గము = త్రోవ, చెడకుండన్ = చెదరకుండునట్లు, నిచ్చలు = ఎల్లప్పుడు, పెక్కుమారులు = బహుపర్యాయములు, అనర్గళము = అడ్డులేనిది, మతివిశేషము = ధీచాతుర్యము, అమరన్ = మెఱయునట్లు, వర్గత్రితయము = ధర్మార్థకామముల ముత్తెఱగు, చెప్పెన్ = నేర్పెను.

తా. రాజా! వానికి శుక్రునికొడుకు తనచాతుర్యముకొలఁది. ధర్మార్థకామములత్రోవలు పలుమాఱు తరిచి తరిచి చెప్పుచు వచ్చెను.

వ. మఱియు గురునందనుండు శిష్యునకు సామదానభేద దండోపాయం బులన్నియు నెఱింగించి నీతికోవిదుం డయ్యె నని నమ్మి ని శ్చయించి తల్లికి నెఱింగించి తల్లిచేత నలంకృతుం డయిన కులదీపకు నవలోకించి. 157

టీ. సామ...పాయంబులు = సామము దానము భేదము దండము ననునుపాయములు, నీతికోవిదుండు=రాజనీతియందు సమస్తము నెఱిఁగినవాఁడు, కులదీపకున్ = వంశప్రకాశకుఁడగు నాప్రహ్లాదుని, అవలోకించి = చూచి.

ఉ. త్రిప్పకు మన్న మామతము దీర్ఘము లైనత్రివర్గపాఠముల్
దప్పకు మన్న నేఁడుమనదైత్యవరేణ్యుని మ్రోల నేమునుఁ
జెప్పినరీతి గాని మఱి సెప్పకు మన్న విరోధిసంస్తుతుల్
విప్పకు మన్న దుష్ట మగువిష్ణుచరిత్రకథార్థజాలముల్. 158

టీ. అన్న = నాయనా ప్రహ్లాదా, మామతము = మా చెప్పిన చదువుల ధోరణిని, దీర్ఘములు = పెద్దవి, త్రివర్గపాఠములు = ధర్మార్థకామముల త్రోవలు, దైత్యవరేణ్యుని ముంగలన్ = హిరణ్యకశిపుని యెదుట, విరోధిశాస్త్రములు పగవారి చదువులు. దుష్టము = చెడినవి, విష్ణుచరిత్రకథార్థజాలములు = విష్ణుగాథల సమూహములు, విప్పకుము.

తా. నాయనా ప్రహ్లాదా, నేఁడు, మా చెప్పిన చదువులు మఱువక మా పరువు దక్కించుము. మేము చెప్పిన పెద్దపెద్ద ధర్మార్థకామముల పాఠములు తప్పిపోకుము. ఈవేళ మనరాజుగారి యెదుట మేము చెప్పిన యెల్లవిద్యలలో నీ చాతుర్యముఁ జూపుము. మనకు శత్రువగు విష్ణుని గాథలు త్రవ్వకుము.

వ. అని బుజ్జగించి దానవేశ్వరుని సన్నిధికిం దోడితెచ్చి. 159

టీ. బుజ్జగించి = ఓదార్చి, దానవేశ్వరుసన్నిధికిన్ = హిరణ్యకశిపుని దగ్గఱకు.

సీ. అడుగడుగునకు మాధవానుచింతనసుధా
మాధుర్యమున మేను మఱచువాని
నంభోజగర్భాదు లభ్యసింపఁగ లేని
హరిభక్తి పుంభావ మైనవాని
మాతృగర్భము సొచ్చి మన్నది మొదలుగాఁ
జిత్త మచ్యుతుమీఁదఁ జేర్చువాని
సంచించి తనలోన నఖిలప్రపంచంబు
శ్రీవిష్ణుమయ మని చెలఁగువాని
తే. వినయకారుణ్యబుద్ధివివేకలక్ష
ణాదిగుణముల కాటపట్టయినవాని
శిష్యు బుధలోకసంభావ్యుఁ జేరి గురుఁడు
ముందఱికిఁ ద్రొబ్బి తండ్రికి మ్రొక్కు మనుచు. 160

టీ. గురుఁడు = ప్రహ్లాదుని చదువులయ్యవారు, మాధవా...ము నన్ = విష్ణు ధ్యాన మనునమృతము తీయదనముచే, మేను = శరీరము, అంభోజగర్భాదులు = బ్రహ్మమొదలగువారును, అభ్యసింపఁగన్ = నేర్చుటకు, లేనిహరిభక్తి = చాలనివిష్ణుభక్తి, పుంభావము=పురుషాకార మును దాల్చుట, మాతృగర్భము = తల్లికడుపు. చొచ్చి = దూఱి, మ న్నది మొదలుగాన్ = బ్రతికినదాదిగా, అచ్యుతుమీఁదన్ = విష్ణువు మీఁద, అంకించి = రూఢించి, తనలోనన్ = తనమనస్సులోపల, అఖిల ప్రపంచంబు = ఎల్లజగత్తు, శ్రీవిష్ణుమయము = విష్ణుస్వరూపము, చెలఁగు వానిన్ = సంతసముతోనుండువానిని, వినయ ..గుణములకున్ = అడఁ కువ భూతదయ తెలివితేటలు మొదలగు మంచిగుణములకన్నిటికిని, ఆటప ట్టు = విహారస్థానము, బుధలోకసంభావ్యున్ = జ్ఞానులచే గౌరవింపఁద గినవాఁడు, శిష్యున్ = శిష్యుఁడగు ప్రహ్లాదుని. చీరి = పిలిచి.

తా. ప్రతిక్షణమునను విష్ణువును ధ్యానించి మైమఱచువాఁడును, బ్ర హ్మదులకును లభ్యముకాని విష్ణుభక్తియొక్క పురుషాకృతివలెనున్నవాఁడు ను, తల్లికడుపులోఁ బ్రవేశించినది మొదలు విష్ణువునందు మనస్సునిల్పిన వాఁడును, చక్కఁగా విచారించి తనమనస్సులో నీయెల్లలోకములు విష్ణు రూపములే యని దృఢముచేసికొన్నవాఁడును, అడఁకువ దయ మొదలగు నెల్ల గుణములకు నిల్లైనపండితమాన్యుఁడైనయాశిష్యుఁడగు ప్రహ్లాదునిఁ బిలిచి, ముందుకు నెట్టి మీనాయనకు నమస్కారముఁ జేయుమా యని చెప్పుచు.

క. శిక్షించితి మన్యము లగు
పక్షంబులు మాని నీతిపారగుఁ డయ్యెన్
రక్షోవంశాధీశ్వర
వీక్షింపుము నీకుమాఱువిద్యాబలమున్. 161

టీ. రక్షోవంశాధీశ్వర = రాక్షసకులమునకుఁ బ్రభువైనవాఁడా, వీనిని. శిక్షించితిమి = చక్కఁగాబోధించితిమి, అన్యములు = శత్రువుల

నను. పక్షంబులు = తోవలు, మాని = విడిచి, నీతిపారగుఁడు నీతిశా
స్త్రమునం దుదముట్టినవాఁడు, నీకుమారువిద్యాబలముల్ = నీకొడుకు చదువు
లపసను, వీక్షింపుము = పరిశీలింపుము.

తా. రాక్షసరాజా, నీకుమారుని చక్కఁగా శిక్షించి, చదివించినార
ము. శత్రుపక్షముల మానినాఁడు. ఎల్లవిద్యలలో గొప్పపండితుఁడైనాఁడు.
పరిశీలింపుఁడు.

వ. అని పలికిన శుక్రకుమారకువచనంబు లాకర్ణించి దానవేం
ద్రుండు దనకు దండప్రమాణంబు చేసి నిలుచున్న కొడుకును
దీవించి బాహుదండంబులు సాఁచి దిగ్గనఁ డగ్గఱం దిగిచి
గాఢాలింగనంబు సేసి తనతొడలమీఁద నిడుకొని చుంచు
దువ్వి చిబుకంబుఁ బుడికి చెక్కిలి ముద్దుగొని శిరంబు మూ
ర్కొని ప్రేమాతిరేకసంజనితబాష్పసలిలబిందుసందోహంబు
ల నతనివదనారవిందంబు దడుపుచు మందమధురాలాపంబు
ల నిట్లనియె. 162

టీ. శుక్రకుమారకువచనంబులు = శుక్రునికొడుకుమాటలు, ఆకర్ణించి =
విని, చాఁచి = జాఁచి, దిగ్గనన్ = వేగముగా, డగ్గఱన్ దిగిచి = దగ్గఱకుఁదీసికొని,
గాఢాలింగనంబు = బిగికౌఁగిలింతను, చుంచు = జులపాలు, చిబుకంబు =
గడ్డము, పుడికి = తడివి, మూర్కొని = వాసనచూచి, ప్రేమా...సంతోషంబు
లన్ = అతిసంతోషమువలనఁబుట్టిన కన్నీళ్ల ధారలచే, వదనారవిందంబు =
మోముతమ్మిని, మందమధురాలాపములన్ = మెల్లని తీయనిమాటలతో.

శా. చోద్యంబయ్యెడి నింతకాలమరిగెన్ శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువు లేవెంటం బఠింపించిరో
విద్యాసార మెఱుంగఁ గోరెద భవద్విజ్ఞాతశాస్త్రంబులోఁ
బద్యంబొక్కటి సెప్ప సార్థముగఁ దాత్పర్యంబుభాషింపుమా.

టీ. చోద్యంబు=చిత్రము, అరిగెన్=కడచెను, శోధించి=పరిశీలించి, సంవేద్యాంశంబులు=తెలియఁదగినసంగతులు, విద్యాసారము = విద్యలసారాంశము, భవద్విజ్ఞాతశాస్త్రంబులోన్ = నీకుఁదెలిసినశాస్త్రములోని, పద్యంబు, సార్థముగన్=అర్థముతోకూడ, తాత్పర్యంబు, భాషింపుమా = చెప్పుమా.

తా. కుమారా! చిత్రమయ్యెడిని. ఎంతకాలమయినదోయీ నీవు చదువసాగి? చక్కఁగా నేర్చి యేమేమి నేర్చితివో మీగురువులెట్లు చదివించినారో నీ చదువులసారము వినఁగోరెదను. నీవు చదివిన శాస్త్రములలో నొక్క మంచి పద్యమునకు అర్థముచెప్పి, తాత్పర్యముగూడ చెప్పుము.

శా. నిన్నుం గా మెచ్చరు నీతిపారమహిమన్ నీతోడిదైత్యార్భకుల్
గన్నా రన్నియుఁ జెప్ప నేర్తురు గదా గ్రంథార్థముల్ దక్షులై
యన్నా యెన్నఁడు నీవు నీతివిదుఁడౌ దంచున్ మహావాంఛతో
నున్నాఁడన్ ననుఁ గన్నతండ్రి భవదీయోత్కర్షముం జూపవే.

టీ. అన్నా=నాయనాప్రహ్లాదా, నీతోడిదైత్యార్భకుల్=నీయీడు వాడగు రాక్షసుల పిల్లకాయలు, నీతిపారమహిమన్ = నీతిశాస్త్రములు చదువుకొన్న ప్రభావముచేత, నిన్నున్, మెత్తురు=మెచ్చుకొనరు, గ్రంథార్థముల్=గ్రంథముల సారాంశములు, అన్నియున్, కన్నారు = నేర్చుకొన్నారు, దక్షులై=సమర్థులై, చెప్పనేర్తురుగదా, నీవు, ఎన్నఁడు, నీతివిదుఁడు=నీతికోవిదుఁడవు. ఔదువో, మహావాంఛతోన్ = అత్యాశతో, భవదీయోత్కర్షమున్=నీ గొప్పతనమును, చూపవే.

తా. కుమారా, నీతోఁ జదువమొదలిడిన యీడు పిల్లకాయలందరు చదువులలో నీకన్నఁ బ్రబలులైరి. వారు నిన్ను మెచ్చుకోరుగదా. వారన్నిగ్రంథములను జక్కఁగాఁ జదువుకొనిరి. అన్నియు విప్పి చెప్పఁగలరు. నాయనా! నీవెన్నఁడు పండితుఁడ వౌదువో యని నేను మిగుల నాశతో నువ్విళ్లూరుచున్నాను. తండ్రీ నీ చాతుర్యముం జూపుము.

వ. అనినం గన్నతండ్రికిఁ బ్రియనందనుఁ డయినప్రహ్లాదుం డి ట్లనియె. 165

టీ. ప్రియనందనుండు=ముద్దులకొమారుఁడు, ఇట్లు అనియెన్.

క. చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ. 166

టీ. తండ్రీ=నాయనా, నను=నన్ను, గురువులు, చదివించిరి, ధర్మార్థముఖ్యశాస్త్రంబులు = ధర్మశాస్త్రము అర్థశాస్త్రము మొదలైనవి, పెక్కులు=అనేకములు, మర్మము=రహస్యము.

తా. నాయనా, నాకు గురువులు, బాగుగాఁ జెప్పిరి. అన్నిశాస్త్రములు జదివినాను. నేను జదివినవి పెక్కులు గలవు. ఇదియదియన నేల? చదువులలోని సారమంతయు గ్రహించితిని.

మ. తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్
వందనార్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీ
ర్తనల్ చింతనం, బను నీతొమ్మిది భక్తిమార్గముల సర్వా
త్ముని హరిన్ నమ్మి స, జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ
దలంతున్ సత్యంబు దైత్యోత్తమా. 167

టీ. దైత్యోత్తమా=రాక్షసులకు రాజైనయోతండ్రీ, తనుహృద్భాషలన్=మనోవాక్కాయములచేత, సఖ్యమున్=ప్రేమించుటయు, శ్రవణమున్=వినికియు, దాసత్వమున్=కైంకర్యమును, వందనార్చనముల్ = మ్రొక్కుటలు పూజించుటలును, సేవయున్=పరిచర్యయు, ఆత్మలోన్=తన యందు, ఎఱుకయున్=తెలివియు, సంకీర్తనల్=పాడుటలును, చింతనంబు=ధ్యానమును, తొమ్మిది భక్తిమార్గములన్=భక్తిమార్గములచేత, సర్వా

తుమ్మా=సర్వస్వరూపియగు, సజ్జనుఁడు=సాధువు, భద్రము=శ్రేయము సత్యంబు=నిజము.

తా. రాక్షసరాజా! సర్వాంతర్యామి యగుశ్రీహరిని నమ్మి, మనోవాక్కాయముల ప్రేమించుట, వినుట, భృత్యుఁడగుట, మ్రొక్కుట, పూజించుట, పరిచరించుట,తనలో నెఱుక గలిగియుండుట, కీర్తనము, ధ్యానము, అనునట్టి భక్తిమార్గములు తొమ్మిదింతను సేవించుచుఁ గాలము ద్రోయుట శ్రేయస్కర మని నా యభిప్రాయము.

శా. అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావలీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితులరిక్తవ్యర్థసంసారముల్. 168

టీ. హరి...సంసారముల్=విష్ణుభక్తి లేనివారి శూన్యములై ప్రయోజనహీనములైన యీ సంసారములు,అంధేందూదయముల్=గ్రుడ్డివానిపాలి వెన్నెలలు, మహా...ముల్ = చెవిటివానిచెంత శంఖధ్వనులు, మూక... ముల్ = మూగవానికిఁ జెప్పిన మంచిగ్రంథములబోధలు, నపుంసకవధూకాంక్షల్=మగతనములేనివానికి మగువలపొందుగోరుటలు, కృత...బులు =మేలుమఱచువారితోడి చుట్టఱికములు, భస్మహవ్యములు=బూడిదలోని హోమములు, లుబ్ధద్రవ్యముల్=లోభివానికలుములు, క్రోడసద్గంధంబుల్ =పందులకుఁ గలసువాసనలు.

తా. తండ్రీ! సర్వగతుఁడగువిష్ణుని దెలియలేనివారుగనుక విష్ణుభక్తి లేనివారి యీవ్యర్థ సంసారడంబనములు గ్రుడ్డివానికి గలవెన్నెలవంటివి. చెవిటివానిచెంత శంఖధ్వనులవంటివి. మూఁగవానికి శాస్త్రార్థములు జెప్పుట వంటివి. ఊబవాఁడువిదలఁ గోరుటవంటివి. చేసినమేలును మఱచిపోవువారి చుట్టఱికములవంటివి. బూడిదలోని హోమములవంటివి. లోభివాని సొమ్ములవంటివి. పందికి దొరికిన పన్నీరువంటివి

సీ. కమలాక్షు నర్చించుకరములు కరములు
శ్రీనాథు వర్ణించుజిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచుచూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కుశిరము శిరము
విష్ణు నాకర్ణించువీనులు వీనులు
మధువైరిఁ దవిలినమనము మనము
భగవంతు వలఁగొనుపదములు పదములు
పురుషోత్తమునిమీఁది బుద్ధి బుద్ధి
తే. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడిగురుఁడు గురుఁడు
తండ్రి హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి. 169

టీ. కమలాక్షున్ = (తామరలవంటికన్నులుగల) విష్ణుని, అర్చించుకరములు = పూజించెడుహస్తములు, కరములు = చేతులు. శ్రీనాథున్ = లక్ష్మీపతిని, వర్ణించుజిహ్వ = స్తోత్రముచేయునాలుక, సురరక్షకునిన్ = దేవతలఁగాచువానిని, చూచుచూడ్కులు = చూచెడుకన్నులు, శేషశాయికిన్ = ఆదిశేషువు పానుపుగాఁగలవానికి, మ్రొక్కుశిరము = మ్రొక్కెడు నౌఁదల, ఆకర్ణించువీనులు = వినుచెవులు, మధువైరిన్ = మధువనువానికి శత్రువగువిష్ణుని, తవిలినమనము = కూడినచిత్తము, భగవంతున్ = షడ్గుణైశ్వర్య సంపన్నుఁడగువానిని, వలఁగొనుపదములు = ప్రదక్షిణముచేయు పాదములు, పురుషోత్తమునిమీఁదిబుద్ధి = విష్ణునిమీఁది తలఁపు, దేవదేవునిన్, చింతించుదినము = ధ్యానించుదినము, చక్రహస్తుని = సుదర్శనధారియగువిష్ణుని, ప్రకటించుచదువు = వెల్లడించెడి చదువు, కుంభినీధవున్ = భూపతియగు విష్ణువును, హరిన్ = విష్ణువును, చేరుమనియెడితండ్రి = చేరుమనిబోధించుతండ్రియే. తండ్రి

తా. తండ్రీ! విష్ణుని బూజించునవి యే చేతులు. వట్టిచేతులు చేతులు గావు. ఆయనను స్తోత్రము చేయునదియే నాలుక. హరిని గాంచునవియే కన్నులు. నారాయణునకు మ్రొక్కునదియే శిరస్సు. విష్ణుకథలు వినునవియే చెవులు. హరియందు లగ్నమైనదే చిత్తమనవలెను. ఆయనకు ప్రదక్షిణము చేయునవియే పాదములు. ఆయనమీఁది బుద్ధియే బుద్ధి. ఆదేవుని ధ్యానము దొరకినదే సుదినము. ఆయన గాథలు గలదే మంచిచదువు. అమహానుభావుని దెలియఁ జెప్పువాఁడే గురువు. నాయనా హరిని బొందుమని బోధించువాఁడే తండ్రిగాని యితరులు తండ్రులా? కారు.

సీ. కంజాక్షునకుఁ గానికాయంబు కాయమే
పవనగుంఫితచర్మభస్త్రి గాక
వైకుంఠుఁ బొగడనివక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడిఢక్క గాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మితదర్వి గాక
కమలేశుఁ జూడనికన్నులు కన్నులే
తనుకుడ్యజాలరంధ్రములు గాక

ఆ. చక్రిచింత లేనిజన్మంబు జన్మమే
తరళసలిలబుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడిపశువు గాక. 170

టీ. కంజాక్షునకుఁ=కమలములఁ బోలుకన్నులు గల విష్ణువునకు, గానికాయంబు = ఉపయోగింపనిశరీరము, కాయమే = శరీరమా, పవనగుంఫితచర్మభస్త్రి=గాలిచేనిండిన తోలుసిద్దె, వైకుంఠుఁ=విష్ణుని, పొగడనివక్త్రంబు = స్తుతింపనినోరు, ఢమఢమధ్వనితోడిఢక్క=ఢమఢమయ

నిర్మోగుఢంకా, హరిపూజనములేనిహస్తంబు=విష్ణుపూజ చేయఁగని యి, తను...ద్వ=చెట్టుకొమ్మచేఁ జేసిన తెడ్డు, కమలేశు...=శ్రీనాథుని, తను...ములు=శరీరమనుగోడయందలి కిటికీలు, తరళసలిలబుద్బుదంబు=కదలుచున్న నీరుబుగ్గ, విబుధుండు=విద్వాంసుఁడు, పాదయుగముతోడి పశువు=రెండుకాళ్లు గలగొడ్డు.

తా. రాక్షసరాజా! విష్ణువునకుఁ బనికిరానిశరీరము ఒక శరీరమేనా? కాదు. అది యొక గాలినిండినతోలుసిద్దె యనవలెను. హరినామకీర్తనలేనిదినోరా? ఘణఘణయని మ్రోఁగు నొకవాద్యమే. హరిని పూజింపనిది చేయియా? అదియొక కొయ్యతెడ్డు. శ్రీనారాయణుని చూడని కన్నులా? ఈ శరీరమను గోడలోని కిటికీలే. విష్ణుధ్యానపరుఁడుగాని జన్మము నొక జన్మమేనా? అది నీటిలోఁ గదలు బుగ్గయే. వైష్ణవభక్తిలేనివాఁడు నొక పండితుఁడా? వాఁడు రెండుకాళ్ల దున్నపోతనియే చెప్పవలెను.

సీ. సంసారజీమూతసంఘంబు విచ్చునే
చక్రిదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీలదావాగ్ను లాఱునే
విష్ణుసేవామృతవృష్టి లేక
సర్వంకషాఘౌఘజలరాసు లింకునే
హరిమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడఁగునే
పద్మాక్షునుతిరవిప్రభలు లేక
తే. నిరుపమాపునరావృత్తినిష్కళంక
ముక్తినిధిఁ గాన వచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక
తామసగర్భసంభూత దానవేంద్ర. 171

టీ. దానవేంద్రా = రాక్షసరాజా, తామరసగర్భునకున్ ఐనన్ = బ్రహ్మకైనను, చక్రిదాస్యప్రభంజనము = విష్ణుకైంకర్యమను నెత్తుగాలి, లేక, సంసారజీమూతసంఘంబు = సంసారమను మేఘములప్రోవు, విష్ణుసేవామృతవృష్టి = శ్రీహరిసేవయనునమృతపువాన, తాప...స్సులు = మూఁడుతాపములనుభయంకరములైన కాఱుచిచ్చులు, హరి...బాగ్ని = విష్ణుచింతయను సముద్రవహ్ని, సర్వం...రాసులు = ఎల్లెడలనిండియున్న సముద్రములు, పద్మా...భలు = విష్ణుప్రేమములను నెండలు, ఘన...రంబులు = ఆపదలను దట్టపుఁజీఁకటులు, అడఁగునే = నశించునా, ముఖ్యము = ప్రధానము, శౌరి...జనము = విష్ణుధ్యానమనుకాటుక, నిరుమా...నిధిన్ = సాటిలేనినిర్మలమైన మోక్షపదవిని, కాన వచ్చునే = చూడ నలవియా ?



తా. నాయనా ! బ్రహ్మకైననుసరే విష్ణుస్మరణ లేక సంసారమేఘముల విముక్తి కలుగునా ? విష్ణుసేవయనువాన లేక తాపత్రయమనుకాఱుమంటలు చల్లారునా ? భగవత్కైంకర్యమనుబడబాగ్ని లేక కన్నులఁ జూచినను కుప్పలు తెప్పలుగా నిండిన పాపసముద్రములు ఇంకిపోవునా ? విష్ణుసేవయను నెండలుగాక ఆపదలను కటికిచీఁకటులు విచ్చునా ? విష్ణుధ్యానమనుకాటుక లేక పునరావృత్తిలేని విమలమైన కైవల్యము దొరకునా ? దొరకదు.

వ. అని యివ్విధంబున వెఱపు మఱపు నెఱుంగక యులుకు సెడి పలికెడి కొడుకు నుడువులు సెవులకు ములుకులక్రియ నాఁటవినఁ గటములు లదరఁ బెదవులం గఱచుచు నదరిపడి గురుసుతునిం గనుంగొని విమతకథనంబులు గఱపినాఁడ వని దానవేంద్రుండి ట్లనియె. 172

టీ. దానవేంద్రుండు = హిరణ్యకశిపుఁడు. వెఱపు = భయము, మఱపు = విస్మృతి, ఉలుకుసెడి = లెక్క సేయక, నుడువులు = మాటలు, ఒనవినన్ = కాఁగా, కటములు = కణఁతలు, కఱచుచు = కొఱు

మము, అదరిపడి = మిడిసిపడి. గురుసుతుఁడ = శుక్రునికొడుకును, విమత కథనంబులు = పగవారికథలు, కఱపినాఁడవు = నేర్పినావు.

చ. పటుతరనీతిశాస్త్రచయపారగుఁ జేసెద నంచు బాలు నీ
వటు గొనిపోయి వానికి ననర్హము లైనవిరోధిశాస్త్రముల్
కుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండ వటంచు నమ్మితిం
గటకట బ్రాహ్మణాకృతివిగాక యథార్థము బ్రాహ్మణుండవే.

టీ. నీవు, బాలుఁడ, పటు...పారగుఁడ = అనింద్యమైన నీతిశాస్త్రము చివరదాఁకఁజదివినవానిఁగా, అనర్హములు = తగనివి, విరోధిశాస్త్రముల్ = శత్రువులచదువులు, కుటిలతఁడ = కపటముతో, భృగుప్రవరుండవు = భృగువంశపు బ్రాహ్మణులలో మేటివి, కటకట = అయ్యో, బ్రాహ్మణాకృతివి = బ్రాహ్మణవేషముతో నున్నవాఁడవు, యథార్థపు బ్రాహ్మణుండవే = నిజమైనబాఁపఁడవా.

తా. గురుపుత్త్రా! పిల్లకాయను దీసికొనిపోయి నేను జక్కఁగా శిక్షించి యన్నిచదువులు బాగుగ నేర్పితెచ్చెదనని కొనిపోయి, వానికి మాకుఁ గానివారిచదువులను నేర్పి మోసముచేసితివి. దుర్మార్గుఁడా! నీవు భృగు వంశమునఁ బుట్టిన సచ్ఛ్రోత్రియుఁడవుగదా యని మోసపోయితిని. ఓరీ! నీవు బ్రాహ్మణవేషమువేసికొన్నావేకాని నిజముగా బ్రాహ్మణుఁడవా?

క. ధర్మేతరవర్తనులును
దుర్మంత్రులు నైనజనుల దురితము లొందుఁ
మర్మములు గలఁచి కల్మష
కర్ముల రోగములు వొందు కైవడి విప్రా. 174

టీ. విప్రా = బ్రాహ్మణా, కల్మషకర్ములఁ = పాపపుఁ బనులఁ జేసినవారిని, మర్మములు = ఆయువుపట్టులు, కలఁచి = పీడించి, రోగములు, పొందుకైవడిఁ, ధర్మేతరవర్తనులు = అన్యాయమార్గమున జనువారు, దుర్మంత్రులు = చెడ్డతలఁపులు గలవారు, దురితములు = పాపములు.

తా. బ్రాహ్మణా! పరదారగమనాది పాపకర్మములు జేసిన వారిని మర్మములకెక్కిన రోగములు, పీడించినట్లు, అన్యాయమార్గములో మెలఁగిన కుక్షితబుద్ధిగలజనులను బాపములు చుట్టుకొనుట నిశ్చయము. నీవు నన్ను మోసముచేసి, నాకొడుకును జెడఁగఱపి పాపివైతివి.

వ. అనిన రాజునకుఁ బురోహితుం డిట్లనియె.

ఉ. తప్పులు లేవు మావలన దానవనాథ విరోధిశాస్త్రముల్
సెప్పము క్రూరులైన పరులు సెప్పరు మీచరణంబులానసు
మ్మెప్పుడు మీకుమారునకు నింతయు నైజమనీష యెవ్వరుం
జెప్పెడిపాటిగాదు ప్రతిచింతఁ దలంపుము నేర్పుకైవడిన్.

టీ. దానవనాథ = రాక్షసులఱేఁడా, మావలన, తప్పులు=దోషములు, విరోధిశాస్త్రములు = శత్రువుల విద్యలు, క్రూరులు = దుర్మార్గులు, పరులు=కానివారు, మీచరణంబులానసుమ్ము=మీపాదాలానసుమీ, ఇంతయున్=ఇదియంతయు, నైజమనీష=తనంతగలిగిన బుద్ధియే, చెప్పెడిపాటి=నేర్పదగినది, కాదు, నేర్పుకైవడిన్=నీప్రజ్ఞకొలఁది, ప్రతిచింత=ప్రతిక్రియ, తలంపుము = యోజింపుము.

తా. రాక్షసరాజా, మేమొక్కటితప్పినము. నెఱుఁగము నీపాదములాన సుమా. నీకొడుకునకు మేము దుర్బోధములు చేయలేదు. ఏవిరోధులు వానికి బోధింపలేదు. ఇవి వాని కొకరు నేర్పినఁ బట్టినవిగావు. వానికిఁ బుట్టుకతోఁ గలిగినవే. ఇఁక నీశక్తికొలఁది వాని కాబుద్ధి విరుగునట్లు చేయువలసినదే కాని మమ్ము నిందించి లాభములేదు. మేము మాశక్తికొలఁది పోరాడితిమి.

క. మిత్రులము పురోహితులము
పాత్రులమే మఱియుఁ గాక భార్గవులము నీ
పుత్రుని నిటువలెఁ జేయఁగ
శత్రులమే దైత్యజలధిచంద్రమ వింటే. 177

టీ. దైత్యజలధిచంద్రమ = రాక్షసులనుపాలవెల్లికిఁ జంద్రునివంటివాఁడా, వింటే = వింటివా, ఏము, మిత్రులము=నీకుఁ గూర్చినవారము, పాత్రులము = బోధించుటకుఁ దగినవారము, భార్గవులము = భృగుకులమునఁ బుట్టినవారము. శత్రులమే = నీకు విరోధులమా ?

తా. రాక్షసరాజా. వినుమా! మేము నీకు నెయ్యులము. పురోహితులము. యోగ్యులము. ఇన్నిటికి నైన భృగువంశజాతులము. అట్టిమేము మాకెన్నివిధముల ప్రేమింపఁదగిన దొరవగు నీకొడుకును జెడఁగ నెపుడు నీకేమి మేము విరోధులమా? అట్లు తలఁపకుము.

వ. అనిన గురునందనుం గోపింపక దైత్యవల్లభుండు గొడుకు నవలోకించి యిట్లనియె. 178

టీ. గురునందనుఁ = శుక్రునికొడుకును, కోపింపక, దైత్యవల్లభుండు = హిరణ్యకశిపుఁడు, అవలోకించి = చూచి.

క. ఒజ్జలు సెప్పనియీమతి
మజ్జాతుఁడ వైననీకు మఱి యెవ్వరిచే
నుజ్జాత మయ్యె బాలక
తజ్జనులం బేరుకొనుము తగ నామ్రోలన్. 179

టీ. బాలక = కుఱ్ఱా, మజ్జాతుఁడవు = సురవిరోధినైన నాకుఁ బుట్టినవాఁడవు, (ఇట్టివానికి విరోధులనీతులు పట్టుబడుట దుర్లభము) ఐన నీకు, ఒజ్జలు = గురువులు, సెప్పనియీమతిన్ = బోధింపని యీబుద్ధి, మఱియెవ్వరిచేన్ = ఇంక నెవరిచేత, ఉజ్జాతము పుట్టినది, తజ్జనులన్ = వారిని, నామ్రోలన్ = నాయెదుట, పేరుకొనుము = చెప్పుము.

తా. కుఱ్ఱా! నాకుఁ బుట్టిననీకు ఈబుద్ధి గురువులు చెప్పక మఱియెవరు నేర్పిరి. వారిని నాయెదుట జెప్పుము.

వ. అనినఁ దండ్రికిఁ బ్రహ్లాదుం డిట్లనియె. 180

ఉ. అచ్చపుఁజీఁకటిం బడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణులైనవారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైనఁ గానలకు నేఁగిననైన హరిప్రబోధముల్.

టీ. అచ్చపుఁ జీఁకటిన్ = గాఢాంధకారములో, పడి, గృహవ్రతులై = కాఁపురనము గలవారై, విషయప్రవిష్టులై = విషయములలోఁదిగి, చర్వితచర్వణులు = తిన్నదే మరల తినువారు, హరిప్రబోధముల్ = విష్ణుని జ్ఞానములు, పరులు = ఇతరులు, నిజేచ్ఛనైనన్ = తమంతటనైనను, ఏమి ఇచ్చిననైనన్ = ఏదియిచ్చినను గానీ, కానలకున్ = అడవులకు, ఏఁగిననైనన్ = వెళ్లినను. చెచ్చెరన్ = శీఘ్రముగా, పుట్టునే = పుట్టునా.

తా. తండ్రీ! అజ్ఞానపుఁ జీఁకటిలోఁ బడి, కాఁపురము సేయుచు, విషయాలోలురై, తేపతేపకుఁ జచ్చిపుట్టుచు, అనుభవించినదానినే మరల ననుభవించు నీమనుజపశువులకు ఒకరుచెప్పి గానీ, తమకుఁ దోఁచిగానీ ఎంతో వ్యయము సేసినఁగానీ అడవులలోఁ బడి తిరిగినఁ గానీ విష్ణుభక్తిసంబంధమైన జ్ఞానములు అట్టె ఒక్కనాఁడే కలుగునా? ఎంతవెఱ్ఱి? దానికి బహుజన్మసంసిద్ధియుండవలెను.

ఉ. కాననివాని నూఁతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్
గానని భంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుఁ గొందఱటఁ గందు రకించనవైష్ణవాంఘ్రిసం
స్థానరజోభిషిక్తు లగుసంహృతకర్ములు దానవేశ్వరా. 182

టీ. దానవేశ్వరా = రాక్షసరాజా, కొందఱు, కాననివాఁడు = గ్రుడ్డివాఁడు, కాననివానిన్ = గ్రుడ్డిని, ఊఁతఁగొని = ఆధారముచేసికొని విశిష్టవస్తువుల్ = కావలసినపదార్థములను, కానినభంగిన్ = చూడలేనివిధమున, కర్మములు, కైకొని = తెచ్చుకొని, కర్మబద్ధులై = తాముజేసినివానికిఁ గట్టువడి, విష్ణున్ = శ్రీహరిని, కానరు = చూడఁజాలరు, కొందఱు, అకించ

న...షిక్తులు=కేవలమైన విష్ణుపాదధూళిచే నిండిన,అగు,సంప్రాప్తకర్ములు=విడువఁబడినకర్మలు గలవారు, అటఁ = తర్వాత, కందురు = విష్ణుని బొందెదరు.

తా. రాక్షసరాజా! కొందఱుమానవులు ఒకగ్రుడ్డివాఁడు గ్రుడ్డివానిఁ దోడుగొని కోరినదానిని దెచ్చుకొనలేనట్లు కర్మములఁజేయుచు, ఆకర్మముల చేతనే బద్ధులయి విష్ణువును గాంచఁజాలరు. కొందఱు విష్ణుపాదధూళిచేఁ బరిపూతచిత్తులయి కర్మలను త్యజించి, యామీఁద విష్ణుసాలోక్యమును బొందెదరు.

మ. శోధింపఁబడె సర్వశాస్త్రములు రక్షోనాథ వే యేటికిఁ
గాథల్ మాధవ శేముషీతరణిసాంగత్యంబుసం గాక దు
ర్మేధఁ దాఁటఁగ వచ్చునే సుతవధూమీనోగ్రవాంఛామద
క్రోధోల్లోలవిశాలసంసృతి మహాఘోరాంబుధిఁ దాంభోనిధిఁ.

టీ. రక్షోనాథ=రాక్షసరాజా, వేయి, గాథల్=కథలు, ఏటికిఁ సర్వశాస్త్రములు, శోధింపంబడెఁ=పరిశీలించినాను, సుత.. నిధిఁ = బిడ్డలు పెండ్లము అను జలజంతువులు తీవ్రమైన కోరికలు గర్వము కోపము అనుతరంగములు గలపెద్దఘోరమైన యీ కడలేనిసంసారసముద్రమును, మాధవ...బునఁ = విష్ణుచింతయనునోడచిక్కనఁగాని, దుర్మేధఁ = దుష్టబుద్ధితో, దాఁటఁగఁ వచ్చునే = తరింపనలవియగునా ? కాదు.

తా. తండ్రీ, లోకములోఁ గలయన్నిశాస్త్రములు చదివినాను. ఏవి కొఱఁతవు. పీఁకి పనివేయుబిడ్డలు పెండ్లము అనుజలచరములు గలిగి, కోరిక గర్వము కోపము నను పెద్దపెద్ద యలలు నిండియున్నయీమహాఘోరమై హద్దు లేనిసంసారసముద్రమును, విష్ణుభక్తియనునోడ యుండిననే దాఁటన గును గాని ఈలాటిదుర్మేధలవలన నలవియగునా ? కాదు.

వ. అని పలికిన కొడుకును ధిక్కరించి మక్కువ సేయక రక్కసులఱేఁడు తనతొడలపై నుండనీక గొబ్బున దిగద్రొబ్బి ని

బ్బరం బగుకోపంబు దీపింప వేఁడిచూపుల మింట మంట లెగయ మంత్రులం జూచి యి ట్లనియె.

టీ. మక్కువ = ప్రేముడి, గొబ్బున = వేగముగా, దిగద్రొబ్బి = పడఁద్రోసి, నిబ్బరంబు = మిక్కుటము, దీపంపఁ = జ్వలింపఁగా, మింట = ఆకసమున.

శా. క్రోడంబై పినతండ్రిఁ జంపెనని తాఁ గ్రోధించి చిత్తంబులో వీడం జేయఁడు బంటుభంగి హరికి విద్వేషికిన్ భక్తుఁడై యోడం డక్కట ప్రాణవాయువులు వీఁ డొప్పించుచున్నాఁడు నా, తోడన్ వైరమునట్టి యిట్టి జనకద్రోహిన్ మహిం గంటిరే.

టీ. క్రోడంబై = పందియై, క్రోధించి = పగపట్టి, విద్వేషికిన్ = శత్రువునకు, ఓడండు = సిగ్గుపడఁడు, అక్కట=అయ్యో, వీఁడు, ప్రాణవాయువులు, వైరము = పగ, మహిన్ = భూమిలో, ఇట్టి జనకద్రోహిన్ = ఈలాగున తండ్రితోఁ బగబెట్టుకొనువానిని, కంటిరే = చూచితిరా.

తా. మంత్రులారా! విష్ణువు మాయపందియై తనచిన్నయ్యను జంపినాఁడనియైనను వానిని వీడక నాకు నిత్యశత్రువగు విష్ణువునకు భక్తుఁడై వానిబంటువలె వానితలఁపు వీఁడఁడు. వీనికి సిగ్గులేదు. ఇట్లు వినాశమునకు సిద్ధమైనాఁడు. నాతోఁ బగఁబూనినాఁడు. ఇట్టిమహాత్ముని దండ్రికి ద్రోహముఁ జేయు వానిని భూమిమీఁద మీ రెచ్చటనైనఁ జూచినారా?

వ. అని రాక్షసవీరుల నీక్షించి యి ట్లనియె. 183

శా. పంచాబ్దంబులవాఁడు తండ్రి నగునాపక్షంబు నిందించి యత్కించిద్భీతియు లేక విష్ణు సహితుం గీర్తించుచున్నాఁడు వ ద్దంచుం జెప్పిన మానఁ డంగమునఁ బుత్రాకారతన్ వ్యాధిజన్మించెన్ వీని వధించి రండు దనుజుల్ మీమీపటుత్వంబులన్..

టీ. దనుజుల్ = రాక్షసులారా, పంచాబ్దంబులవాఁడు = ఐదేండ్ల యీడుగలవాఁడు, నాపక్షంబు = నామతము, యతిక్రమించివిద్వేషి = ఏకాంతమైన ఘయాముసు, అహితున్ = శత్రువగు, అంగమునన్ = శరీరమందు, పుత్రాకారతన్ = కొడుకను రూపముతో, వ్యాధి = రోగము, జన్మించెన్ = పుట్టెను. వీనిన్, మీమీపటుత్వంబులన్ = మీబలముకొలఁది, వధించి = చంపి, రండు.

తా. రాక్షసులారా! వీఁడు చూడ నయిదేండ్లకూన. తండ్రినగునన్ను ధిక్కరించి, నాశత్రువగువిష్ణుని నామెసుర నదరు బెదరు లేక పొగడుచున్నాఁడు. కలదని నూరకుండఁడు ఇఁకఁ జింతించి లాభములేదు నాశరీరమందు కొడుకను పేరుతో వీఁడొకరోగముగాఁ బుట్టినాఁడు. వీనిని మీపరాక్రమము కొలఁది కొనిపోయి హతముగావించి రండు. పొండు.

శా. అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్ష సేయుక్రియ నీయజ్ఞుం గులద్రోహి దు
స్సంగుం గేశవపక్షపాతి నధముం జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదం గులము నిర్దోషంబు గావించెదన్.

టీ. చికిత్సకుఁడు = శస్త్రవైద్యుఁడు, అంగవ్రాతములోన్ = అవయవములగుంపులో, దుష్టాంగంబు = చెడిన యవయవమును, ఖండించి = కోసివైచి, శేషాంగశ్రేణికిన్ = మిగిలిన యన్నియవయవములకును, రక్ష = కాపుదల. సేయుక్రియన్, కులద్రోహిన్ = వంశమునకు హానిగావించువానిని, దుస్సంగున్ = చెడ్డచెలిమిగలవానిని, కేశవపక్షపాతిన్ = విష్ణుపక్షమును బొందినవానిని, అధమున్ = నీచుని అజ్ఞున్ = అజ్ఞానశూన్యుని వీర...ఖ్యాతిన్ = శూరకర్మముగలవాఁడను పెద్ద కీర్తితో, చరించెదన్ = తిరిగెదను, కులము = వంశము, నిర్దోషంబు = కళంకములేనిదానినిగా, కావించెదన్ = చేసెదను.

తా. మంత్రులారా! వైద్యుఁడు శరీరములోఁ జెడిపోయినదానిని గోసి వైచి, మిగిలిన యవయవములకు క్షేమము గలుగఁ జేసినట్లు, కులనాశకుఁడు, దుస్సంగము గలవాఁడు, శైశవపక్షపాతము గలవాఁడు, నీచుఁడు నైన యీమూర్ఖుని జంపించి, మహావీరుఁడనుకీర్తితోఁ దిరిగెదను. నావంశము పవిత్రము జేసికొందును.

క. హంతవ్యుఁడు రక్షింపను
మంతవ్యుఁడు గాఁడు యముని మందిరమునకుం
గంతవ్యుఁడు వధమున కుప
రంతవ్యుఁ డనక చంపి రం డీపడుచున్. 18[illegible]

టీ. హంతవ్యుఁడు = చంపఁదగినవాఁడు, మంతవ్యుఁడు = యోచింపఁదగినవాఁడు, కాఁడు, గంతవ్యుఁడు = పొందఁదగినవాఁడు, వధమునకున్ = హింసకు, ఉపరంతవ్యుఁడు = మానఁదగినవాఁడు, అనక, ఈపడుచున్ = ఈపిల్లవానిని, చంపిరండు,

తా. వీఁడు చంపఁదగినవాఁడే. ఇఁక నాలోచనలేదు. యముని యింటికంపఁదగినవాఁడే. విడువఁదగఁడు. శీఘ్రమే. చంపిరండు.

వ. అని దానవేంద్రుం డానతిచ్చిన వాఁడికోఱలు గలరక్కసులు పెక్కండ్రు శూలహస్తులై వక్త్రంబులు దెఱచికొని యుబ్బి బొబ్బలిడుచు ధూమసహితదావదహనంబుచందంబోలెఁ దామ్రసంకాశంబు లయిన కేశంబులు మెఱయ భేదనవాదనచ్ఛేదనంబులు సేయుచు.

టీ. దానవేంద్రుండు = హిరణ్యకశిపుఁడు, ఆనతి = ఆజ్ఞ, వాఁడికోఱలు = పదునుగలదంతములు, పెక్కండ్రు = అనేకులు, శూలహస్తులు = శూలమును ధరించినవారు, వక్త్రంబులు = నోరులు, ఉబ్బి = పొంగి, బొబ్బలు = కేకలు. ధూమ.. బోలెన్ = పొగతోఁడి కారుచిచ్చు.

వలె, తామ్రసంకాశంబులు=రాగివలె నెఱ్ఱనైనవి, కేశంబులు = వెండ్రుకలు, మెఱయఁగ = ప్రకాశింపఁగా, భేద...నంబులు=పగులగొట్టుటలు, వాహ్యప్రమోఁతలు, నఱుకులు, చేయుచున్.

ఉ. బాలుఁడు రాచబిడ్డఁడు కృపాళుఁడు సాధుఁడు లోకమాన్యసం
శీలుఁడు వీఁ డవధ్యుఁ డని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై
శూలములం దదంగముల సుస్థిరులై ప్రహరించి రుగ్రవా
చాలత నందఱుం దివిజశత్రుఁడు వల్దనఁ డయ్యె భూవరా.

టీ. భూవరా=ధర్మరాజా, బాలుఁడు=చిన్నవాఁడు, రాచబిడ్డఁడు = రాజుకొడుకు, కృపాళుఁడు = దయగలవాఁడు. సాధుఁడు = సజ్జనుఁడు, లోకమాన్యసంశీలుఁడు = లోకులచే నెన్నఁదగిన నైజముగలవాఁడు, అవధ్యుఁడు = చంపఁదగనివాఁడు, చిక్కక=వెఱవక, స్రుక్కక = బడలక, క్రూరచిత్తులై = కఠినపు మనస్సు గలవారై, సుస్థిరులై = చక్కఁగా నిలచినవారై, తదంగములన్=వాని యవయవములను, అందఱున్, ఉగ్రవాచాలతన్ = తీవ్రమైనవాఁగుబోతుతనముతో. ప్రహరించిరి = కొట్టిరి, దివిజశత్రుఁడు = హిరణ్యకశిపుఁడు. వలదు, అనఁడు, అయ్యెన్ = వలదని చెప్పలేదు.

తా. రాజా! అంతట రాక్షసులందఱు ఒకటై శూలములు దీసికొని, వానిని పిల్లకాయయనియు, రాజుకొడుకనియు, దయగలవాఁడనియు, సాధువనియు, లోకులచే మన్నింపఁబడినవాఁడనియు, చంపఁదగఁడనియు నను మానింపక, నిర్దయులై క్రూరముగాఁ గొట్టిరి. హిరణ్యకశిపుఁ డాఘోరకృత్యమును జూచుచు వేడుకపడుచున్నాఁడేకాని వలదని చెప్పలేదు.

చ. పలువురు దానవుల్ వొడువ బాలుని దేహము లేశమాత్రము
న్నొలియదు లోపలన్ రుధిరముబ్బదు కందదు శల్యసంఘముం
దలియదు దృష్టివైభవము నష్టముగాదు ముఖేందుకాంతియుం
బొలియదు నూతనశ్రమము పుట్టదు పట్టదు దీనభావమున్.

టీ. బాలునిదేహము = ప్రహ్లాదుని శరీరము, పలువురు = అనేకు లు, దానవుల్ = రాక్షసులు, పొడువన్ = శూలములతోఁ గ్రుచ్చినను, లేశమాత్రమున్ = కొంచెమైనను, ఒలియదు = తరుగదు, లోపలన్, రుధిరము = రక్తము, శల్యసంఘమున్ = ఎముకలమోపును, నలియదు = తును గగు, దృష్టివైభవము = చూపులనీటు, నష్టము = నాశమొందినది, కాదు, ముఖేందుకాంతియున్ = మోముచందురుని వన్నెయు, పొలియదు = నశింపదు, నూతనశ్రమము = క్రొత్త యలఁత, దీనభావమున్ = దిక్కులేమిగలనైన భీరుత్వమున్ను, పట్టదు = చెందదు.

తా. ఈలాగున అనేకులు రాక్షసులొక్కటై వానిశరీరము గ్రుమ్ముచున్నను అది కొంచెమును నలుగదు. నెత్తురు గ్రమ్మదు. కందదు. ఎముకలు నుగ్గుగావు. చూపులపస చెడదు మొగమువన్నెయు మాఱదు. క్రొత్తయలఁతఁ జనింపదు. దైన్యము గలుగదు.

ఉ. తన్నునిశాచరుల్ వొడువ దైత్యకుమారుఁడుమాటిమాటికో
పన్నగశాయి యోదనుజభంజన యోజగదీశ యోమహా
పన్నశరణ్య యోనిఖిలపావన యంచు నుతించుఁగానితాఁ
గన్నులనీరు దేఁడు భయకంపసమేతుఁడుగాఁడు భూవరా.

టీ. భూవరా = ధర్మరాజా, దైత్యకుమారుఁడు = ప్రహ్లాదుఁడుఁ, తన్ను, నిశాచరుల్ = రాక్షసులు, పొడువన్ = క్రుమ్మఁగా, ఓపన్నగశాయి = ఓశేషశాయీ, దనుజభంజనా = రాక్షససంహారా, జగదీశ = లోకనాయకా, మహాపన్నశరన్య = అతిదీనులకు రక్షకుఁడా, నిఖిలపావన = అన్నిటినిఁ బవిత్రము సేయువాఁడా, నుతించున్ = స్తోత్రముచేయును గాని, భయకంపసమేతుఁడు = జడుపుఁవణఁకుతోఁ గూడినవాఁడును, కాఁడు.

తా. ధర్మరాజా! ఇట్లు రాక్షసులు తన్నెంత క్రుమ్మినను తేపకు నో శేషశయనా, ఓరాక్షసధ్వంసకా ఓలోకనాయకా, ఓదీనరక్షకా ఓస

ర్వపవిత్రుఁడా, అని దెబ్బకొకవన్నెగా హరిస్తుతి చేయును గాని కండ్లను నీళ్లు బెట్టుకొనఁడు. భయమందఁడు. వణఁకఁడు.

ఉ. పాఱఁడు లేచిదిక్కులకు బాహువు లొడ్డఁడు బంధురాజిలోఁ
దూఱఁడు ఘోరకృత్య మని దూఱఁడు తండ్రిని మిత్రవర్గముం
జీరఁడు మాతృసంఘము వసించుసువర్ణ గృహాంబులోనికిం
దాఱఁడు కావరే యనఁడు తాపమునొందఁడు కంటగింపఁడున్.

టీ. లేచి, దిక్కులకున్ = నలుకెలంకులకు, పాఱఁడు = పరుగెత్తఁడు, బాహువులు = చేతులు, ఒడ్డఁడు = అడ్డము పెట్టఁడు, బంధురాజిలోన్ = చుట్టములగుంపులోన, దూఱఁడు, ఘోరకృత్యము = పాపపుఁ బని, అని, తండ్రిని, దూఱఁడు = తిట్టఁడు, మిత్రవర్గమున్ = స్నేహితుల సమూహమును, చీరఁడు = పిలువఁడు, మాతృసంఘము = తల్లులసమూహము, వసించు...లోనికిన్ = ఉండు బంగారు మేడలోనికి, తాఱఁడు = చొరఁడు, కావరే = రక్షింపుఁడా, అనఁడు, తాపము నొందఁడు = సంతాపము చెందఁడు, కంటగింపఁడున్ = ఎవనిని విరోధింపఁడు.

తా. రాక్షసు లెంతైన హింసపెట్టినీ వీథులవెంటఁ బరుగెత్తఁడు. కొట్టరాఁగాఁ జేతు లడ్డమిడఁడు. చుట్టములచాటునకుఁ బోఁడు. ఇది పాపమని తండ్రిని నిందింపఁడు సావాసకాండ్రను బిలువఁడు. తల్లిమేడలోనికిఁ బోఁడు నన్ను రక్షింపుఁడీ యని ఎవరిని అడుగఁడు. వేదన నొందఁడు. ఎవరితోను విరోధము పెట్టుకొనఁడు.

వ. ఇట్లు సర్వాత్మకం బైయుట్టి దృష్టి గని నిర్దేశింపరానిపరబ్రహ్మంబు దాన యై యమ్మహావిష్ణునియందుఁ జిత్తంబుఁ జేర్చితన్మయుం డయి పరమానందంబును బొందియున్నప్రహ్లాదునియందు రాక్షసేంద్రుండు దనకింకరులచేతం జేయించుచున్న మారణకర్మంబులు పాపకర్మునియందుఁ బ్రయుక్తంబు లైనసత్కారంబులుం బోలె విఫలంబు లగుటం జూచి.

టీ. సర్వాత్మకంబు = సర్వరూపము, నిర్దేశింపరాని = చెప్పనలవి కాని, రాక్షసేంద్రుండు = హిరణ్యకశిపుఁడు, తనకింకరులచేతన్ = తన భటులచేత, మారణ, కర్మంబులు=చంపించుటలు, పాపకర్మునియందున్ = పాపాత్మునియందు, ప్రయుక్తంబులు = చేయఁబడినవి, సత్కారంబులు= ఉపకారములు, విఫలంబులు = వ్యర్థములు.

ఉ. శూలములన్ నిశాచరులు సుక్కక దేహమునిగ్రహింపఁగా
బాలుఁడు నేలపైఁబడఁడు పాఱఁడు చావఁడు తండ్రియైన నా
పాలికి వచ్చి చక్రధరు పక్షము మానితి నంచుఁ బాదముల్
ఫాలముసోఁక మ్రొక్కఁడనపాయత నొందుట కేమి హేతువో.

టీ. నిశాచరులు = రాక్షసులు, శూలములన్ = మూఁడుకొనల బరిసెలచేత, స్రుక్కక = వెనుదీయక, నిగ్రహింపఁగాన్ = దండింపఁగా, ప్రహరింపఁగా, బాలుఁడు = ప్రహ్లాదుఁడు, నేలపైన్ = భూమిమీఁద, పాఱఁడు = పఱుగిడఁడు, నాపాలికిన్ = నాయొడకు, చక్రధరుపక్షము = విష్ణునిపక్షమును, మానితిన్ = విడిచిపెట్టితిని, ఫాలము = నొసలు, సోఁకన్ = తగులునట్లు, మ్రొక్కఁడు = నమస్కరింపఁడు, అనపాయతన్ = ఉపద్రవము లేమిని, ఒందుటకున్ = పొందుటకు, ఏమిహేతువో=ఏమికారణమో?

తా. వీఁడు ఇంతమంది శూలములతోఁ బొడుచుచున్నను క్రిందఁబడఁడు. పఱుగెత్తఁడు. ప్రాణముల విడువఁడు. తండ్రినైననాదగ్గఱకైననువచ్చి నాయనా యిఁక విష్ణుని దలఁపను రక్షించుమని కాళ్లమీఁదఁబడఁడు. ఇంత ధైర్యముతో నేయాపద లేకుండ నుండుట కేమికారణమో తెలియదు.

వ. అని శంకించుచు. 197

సీ. ఒకమాటు దిక్కుంభియూథంబుఁ దెప్పించి
కెరలి డింభకునిఁ ద్రొక్కింపఁ బంపు

ఒకమాటు విభీషకరోరగశ్రేణులఁ
గడువడి నర్భకుఁ గఱవఁ బంపు
నొకమాటు హేతిసంఘోగ్రాగ్నిలములోన
విసరి కుమారుని వేయఁ బంపు
నొకమాటు కూలంకషోల్లోలజలధిలో
ముట్టించి శాబకు ముంపఁ బంపు
తే. విషముఁ బెట్టఁ బంపు విదళింపఁగాఁ బంపు
దొడ్డకొండచఱులఁ ద్రోయఁ బంపు
బట్టి కట్టఁ బంపు బాధింపఁగాఁ బంపు
బాలుఁ గినిసి దనుజపాలుఁ డధిప. 198

టీ. అధిప = ధర్మరాజా, దనుజపాలుఁడు = హిరణ్యకశిపుఁడు, కినిసి = కోపించి, ఒకమాటు, దిక్కుంభియూథంబున్ = దిగ్గజముల గుంపును, కెరలి = చెలరేఁగి, డింభకునిన్ = ప్రహ్లాదకుమారుని, త్రొక్కింపన్, పంపున్, విష...శ్రేణులన్ = విషముచే భయప్రదములైన త్రాఁచు పాములను, అర్భకున్ = బాలుని, కడువడిన్ = మిగుల వేగముతో, కుమారునిన్ = ప్రహ్లాదుని, హేతి...లోనన్ = మండలచే చెడినమైన నిప్పులో, కూలంకషోల్లోలజలధిలో = దరులమీఁదికి బోరలు గొప్పయలలు గల సముద్రములో, శాబకున్ = శిశువుని, ముట్టించి = కొట్టించి, ముంపన్ = ముంచుటకు, పంపును, విదళింపఁగాన్ = చీల్చివేయుటకై, దొడ్డకొండచఱులన్ = పెద్దపెద్ద కొండలసురంగములలో, బాధింపఁగాన్ = పీడించుటకై, బాలున్ = ప్రహ్లాదుని, పంపును.

తా. అంత హిరణ్యకశిపుఁడు మఱింత కోపించి, వానిని ఒక్కసారి దిగ్గజములక్రింద వేసి త్రొక్కించును. ఒకసారి పాములచేఁ గఱపించును. ఒకమాటు మంటలెగయు నిప్పులో విసరివేయించును. ఒకతేప పొంగిపారలు ముద్రములోఁ ద్రోయించును. ఒకసారి విషముబెట్టించును. ఒకసారి చీల్చి పా

బవేయు మనును. ఒకసారి కొండచఱియలో ద్రోపించును. ఒకప్పుడు బంధింపఁజేయును.

సీ. ఒకవేళ నభిచారహోమంబు సేయించు
నొకవేళ నొండల నుండఁ బంచు
నొకవేళ వానల నుపహతి నొందించు
నొకవేళ రంధ్రంబు లుక్కఁ బట్టు
నొకవేళఁ దనమాయ నొదవించి బెగడించు
నొకవేళ మంచున నొంటి నిలుపు
నొకవేళఁ బెనుగాలి కున్ముఖుఁ గావించు
నొకవేళఁ బాఁతించు నుర్వియందు

తే. నీరు నన్నంబు నిడనీక నిగ్రహించు
గశల నడిపించు నువ్వించు గండశిలల
గదల వ్రేయించు నేయించు ఘనశరములఁ
గొడుకు నొకవేళ నమరారి క్రోధి యగుచు. 199

టీ. అమరారి = హిరణ్యకశిపుఁడు, క్రోధి=అతికోపము గలవాఁడు, అభిచారహోమంబు = మారణహోమమును, రంధ్రంబులన్ = తొమ్మిది రంధ్రములను, ఉక్కఁబట్టున్=ఊఁపిరిసలుపకుండ బిగఁబట్టును, తనమాయన్ = తనప్రతారణవిద్యను, ఒదవించి = కలిగించి, బెగడించున్ = భయపెట్టును, ఉన్ముఖున్ = ఎదురైనవానినిగా, ఉర్వియందున్ = భూమిలో, పాఁతించున్ = పూడిపించును, ఇడనీకన్ = పెట్టనీయక, నిగ్రహించున్ = దండించును, కశలన్ = కొరడాలతో, చబుకులతో, అడిపించున్ = కొట్టించును, గండశిలలన్ = పెద్దపెద్దఱాళ్లచేత, ఉవ్వించున్ = విసరివేయించును, కదలన్ = దొడ్డునట్లు, ఘనశరములన్ = వాఁడిబాణములచేత.

తా. హిరణ్యకశిపుఁడు మేరమీఱినకోపము గలవాఁడై, కుమారునికి ఒకప్పుడు చచ్చుటకై మారణహోమము సేయించును. ఒకప్పుడు ఎండలో నిలుచఁబెట్టును. ఒకవేళ వానలో నిలుపును, ఒకవేళ ఊపిరి సలుపుటకు వీలు గాకుండ నవరంధ్రములు బిగించును. ఒకసమయమున తనమాయతోఁ జడిపించును. ఒకతేప మంచులో నుంచును. ఒక్కసారి పోఁడుగాలికి నెదురుగా నిలుపును. ఒకసమయమున నేలలోఁ బాఁతిపెట్టించును. నీళ్లుపోయనీయఁడు. అన్నము బెట్టనీయఁడు. చబుకులతోఁ గొట్టించును. రాళ్లురువ్వించును. ఎత్తిక్రిందఁ బడవేయించును. వాఁడిబాణములతోఁ గొట్టించును.

వ. మఱియు ననేకమారణోపాయంబులఁ బాపరహితుం డైన
పాపనిరూపు మాపలేక యేకాంతంబున దురంతచింతాపరి
శ్రాంతుం డయి రాక్షసేంద్రుండు దన మనంబున. 200

టీ. రాక్షసేంద్రుఁడు = హిరణ్యకశిపుఁడు, అనేకమారణోపాయంబులన్ = అనేకములైన చంపెడు నుపాయములచేత, పాపరహితుండు = పాపమెఱుఁగనివాఁడు, పాపనిరూపుమాపలేక = బాలుని జంపించలేక, ఏకాంతంబునన్ = రహస్యమందు, దురంత...శ్రాంతుండు = కష్టకారణమైనదుఃఖముతోఁగూడినవాఁడు, తనమనంబునన్ = తనచిత్తములో.

ఉ. ముంచితి వార్ధులన్ గదల మొత్తితి శైలతటంబులందుఁ ద్రో
బ్బించితి శస్త్రరాజిఁ బొడిపించితి మీఁద నిభేంద్రపంక్తిఁ ద్రొ
ప్పించితి ధిక్కరించితి శపించితి ఘోరదవాగ్నులందుఁ ద్రో
యించితి పెక్కుపాట్ల నలయించితిఁ జావఁ డిదేమిచిత్రమో!

టీ. వార్ధులన్ = సముద్రములలో, మొత్తితి = కొట్టినాను. శైలతటంబులందున్ = పర్వతపుఁ జఱియలలో, ద్రొబ్బించితిన్ = త్రోయించితిని, శస్త్రరాజిన్ = కత్తులచేత, ఇభేంద్రపంక్తి = ఏనుఁగులబంతి, త్రొప్పించితిన్ = పలుగ్రత్తించితిని, ధిక్కరించితిన్ = బెదిరించినాను, శపించితిన్ = తిట్టినాను, ఘోరదవాగ్నులందున్ = భయంకరమైన

కాలుచిచ్చులలో, పెక్కు-పాట్లన్ = అనేకవిధములుగా, అలయించితిన్ = కష్టపెట్టినాను.

తా. వీనిని సముద్రములలో ముంచితిని. చావమోఁదించితిని. పర్వతకందరములలో నెట్టించితిని. కత్తులతోఁ బొడిపించినాను. క్రిందఁబడఁద్రోసి పైన యేనుఁగుల నడిపించితిని. బెదరించితిని. నిప్పులలోఁ ద్రోయించితిని. ఎన్నివిధములనో హింసించినాను. ఐనను చావఁడు. ఇదేమి వింతయో తెలియదు.

చ. ఎఱుఁగఁడు జీవనౌషధము లెవ్వరు భర్తలు లేరు బాధలం
దరలఁడు నైజతేజమునఁ దథ్యము జాడ్యము లేదు మిక్కిలిన్
మెఱయుచునున్నవాఁడొకని మేషము దైన్యమునొందఁడింక
నే తెఱఁగున ద్రుంతు వేసరితి దివ్యము వీనిప్రభావమెట్టిదో.

టీ. జీవనౌషధములు = చావకుండ బ్రతుకుటకైనమందులు, భర్తలు = రక్షించువారు, బాధలన్ = కష్టములలో, నైజతేజమునన్ = తన ప్రకాశమునుండి, తరలఁడు = చావఁడు, తథ్యము = నిజము, జాడ్యము = మోహము, మెఱయుచున్ = ప్రకాశించుచు, ఉన్నవాఁడు, ఒకనిమేషము = ఒకనిముషమైనను, దైన్యమున్ = కృపణత్వమును, ఏతెఱఁగునన్ = ఏలాగున, ద్రుంతున్ = చంపెదను. వేసరితిన్ = విసిగిపోతిని, ప్రభావము = సామర్థ్యము, దివ్యము = అమానుషము.

తా. ప్రాణములు పోకుండఁజేయుమందు లెఱుఁగఁడు. ఎవ్వరును రక్షించువారు లేరు ఎన్నియిడుమలఁ బెట్టినను తనప్రకాశము విడువఁడు. ఏమోహమును జెందఁడు. అంతకంతకు మఱింత యుల్లాసముతో నున్నవాఁడు. ఒకక్షణమైనను భయమునొందఁడు. ఇఁక వీని నెట్లు జంపుదును? వీనిమహిమ అసాధారణముగా నున్నది. ఇదియేమో యెఱుఁగరాదుగదా.

వ. అదియునుం గాక తొల్లి శునశ్శేఫుం డనుమునికుమారుండు

దండ్రిచేత యాగపశుత్వంబునకు దత్తుం డయి తండ్రి తనకు నపకారి యని తలంపక బ్రదికిన చందంబున. 203

టీ. తొల్లి = మునుపు, యాగపశుత్వంబునకున్ = యజ్ఞమందు విశసింపఁదగినపశువునకుఁగా, దత్తుండు = ఇయ్యఁబడినవాఁడు, అపకారి = ద్రోహకారి.

క. ఆగ్రహమున నేఁ జేసిన
నిగ్రహములు పరులతోడ నెఱి నొకనాఁడున్
విగ్రహములనుచుఁ బలుకఁడ
నుగ్రహములు గా స్మరించు నొవ్వఁడు మదిలోన్. 204

టీ. ఆగ్రహమునన్ = కోపముతో, నిగ్రహములు = దండనములు, పరులతోడన్ = ఇతరులతో, నెఱిన్ = వరుసగా, విగ్రహములు = విరోధములు, అనుగ్రహములు = సత్కారములుగా, నొవ్వఁడు = దుఃఖపడఁడు.

తా. ఇదిగాక నేను మహాకోపముతో నెన్నివిధముల హింసించినను దానిని ఇతరులతోఁ గొండెముగాఁ జెప్పఁడు. అన్నియు తనకు హితములుగానే తలఁచును. తనలో నైనను కష్ట మని యెన్నఁడు.

కావున వీఁడు మహాప్రభావసంపన్నుండు వీని కెందును భయంబు లేదు వీనితోడి విరోధంబునం దనకు మృత్యువు సిద్ధించు నని నిర్ణయించి చిన్నఁబోయి ఖిన్నుండై ప్రసన్నుండుగాక క్రిందు సూచుచు విషణ్ణుండై చింతనంబు సేయుచున్న రాజునకు మంతనంబునఁ జండామర్కు లిట్లనిరి. 205

టీ. మహాప్రభావసంపన్నుండు = గొప్పమహిమ గలవాఁడు, మృత్యువు = చావు, చిన్నఁబోయి = సిగ్గుపడి, ఖిన్నుండు = దుఃఖించినవాఁడు, ప్రసన్నుండు = సంతోషము గలవాఁడు, విషణ్ణుండు = దుఃఖము చెందినవాఁడు, చింతనంబు = యోఁచన, మంతనంబునన్ = ఏకాంతమందు.

శా. శుభ్రఖ్యాతివి నీప్రతాపముమహాచోద్యంబు దైత్యేంద్రరో
షభ్రూయుగ్మవిజృంభణంబున దిగీశవ్రాతముం బోరులన్
విభ్రాంతంబుగఁ జేసి యేలితి గదా విశ్వంబు వీఁడెంత యీ
దభ్రోక్తుల్ గుణదోషహేతువులు చింతం బొంద నీ కేటికిన్.

టీ. దైత్యేంద్ర=రాక్షసోత్తమా, నీవు, శుభ్రఖ్యాతివి=నిర్మలమైన కీర్తిగలవాఁడవు, నీప్రతాపము=నీపరాక్రమము, మహాచోద్యంబు=మిగులఁ జిత్రము, రోష...బునన్=క్రోధముచే ముడివడిన కనుబొమల యాటోపముచేత, పోరులన్=యుద్ధములలో, దిగీశవ్రాతమున్=దిక్పాలురసమూహమును, విభ్రాంతము=కలుగుండువడినది, విశ్వంబు=ప్రపంచము, వీఁడెంత = ఈప్రహ్లాదుఁడనఁగా నీ కేపాటివాఁడు, ఈదభ్రోక్తులన్ = ఈయల్పపుఁ గూఁతలు, గుణదోషహేతువులు=మంచిచెడ్డతనములె మూలముగాఁ గలవి.

తా. రాక్షసేంద్రా! నీవు నిర్మలమైన వింతగొలుపు కీర్తిగలవాఁడవు. నీవు యుద్ధములో నెక్కుమాఱు కనుబొమలు జిట్లించుకొన్నచో దిక్పాలురెల్లరు ఓడిపోవుదురు. ఇట్లీప్రపంచమునంతయు నిరంకుశముగా నేలిన నీబోఁటి వీరునకు నీపిల్లకాయయనఁగా నెంత? ఈమాత్రమునకే యేలయిట్లు విచారపడెదవు. ఇంతకు వానికి జ్ఞానములేనికారణమున నట్లు పల్కుచున్నాఁడు. మంచిగుణములున్న మంచిమాటలు చెడ్డగుణములున్న చెడ్డమాటలు నని యెఱుఁగవా. మంచిబుద్ధి కలిగినవాఁడే బాగుపడును. లేకున్నఁ జెడితోవును. నీకేల వృథాయాసము.

శా. వక్రుం డైనజనుండు వృద్ధగురుసేవంజేసి మేధానయో
పక్రాంతిన్ విలసిల్లు మీఁదఁట వయఃపాకంబుతో బాలకున్
శక్రద్వేషణబద్ధుఁ జేయుము మదిం జాలింపుమీ రోషమున్
శుక్రాచార్యులువచ్చునంతకితఁడున్ సుశ్రీయుతుండయ్యెడున్.

టీ. వక్రుండు=దుర్నీతిగలవాఁడు, వృద్ధగురుసేవం జేసి=పెద్దలను గురువులను సేవించుటవలన, మేధానయోపక్రాంతిన్=బుద్ధి నీతి గలుగుటచే,

విలసిల్లుచున్ = ప్రకాశించుచు, మీఁదట = తర్వాత, వయఃపాకంబుతోన్ = వయస్సుయొక్క పాకమునుబట్టి, బాలున్ = ప్రహ్లాదుని, శక్రద్వేషణబద్ధున్ = ఇంద్రునియందలిపగతోఁగూడినవానినిగా, మదిన్ = చిత్తమున, శుక్రాచార్యులు, వచ్చునంతకున్ = వచ్చులోపల, ఇతఁడున్ = ప్రహ్లాదుఁడు, సుశ్రీయుతుండు = మంచిజ్ఞానసంపదగలవాఁడు.

తా. రాక్షసరాజా, ఎట్టివాఁడైనను పుట్టుకలోఁ గొంచెము వక్రబుద్ధిగానున్నను పెద్దలు గురువులు వీరలసేవచే జ్ఞానవంతుఁడగును. మనప్రహ్లాదునికి క్రమముగా వయసు వచ్చినకొలఁది సమయముచూచి, యింద్రునిమీఁద విరోధము గలుగునట్లుబోధింతము. ఇప్పుడు వానిమీఁద వృథా కోపము మానుము. మఱియు శుక్రాచార్యులు వచ్చులోపల వాఁడు మిగులఁ దెలివి కలవాఁడగును. పైపై చ్చాయనయుఁ జక్కఁగా శిక్షించి జ్ఞానవంతునిగాఁ జేయును.

వ. అని గురుపుత్రులు పలికిన రాక్షసేశ్వరుండు గృహస్థులైన రాజులకు నుపదేశింపఁదగినధర్మార్థకామంబులు ప్రహ్లాదునకు నుపదేశింపుఁడని యనుజ్ఞ సేసిన వారు నతనికిఁ ద్రివర్గంబు నుపదేశించిన నతండు రాగద్వేషంబులచేత విషయాసక్తులైన వారలకు గ్రాహ్యంబులైనధర్మార్థకామంబులు దనకు నగ్రాహ్యంబు లనియును వ్యవహారప్రసిద్ధికొఱకైన భేదంబు గాని యాత్మభేదంబు లేదనియును ననర్థంబులయం దర్థకల్పన సేయుట దిగ్భ్రమంబనియును నిశ్చయించి గురూపదిష్టశాస్త్రంబులు మంచి వని తలంపక గురువులు దమగృహస్థకర్మానుష్ఠానంబులకుం బోయినసమయంబున. 208

టీ. ఉపదేశింపఁదగిన = నేర్పఁదగిన, అనుజ్ఞ = ఉత్తర్వు, త్రివర్గంబు = ధర్మార్థకామములను, రాగద్వేషంబులచేతన్ = అనురాగముచేత, విరోధముచేత, విషయాసక్తులు = ఇంద్రియములకు లోనైనవారు, గ్రాహ్యంబులు = అభ్యసింపఁదగినవి, అగ్రాహ్యములు = నేర్చుకోఁదగనివి, వ్యవహారప్రసిద్ధి = వ్య

వహారమాత్రము, ఆత్మభేదంబు, అనర్థములు=ఆశాశ్వతవస్తువులు, అర్థకల్పన=వస్తుభ్రాంతి, దిగ్భ్రమంబు = దిక్కు తెలియకపోవుట, గురూపదిష్టశాస్త్రంబులు=గురువులు నేర్పినశాస్త్రములు,గృహస్థకర్మానుష్ఠానంబులకున్=గృహస్థులు చేయఁదగిన సంధ్యావందనాదికర్మలు చేయుటకయి, పోయిన సంయంబునన్.

క. ఆటలకుఁ దన్ను రమ్మని
పాటించి నిశాటసుతులు భాషించిన దో
షాటకులేంద్రకుమారుఁడు
పాటవమున వారిఁ జీరి ప్రజ్ఞాన్వితుఁడై. 209

టీ. దోషా...రుఁడు=ప్రహ్లాదుఁడు, నిశాటసుతులు=తోడిరాక్షసబాలురు,పాటించి=పట్టుపట్టి, భాషించినన్=పిలువఁగా, ప్రజ్ఞాన్వితుఁడై=తెలివికలవాఁడై, పాటవమునన్=నేరుపుతో, వారిన్, చీరి=పిలిచి.

తా. తనతోఁగూడ చదువుకొను రాక్షసులపిల్లకాయలు తనను ఆడుకొందము రమ్మని పిలువఁగా జాగరూకుఁడై వారలను జేరఁదీసికొన్నవాఁడై.

క. చెప్పఁడొకచదువు మంచిది
చెప్పెడిఁ దగులములు చెవులు సిందఱగొనఁగా
జెప్పెడు మనయెడ నొజ్జలు
సెప్పెద నొకచదువు వినుఁడు చిత్తము లలరన్. 210

టీ ఒజ్జలు=మనగురువుగారు, మనయెడన్ =మనకు, ఎప్పుడున్, ఒకచదువు=ఒక్కచదువున్ను, మంచిది, చెప్పఁడు, చెవులు=సిందఱగొనఁగాన్=గింగురుమనునట్లు, తగులములు = కర్మబంధములు, చెప్పెడున్=చెప్పును, నేను,ఒకచదువు, చిత్తములు=మీమనస్సులు, అలరన్=సంతసించులాగున, చెప్పెదన్, వినుఁడు.

తా. ఓస్నేహితులారా! మనయయ్యవారు మనకెప్పుడును ఒక్కటియు మంచిచదువు చెప్పఁడుగదా! ఎప్పుడు చూచినను చెవులు చిల్లులువోవఁ

గర్మబంధములను గూర్చి చెప్పును. ఈలాగున రండు. నేనొకమంచిచదువు చెప్పెదను. దాన మీకందఱకు పరమానందము కలుగును.

వ. అని రాజకుమారుండు గావునఁ గరుణించి సంగడికాండ్ర తోడ నగిమొడిచందంబునఁ గ్రీడలాడుచు సమానవయస్కులైన దైత్యకుమారుల కెల్ల నేకాంతంబున నిట్లనియె. 211

టీ. కరుణించి=దయచూచి, సంగడికాండ్రతోడన్ = స్నేహితులతో, సమానవయస్కులు=ఒకయీడువారు, దైత్యకుమారులకున్=రాక్షసకుమారులకందఱకును, ఏకాంతంబునన్=రహస్యముగా.

ఉ. బాలకులార రండు మనప్రాయపుబాలురు కొందఱుర్విపైఁ
గూలుట గంటిరే గురుఁడు క్రూరుఁ డనర్థచయంబునందు దు
శ్శీలత నర్థకల్పనముఁ జేసెడి గ్రాహ్యము గాదు శాస్త్ర మే
మేలెఱిఁగించెదన్ వినిన మీకు నిరంతరభద్ర మయ్యెడిన్.

టి. బాలకులార=ఓపిల్లకాయలారా, ఉర్విపైన్=భూమిమీఁద, కొందఱు, మనప్రాయపుబాలురు=మనయీడుజోడుకుఱ్ఱవాండ్రు, కూలుట=చచ్చుట, కంటిరే=చూచినారుగదా, క్రూరుఁడు=దయలేనివాఁడు, దుశ్శీలతన్=దుర్బుద్ధితో, అనర్థచయంబునందున్=స్థిరములు కానిదారాపుత్రపశుధనకనకవస్తువాహనరాజ్యాదులందు, అర్థకల్పనము=స్థిరములనుబుద్ధిని, చేసెడిన్=చేయును, గ్రాహ్యము=నేర్చుకోఁదగినది. మేలు = క్షేమమైన దానిని, నిరంతరభద్రము=శాశ్వతమైనక్షేమము. అయ్యెడున్.

తా. ఓబాలురారా! యిటురండు. మనతోడిపిల్లకాయలు కొందఱు మనకనులయెదుటఁ జచ్చుటం జూచుచున్నారము గదా. మనగురువు దయలేనివాఁడై మన కనర్థములైన శాస్త్రములను బోధించి, యనిత్యములు కానివానియందు నిత్యము లనుభ్రాంతిని గలిగించుచున్నాఁడు. మన మాచదువులు చదివినచో నన్యాయముగాఁ జెడిపోవుదుము. మీకు నేను శాశ్వతసుఖము నిచ్చు నొకవిద్యను జెప్పెదను. నేర్చుకొనుఁడు.

వ. వినుండు సకలజన్మంబులందును ధర్మార్థాచరణకారణం బయి నమానుషజన్మంబు దుర్లభం బందుఁ బురుషత్వంబు దుర్గమం బదియు శతవర్ష పరిమితం బైన జీవితకాలంబున నియతం బై యుండు నందు సగ మంధకారబంధురం బయి రాత్రిరూపంబున నిద్రాదివ్యవహారంబుల నిరర్థకం బయి చను చిక్కిన పంచాశద్వత్సరంబులందును బాల్యకౌమారకైశోరయౌవన వయోవిశేషంబుల వింశతిహాయనంబులు గడచు కడమ ముప్పదియబ్దంబులు నింద్రియంబులచేతఁ బట్టువడి దురవగాహంబు లయినకామక్రోధలోభమోహమదమత్సరంబు లను పాశంబులం గట్టువడి విడవ సమర్థుండుగాక ప్రాణంబులకంటె మధురాయమాణ మైనతృష్ణకులోనై భృత్యతస్కరవణిక్కర్మంబులఁ బ్రాణహాని యైన నంగీకరించి పరార్థంబుల నర్థించుచు సహాస్యసంభోగ చాతుర్యసౌందర్యవిశేషంబుల ధైర్యవల్లికాలవిత్రంబు లయిన కళత్రంబులను మహనీయమంజులమధురాలాపంబులు గలిగి వశు లయినశిశువులను శీలవయోరూపధన్య లగుకన్యలను వినయవివేక విద్యాలంకారులయిన కుమారులను గామితఫలప్రదాత లగుభ్రాతలను మమత్వప్రేమదైన్యజనకు లయినజననీజనకులను సకలసౌజన్యసింధువు లయినబంధువులను ధనకనకవస్తువాహనసుందరంబు లయినమందిరంబులను సుకరంబు లైనపశుభృత్యనికరంబులను వంశపరంపరాయత్తంబు లయినవిత్తంబులను వర్జింపలేక సంసారంబు నిర్జించునుపాయంబుఁ గానక తంతువర్గంబున నిర్గమద్వారశూన్యం బయినమందిరంబుఁ జేరి చిక్కువడి వెడలెడిపాటవంబుసాలక తగులువడుకీటకంబుచందంబున

గృహస్థుండు స్వయంకృతకర్మబద్ధుండై శిశ్నోదరాదిసుఖంబు
లఁ బ్రమత్తుండయి నిజకుటుంబపోషణపారవశ్యంబున విరక్తి
మార్గంబుఁ దెలియ నేరక స్వకీయపరకీయభిన్నభావంబున నం
ధకారంబునం బ్రవేశించుం గావునఁ గౌమారసమయంబునన
సీమాగరిష్ఠుండై పరమభాగవత ధర్మంబు ననుష్ఠింప వలయు
దుఃఖంబులు వాంఛితంబులు గాక చేకుఱుభంగి సుఖంబులు
ను గాలానుసారంబులై లబ్ధంబు లగుం గావున వృథాప్రయా
సంబున నాయుర్వ్యయంబు సేయం జనదు హరిభజనంబున
మోక్షంబు సిద్ధించు విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వ
రుండు ప్రియుండు ముముక్షు వైన దేహికి దేహావసానపర్యం
తంబు నారాయణచరణారవిందసేవనంబు కర్తవ్యంబు. 213

టీ. సకలజన్మంబులందును=అన్నిపుట్టుకలయందును, ధర్మార్థాచరణకారణంబు=ధర్మార్థములఁ జేయుటకు హేతువైనది. దుర్లభంబు=పొందరానిది పురుషత్వంబు=మగవాఁడౌట, దుర్గమంబు=పొందనలవికానిది, శతవర్షపరిమితంబు=నూఱేండ్లపరిమాణముకలది. నియతంబు=నిర్ణయింపఁబడినది. అంధకారబంధురంబు=చీఁకటిచే నిండినది. నిరర్థకంబు=పనికిమాలినది. పంచాశద్వత్సరంబులందును=ఏఁబదియేఁడులయందును, బాల్య=చిన్నతనము, కౌమార=కౌమారము, కైశోర=కిశోరవయస్సు, యౌవన=నడిమివయస్సు, వయోవిశేషంబులన్=వయస్సుయొక్క భేదములచేత, వింశతిహాయనంబులు=ఇరువదియేండ్లు, అబ్దంబులు=ఏండ్లు, దురవగాహంబులు=తెలిసి గట్టునఁబడనీయని, పాశములన్=త్రాళ్లచేత, మధురాయమాణ=తీయనిదానివలెనుండునది, తృష్ణ=ఆశ, భృత్య=భటులు, తస్కర=దొంగలు, వణిక్=వర్తకులు, ప్రాణహాని=చావు, పదార్థంబులన్=ఒరులసొమ్ములను, అర్థించుచు=కోరుచు, చాతుర్య=నేరుపు, సౌందర్యము, విశేష=అతిశయము, ధైర్యవల్లికాలవిత్రంబుబు=ధైర్యమనుతీఁగలకుఁ గొడవండ్లు, కళత్రములను=

భార్యలను, మహనీయ...లాపంబులు=గొప్పలై సొగసైన తీయనైనమాటలు, వశులు=స్వాధీనులు, శిశువులు=బిడ్డలు, శీల...ధన్యలు=నైజము, వయస్సు రూపము, వీనిచేఁ గృతార్థలు, వినయ...కారులు=అడఁకువ తెలివి చదువు ఇవియలంకారముగాఁగలవారు, కామితఫలప్రదాతలు=కోరినకోర్కెలిచ్చు వారు, భ్రాతలు=సోదరులు, మమత్వ=మమకారము, ప్రేమ=ప్రీతి, దైన్య=కరుణ, జననీజనకులు = తల్లిదండ్రులు, సకలసౌజన్యసింధువులు=ఎల్ల సాధుత్వమునకు నెలవైనవారు, మందిరంబులు=ఇండ్లు, సుకరంబులు=సుఖము గానార్జింపఁదగినవి, పశుభృత్యనికరంబులును=పశువులు సేవకులు వీరలసమూహములును, వంశపరంపరాయత్తంబులు=వంశక్రమముగావశమైన, విత్తంబులు=ధనములను, వర్జింపలేక=విడువఁజాలక, నిర్జించు=జయించునుపాయము, తంతుగర్గంబునన్=దారములచిక్కులో, నిర్గమద్వారశూన్యంబు = వెడలివచ్చుటకు వాకిలిలేనిది, వెడలెడిపాటవంబు=వెలువడుబలము, తగులువడు కీటకంబుచందంబునన్=చిక్కుకొనినపురుగువలె, గృహస్థుండు=ఇంటనుండి కాఁపురముచేయువాఁడు, స్వయంకృతకర్మబద్ధుండు=తాఁజేసినకర్మలకుఁ జిక్కినవాఁడై, శిశ్నోదరాది సుఖంబులన్=మైథునము భోజనము మొదలగు గ్రామ్యసుఖములచేత, ప్రమత్తుండు=ఒడలెఱుఁగనివాఁడు, నిజ...మార్గంబునన్=తనకుటుంబమును రక్షించుకొను దారిని, స్వకీయ...బునన్ = తనది ఇతరునిది అనుభేదబుద్ధితో, అంధకారంబునన్=చీఁకటిలో, కౌమారసమయంబునన్=కుమారత్వదశలో, మనీషాగరిష్ఠుండై=బుద్ధిబలముగలవాఁడై, పరమభాగవతధర్మంబుల్=మేలైనభక్తులధర్మమును, అనుష్ఠింపవలయున్ = చేయవలెను. వాంఛితంబులు=కోరఁబడినవి, చేకుఱుభంగిన్=దొరకునట్లు, సుఖంబులున్=సుఖములును, కాలానుసారంబులు = కాలమునకుఁ దగినవి, లబ్ధంబులు=పొందఁబడినవి, వృథాప్రయాసంబునన్=వ్యర్థమైశ్రమతో, అయుర్వ్యయంబు=ఆయువుయొక్కపోకను, హరిభజనంబునన్=విష్ణునిసేవవలన, సర్వభూతంబులకున్=ఎల్లభూతములకు, ఆత్మేశ్వరుండు=ఆత్మాధిష్ఠాత, ప్రియుండు=ఇష్టుఁడు, ముముక్షువు = మోక్షేచ్ఛగలవాఁడు, దేహావసానప

ర్యంతంబు=దేహముతీఱునంతవఱకు, నారాయణచరణారవిందసేవనంబు=విష్ణుపాదకమలముల కైంకర్యము, కర్తవ్యంబు=చేయఁదగినది.

సీ. కంటిరే మనవారి ఘనులు గృహస్థులై
        విఫలులై కైకొన్న వెట్టితనము
    భద్రార్థులై యుండి పాయరు సంసార
        పద్ధతి నూరక పట్టువడిరి
    కలయోనులం దెల్ల గర్భాద్యవస్థలఁ
        బురుషుండు దేహియై పుట్టుచుండుఁ
    దన్నె ఱుంగఁడు కర్మతంత్రుఁడై కడపట
        ముట్టఁడు భవశతములకు నయిన
ఆ. దీన శుభములేదు దివ్యకీర్తియు లేదు
    జగతిఁ బుట్టి పుట్టి చచ్చి చచ్చి
    పొరల నేల మనకుఁ బుట్టని చావని
    త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి. 214

టీ. కంటిరే = చూచితిరా, ఘనులు = దొడ్డవారు, గృహస్థులు = కాఁపులు, విఫలులు=పనికిమాలినవారు, కైకొన్న వెట్టితనము=పూనినమూఢత్వము, భద్రార్థులై = క్షేమముగోరినవారై, సంసారపద్ధతిన్ = సంసారమార్గమున, పట్టువడిరి, చిక్కుకొనిరి, కలయోనులందు = లోకమున నున్నయన్ని యోనులయందును, గర్భాద్యవస్థలన్=గర్భవాసము మొదలైన పాట్లచే, దేహి = శరీరి, కర్మతంత్రుఁడై = కర్మములకు వశమైనవాఁడై, భవశతములకునైనన్ = వందలసంవత్సరములకైనను, శుభము = క్షేమము, దివ్యకీర్తి = చావుపుట్టుకలులేని యశస్సు, పొరల నేల=ఏలపొర్లవలెను, దొడ్డబుద్ధి = శ్రేయమైన బుద్ధి.

తా. బాలకులారా! చూచినారుగదా! మనవారందఱు బలదర్పసంపన్నులు గొప్పవారును నయ్యును వెట్టివారలై జన్మమును వ్యర్థము చేసికొను

చున్నవారలు. తమకు మేలే కావలెనని కోరియు దానికిఁ దగినట్లు సంసారబంధవిముక్తి జేసికొనక, దీనిలో నింకను జిక్కుకొనుచున్నారు. ఈజీవుఁడు లోకములో నెన్నిరకములజంతువులు గలవో అన్నిటి యోనులయందును బుట్టి చచ్చుచుండును. కర్మవశుఁడై తన్నుదాఁ దెలిసికోలేకున్నాఁడు. ఇఁక వేయి జన్మములెత్తియు నీసంసారమునుండి గట్టునఁబడు నుపాయ మెఱుఁగఁడు. కాన దీనివలన మనకు శ్రేయస్సు లేదు. మంచికీర్తియు అదియును లేదు. వ్యర్థముగాఁ బుట్టుచుఁ జచ్చుచు నేల బాధచెందవలెను. మనము పుట్టుక చావును లేని యొకమార్గము వెదకికొనవలయును.

శా. హాలాపానవిజృంభమాణమదగర్వాతీత దేహోల్లస
ద్వాలాలోకనశృంఖలానిచయసంబద్ధాత్ముఁడై లేశమున్
వేలానిస్సరణంబు గానక మహావిద్వాంసుఁడుం గామినీ
హేలాకృష్టకురంగశాబక మగున్ హీనస్థితిన్ వింటిరే. 215

టీ. మహావిద్వాంసుఁడున్ = గొప్పపండితుఁడైనను, హాలా...త్ముఁడై = కల్లుద్రాగుటచే మేరమీఱిన గర్వముచేఁ బ్రకాశించు జవ్వని చూపులనుగొలుసులచేఁ గట్టువడినవాఁడై, లేశమున్ = కొంచమును, వేలానిస్సరణంబు = గట్టునకుఁ జేరుటను, కామినీ...శాబకము = స్త్రీయొక్క విలాసములచే లాగఁబడిన లేడిపిల్ల, హీనస్థితిన్ = అధోగతిని, వింటిరే = విన్నారా.

తా. బాలురారా! ఎంతగొప్పపండితుఁడైనను కల్లుద్రాగి ఒడలెఱుంగక పెచ్చుపెరుగునందము గర్వము వీనిచే వెలయు స్త్రీలవాలుఁజూపులనుగొలుసులచేఁ గట్టఁబడి కొంచెమైన దరిజేరుమార్గ మెఱుఁగక, ఆఁడువార లాడుకొను లేడిపిల్లమాదిరి నుండును. ఇది యెంతదుర్గతియో యోచించుకొనుఁడు.

ఆ. విషయసక్తులైన విబుధాహితులతోడి
మనికి వలదు ముక్తిమార్గవాంఛ

నాదిదేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్త
సంగజనులఁ గూడి శైశవమున. 216

టీ. విషయాసక్తులు = ఇంద్రియార్థములయందుఁ దవిలినవారు, విబుధాహితులతోడిమనికి=రాక్షసులతోడిపొత్తు, ముక్తిమార్గవాంఛన్ = మోక్షమార్గమందలి కోరికతో శైశవమునన్ = బాల్యమందు, ముక్తసంగజనులన్ = వదలఁబడినసంగముగలమహాత్ములను. ఆదిదేవున్ = దేవతలకు మొదటిదేవుఁడైన. విష్ణున్ = ఆశ్రయింపుఁడు.

తా. బాలకులారా! వ్యర్థముగాఁ జెడవలదు. నామాట విని యీచిన్నతనమునందే రాక్షసులతోఁగూడి చెడక సంగవర్జితులైనమహాత్ములను సేవించి వారిద్వారమున విష్ణుసాయుజ్యమును బొందుఁడు.

వ. కావున విషయంబులఁ జిక్కువడినరక్కసులకు హరిభజనంబు శక్యంబుగాదు రమ్యమయ్యును బహుతరప్రయాసగమ్యమని తలంచితిరేనిఁ జెప్పెద సర్వభూతాత్మకుం డై సర్వదిక్కాలసిద్ధుం డై బ్రహ్మ కడపలగాఁ గలచరాచరస్థూలసూక్ష్మజీవసంఘంబులందును నభో వాయుకుంభినీసలిలతేజంబు లనియెడు మహాభూతంబులయందును భూతవికారంబు లయినఘటపటాదులయందును గుణసామ్యం బయినప్రధానమందును గుణవ్యతికరం బైనమహత్తత్త్వాదియందును రజస్సత్త్వతమోగుణంబులయందును భగవంతుఁ డవ్యయుం డీశ్వరుండు పరమాత్మ పరబ్రహ్మ మనియెడువాచకశబ్దంబులు గల్గి కేవలానుభవానందస్వరూపకుండు నవికల్పితుండు ననిర్దేశ్యుండు నయినపరమేశ్వరుండు త్రిగుణాత్మకం బైనతనదివ్యమాయచేత నంతర్హితైశ్వర్యుం డై వ్యాప్యవ్యాపకరూపంబులం జేసి దృశ్యుండును ద్రష్టయు భోగ్యుం

డును భోక్తయునయి నిర్దేశింపం దగి వికల్పితుం డై యుం డుఁ దత్కారణంబున నాసురభావంబు విడిచి సర్వభూతంబులందును దయాసుహృద్భావంబులు కర్తవ్యంబులు దయాసుహృద్భావంబులుగల్గిన నధోక్షజుండు సంతసించు ననంతుం డాద్యుండు హరి సంతసించిన నలభ్యం బెయ్యదియు లేదు జనార్దనచరణసరసీరుహ యుగళస్మరణసుధారసపానపరవశుల మైతిమేని మనకు దైవవశంబున నకాంక్షితంబులై సిద్ధించు ధర్మార్థకామంబులుఁ గాంక్షితంబై సిద్ధించుమోక్షం బన నేల త్రివర్గంబును నాత్మవిద్యయుం దర్కదండ నీతి జీవికాదు లన్నియును దైగుణ్య విషయంబు లై నవేదంబులవలనం బ్రతిపాద్యంబులు ని స్త్రైగుణ్యలక్షణంబునం బరమపురుషుం డైనహరికి నాత్మసమర్పణంబు సేయుటయ మేలు పరమాత్మతత్త్వజ్ఞానోదయంబునం జేసి స్వపరభ్రాంతి సేయక పురుషుండు యోగావధూతత్త్వంబున నాత్మవికల్పభేదంబునం గలలోఁ గన్నవిశేషంబులభంగిం దథ్యంబనక మిథ్య యని తలంచు నని మఱియుఁ బ్రహ్లాదుం డిట్లనియె. 217

టీ. విషయంబులం = ఇంద్రియములలో, శక్యము = అలవియైనది, రమ్యము = సొంపైనది, బహు.. గమ్యము = చాలకష్టపడినఁ గాని దొరకనిది, సర్వభూతాత్మకుండు = సర్వభూతస్వరూపము గలవాఁడు, సర్వదిక్కాల సిద్ధుండు = ఎల్లదేశములయందు కాలములయందు నుండువాఁడు, చరా... సంఘంబులందును = స్థిరములు చరములు చిన్నవి పెద్దవియగు ప్రాణికోటుల యందు, నభః = అకాశము, వాయు = గాలి, కుంభినీ = పృథివి, సలిల = ఉదకము, తేజః = మంట, మహాభూతములు = పెద్దభూమి మొదలగు భూత

ములు, భూతవికారములు=భూతములవలనఁ బుట్టినవి, ఘటపటాదులు=కుండ గుడ్డ మొదలయినవి, గుణసామ్యంబు=గుణములకు తుల్యముగా నుండునది, ప్రధానము = ప్రకృతి, గుణవ్యతికరంబు=గుణముల యెచ్చుతగ్గులు గలది, మహత్తత్త్వాదియందును = మహత్తత్త్వమందును, రజస్సత్త్వతమోగుణంబులయందును, భగవంతుండు = షడ్గుణైశ్వర్యములు కలవాఁడు, అవ్యయుండు = నాశములేనివాఁడు, ఈశ్వరుండు = సర్వశక్తుఁడు, కేవలా...రూపకుండు. కేవలమై యనుభవగోచరమైనయానందరూపము గలవాఁడు, అవికల్పితుఁడు=మాఱుపడనివాఁడు, అనిర్దేశ్యుండు=చెప్పఁగలవికానివాఁడు, త్రిగుణాత్మకంబు = సత్త్వరజస్తమోగుణస్వరూపము, అంతర్హితైశ్వర్యుండై= మఱుఁగువడిన వైభవము గలవాఁడై, వ్యాప్యవ్యాపక రూపంబులం జేసి, దృశ్యుండు = చూడఁదగినవాఁడు, ద్రష్ట = చూచువాఁడు, భోగ్యుండు = అనుభవింపఁదగినవాఁడు, భోక్త = అనుభవించువాఁడు, నిర్దేశింపన్ = నిర్ణయించుటకు, వికల్పితుండు = రూపకల్పన జేయఁబడినవాఁడు, ఆసుర భావంబు = రాక్షసత్వమును, సర్వభూతంబులందును = ఎల్లజంతువులయందును, దయ = కరుణ, సుహృద్భావము = చెలిమి, కర్తవ్యంబులు = చేయఁదగినవి, అధోక్షజుండు, (ఇంద్రియజన్యజ్ఞానమును క్రిందుపఱచువాఁడు) ఇంద్రియాగోచరుఁడగు విష్ణువు, అనంతుండు = తుదలేనివాఁడు, ఆద్యుండు=మొదటివాఁడు, అలభ్యుండు=పొందరానివాఁడు, జనా...వశులము = శ్రీహరి పాదకమలముల జంటయొక్క స్మరణయను నన్నుపద్రవమును బ్రాగిమై మఱచిన వారమేని, ఆకాంక్షితంబులు= కోరఁబడినవి, సిద్ధించున్= దొరకును, ఆత్మవిద్య = బ్రహ్మవిద్య, తర్క = న్యాయశాస్త్రము, దండనీతి = కామందకాది శిక్షాస్మృతి, జీవికాదులు = బ్రతుకుదెరువులైనవార్తాదులు. త్రైగుణ్యవిషయంబులు = త్రిగుణస్వరూపములను జెప్పునట్టి, ప్రతిపాద్యంబులు = చెప్పఁదగినవి, నిస్త్రైగుణ్యలక్షణంబునన్ = త్రిగుణాతీతుఁడను గుర్తుచేత, ఆత్మసమర్పణంబు = బ్రహ్మార్పణము, పరమాత్మతత్త్వజ్ఞానోదయంబు = ఆత్మతత్త్వముయొక్క పుట్టుకను, స్వపర

భ్రాంతి = నేను అన్యుఁడు అను పొరపాటు, ఆత్మవికల్ప భేదంబునన్ = అత్మ యందలియుపాధిభేదముచేత, కన్నవిశేషములు = చూచిన సంగతులు, తథ్యంబు = నిజము, మిథ్య = బూటకము, తలంచున్ = తలపోయును.

మ. నరుఁడుం దానును మైత్రితో మెలఁగుచున్ నారాయణుం
డింతయున్, వరుసన్ నారదసంయమీశ్వరునకున్ వ్యాఖ్యా
నముం జేసె మున్, హరిభక్తాంఘ్రిపరాగశుద్ధతను లేకాం
తుల్ మహాకించనుల్, పరతత్త్వజ్ఞులు గాని నేరరు మదిన్
భావింప నీజ్ఞానమున్. 218

టీ. నరుఁడు = ఒకఋషి, మైత్రి = చెలిమి, మెలఁగుచున్ = సంచరించుచు, నారాయణుండు = అనుఋషి, ఇంతయున్ = దీనినంత యును, వరుసన్ = క్రమముగా, మున్ = పూర్వము, నారదసంయమీ శ్వరునకున్ = నారదమహామునికి, వ్యాఖ్యానమున్ చేసెన్ = విప్పిచెప్పెను, ఈజ్ఞానమున్ = ఈబ్రహ్మజ్ఞానమును, హరి...తనులు = విష్ణుభక్తుల కాళ్ల దుమ్ములచేఁ బావనములైన శరీరముగల, ఏకాంతుల్ = అంతరంగభక్తులు, మహా కించనుల్ = సర్వసంగవర్జితులు, పరతత్త్వజ్ఞులు = ఉత్తమతత్త్వమును దెలి సినవారు, మదిన్ = చిత్తములో, భావింపన్ = మననముచేయుటకు, నేరరు = సమర్థులుకారు.

తా. బాలకులారా! ఇప్పుడు నేఁ జెప్పిన యీపరతత్త్వమును నర నారాయణులు నారదమహామునికుపదేశమిచ్చినారు. దీనిని ఎంతయో అను భవముగల వైష్ణవసేవాపరులగు తత్త్వవేత్తలుగాని సామాన్యులు తెలిసికోఁ జాలరు.

వ. తొల్లి నేను దివ్యదృష్టి గలనారదమహామునివలన సవిశేషం
బయినయీజ్ఞానంబును బరమభాగవతధర్మంబులు వింటి నని
న వెఱఁగుపడి దైత్యబాలకు లద్దనుజరాజకుమారున కిట్లనిరి.

టీ. తొల్లి = మునుపు, దివ్యదృష్టి = అతీంద్రియవిషయములను దెలిసికొనుజ్ఞానము. సవిశేషంబు = ఎల్లరహస్యములతోఁగూడిన, పరమభాగవతధర్మంబుల్ = మేలైనభాగవతమును. వెలుఁగుపడి = విన్నఁబోయి.

ఉ. మంటిమి కూడి భార్గవకుమారకులొద్ద ననేకశాస్త్రముల్
వింటిమి లేఁడు సద్గురుఁడు వేఱొకఁ డెన్నఁడు రాజశాల ము
క్కంటికి నైన రాదు సొరఁగా వెలికిం జనరాదు నీకు ని
ష్కంటకవృత్తి నెవ్వఁడుప్రగల్భుఁడు సెప్పెగుణాఢ్య చెప్పుమా. 221

టీ. గుణాఢ్య = మంచిగుణములచే నిండియున్నవాఁడా ప్రహ్లాదా, కూడి = కలసి, మంటిమి = పెరిగితిమి, కూడి, భార్గవకుమారకులొద్దన్ = శుక్రునికొడుకులకడ, అనేకశాస్త్రముల్ = చాలచదువులు, సద్గురుఁడు = మంచియుపాధ్యాయుఁడు, రాజశాల = మనరాజునిల్లు, ముక్కంటికిన్ = మూఁడవకన్నుగల యీశ్వరునకును, సొరన్ = చొచ్చుటకు, వెలికిన్ = వెలుపలికి, చనన్ = పోవుటకు, రాదు = వీలుకాదు, నిష్కంటకవృత్తిన్ = టొంకులేని నడవడితో, ప్రగల్భుఁడు = నేర్పరి, చెప్పుమా.

తా. ప్రహ్లాదా! మనమందఱము నొక్కచోఁ బుట్టి పెరిగితిమి. అందఱము శుక్రునికొడుకులవలననే చదివినంతవఱకుఁ గూడి చదివితిమి. మనపట్టణములోనికా చండశాసనుఁ డగునీతండ్రికిఁ దెలియకుండఁ గొత్తమానిసి వచ్చువీలు లేదు. నీవా వెలుపలి కెన్నఁడు మమ్ము విడచిపోయిన వాఁడవు కావు. నీ కేపుణ్యాత్ముఁ డయ్యా యీజ్ఞానోపదేశము చేసినవాఁడు ఆయన యెంతటి యుపాయశాలియో కదా!

క. సేవింతుము నిన్నెప్పుడు
భావింతుము రాజ వనుచు బహుమానములం
గావింతుము తెలియము నీ
కీవింతమతిప్రకాశ మేక్రియఁ గలిగెన్.

టీ. సేవింతుము = సేవించుచునే యుంటిమి, భావింతుము = ధ్యానింతుము, తెలియము = ఎఱుఁగము, వింత మహాప్రకాశము = ఆశ్చర్యమైన జ్ఞానోదయము, ఏక్రియన్ = ఎట్లు. కలిగెన్.

తా. ప్రహ్లాదా! మేము నిన్నెప్పుడు పరివేష్టించియే యున్నాము. నీవు మాకు రాజ వని బహువిధముల గౌరవించుచునే యున్నాము. కాని నీ వింతటి మహనీయుఁడ వై యింతజ్ఞానము నార్జించియున్న సంగతి మేమెఱుఁగము. నీ కీజ్ఞాన మెట్లు లభించెను?

వ. అని యిట్లు దైత్యనందనులు తన్నడిగినఁ బరమభాగవతకులాలంకారుం డైన ప్రహ్లాదుండు నగి తనకుఁ బూర్వంబునందు వినంబడిననారదుమాటలు దలంచి యిట్లనియె. 222

టీ. దైత్యనందనులు = రాక్షసుల పిల్లకాయలు, పరమ...రుండు= యోగ్యులగుహరిదాసులగుంపునకు నెన్నవెట్టువాఁడగు, నగి=నవ్వి.

శా. అక్షీణోగ్రతపంబు మందరమునై నర్థించి మాతండ్రి శుద్ధక్షాంతిం జని యుండఁ జీమగమిచేతన్ భోగిచందంబునన్
భక్షింపంబడెఁబూర్వపాపములచేఁ బాపాత్మకుండంచు మున్
రక్షస్సంఘముమీఁద నిర్జరులు సంరంభించి యుద్ధార్థులై.

టీ. మాతండ్రి = మాయయ్య, అక్షీణోగ్రతపంబు = కొఱఁతలేని భయంకర తపస్సును, అర్థించి = కోరి, శుద్ధక్షాంతిన్ = పరమశాంతితో మందరము పైన్ = కవ్వపుఁ గొండమీఁద, చని యుండన్=వెళ్లియుండఁగా, చీమగమిచేతన్ = చీమలబారులచేత, భోగిచందంబునన్ = పాము వలె, పూర్వపాపములచేన్ = పూర్వజన్మమందు సంపాదించుకొన్న పాపములచేత, పాపాత్మకుఁడు = పాపస్వరూపి, భక్షింపంబడెన్ = తినఁబడెను, (నశించెను) అంచున్, నిర్జరులు = వేల్పులు, రక్షస్సంఘముమీఁదన్= రాక్షసుల సమూహముమీఁద, సంరంభించి = ఆటోపము జేసి, యుద్ధార్థులై = యుద్ధముఁ జేయువారై.

తా. బాలకులారా! పూర్వము మా నాయన గొప్పతపముఁ జేయఁ గోరి మందరపర్వతము మీఁదికి బోయి, చాలకాలము రాక అచ్చటనే యుండఁగా, దేవతలందఱు ఇఁక హిరణ్యకశిపుఁడు చీమలబారిని బడినపాము వలె తనపాపములచేఁ దానే దగ్ధుఁడైనాఁడు. ఇఁక రాక్షసుల రూపుమాపుద మని మహోత్సాహముతో నందఱుఁ గలసి యుద్ధము జేయఁదలఁచి (పైపద్యముతో నన్వయము.)

శా. ప్రస్థానోచితభేరిభాంకృతులతోఁ బాకారియుం దారు శౌ
ర్యస్థైర్యంబుల నేఁగుదెంచినఁ దదీయాటోపవిభ్రాంతులై
స్వస్థేమల్ దిగ నాడి పుత్ర ధన యోషా మిత్రసంపత్కళా
ప్రస్థానంబులు డించి పాఱి రసురల్ ప్రాణావనోద్యుక్తులై.

టీ. ప్రస్థానో...లతోన్ = యుద్ధనిర్యాణమునకుఁ దగిన భేరుల భంభం అను మ్రోఁతలతో, పాకారియున్ = ఇంద్రుఁడును, తారున్ = దేవతలు శౌర్యస్థైర్యంబులన్ = విక్రమముతోడను ధైర్యముతోడను, ఏఁగుదెంచినన్ = రాఁగా అసురల్, తదీయాటోపవిభ్రాంతులై = వారి సంరంభమునకు వెఱచినవారై, స్వస్థేమల్ = తమ ధైర్యములను, దిగనాడి=వీడి, పుత్ర...బులు = బిడ్డలు ధనము భార్యలు నెచ్చెలులు ఐశ్వర్యములు తేజములు తావులును, డించి = దిగవిడిచి, ప్రాణావనోద్యుక్తులై =ప్రాణములఁ గాపాడుకొనఁగోరినవారై, పాఱిరి = పలాయనమైరి.

తా. యుద్ధయాత్రకుఁ దగినసన్నాహముతో భేరులు మ్రోయించుకొనుచు నింద్రుఁడును దామును తగుపాటి యుత్సాహస్థైర్యములతో దండువెడలి రాఁగా నది రాక్షసులు గని వారి యాడంబరమునకు వెఱచి, ధైర్యమువదలి తమయాలుబిడ్డలు ధనసంపదలు నైజతేజము గృహములు విడిచి, ప్రాణములు దక్కించుకొనఁ జూచి యెచ్చటివాఁ డచ్చటనుండియే పాఱిపోయిరి.

మత్తకోకిల. ప్రల్లదంబున వేల్పు లుద్ధతిఁ బాటి రాజనివాసముం
గొల్లవెట్టి సమస్తవిత్తముఁ గ్రూరతం గొని పోవఁగా
నిల్లుసొచ్చి విశంకుఁడై యమరేశ్వరుం డదలించి మా
తల్లి దాఁ జెఱవట్టె సిగ్గునఁ దప్తయై విలపింపఁగాన్. 225

టీ. వేల్పులు = దేవతలు, ప్రల్లదంబునన్ = కఱుకుఁ దనముతో, ఉద్ధతిన్ = గర్వముతో, పాటి = దుమికి, రాజనివాసమున్ = రాజునగరమును, కొల్లవెట్టి = చూఱగొని, క్రూరతన్ = కాఠిన్యముతో, సమస్తవిత్తమున్ = కలధనమంతయు, కొనిపోవఁగాన్ = తీసికొనిపోవుచుండఁగా, అమరేశ్వరుఁడు = ఇంద్రుఁడు, విశంకుఁడై = జంకులేనివాఁడై, ఇల్లు, సొచ్చి, అదలించి = భయపెట్టి, తాన్, సిగ్గునన్, తప్తయై = క్రాఁగినదై, విలపింపఁగాన్ = ఏడువఁగా, మాతల్లిన్ = మాయమ్మయగు లీలావతిని, చెఱవట్టెన్ = చెఱగొనిపోయెను.

తా. ఇట్లు దేవతలందఱు ధార్ష్ట్యముమీఱఁ బట్టణము పైకుఱికి దయమాలి పట్టణమును కొల్లగొనుచుండఁగా, నింద్రుఁడు సాహసముతో నంతఃపురము జొచ్చి సిగ్గున గ్రుగ్గికుములుచున్న మాయమ్మను జంకు విడిచి చెఱగొని పోయెను.

వ. ఇట్లు సురేంద్రుండు మాతల్లిం జెఱ గొని పోవు చుండ నమ్మొగుడ కురరి యను పులుఁగుఁ బ్రియ మొఱ లిడినఁ దెరువున దైవయోగంబున నారదుండు పొడగని యిట్లనియె. 226

టీ. కురరి = లకుముకిపిట్ట, పులుఁగు = పిట్ట, మొఱలిడినన్ = పరిదేవనము చేయుచుండఁగా, తెరువునన్ = త్రోవలో, దైవయోగంబునన్ = దైవవశముచేత, నారదుండు = నారదమహాముని, పొడగని = చూచి.

ఉ. స్వర్భువనాధినాథ సురసత్తమ వేల్పులలోన మిక్కిలిన్
నిర్భరపుణ్యమూర్తివి సునీతివి మానినిఁ బట్ట నేల యా

గర్భిణి నాతురన్ విడువు కల్మషమానసురాలు గాదు నీ
దుర్భరరోషముఁ నిలుపు దుర్జయుఁడైననిలింపవైరిపై.

టీ. స్వర్భువనాధినాథ=స్వర్గలోకమునకు ప్రభువగు నో యింద్రా, సుర సత్తమ=దేవతలలో శ్రేష్ఠుఁడా, వేల్పులలోనన్=దేవతలలోపల, మిక్కిలిన్, నిర్భరపుణ్యమూర్తిని=కొదువలేని పుణ్యము గలవాఁడవు, సునీతివి=మంచినీతి గలవాఁడవు. మానినిన్=కులశీలాదులు గాపాడుకొను నీయిల్లాలిని, పట్టన్, ఏల, ఆతురన్=శోకము జెందిన, ఈగర్భిణిన్ = గర్భవతి యగునీమెను, విడువు, కల్మ...రాలు=పాపచిత్తముగలది కాదు, దుర్జయుఁడు=నీకు గెలువశక్యము కాని, నిలింపవైరిపైన్ = హిరణ్యకశిపునిమీఁద, నీదుర్భరరోషమున్ = నీపట్టరానికోపమును, నిలుపుము.

తా. ఓయింద్రా! నీ వెల్లదేవతలలో మేటివి. గొప్పపుణ్యము గలవాఁడవు మంచిధర్మము గలవాఁడవు. మంచిమనస్సు గలయీకులాంగనను ఎందులకుఁ బట్టుకొనెదవు ? ఈమెయెడఁ బాపములేదు. ఇదిగాక గర్భవతి దీనయునై యున్నది. విడువుము. రాక్షసరాజుపై నీపట్టరానివ్యర్థపుఁగోపము వీడుము. దాని కెవఁడైన నవతారమూర్తి కావలెఁ గాని నీకు హిరణ్యకశిపుని జయింప సామర్థ్యము చాలదు. ఊరకుండుము.

వ. అనిన వేల్పుఁదపసికి వేయిగన్నులప్రోడ యిట్లనియె. 228

టీ. వేల్పుఁదపసికిన్ = దివ్యర్షి యగునారదునకు వేయికన్నుల ప్రోడ = వేయికన్నులు గల పెద్ద.

ఉ. అంతనిదాన మైనదివిజాహితువీర్యము దీనికుక్షి న
త్యంతసమృద్ధి నొందెడి మహాత్మక కావునఁ దత్ప్రసూతిప
ర్యంతము బద్ధఁ జేసి జనితార్భకు వజ్రముధారఁ ద్రుంచి ని
శ్చింతుఁడ నై తుదిన్ విడుతు సిద్ధము దానవరాజవల్లభన్.

టీ. మహాత్మక = ఓనారదమహామునీ, దీనికుక్షిన్ = ఈమె గర్భమున, అంతనిధానము = లోకములకు నాశకరమైన, దివిజాహితువీర్యము =

హిరణ్యకశిపునిరేతస్సు, అంత్యంతసమృద్ధిన్ = మిగులవృద్ధిని, ఒందెడిన్, కావునన్, తత్ప్రసూతిపర్యంతము = ఆబిడ్డను గను నంతదాఁక, బద్ధఁ జేసి = చెరఁబెట్టి, జనితార్భకున్ = పుట్టినపట్టిని, వజ్రముధారన్ = వజ్రాయుధమునంచుతో, త్రుంచి = నఱికి, నిశ్చింతుఁడన్ = దిగులుబాసినవాఁడను, ఐ, తుదిన్ = చివరను, దానవరాజవల్లభన్ = హిరణ్యకశిపునిభార్యను, విడుతున్, సిద్ధము=నిజము.

తా. నారదా! లోకములకు దుస్సహమైనరాక్షసునివీర్య మీమె కడుపులో నున్న దని నేనుపట్టినాను. ఈమె బిడ్డను గనుదాఁకఁ జెఱఁబెట్టి యాబిడ్డను వజ్రముచేఁ జంపి పిమ్మట నీమెను విడిచెదఁగాక యని నానిశ్చయము.

వ. అని పలికిన వేల్పులఱేనికిం దపసి యి ట్లనియె. 230

టీ. వేల్పులఱేనికిన్=ఇంద్రునకు, తపసి=నారదుఁడు.

శా. నిర్భీకుండు ప్రశస్తభాగవతుఁడున్ నిర్వైరి జన్మాంతరా
విర్భూతాచ్యుతపాదభక్తిమహిమావిష్టుండు దైత్యాంగనా
గర్భస్థుండగుబాలకుండుబహుసంగ్రామాద్యుపాయంబులన్
దుర్భావంబునఁ బొంది చావఁడు భవద్దోర్దర్పవిభ్రాంతుఁడై.

టీ. దైత్యా...స్థుండు = ఈలీలావతి కడుపులోనున్నవాఁడు, అగుబాలకుండు, నిర్భీకుండు = ఎవరివలనను భయములేనివాఁడు, ప్రశస్తభాగవతుఁడున్ = శ్రేష్ఠుఁడైన హరిదాసుఁడు, నిర్వైరి = శత్రుత్వములేనివాఁడు, జన్మా...విష్టుండు = పూర్వజన్మమునఁ బుట్టినహరిపాదభక్తిప్రభావముతోఁ గూడినవాఁడు, భవ...తుఁడై =నీచేతిగావునకు లోఁగి తికమకనొందినవాఁడై, బహు...బులన్ = నానావిధములైన యుద్ధము మొదలగునుపాయంబులచే, దుర్భావంబునన్ = నికృష్టత్వమును, పొంది, చావఁడు.

తా. ఇంద్రా! ఈమెకడుపులోనిబాలుఁడు అకుతోభయుఁడు, పరమభాగవతోత్తముఁడు, ఎవరియెడలను విరోధము లేనివాఁడు, బహుజన్మ

భ్యస్తమైనవిష్ణుభక్తిచే రూఢమైన చిత్తముగలవాఁడు. నీవెంత మిక్రమించి యేమిచేసినను నీకు లోఁగి చచ్చువాఁడు గాఁడు.

వ. అని దేవముని నిర్దేశించిన సతనివచనంబులు మన్నించి తానును హరిభక్తుఁడు గావున దేవేంద్రుండు భక్తిబాంధవంబున మాయవ్వను విడిచి వలగొని సురలోకంబునకుంజనియె మునీంద్రుండును మజ్జననియందుఁ బుత్రికాభావంబుసేసి యూఱడించి నిజాశ్రమంబునకుఁ గొనిపోయి నీవు పతివ్రతవు నీయుదరంబునఁ బరమభాగవతుం డయిన ప్రాణి యున్నవాఁడు తపోమహత్త్వంబునం గృతార్థుం డై నీపెనిమిటి రాఁగలం డందాఁక నీ విక్కడ నుండు మనిన సమ్మతించి. 232

టీ. దేవముని, నిర్దేశించినన్ = వాస్తవము చెప్పఁగా, భక్తిబాంధవంబునన్ = నాకును ఆయనకుం గలహరిభక్తి మూలకమైన చుట్టఱికమువలన, మాయవ్వను = మాయమ్మను, వలగొని = ప్రదక్షిణముచేసి, సురలోకంబునకున్ = స్వర్గమునకు, మజ్జననియందు = మాయమ్మయందు, పుత్రికాభావంబు = బిడ్డయనుతలఁపును, ఊరడించి = బుజ్జగించి. నిజాశ్రమంబునకున్ = తనయాశ్రమమునకు, నీయుదరంబునన్ = నీకడుపులో. పరమభాగవతుఁడు = యోగ్యుండైన హరిదాసుఁడు, అయినప్రాణి = అయిన జీవుఁడు, తపోమహత్త్వంబునన్ = తపస్సుయొక్క గొప్పతనముచే, కృతార్థుండై = నెరవేర్పఁబడినయిష్టము గలవాఁడై, ఇక్కడ = నాకగ్గఱ, సమ్మతించి.

శా. యోషారత్నము నాథదైవత విశాలోద్యోగ మాతల్లి ని
ర్దోషమ్యంబున నాథురాక మదిలో వాంఛించి నిర్దోషయై
యూషద్భీతియు లేక గర్భపరిరక్షేచ్ఛన్ విచారించి శు
శ్రూషల్ సేయుచు నుండె నారదునకున్ సువ్యక్తశీలంబునన్.

టీ. యోషారత్నము = అన్నులమిన్నయు, నాథదైవత = మగఁడే దేవుఁడు గాఁగలదియు, విశాలోద్యోగ = గొప్పయత్నముగల, మాతల్లి, నిర్వ్యాపమ్యంబునన్ = సాధుభావముతో, సాధురాకన్ = మాయయొక్క రాకను, వాంఛించి = కోరి, నిర్దోషయై = ఏలాటిపాపము నెఱుఁగనిదై, ఈషద్భీతియు = కొంచెము భయమును, లేని, గర్భపరిరక్షేచ్ఛన్ = గర్భమును గాపాడుకొను తలఁపుచేత, విచారించి = యోచించుకొని, నారదునకున్, సువ్యక్తశీలంబునన్ = నిష్కపటమై భక్తివిశదమైన చిత్తముతో, శుశ్రూషల్ = సేవలు. సేయుచున్, ఉండెన్.

తా. పతివ్రతయు కులాంగనలశిరోరత్నము వంటి దగుమాయమ్మయు భర్తరాకఁ గోరుచు భయమువీడి నిర్మలచిత్తముతో నారదునకుఁ బరిచర్యసేయుచు నాయనచేఁ బోషింపఁబడుచుండెను.

వ. ఇట్లు దనకుఁ బరిచర్య సేయుచున్నదైత్యరాజకుటుంబినికి నాశ్రితరక్షావిశారదుం డైననారదుండు నిజసామర్థ్యంబున నభయం బిచ్చి గర్భస్థుండ నైననన్ను నుద్దేశించి ధర్మతత్త్వంబును నిర్మలజ్ఞానంబును నుపదేశించిన నమ్ముద్దియ తద్దయుం బెద్దకాలంబున్నాఁటవినికి గావున నాఁటది యగుటం జేసి పరిపాటి దప్పి సూటిలేక మఱచె నారదుంతు నాయెడఁ గృపగలనిమిత్తంబున. 234.

టీ. పరిచర్య = సేవ, దైత్యరాజకుటుంబినికిన్ = హిరణ్యకశిపుని భార్యలీలావతికి, ఆశ్రితరక్షావిశారదుఁడు = తన్నాశ్రయించినవారిని రక్షించు పూనికగల, నిజసామర్థ్యంబునన్ = తనశక్తిచేత, అభయంబు = అభయదానము, ఇచ్చి, గర్భస్థుండు = ఆమెకడుపులోనున్న, నన్నున్, ఉద్దేశించి = గుఱించి, ఆమెతో, ధర్మతత్త్వంబును = న్యాయస్వరూపమును, నిర్మలజ్ఞానంబును = రాగాదికలుషముకాని జ్ఞానమును, ఉపదేశించినన్ = బోధింపఁగా, అమ్ముద్దియ = ఆమాయమ్మ, తద్దయున్ = మిగుల, పెద్దకా-

లంబునాఁటి వినికి గావునన్ = చాలకాలమునాఁడు విన్న సంగతిగనుక, ఆఁటది = స్త్రీ, అగుటంజేసి, పరిపాటి = అభ్యాసము, తప్పి, సూటి = గుఱి, జ్ఞప్తి, లేక, మఱచెన్.

తా. నారదుఁడు ఇట్లు తనకు సేవసేయుచున్న మాయమ్మను దనశక్తికొలఁది కడుపులోఁ బెట్టికొని కాపాడుటయేగాక నాయందును మిగుల దయగలవాఁడుగనుక నాకుఁ జెప్పవలె ననుతలఁపుతో నన్నుద్దేశించి మాయమ్మకు అనేకతత్త్వరహస్యములఁ జెప్పెను. మాయమ్మ స్త్రీగనుకను చాలరోజులక్రింద విన్నసంగతి యగుటచేతను దాని యభ్యాస మంతగా లేక ఇప్పు డాయుపదేశములన్నియు మఱచిపోయినది.

క. వెల్లిగొని నాఁటనుండియు
నుల్లసితం బైనదైవయోగంబున శో
భిల్లెడు మునిమత మంతయు
నుల్లంబున మఱపు వుట్ట దొకనాఁడైనన్. 235

టీ. నాఁటన్ ఉండియు = నారదుఁడు ఉపదేశించినది మొదలుగా, ఉల్లసితము = ప్రకాశింపఁ జేయఁబడినది, ఐనదైవయోగంబునన్ = ఐనయదృష్టసంయోగముచే, మునిమతము అంతయున్ = నారదుని కిష్టమైన తత్త్వార్థమంతయు, వెల్లిగొని = అంతటనిండి, శోభిల్లెడున్ = ప్రకాశించుచున్నది. ఒకనాఁడైనన్, ఉల్లంబునన్ = చిత్తములో, మఱపు, పుట్టదు.

తా. బాలులారా! నాకుమాత్రము నారదుఁ డుపదేశించినది మొదలుగా నాయుపదేశములు చక్కఁగా మనస్సున నాటి దినదినప్రవర్ధమాన మగుచున్నదే కాని ఒక్కనాఁడును మఱపునకు రాదు.

ఆ. వినుఁడు నాదుపలుకు విశ్వసించితి రేని
సతుల కయిన బాలజనుల కయినఁ
దెలియ వచ్చు మేలు దేహాద్యహంకార
దళననిపుణ మైన తపసిమతము. 236

టీ. నాదుపలుకు విస్వసించితిరేనిన్ = నమ్మితిరేని, వినుఁడు, దేహా...నిపుణము = దేహాదులయందలి మమత్వమును బోఁగొట్టునట్టిది, ఐన, తపసిమతము = నారదుని మతము. మేలు = మంచిది, సతులకైనన్ = స్త్రీలకైనను. బాలజనులకైనన్=బాలురకైనను, తెలియవచ్చున్ = తెలియనగును.

తా. స్నేహితులారా! నామాటలయందు మీకు నమ్మకమున్నచో వినుఁడు చెప్పెదను దేహాదులయందలి మమకారముఁ బోఁదోలి తత్త్వజ్ఞానమును విష్ణుభక్తిని గలిగించు నారదునిమతము వారు వీరనక స్త్రీలకు బాలురకుఁగూడ విశదముగాఁ దెలియును.

వ. అని నారదోక్తప్రకారంబున బాలకులకుఁ బ్రహ్లాదుం డిట్లనియె నీశ్వరమూర్తి యైనకాలంబునంజేసి వృక్షంబు గలుగుచుండ ఫలంబునకు జన్మసంతానవర్ధనాపక్షీణాస్వ పరిపాకనాశంబులు ప్రాప్తంబు లయిన తెఱంగున దేహంబునకుం గాని షడ్భావవికారంబు లాత్మకు లే వాత్మ నిత్యుండు క్షయరహితుండు శుద్ధుఁడు క్షేత్రజ్ఞుండు గగనాదులకు నాశ్రయుండు క్రియాశూన్యుండు స్వప్రకాశుండు సృష్టిహేతువు వ్యాపకుండు నిస్సంగుండుఁ బరిపూర్ణుండు నొక్కండు నని వివేకసమర్థంబు లగునాత్మలక్షణంబులు బండ్రెండు నెఱుంగుచు దేహాదులందు మోహజనకంబు లగునహంకారమమకారంబులు విడిచి పసిండిగనులు గలనెలవున విభ్రాజమానకనకలేశంబు లైనపాషాణాదులందుఁ బుటంబు వెట్టి వహ్నియోగంబునఁ గరంగ నూఁది హేమకారకుండు పాటవంబున హాటకంబు వడయుభంగి నాత్మకృత కార్యకారణంబుల నెఱింగి డినేర్పరి దేహంబునం దాత్మసిద్ధికొఱకు నయినయుపాయ ప్రకృతియు మహదహంకారంబులును బంచతన్మాత్రంబులు

నివి యెనిమిదియుం బ్రకృతు లనియును రజస్సత్త్వతమంబు లుమూఁడును బ్రకృతిగుణంబులనియును గర్మేంద్రి యంబు లయినవాక్పాణి పాదపాయూపస్థంబులును జ్ఞానేంద్రియం బులైన శ్రవణనయనరసనాత్వగ్ఘ్రాణంబులును మనంబును మ హీసలిల తేజోవాయుగగనంబులును నివి పదాఱును వికా రంబు లనియును గపిలాదిపూర్వాచార్యులచేతఁ జెప్పంబ డియె సాక్షిత్వంబున నీయిరువదేఁడింటిని నాత్మ గూడియుం డుఁ బెక్కండ్రకూటువ దేహ మదియు జంగమస్థావరరూపం బుల రెండువిధంబులయ్యె మూలప్రకృతి మొదలయినవర్గం బునకు వేఱై మణిగణంబులం జొచ్చియున్న సూత్రంబుచం దంబున నాత్మ యిన్నింటియందును జొచ్చి దీపించు నాత్మకు జన్మస్థితిలయంబులు గల వంచు మిథ్యాతత్త్వంబులుగాక వివే కశుద్ధ మైన మనంబునంజేసి విచారించి దేహంబునం దాత్మ వెదక వలయు నాత్మకు నవస్థలు గల యట్లుండుఁ గాని య వస్థలు లేవు జాగరణస్వప్న సుషుప్తు లనువృత్తు లెవ్వనిచేత నెఱుంగంబడు నతం డాత్మ యంద్రు కుసుమధర్మంబులయిన గంధంబులచేత గంధాశ్రయుం డయినవాయువు నెఱిఁగెడు భంగిం ద్రిగుణాత్మకంబులయి కర్మజన్యంబు లయిన బుద్ధిభే దంబుల నాత్మ నెఱుంగం దగు నని చెప్పి. 237

టీ. నారదోక్త ప్రకారంబునన్ = నారదుఁడు చెప్పినచొప్పున, ఈశ్వరమూర్తి = ఈశ్వరాత్మకము, ఐనకాలంబునం జేసి = ఐనకాలము వలన, వృక్షము = చెట్టు, కలుగుచుండన్, ఫలంబునకున్ = దానిపండు నకు, జన్మ...బులు=పుట్టుట, కాయయగుట, పెరుగుట, ముదురుట, పం డుట, నశించుటలు, ప్రాప్తంబులు ఐనతెఱంగునన్ = కలిగినట్లు, ష

డ్భావవికారంబులు = జన్మ, సంస్థాన, వర్ధన, అపక్షయ, పరిపాక, నాశ
ము లను నాఱుమార్పులు, దేహంబునకుఁ గాని = దేహమునకే గాని,
ఆత్మకు = పరమాత్మకు, లేవు, ఆత్మ, నిత్యుండు = ఎల్లప్పుడు నుండు
వాఁడు, క్షయరహితుండు = నాశములేనివాఁడు, శుద్ధుఁడు = నిర్మలుఁ
డు, క్షేత్రజ్ఞుండు = మాయ నెఱింగినవాఁడు, గగనాదులకుఁ = ఆకాశా
దిభూతపంచకమునకు, ఆశ్రయుండు = నెలవైనవాఁడు, క్రియాశూన్యుం
డు = ఏపనులును లేనివాఁడు, స్వప్రకాశుండు = తనకుఁ దాఁ బ్రకాశించు
వాఁడు, సృష్టిహేతువు = ఉత్పత్తికిఁ గారణమైనవాఁడు, వ్యాపకుండు =
అంతట వ్యాపించువాఁడు, నిస్సంగుండు = దేనితోడను సంబంధములేనివాఁ
డు, పరిపూర్ణుండు = అంతట నిండియున్నవాఁడు, ఒక్కండు = కేవలుఁడు,
అని, వివేకసమర్థంబులు = జ్ఞానమునీయఁగలవైన, ఆత్మలక్షణంబులు =
పరమాత్మకుఁ గలయీ నిత్యత్వాదిలక్షణములను, పండ్రెండుఁ, ఎఱుంగు
చుఁ, దేహాదులయందుఁ = దేహగేహపుత్రమిత్రకళత్రాదులయం
దు, మోహజనకంబులు = తగులమును గలిగించునవి, అగు నహంకారమమ
కారంబులు = నేను నాది యనుభావములను, విడచి, పసిండిగనులు =
బంగారుగనులు, కల నెలవున = ఉండుచోట, విభ్రాం...బులు = మెఱ
యుచున్న బంగరు తునుకలు గలవి, ఐనపాషాణాదులందుఁ = ఐనఱాళ్లు
ఇసుక మొదలగువానియందు, పుటంబు పెట్టి = పుటము వేసి, కరంగఁ =
ద్రవమగునట్లుగా, ఊఁది, హేమకారకుండు = అగసాలెవాఁడు, పాటవం
బునఁ = నేరుపుతో, హాటకంబుఁ = బంగారమును, పడయుభం
గిఁ = పొందులాగున, ఆత్మ...బులఁ = పరమాత్మచేఁ గలిగిన కార్య
కారణములను, ఎఱింగెడివేర్పరి = తెలియఁగలయుపాయశాలి, దేహంబు
నందున, ఆత్మసిద్ధికొఱకుఁ = పరమాత్మ తాదాత్మ్యముకొఱకుఁ ఐనయుపా
యంబునం జేసి, బ్రహ్మభావంబుఁ = బ్రహ్మత్వమును, పడయుఁ =
పొందును, మూలప్రకృతియుఁ = మాయయును, మహదహంకారములు
ను = బుద్ధ్యహంకారములును, పంచతన్మాత్రంబులుఁ = శబ్దస్పర్శరూ

పరసగంధము లైదును, కర్మేంద్రియంబులు = పనులు చేయు నవయవములు, ఐనవాక్పాణిపాద పాయూపస్థంబులును = మాట, (నోరు) చేతులు, కాళ్లు గుదము, భగముమ, జ్ఞానేంద్రియంబులు = తెలిసికొను సాధనములైన యవయవములు, శ్రవణ ... లును = చెవులు, కన్నులు, నాలుక, తోలు ముక్కును, మనంబును, మహీ...బులును = నేల, నీళ్లు, నిప్పు, గాలి, బయలును, ఇవిపదారును, వికారంబులు, అనియును, కపిలా...చేతన్ = కపిలుండుమొదలగు వెనుకటి గురువులచేత, చెప్పంబడియెన్, ఆత్మ, సాక్షిత్వంబునన్ = తటస్థలక్షణముచేత, ఈయిరువదేడింటినిన్, కూడియుండున్, పెక్కింటికూటువ = ఇట్టివి అనేకములు గలసినది, దేహము = శరీరము, అదియున్, జంగమస్థావరరూపంబులన్ = కదలునది, కదలనిది, యను నాకారములచేత, రెండువిధంబులు, అయ్యెన్, ఆత్మ, మూలప్రకృతి = అవిద్య, (మాయ) మొదలయిన, సర్గంబునకున్ = సమూహమునకు, వేఱై = విలక్షణమై, మణిగణంబులన్ = రత్నములయందు, చొచ్చియున్న సూత్రంబు చందంబునన్ = దూరినదారమువలె, ఇన్నింటియందును, చొచ్చి = చేరి, దీపించున్ = వెలుంగును, ఆత్మకున్, జన్మ...బులు, పుట్టుట, వెలయుట, చచ్చుటలు, కలవు, అంచున్ = అనితలంచుచు, మిథ్యాతత్పరులు = అసత్యమును నమ్మినవారు, కాక, వివేకశుద్ధము = జ్ఞానముచే నిర్మలమైన, మనంబునం జేసి = చిత్తమువలన, విచారించి, ఆత్మను, వెదకవలయును, ఆత్మకున్, అవస్థలు = మేలుకొనుట, నిద్రించుట కలగాంచుటన్, యనుమార్పులు, గలయట్లు = ఉండునట్లు, ఉండుగాని, అవస్థలు, లేవు, జాగరణ స్వప్నసుషుప్తులు = మేలుకొనుట కలగాంచుట నిద్రించుటలు, అనువృత్తులు=వ్యాపారములు, ఎవ్వనిచేతన్, ఎఱుంగబడున్, తెలియఁబడునో, కుసుమధర్మంబులు=పూవులకు సహజగుణములు, అయినగంధంబులచేతన్ = అయినవాసలవలన, గంధాశ్రయుండు = పరిమళము వహించువాఁడు, అయినవాయువున్ = అయినగాలిని, ఎఱింగెడు భంగిన్ = తెలిసికొనునట్లు, త్రిగుణాత్మకంబులు = సత్త్వరజస్తమోగుణ

రూపములు, అయి, కర్మజన్యంబులు = కర్మవలనఁ బుట్టునవి, అయినబుద్ధి భేదంబులన్ = చిత్తవృత్తులచేత, ఆత్మను, ఎఱుఁగన్, తగును, అని = ఇట్లని, చెప్పి.

సీ. సంసార మిది బుద్ధిసాధ్యము గుణకర్మ
గణబద్ధ మజ్ఞాన కారణంబు
గలవంటి దింతియు కాని నిక్కముగాదు
సర్వార్థములు మన స్సంభవములు
స్వప్నజాగరములు సమములు గుణశూన్యుఁ
డగుపరమునికి గుణాశ్రయమున
భవవినాశంబులు వాటిల్లినట్లుండుఁ
బట్టిచూచిన లేవు బాలురార
తే. కడఁగి త్రిగుణాత్మకము లైనకర్మములకు
జనక మై వచ్చు నజ్ఞానసముదయమును
ఘనతరజ్ఞానవహ్నిచేఁ గాల్చి పుచ్చి
కర్మవిరహితులై హరిఁ గనుట మేలు. 238

టీ. ఓబాలురారా, ఇది = ఈ, సంసారము, బుద్ధిసాధ్యము = బుద్ధిచే సాధింపఁదగినది, గుణ...బద్ధము = సత్త్వరజస్తమోగుణమూలము లైన (నానావిధ) కర్మలచేఁ గల్పింపఁబడినది, అజ్ఞానకారణంబు = తెలివి లేమికి హేతువైనది, కలవంటిది, ఇంతియకాని, నిక్కము = నిజము, కాదు, సర్వార్థములు = ఎల్లవిషయములు, మనస్సంభవములు = మనస్సులోఁ బుట్టినవి, స్వప్నజాగరములు = స్వప్నము మేలుకువయు, సమములు, గుణశూన్యుఁడు = గుణములచే రహితుఁడైన, పరమునికిన్ = పరమాత్మకు, గుణాశ్రయంబునన్ = సత్త్వాదిగుణముల సంగముచేత, భవవినాశంబులు = జన్మమరణములు, వాటిల్లినట్లు = కలిగినట్లు, ఉండున్, పట్టిచూచినన్=విచారించిచూడఁగా, లేవు, కడఁగి = ప్రయత్నపడి, త్రిగుణాత్మ

కములు = సత్త్వరజస్తమోగుణరూపములు, ఐనకర్మములను, జనకము = జన్మకారణము, ఐ, వచ్చు, అజ్ఞానసముదయమును = అజ్ఞానముయొక్క సమూహమును, ఘనతరజ్ఞానవహ్నిచేన్ = గొప్పజ్ఞానమనునిప్పుచేత, కాల్చిపుచ్చి, కర్మవిరహితులు = కర్మబంధములు లేనివారు, ఐ, హరిన్ = విష్ణువును, కనుట = చూచుట, మేలు.

తా. బాలురారా, ఈసంసారము తెలివితోఁ బరిశీలింపఁదగినది. గుణకర్మల ననుసరించి యున్నది. అవివేకమునకు మూలమైనది. కలవంటిది. ఇంతేగాని నిజముకాదు. ఎల్లవిషయములును మనమనస్సులోనే పుట్టినవి. స్వప్నము మేలుకొనుటయు నొక్కటే. గుణవర్జితుఁడైనయాత్మకు గుణములకూటమింజేసి జన్మలయములు గలిగిన ట్లుండునుగాని చక్కఁగా విచారించితిమా లేవు. ఇట్లు త్రిగుణరూపమైనకర్మబంధములను గలిగించు నీ యజ్ఞానపుఁ బాదను గొప్పదైన జ్ఞానాగ్నిచేఁ గాల్చివేసి ఎల్లకర్మలను బాపికొని విష్ణుని జేరినయెడల మే లగును.

వ. అది గావున గురుశుశ్రూషయు సర్వలాభసమర్పణంబును సాధుజనసంగమంబును నీశ్వరప్రతిమాసమారాధనంబును హరికథాతత్పరత్వంబును వాసుదేవునియందలి ప్రేమయు నారాయణగుణకర్మకథానామకీర్తనంబును వైకుంఠచరణకమలధ్యానంబును విశ్వంభరమూర్తివిలోకనపూజనంబులును మొదలయిన విజ్ఞానవైరాగ్యలాభసాధనంబులైనభాగవతధర్మంబులపై రతి గలిగి సర్వభూతంబులయందు నీశ్వరుండు భగవంతుం డాత్మ గలం డని సమ్మానంబు సేయుచుఁ గామక్రోధలోభమోహమదమత్సరంబులఁ గెలిచి యింద్రియవర్గంబును బంధించి భక్తి సేయుచుండ నీశ్వరుండ యినవిష్ణుదేవునియందలిగతి సిద్ధించును. 239

టీ. అదిగావునన్ = అట్లగుటవలన, గురుశుశ్రూషయు=గురువును సేవించుటయు, సర్వార్థసమర్పణంబును = కర్మములను ఈశ్వరార్పణము జేయుటయు, సాధుజనసంగమంబును=ఉత్తములచెలిమియు, ఈశ్వరప్రతిమాసమారాధనంబును=దేవునివిగ్రహముం బూజించుటయు, హరికథాతత్పరత్వంబును = భగవంతునికథలయందుఁ దదేకనిష్ఠ గలిగియుండుటయు, వాసుదేవునియందలిప్రేమయును, నారాయణ...బును = శ్రీహరిగుణములు కర్మములు కథలు నామములు కీర్తించు(పాడు)టయు, వైకుంఠ...బును = విష్ణుపాదకమలములను ధ్యానించుటయు, విశ్వంభర...బులును = సర్వప్రపంచమును భరించువాఁడైన శ్రీహరి యాకారమును గాంచుట పూజించుటయు మొదలయిన, విజ్ఞాన...బులు = ఉత్తమజ్ఞానము విషయవైముఖ్యము వీనికి సాధనములు, ఐన, భాగవత ధర్మంబులపైన్ = భాగవతధర్మములమీఁద, రతి=మక్కువ, కలిగి, సర్వభూతంబులయందున్=చరాచరము లైనయెల్లజంతువులయందును, ఈశ్వరుండు = సర్వలోకనియామకుఁడును, భగవంతుండు = షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన, ఆత్మ = పరమాత్మ, కలండు, అని, సమ్మానంబు = (ఎల్లజంతువులయెడల) గౌరవమును, సేయుచు, కామక్రోధలోభమోహమదమత్సరములను, గెలిచి, ఇంద్రియవర్గము = అంతరింద్రియబాహ్యేంద్రియములను, బంధించి = వానియిచ్ఛ చొప్పునఁ బోనీయకుండునట్లు చేసి, భక్తి = పూజ్యులయందుఁ గావింపఁదగుభావమును, సేయుచుండన్, ఈశ్వరుండు = సర్వనియామకుఁడు, అయిన విష్ణుదేవునియందలి, గతి=చేరిక, సిద్ధించును.

సీ. దనుజారిలీలావతారంబులందలి
శౌర్యకర్మంబులు సద్గుణములు
విని భక్తుఁ డగువాఁడు వేడ్కఁ బోఁ బులకించి
కన్నుల హర్షాశ్రుకణము లొలుక
గద్గదస్వరముతోఁ గమలాక్ష వైకుంఠ
వరద నారాయణ వాసుదేవ

యనుచు నొత్తిలి పాడు నాడు నాక్రోశించు
నగుఁ జింతనము సేయు నతి యొనర్చు
తే. మరులు కొనియుండుఁ దనలోన మాటలాడు
వేల్పు సోఁకినపురుషునివృత్తిఁ దిరుగు
బంధములఁ బాసి యజ్ఞానపటలిఁ గాల్చి,
విష్ణుఁ బ్రాపించుఁ దుది భక్తివివశుఁ డగుచు. 240

టీ. భక్తుఁడు = ప్రసన్నుఁడు, అగువాఁడు = అయినపురుషుఁడు, దనుజారి = విష్ణునియొక్క, లీలా = వేడుకకొఱకైన, అవతారంబులందలి, శౌర్యకర్మంబులు = పరాక్రమపుఁ జేఁతలు, సద్గుణములు = మంచిగుణములును, విని, వేడ్కతోన్ = కౌతుకముతోడ, పులకించి = గగురుపాటుజెంది, కన్నులయందు, హర్షాశ్రుకణములు = ఆనందబాష్పముల బిందువులు, ఒలుకన్ = జాలువాఱఁగా, గద్గదస్వరముతోడన్ = డగ్గుత్తికపడినయెలుఁగుతోడ, కమలాక్ష = కమలములవంటి కన్నులుగలవాఁడా, వైకుంఠా, వరద = కోరినదానినెల్ల నిచ్చువాఁడా, నారాయణా = ఉదకమందు వసించువాఁడా, వాసుదేవ = వసుదేవునికొడుకా, అనుచున్, ఒత్తిలి = బిగ్గరగా, పాడున్ = గానముచేయును, ఆడున్, ఆక్రోశించున్ = పెద్దగానఱచును, నగున్, నవ్వును, చింతనము = ధ్యానము, చేయును, నతి = మ్రొక్కు, ఒనర్చున్ = చేయును, మరులు = మోహము, కొనియుండున్ = పొందియుండును, తనలోనన్, మాటలాడును, వేల్పు = దయ్యము, సోఁకిన పురుషునివృత్తిన్ = పట్టినవానిలాగున, తిరుగున్, బంధములన్ = కర్మసంసారబంధములను, పాసి = తొలఁగించికొని, అజ్ఞానపటలిన్ = అవివేకపుఁ జిక్కును, కాల్చి = మసిచేసి, తుదిన్ = అంతమున, భక్తివివశుఁడు = అనురాగబంధురుఁడు, అగుచున్, విష్ణుని, ప్రాపించున్ = పొందును.

తా. విష్ణుభక్తుఁడు అనవరతము శ్రీహరియొక్క అవతారములయందలి పరాక్రమకర్మములను విని మేను గగుర్పొడువ నానందబాష్పముల విడుచుచు డగ్గుత్తికతో కమలాక్షా! వైకుంఠా! వరదా! నారాయణా! వాసుదేవా!

అని పేరెలుంగుతోఁ గొంతదడవు పాడును. కొంతసే పాడును. కొంతసేపలు
చును. కొంతకాలము నవ్వును. కొంతసేపు తదేకనియతితో ధ్యానించును.
మొఱ్ఱిక్కును. ఎప్పుడు నాదేవునిమీఁద మోహము గలిగియుండును. తన
లోఁ దానే మాట లాడుకొనును. కొంతసేపు దయ్యము పట్టినట్లు తిరుగును.
ఇట్లు తత్పరుఁడై యుండి చివరకు కర్మబంధములను విడిచి యజ్ఞానముఁ
బొలఁగఁ ద్రోసికొని భక్తిపరవశుఁడై విష్ణువునం దైక్యమొందును.

వ. కావున రాగాదియుక్తమనస్కుం డయినశరీరికి సంసారచక్ర
నివర్తకం బయిన హరిచింతనంబు బ్రహ్మానందనిర్వాణసు
ఖం బెట్టి దట్టి దని బుధులు దెలియుదురు హరిభజనంబు దు
ర్గమంబు గాదు హరి సకలప్రాణిహృదయంబులయందు నం
తర్యామి యై యాకాశంబుభంగి నుండు విషయార్జనంబుల
నమ్యోడిది లేదు నిమిషభంగురప్రాణు లయినమర్త్యులకు మ
మతాస్పదంబులును జంచలంబులును నైన పుత్త్ర మిత్త్ర క
ళత్త్ర పశుభృత్యబలబంధురాజ్యకోశమణిమందిరమంత్రిమా
తంగమహీప్రముఖవిభవంబులు నిరర్థకంబులు యాగప్రముఖ
పుణ్యలబ్ధంబు లైనస్వర్గాదిలోకభోగంబులు పుణ్యానుభవక్షీ
ణంబులుగాని నిత్యంబులు గావు నరుండు విద్వాంసుండ నని
యభిమానించి కర్మంబు లాచరించి యమోఘంబు లయినవిప
రీతఫలంబుల నొందుఁ గర్మంబులు గోరక చేయవలయు గోరి
చేసిన దుఃఖంబులు ప్రాపించుఁ బురుషుండు దేహంబుకొఱ
కు భోగంబుల నపేక్షించు దేహంబు నిత్యంబు గాదు తో
డ రాదు మృతం బయినదేహమును శునకాదులు భక్షించు
దేహి కర్మంబు లాచరించి కర్మబద్ధుం డయి క్రమ్మఱం గ
ర్మానుకూలం బయినదేహంబుఁ దాల్చు నజ్ఞానంబునం జేసి

పురుషుండు గర్మదేహంబుల విస్తరించు నజ్ఞానతంత్రంబులు ధర్మార్థకామంబులు జ్ఞానలభ్యంబు మోక్షంబు మోక్షప్రదాత యగుహరి సకలభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు దనచేత నయినమహాభూతంబులతోడ జీవసంజ్ఞితుం డయియుండు నిష్కాము లై హృదయగతుం డయినహరిని నిజభక్తిని భజింపవలయు. 241

టీ. కావునన్, రాగాది యుక్త మనస్కుండు = రాగద్వేషాదులతోఁ గూడినచిత్తము గలవాఁడు, అయిన, శరీరికిన్ = దేహధారికి, సంసార...కంబు = సంసారజాలమును బాపునది, అయిన, హరి చింతనంబు = విష్ణుధ్యానము, బ్రహ్మమండలి, నిర్వాణ = మోక్షముయొక్క, సుఖంబు, ఎట్టిదో, అట్టిది, అని, బుధులు = పండితులు, హరిభజనంబు = విష్ణుసేవ, దుర్గమంబు = పొందరానిది, కాదు, హరి, సకల...యందున్ = ఎల్ల జీవులమనస్సులయందు, అంతర్యామి = లోన నున్నవాడు, ఐ, ఆకాశంబుభంగిన్, ఉండున్, విషయార్జనంబులన్ = ఇంద్రియార్థములను సాధించుట వలన, అయ్యెడిది = కలుగులాభము, లేదు, నిమిష...ప్రాణులు = అప్పపాటులోఁ జెడిపోవు ప్రాణముగల, మర్త్యులకున్ = (చచ్చునైజముగల) మానవులకు, మమతాస్పదంబులును = నాది యనుభావమునకుఁ జోటైనవియు, చంచలంబులును, ఐన, పుత్త్రి...బులు = బిడ్డలు నెచ్చెలులు భార్యలు గొడ్లు నౌకరులు సేనలు చుట్టములు ఏనుఁగులు భూములు (రాజ్యము) మొదలగు సంపదలు, నిరర్థకంబులు = ప్రయోజనములేనివి, యాగ...బులు = యజ్ఞములు మొదలగు పుణ్యకార్యములచేత దొరకిన స్వర్గాది భోగంబులుగాని, పుణ్యానుభవక్షీణంబులు = పుణ్యముల ననుభవించుటవలనఁగాని, నిత్యంబులు = కలకాలముండునవి, కావు, నరుండు, విద్వాంసుఁడన్ = తెలిసినవాఁడను, అని, అభిమానించి = అహంకారపడి, కర్మంబులు, ఆచరించి, అమోఘంబులు = రిత్తలుగానివి, ఐన, విపరీతఫలంబులన్ = కోరుకొన్నదానికి ప్రతికూలమైన ఫలములను, ఒందున్, కర్మంబులు, కోరక = ఫలాపేక్ష లేక, చేయవలయును,

కోరి = ఫలమపేక్షించి, చేసినన్, దుఃఖంబులు, ప్రాపించున్ = పొందును, పురుషుండు, దేహంబుకొఱకు, భోగంబులన్ = స్రక్చందన వనితాదులను, అపేక్షించున్ = కోరును, దేహంబు, నిత్యంబు=నిజము, కాదు, తోడన్ = లోకాంతరమునకుఁబోవు జీవుని వెంబడిని, రాదు, మృతంబు=ప్రాణములఁ బాసినది, అయిన దేహమును, శునకాదులు=కుక్కలు మున్నగునవి, భక్షించున్=తినును. దేహి, కర్మంబులు, ఆచరించి=చేసి, కర్మబద్ధుఁడు=కర్మలచేఁ గట్టఁబడినవాఁడు, అయి, క్రమ్మఱన్=మరల, కర్మానుకూలంబు=తనకర్మకుఁ దగినది, అయిన దేహంబును, తాల్చును=పూనును, పురుషుండు, అజ్ఞానంబునం జేసి=అజ్ఞానమువలన, కర్మదేహంబులన్ - విస్తరించున్=కర్మలను వానిని బట్టి దేహములను పెంచుకొనును. ధర్మార్థకామంబులు=ధర్మకామార్థములు, అజ్ఞానతంత్రంబులు=అజ్ఞానము కార్యములు (అనఁగా నజ్ఞానముతోడ నిత్యసంబంధము గలవి) మోక్షము, జ్ఞానలభ్యము=జ్ఞానముచే సాధింపఁదగినది, మోక్షప్రదాత = మోక్షమిచ్చువాఁడు, అగుహరి, సకలభూతంబులకున్ = ఎల్లజంతువులకును, ఆత్మేశ్వరుండు=ఆత్మరూపుఁడైన ప్రభువు, ప్రియుండు=అన్నిటికంటె నిష్టమయినవాఁడు, తనచేతన్ =తనవలన, అయినమహాభూతంబులతోడన్ = కల్పితమైన పంచమహాభూతముల కలయికతోడ్పాటున, జీవసంజ్ఞితుండు=జీవుఁడని పేరుగలవాఁడు, అయి, ఉండున్, నిష్కాములు=కోరికలేనివారు, ఐ, హృదయగతుండు=హృదయమును బొందినవాఁడు, అయిన హరిని, నిజభక్తిని=రాగద్వేషకలితముగాని అచ్చపు భక్తిచేత, భజింపవలయున్ = సేవింపవలయును.

క. దానవ దైత్య భుజంగమ
మానవ గంధర్వ సుర సమాజములో ల
క్ష్మీనాథుచరణకమల
ధ్యానంబున నెవ్వఁడయిన ధన్యత నొందున్. 242

టీ. దానవ...సమాజములోన్ = దనుజులు దితిజులు (రాక్షసులు) నాగులు మనుజులు గంధర్వులు దేవతలు మొదలగు సంఘములోన్, ఎవ్వఁడు = ఏలాటిజీవుఁడు, అయినన్, లక్ష్మీనాథుచరణాంబుజధ్యానంబునన్ = శ్రీహరి పాదకమలముల చింతనము చేత, ధన్యతన్ = కృతార్థత్వమును, ఒందును.

తా. మానవ రాక్షస గంధర్వ సర్పాది యోనులయందుఁ బుట్టినయేజీవుఁడైనను శ్రీహరిపదధ్యానము చే ధన్యత్వముఁ జెందును.

క. చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
చిక్కఁడు దానముల శౌచశీలతపములం
జిక్కఁడు యుక్తిని భక్తిని
జిక్కినక్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ. 243

టీ. అచ్యుతుండు = శ్రీవిష్ణుమూర్తి, భక్తిని = భక్తిచేత, చిక్కినక్రియన్ = దొరకినట్లు, వ్రతములచేతను, క్రతువులన్ = యజ్ఞములచేతను, దానములన్ = దానములచేతను, శౌచశీలతపములన్ = సదాచారము, మంచినైజము చేతను, తపస్సుచేతను, యుక్తిని = శాస్త్రతర్కము చేతను, చిక్కఁడు సుండీ.

తా. బాలురారా! శ్రీహరి భక్తికి వశమైనట్లు ఇఁక నేనోములకు యాగములకు దానములకు శుచిత్వమునకు మంచినడవడికి తపస్సునకు యుక్తికిని స్వాధీనము గాఁడుసుమా.

క. చాలదు భూదేవత్వము
చాలదు దేవత్వ మధికశాంతత్వంబుం
జాలదు హరి మెప్పింప వి
శాలోద్యములార భక్తి చాలినభంగిన్. 244

టీ. విశాలోద్యములార = గొప్పయత్నము గలరాక్షస బాలురారా, హరిన్ = శ్రీవిష్ణువును, మెప్పింపన్ = మెచ్చఁజేయుటకు, భక్తి, చాలినభంగిన్ = చాలినట్లు, భూదేవత్వము = బ్రాహ్మణులౌట, చాలదు, దేవత్వము =

దేవతలాట, చాలదు, అధిక శాంతత్వంబుగా = మిగుల నెమ్మదియు, చాలదు.

తా. గొప్పయత్నము గలదానవరాక్షసబాలురారా, శ్రీవిష్ణువును మెప్పించుటకు భక్తి యనువస్తువు చాలినట్లు ఇంకొకటి యేదియుఁ జాలదు. ఉత్తమమైనబ్రాహ్మణకులమందుఁ బుట్టిననే ప్రయోజనము లేదు. స్వర్గతదేవతయైనంతనే కార్యములేదు. చాల నెమ్మది గలిగినను ఫలములేదు. ఒక్క భక్తియే కావలెను. ఆయన దానికే వశమై యుండును.

ఆ. దనుజభుజగయక్షదైత్యమృగాభీర
సుందరీవిహంగ శూద్రశబరు
లైన బాపజీవులైన ముక్తికిఁ బోదు
రఖిలజగము విష్ణుఁ డనుచుఁ దలఁచి. 245

టీ. అఖిలజగము = ప్రపంచమంతయు, విష్ణుఁడు = శ్రీహరియే, అనుచును, తలఁచి, దనుజ...లు = రాక్షసులు పన్నగులు యక్షులు దితిజులు మృగములు గొల్లలు స్త్రీలు పక్షులు శూద్రులు ఎఱుకవారును, ఐనను, పాపజీవులు = పాపాత్ములు, ఐనను, ముక్తికిన్ = మోక్షమునకు, పోవుదురు.

తా. బాలురారా! ప్రపంచమంతయు విష్ణుమయ మని తెలిసికొనినయెడల రాక్షసులు, యక్షులు, మృగములు, గొల్లలు, స్త్రీలు, పక్షులు, శూద్రులు, బోయలు మొదలుగా నెంతటి పాపాత్ములైనను మోక్షమందుటకు సందేహము లేదు.

క. గురువులు దమకును లోఁబడు
తెరువులు సెప్పెదరు విష్ణుదివ్యపదవికిం
దెరువులు సెప్పరు చీఁకటిఁ
బరువులు వెట్టంగ నేల బాలకులారా. 246

టీ. బాలకులారా, గురువులు = ఒజ్జలు, తమకును, లోఁబడు తెరువులు = తెలిసిన (చదువుల) జాడలను, చెప్పెదరు, గాని, విష్ణుదివ్యపదవికిన్ =

శ్రీహరియొక్క దివ్యమైన స్థానమునకు, తెరువులు=త్రోవలు, చెప్పరు, చీఁకటిన్ = చీఁకటిలో, పరువులు పెట్టంగన్ = పరుగులుదీయుట, ఏల = ఎందుకు?

తా. బాలురారా! మనయుపాధ్యాయులు వారికిఁ దెలిసినచదువులే చెప్పఁగలరుగాని వారలుఁగఁజాలని విష్ణుపదప్రాప్తి మార్గమైన చదువు చెప్పలేరు. ఇట్లు మనము ఈగ్రుడ్డిచదువు ఎన్నాళ్లు చదివినను ఏమి ప్రయోజనమున్నది?

క. తెం డెల్లపుస్తకంబులు
నిం డాచార్యునకు మరల నేకతమునకున్
రండు విశేషము సెప్పెదఁ
బొం డొల్లనివారు కర్మపుంజముపాలై. 247

టీ. ఎల్లపుస్తకంబులున్ = మీ బడిలోఁ జదువుకొనవలసిన పుస్తకములన్నియు, తెండు, తీసుకొనిరండు, ఆచార్యునకున్ = మనగురువుగారికి, ఇండు, మరలన్ = తిరిగి, ఏకతమునకున్ = ఈలాటి రహస్యదేశమునకు, రండు, విశేషమున్ = ఒకప్రత్యేకమైనవార్త, చెప్పెదను, ఒల్లనివారు = ఇందులకిష్టపడనివారు, కర్మపుంజముపాలై = కర్మముల సమూహమునకు లోఁబడి, పొండు.

తా. బాలకులారా! ఇటు వచ్చి నేఁ జెప్పెడుమాట లాలింపుఁడు. మీమీపుస్తకాలన్ని తెచ్చి గురువుగారివాతఁ బడవేసి వచ్చి మరల నన్ను గలసికొనుఁడు, మీకు మంచిమార్గము జెప్పెదను. ఇందుల కిష్టపడనివారు కర్మలపాలై పొండు. మీగతి మీది.

క. ఆడుదము మనము హరిరతిఁ
బాడుద మేప్రొద్దు విష్ణుభద్రయశంబుల్
వీడుదము దనుజసంగతిఁ
గూడుదము ముకుందభక్తకోటిన్ సూటిన్. 248

టీ. మనము, హరిరతిన్ = విష్ణువునందలి మక్కువచేత, ఆడుదము, ఏప్రొద్దున్ = ఎల్లప్పుడును, విష్ణుభద్రయశంబుల్ = విష్ణువిమంగళకరములైన కీర్తులు, పాడుదము, దనుజసంగతిన్ = రాక్షసులచెలిమిని, వీడుద

ము, సూటిక్ = గుఱితోడ, ముకుంద భక్తకోటిక్ = విష్ణుభక్తుల సమూహమును, కూడుదము = చేరుదము.

తా. కుఱ్ఱలారా! మనము శ్రీహరిమీఁది చిత్తముతో నాడుదము రండు. ఎప్పుడును విష్ణునికీర్తనములను పాడుకొందము. ఈమాయరాక్షసుల సంబంధము మానుకొందము. శ్రీహరిదాసులచెంతఁ జేరుదము రండు.

క. విత్తము సంసృతిపటలము
ద్రవ్త్తము కామాదివైరివర్గంబుల నేఁ
డిత్తము చిత్తము హరికిని
జొత్తము నిర్వాణపదము శుభ మగు మనకున్. 249

టీ. సంసృతిపటలము = సంసారసమూహమును, విత్తము = విడఁగొట్టుదము, కామాదివైరివర్గంబులక్ = కామక్రోధాది శత్రువులను, ద్రవ్త్తము = చీల్చుదము, నేఁడు = ఈదినము, చిత్తము = మనమనస్సు, హరికిని, ఇత్తము, నిర్వాణపదము = మోక్షపుఁజక్కిని, చొత్తము = చేరుదము, మనకును, శుభము = క్షేమము, అగుక్.

తా. మనము సంసారమును దొలఁగఁ ద్రోయుదము. కామక్రోధాదులను జీల్చి చెండాడుదము. నేఁడు శ్రీహరికి మనచిత్త మర్పించి మోక్షమార్గమున కేఁగుదము. మనకు మేలగును.

వ. అని యిట్లు ప్రహ్లాదుండు రహస్యంబున నయ్యైవేళల రాక్షసకుమారులకు నపవర్గమార్గం బెఱింగించిన వారును గురుశిక్షితంబు లైనచదువులు సాలించి నారాయణభక్తిచిత్తంబులం గీలించి యుండుటం జూచి వారల యేకాంతభావంబు దెలిసి వెఱచి వచ్చి శుక్రనందనుండు శక్రవైరి కిట్లనియె.

టీ. అని, ఇట్లు, ప్రహ్లాదుండు, అయ్యైవేళలక్ = ఆయాసమయములయందు, సమయము చిక్కినప్పుడెల్లను ననుట. రహస్యంబునక్ = ఒంటరిపాటున, రాక్షస కుమారులకుక్, అపవర్గ మార్గంబు = మోక్షపుఁ దెరువు, ఎఱిం

గించినన్ = ఉపదేశింపఁగా, వారును = రాక్షసకుమారులును, గురుశిక్షితంబులు = ఉపాధ్యాయులచే నేర్పఁబడిన, చదువులు, చాలించి, చిత్తంబులన్ = తమమనస్సులలో, నారాయణభక్తి = విష్ణుభక్తి, కీలించి = నాటుకొనఁజేసి, ఉండుటను చూచి, శుక్రనందనుండు = శుక్రుని కొడుక గు రాక్షసబాలుర విద్యాగురువు, వారల యేకాంతభావంబు = ఆరక్షోబాలురయాంతర్యమును, తెలిసికొని, వచ్చి, శక్రవైరికిన్ = ఇంద్రవిరోధి యగుహిరణ్యకశిపునకు, ఇట్లనియెను.

శా. రక్షోబాలుర నెల్ల నీకొడుకు సేరం జీరి లోలోన నా
శిక్షామార్గము లెల్లఁ గల్లలని యాక్షేపించి తా నందఱన్
మోక్షాయత్తులఁ జేసినాఁడు మనకున్ మోసంబు వాటిల్లె నీ
దక్షత్వంబునఁ జక్కఁ జేయ వలయున్ దైతేయవంశాగ్రణీ.

టీ. దైతేయవంశాగ్రణీ = ఓరాక్షసరాజా, నీకొడుకు = ప్రహ్లాదుఁడు, రక్షోబాలురనెల్లన్ = రాక్షసులబిడ్డలందఱను, చేరన్ జీరి = రాఁబిలచి, లోలోనన్ = రహస్యముగా, నాశిక్షామార్గములు ఎల్లన్ = నాయుపదేశపద్ధతులన్నిటిని, ఆక్షేపించి, తాన్ = ప్రహ్లాదుఁడు, అందఱన్ = రాక్షసకుమారులందఱను, మోక్షాయత్తులన్ = మోక్షమార్గాసక్తులనుగా, చేసినాఁడు, మనకున్, మోసంబు = పొరపాటు, వాటిల్లెన్ = కల్గెను. నీదక్షత్వంబునన్ = నీసామర్థ్యమువలన, చక్కఁజేయవలయున్ = ఈదోసఁగు మానుపవలెను.

తా. రాజా! నీకొడుకు ప్రహ్లాదుఁడు రాక్షసబాలుర నందఱను జేరఁబిలిచి నే జెప్పినచదువులు కల్లలని బోధించి తాను వారి కందఱకు మోక్షమార్గము నుపదేశించెను. మనకుఁ జాల ప్రమాదము సంభవించినది. దీనిని నీవు విచారించి చక్కఁబెట్టవలయును.

క. ఉల్లసితవిష్ణుకథనము
లెల్లప్పుడు మాకుఁ జెప్పఁ డీగురుఁ డని న
న్నుల్లంఘించి కుమారకు
లొల్లరు చదువంగ దానవోత్తమ వింటే. 252

టీ. దానవోత్తమ=రాక్షసశ్రేష్ఠా, వింటే=వింటివా, కుమారకులు = విద్యార్థులు, ఈగురుఁడు=ఈయుపాధ్యాయుఁడు, మాకున్, ఎల్లప్పుడున్, ఉల్లసిత విష్ణుకథనములు=ప్రకాశించు విష్ణునిగాథలను, చెప్పఁడు, అని, నన్నున్, ఉల్లంఘించి=తిరస్కరించి, చనువంగన్ = నేఁజెప్పినచదువులఁ జదువుటకు, ఒల్లరు=ఇష్టపడరు.

తా. రాక్షసరాజా! వింటివా! బాలురెల్లను ఈగురు వెప్పుడు చూచినను ఏవో లేనిపోనిగాథలు చెప్పునుగాని మోక్షైకసాధనములైన విష్ణుచరిత్రములను జెప్పఁడు అని నన్నధిక్షేపించుచు నేఁ జెప్పెడుచదువులను గుతియుంచి చదువుకొనరు.

క. ఉడుగఁడు మధురిపుకథనము
విడివడి జడుపగిదిఁ దిరుగు వికసనమున నే
నొడివిననొడువులు నొడువఁడు
దుడుకనిఁ జదివింప మాకు దుర్లభ మధిపా. 253

టీ. అధిపా=రాజా, మధురిపుకథనము = విష్ణునికీర్తనము, ఉడుగఁడు=మానఁడు, జడుపగిదిన్=మందునివలె, విడివడి=అడ్డువదలి, వికసనమునన్=ఆనందముతో, తిరుగును, నేనొడివిన నొడువులు= నేఁజెప్పినచదువులు, నొడువఁడు=చదువఁడు, దుడుకనిన్=ఇట్టినీకొడుకును, చదివింపన్ = విద్యగఱపుటకు, మాకున్, దుర్లభము=శక్యముకాదు.

తా. రాజా! మీబాలుఁడు ఎప్పుడు విష్ణుకథలను బాడుచు అడ్డమాపులులేక పిచ్చివానివలె నానందముతోఁ దిరుగుచుండును. తనపట్టువిడువఁడు. నాచదువులు వానికి రుచింపవు. ఇఁక వీని జదివించునేర్పు నాకు లేదు.

క. చొక్కపుఁ బొక్కిసికులమున
వెక్కురు జన్మించినాఁడు విష్ణునియందున్
నిక్కపుమక్కువ విడువం
డెక్కడిసుతుఁ గంటి రాక్షసేశ్వర వెట్టిన్. 254

టీ. చొక్కపురక్కసికులమునన్ = మంచిరాక్షసవంశమందు, వెఱ్ఱరు = వెఱ్ఱివాఁడు, జన్మించినాఁడు, విష్ణునియందున్, నిక్కపుమక్కువ = అచ్చపు భక్తిని, విడువఁడు, రాక్షసేశ్వరా, వెఱ్ఱిన్, ఎక్కడిసుతున్ = ఎటువంటికొడుకును, కంటివి.

తా. రాజా! పాలవంటి మీ కులమున నీ వెఱ్ఱి జన్మించినాఁడు. ఎంత చెప్పినను విష్ణునియందు మమత వీడఁడు. ఎంత చక్కనికొడుకును గన్నావయ్యా!

వ. అని యిట్లు గురుసుతుండు సెప్పినఁ గొడుకువలని విరోధవ్యవహారంబులు గర్ణరంధ్రంబుల ఖడ్గప్రహారంబు లయి సోఁకిన బిట్టు మిట్టిపడి పాదాహతం బైనభుజంగంబుభంగిఁ బవనప్రేరితం బైన దవానలంబుచందంబున దండతాడితం బయిన కంఠీరవంబుకైవడి భీషణరోషరసావేశ జాజ్వల్యమాన చిత్తుండును బుత్రసంహారోద్యోగాయత్తుండును గంపమాన గాత్రుండును నరుణీకృతనేత్రుండును నై కొడుకును రప్పించి సమ్మాననకృత్యంబులు దప్పించి నిర్దయుండై యశనిసంకాశభాషణంబుల నదల్చుచు. 255

టీ. గురుసుతుండు = గురువగుశుక్రునికొడుకు, విరోధవ్యవహారంబులు = అయిష్టవర్తనములు, కర్ణరంధ్రంబులన్ = చెవిసందులలో, ఖడ్గప్రహారంబులు = కత్తివేట్లు, బిట్టు = మిగుల, మిట్టిపడి = అదరిపడి, పాదాహతంబు = కాలఁదన్నఁబడినది, భుజంగంబుభంగిన్ = పామువలె, పవనప్రేరితంబు = గాలిచే రగుల్కొలుపఁబడిన, దవానలంబు = కార్చిచ్చు, దండతాడితంబు = కఱ్ఱతో మోఁదఁబడిన, కంఠీరవంబు = సింగము, భీషణ...త్తుండు = భయంకరమైన కోపముచే మండుచున్న మనము గలవాఁడు, పుత్త్ర...చిత్తుండు = కొడుకును జంపుపనియందుఁ దవిలిన మనస్సు గలవాఁడు, కంపమానగాత్రుండు = వడఁకుచున్న మేను గలవాఁడు, అరుణీకృతనేత్రుం

డు = ఎఱ్ఱఁగాఁ జేసికోఁబడినకన్నులు గలవాఁడు, సమ్మానకృత్యంబులు = గారవంపుఁజెయిదములు, నిర్దయుండై = కరుణమాలినవాఁడై, అశని...బులన్ = పిడుగులంబోనిమాటలతో, అదల్చుచున్ = బెదరించుచు, (వైపద్యముతోనన్వయము.)

శా. సూనున్ శాంతగుణప్రధాను నతిసంశుద్ధాంచితజ్ఞాను న
జ్ఞానారణ్యకృశాను సంజలిపుటీసంభ్రాజమానున్ సదా
శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదనా
ధీనున్ ధిక్కరణంబు సేసి పలికెన్ దేవాహితుం డుగ్రతన్.

టీ దేవాహితుండు = రాక్షసుఁడు, ఉగ్రతన్ = క్రౌర్యముతో, శాంతగుణప్రధానున్ = శాన్నిగుణము లె ముఖ్యము గాఁ గలవాఁడును, అతిశుద్ధాంచితజ్ఞానున్ = మిగులదోషరహితమై యొప్పు తెలివిగలవాఁడును, అజ్ఞానారణ్యకృశానున్ = తెలివిలేమి యనునడవికిఁ జిచ్చువంటివాఁడును, అంజలిపుటీసంభ్రాజమానున్ = ప్రణామాంజలి (దోసిలి) చేఁ బ్రకాశించువాఁడును, సదా.. ధీనున్ = ఎప్పుడును శ్రీహరిపాదకమలములజంటను జింతించుట యనునమృతమురుచికి లోనైనవాఁడును నగు, సూనున్ = కొడుకును, ధిక్కరణంబు = తిరస్కారము, చేసి, పలికెను.

తా. హిరణ్యకశిపుఁడు బలుక్రౌర్యముతో, నతిశాంతుఁడు, నిర్మలమైన జ్ఞానము గలవాఁడు, అవివేకము లేనివాఁడు, వినయము తెలుకపడులా గున నంజలి పట్టికొనియున్నవాఁడును, సర్వకాల సర్వావస్థలయందును శ్రీమన్నారాయణచరణసరసిజములధ్యాన మనునమృతమును ద్రావుటయందుఁ దవిలియున్నవాఁడును నగుకొడుకును ధిక్కరించి మాటలాడఁ దొడఁగెను.

సీ. అస్మదీయం బగు నాదేశమునఁ గాని
మిక్కిలి రవి మింట మెఱయ వెఱచు
నన్నికాలములందు ననుకూలుఁడై కాని
విద్వేషి యై గాలి వీవ వెఱచు

మత్ప్రతాపానలమందీకృతార్చి నై
విచ్చలవిడి నగ్ని వెలుఁగ వెఱచు
నతితీక్ష్ణమైన నాయాజ్ఞ నుల్లంఘించి
శమనుండు ప్రాణులఁ జంప వెఱచు
తే. నింద్రుఁ డాదిగ నామోల నెత్త వెఱచు
నమరకిన్నర గంధర్వ యక్షవిహగ
నాగవిద్యాధరావలి నాకు వెఱచు
నేల వెఱవవు పలువ నీ కేది దిక్కు. 257

టీ. ఓపలువ=తులువ యగునోబాలకా, రవి = సూర్యుఁడు, అస్మదీయంబు = నాసంబంధము, అగు నాదేశమునఁ గాని=ఆజ్ఞవలనఁ గాక, మింటన్=గగనమందు, మిక్కిలి=మిగుల, మెఱయ వెఱచున్=ప్రకాశింపనోడును, గాలి, అన్ని కాలములందున్=ఎల్ల వేళలయందును, అనుకూలుఁడుఐకాని=నాయిచ్చచొప్పున మెలఁగువాఁడు కాక, విద్వేషియై=అహితుఁడై, వీవన్=వీచుటకు, వెఱచున్, అగ్ని, మత్ప్రతాపానల మందీకృతార్చియై=నాపరాక్రమముమంటలచేత జబ్బుపడిన వేఁడిమి గలవాఁడై, విచ్చలవిడిన్=తనయిచ్చకొలఁది, వెలుఁగన్ = మండుటకు, వెఱచున్, శమనుండు=యముఁడు, అతిశాత = మిగులతీవ్రమయిన, నాయాజ్ఞన్=నాయానతిని, ఉల్లంఘించి=దాఁటి, ప్రాణులన్=జంతువులను, చంపన్, వెఱచును, ఇంద్రుఁడు, నామోలన్=నాసమ్ముఖమున, ఆఁదల=తలను, ఎత్త వెఱచున్, అమర...రావళి=దేవతలు, కిన్నరులు, గంధర్వులు, యక్షులు, పక్షులు, నాగులు, విద్యాధరులు వీరలపంక్తి, నాకు, వెఱచున్, నీవు, ఏల, వెఱవవు? నీకు, దిక్కు=నాయనుగ్రమునకుఁ బాసినవెనుక రక్షింపఁగలపాపు, ఏది=ఎవరు?

తా. ఏరా తులువా! నాకు వెఱచి సూర్యుఁడు మిక్కిలి యెండఁ గాయ జంకును. గాలి గట్టిగాఁ గొట్టనోడును. నాప్రతాపమునకు వెఱచి అగ్నియు భగ్గని మండ నోడును. నాతీక్ష్ణమైనయాజ్ఞకు భయపడి యముఁడును ప్రా

ణులఁ జంపనోడుదు. ఇంద్రుఁడో నాయెదుట తలయెత్తనేలేఁడు. ఇఁక తక్కిన దేవతలు, కిన్నరులు, యక్షులు, పక్షులు, నాగులు, విద్యాధరులు మొదలగువారిమాట చెప్పనేల. ఓరీ యిట్లు మానవుల కుపాసింపఁదగిన దేవులే నాకు వెఱచుచుండఁగా నీవేల భయపడవు. నాయాగ్రహమునకు లోనై నీ వెవ్వని యండఁ జేరి బ్రతుకఁగలవురా చెప్పుము ?

శా. ప్రజ్ఞావంతులు లోకపాలకులు శుంభద్ద్వేషు లయ్యుఁ మదీ
యాజ్ఞాభంగము సేయ నోడుదురు రోషాసాంగదృష్టిఁ వివే
కజ్ఞానచ్యుత మై జగత్త్రితయముం గంపించు నీ విట్టిచో
నాజ్ఞోల్లంఘన మెట్లు సేసితివి సాహంకారతఁ దుర్మతీ. 258

టీ. దుర్మతీ = ఓ చెడుబుద్ధి గలవాఁడా, ప్రజ్ఞావంతులు = శక్తియుక్తులు గలిగిన, లోకపాలకులు = ఇంద్రుఁడు మొదలగువారు, శుంభద్ద్వేషులు = ప్రకాశించుపగ గలవారు, అయ్యుఁ, మదీయాజ్ఞాభంగముఁ సేయఁ ఓడుదురు = నాయాజ్ఞను దాఁటవెఱతురు, జగత్త్రితయమున్ = ముల్లోకములును, వివేకజ్ఞానచ్యుతము = ముందువెనుకలరయు తెలివితోడిజ్ఞానమునువీడి, కంపించున్ = వణఁకును, నీవు, ఇట్టిచోఁ = ఇప్పట్టున, సాహంకారతఁ = పొగరుఁబోతుదనముతో, ఆజ్ఞోల్లంఘనము = నాయాజ్ఞమీఱుట, ఎట్లు, చేసితివి.

తా. ఓరీ చెడ్డబాలుఁడా, గొప్పసామర్థ్యము గలిగి నీకంటె ఎన్నిరెట్లో బలవంతులైన యింద్రాదులు నాయం దెప్పుడు ఈర్ష్యగలవారైయుండియు, నాకు వెఱచి నా కయిష్టము చేయలేరు. నేనొక్కతేప గ్రుడ్లెఱ్ఱఁగా జేసి చూడఁగానే ముల్లోకములును తెలివిమాలి గడగడ వణఁకును. ఇట్టినాయాజ్ఞ నెట్లుమీఱఁ గలిగితివి చెప్పుము ?

శా. కంఠక్షోభము గాఁగ నొత్తిలి మహాగాఢంబుగా డింభ వై
కుంఠుం డెప్పుడు దుర్జయుం డనుచు వైకుంఠుండు వీరవ్రతో
త్కంఠాబంధురుఁ డేని నే నమరులఁ ఖండింప దండింపఁ గాఁ
గుంఠీభూతుఁడు గాక రావలదె మద్ఘోరాహవక్షోణికిన్. 259

టీ. డింభ = ఓయిబిడ్డా, వైకుంఠుఁడు = విష్ణువు, దుర్జయుండు అనుచున్ = ఇతరులకు ఓడింప శక్యముకానివాఁడని, కంఠక్షోభము కాఁగన్ = గొంతు నొప్పియెత్తునట్లు, ఒత్తిలి = బిగ్గఱగా, మహాగాఢంబుగాన్ = మిగుల పూనికతో, చెప్పెదు, వైకుంఠుండు, వీరవ్రతోత్కంఠుఁడు ఏనిన్ = శూరత్వము వెల్లడించుటయందు కోరిక గలవాఁడైనచో, నేను, అమరులన్ = దేవతలను, ఖండింపన్ = నఱుకఁగా, చండింపన్ = శిక్షింపఁగా, కుంఠీభూతుఁడు = మూలముడుఁగువాఁడు, కాక, మద్ఘోరాహవక్షోణికిన్ = నాభయంకరమైన యుద్ధరంగమునకు, రావలదె = రావలయునేకదా?

తా. కుఱ్ఱా! ప్రహ్లాదా, విష్ణువు చాల దొడ్డవాఁడు, మహాశూరుఁడు, అని నీవు గొంతుపగల నఱచెదవుగదా! అతఁడు నీవనుకొనినట్లు, అంత మేఱమీఱి దుర్జయమైన పరాక్రమము గలవాఁడైనచో నేను దేవతల నందఱను ముక్కలుగాఁ గోసి చీకాకు చేయునప్పుడు యుద్ధరంగమున నా యెదుటికి రావలసినదే నే ఏలరాలేదు చెప్పుము ?

శా. ఆచార్యోక్తము గాక బాలురకు మోక్షాసక్తిఁ బుట్టించి నీ
వాచాలత్వముఁ జూపి విష్ణు నహితుర్ వర్ణించి మద్దైత్యవం
శాచారంబులు నీఱు సేసితివి మూఢాత్ముం గులద్రోహి నిన్
నీచుం జంపుట మేలు చంపి కులమున్ నిర్దోషముం జేసెదన్.

టీ. బాలురకున్ = రాక్షసుల పిల్లకాయలకు, ఆచార్యోక్తము = గురువుచెప్పినది, కాక, మోక్షాసక్తిన్ = ముక్తియందలి ప్రేమను, పుట్టించి = కలిగించి, నీవాచాలత్వము = నీవదరుబోతుఁదనమును, చూపి = అగపఱిచి, అహితున్ = నాపగవాఁడగు, విష్ణున్, వర్ణించి = పొగడి, మద్దైత్య వంశాచారంబులు = నారక్కసి కులపు మర్యాదలు, నీఱు చేసితివి = బూడిదగా నొనర్చితివి. మూఢాత్మున్ = మూర్ఖుఁడును, కులద్రోహినిన్ = వంశమునకు చెడుగొనర్చినవానిని, నీచున్ = నీచుఁడవైన

నిన్ను, చంపుట, మేలు = క్షేమము, నిన్ను, చంపి, కులము = నావంశ మును, నిర్దోషముగా = దోషములేనిదానిగా, చేసెదను.

తా. నీవు గురువు చెప్పనిదే పిల్లకాయల కింకొకను మోక్షమం దా రను బుట్టించి నీనోరికిలాలంది నాశత్రువగు విష్ణునిఁ బొగడి నాకులాచార ములు బూడిదపాలు చేసినావు. ఇట్టిమూర్ఖుని వంశమునకు చెఱుపు చేసినవాని నికృష్టుని నిన్ను జంపి నావంశము పావనము చేసికొందును.

క. దిక్కులు గెలిచితి నన్నియు
దిక్కెవ్వఁడు రోరి నీకు దేవేంద్రాదుల్
దిక్కులరాజులు వేఱొక
దిక్కెఱుఁగక కొలుతు రితఁడె దిక్కని నన్నున్. 261

టీ. దిక్కులు అన్నియు, గెలిచితిని, ఓరీ, నీకు, దిక్కు = శరణు, ఎవ్వఁడు రా, దిక్కులరాజులు=దిక్కులకుఁ బ్రభువులైన, దేవేంద్రాదులు = దేవేంద్రుఁడు మొదలగువారు, వేఱొకదిక్కు = మఱియొకదిక్కు, ఎఱుఁ గక = లేక, ఇతఁడు అని = వీఁడే మనకు దిక్కు అని, నన్నుగా. కొలుతురు.

తా. బాలకా! ఎల్లదిక్కులకు ప్రభువులగు ఇంద్రాదులు గూడ దిక్కుగానక నేనే దిక్కని నన్ను సేవించు చుందురు. ఇట్లుండఁగ నన్ను గొలుచుచుండఁగా నీవు తిరస్కరించుచున్నావే నీ కెవఁడురా దిక్కు?

క. బలవంతుఁడ నే జగముల
బలములతోఁ జనక వీరభావమున మహా
బలుల జయించితి నెవ్వని
బలమున నాడెదవు నాకుఁ బ్రతివీరుఁడ వై. 262

టీ. నేను, జగములన్ = లోకములయందు, బలవంతుఁడన్ = సామ ర్థ్యము గలవాఁడను, బలములతోన్ = సేనలతోడ, చనక = కూడి వెళ్లక, వీరభావమునన్ = శూరత్వమున, మహాబలులన్ = గొప్పబలము గలవీరు

లను, జయించితిని, నీవు, నాకు, ప్రతివీరుఁడవై = శత్రుఁడవై, ఎవ్వని బలమునన్ = ఎవనియండచేత, ఆడెదవు.,

తా. బాలకా ఎల్లలోకములలో నేన బలవంతుఁడను. నన్నుమిం చినవా రెందును లేరు. సేన లేకయే ఒంటరిగా నేఁగి యెందఱో శూరులను జంపితిని. నీ వీఁక నెవరిప్రాపు చూచుకొని నాకుఁ బ్రతిఘటించెదవో యె ఱుఁగఁ జెప్పుము.

వ. అనినఁ దండ్రికి మెల్లన వినయంబునఁ గొడు కిట్లనియె. 263

టీ. మెల్లనన్=తిన్నగా, వినయంబునన్=అడఁకువతో.

క. బలయుతులకు దుర్బలులకు
బల మెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును
బల మెవ్వం డట్టివిభుఁడు బల మసురేంద్రా. 264

టీ. అసురేంద్రా= రాక్షసులరాజా, బలయుతులకున్ = బలముగల వారికి, దుర్బలులకున్=బలము లేనివారికి, నీకు, నాకు, బ్రహ్మాదులకున్ = బ్రహ్మ మొదలగువారికిని, ఎవ్వఁడు=ఏదేవుఁడు, బలము=ప్రాపో, ప్రాణు లకును=ఎల్లజంతువులకును, బలము=అండ, ఎవఁడో, అట్టివిభుఁడు=అలాంటి దేవుఁడు, బలము = నాకు దిక్కు.

తా. రాజా! బలము గలవారికి, లేనివారికి, నీకు, నాకు, బ్రహ్మ మొ దలగువారికిని, ఇంతయేల యెల్లజీవులకు, ఎవఁడు జీవనాధారుఁడో వాఁడే నాకు రక్షకుఁడు.

క. దిక్కులు గాలముతో నే
దిక్కున లే కుండఁ గలుగు దిక్కులమొదలై
దిక్కు గలలేనివారికి
దిక్కెయ్యెడువాఁడు నాకు దిక్కు మహాత్మా. 265

టీ. మహాత్మ=గొప్పవాఁడగునో తండ్రీ, కాలముతో, దిక్కులు=ఎల్లదిక్కులు, ఏదిక్కునన్=ఎవనియందు, లేకుండున్=లేకపోవునో, కలుగున్=ఎవనియందు పుట్టునో, దిక్కుల మొదలువి=అన్నిదిక్కు (గతు)లకు మూలమై, దిక్కు=శరణము, కలలేనివారికిన్ = కలిగినవారికిని లేనివారికిని, దిక్కు=శరణము, అయ్యెడువాఁడు, నాకు, దిక్కు = రక్షకుఁడు.

తా. తండ్రీ! ఎవనియందు ఈదిగ్దేశకాలములు లేవో, అనఁగా నెవనియందు లీనమగునో, ఎవనియందిని పుట్టునో, అన్నిగతులను మొదటిగతియై దిక్కుగలవారికిని, లేనివారికిని ఏస్వామి దిక్కో, వాఁడే నాకు దిక్కు.

సీ. కాలరూపంబులఁ గ్రమవిశేషంబుల
నలఘుగుణాశ్రయుం డయినవిభుఁడు
సత్త్వబలేంద్రియసహజప్రభావాత్ముఁ
డై వినోదంబున నఖిలజగము
గల్పించు రక్షించు ఖండించు నవ్యయుం
డన్నిరూపములందు నతఁడు గలఁడు
చిత్తంబు సమముగాఁ జేయుము మార్గంబుఁ
దప్పి వర్తించు చిత్తంబుకంటె
తే. వైరు లెవ్వరు చిత్తంబు వైరి గాక
చిత్తమును నీకు వశముగాఁ జేయ వయ్య
మదయుతాసురభావంబు మానవయ్య
యయ్య నీ మ్రోల మే లాడరయ్య జనులు. 266

టీ. అయ్య = తండ్రీ, కాలరూపంబులన్ = కాలప్రకృతులయందు, అలఘుగుణాశ్రయుండు = గొప్పగుణములకు కారణము, అయినవిభుఁడు = అయినట్టిదేవుఁడు, సత్త్వ... త్ముఁడై=సద్భావము, బలము, నైజమైనమహిమగలవాఁడై, వినోదంబునన్ = వేడుకచేత, అఖిలజగము=ఎల్లప్రపంచమును, కల్పించున్=నిర్మించును, రక్షించున్ = కాపాడును, ఖండించున్=

సంహరించును, అవ్యయుండు = నాశములేని, అతండు, అన్నిరూపములందుఁ = ఎల్లబింబములయందు, కలఁడు, చిత్తంబు = నీమనము, సమముకాఁ = రాగద్వేషసుఖదుఃఖాదిద్వంద్వగతముకాకుండ నన్నిటియందుఁ దుల్యరూపముగునట్లు, చేయుము, మార్గంబు = మంచిత్రోవ, తప్పి = తొలఁగి, వర్తించుచిత్తంబుకంటెఁ = తిరుగుమనముకంటె, వైరులు = శత్రువులు, ఎవ్వరు, చిత్తంబు, వైరి = నీకు విరోధముగానుండునది, కాక, చిత్తము, నీకు, వశముకాఁ = స్వాధీనమగునట్లు, చేయుమయ్యా, మద...వంబు = పొగరుబోతురాక్షసధర్మమును, మానవయ్యా, జనులు = నీప్రజలందఱు, నీమ్రోలఁ = నీయెదుట, మేలు = మంచి, ఆడరయ్యా = చెప్పఁజాలరు.

తా. తండ్రీ! ఆయాకాలముల నాయారూపములయందుఁ గ్రమముగా వర్తించుచు సర్వగుణాధారుఁడైనయాపరమేశ్వరుఁడు సాత్త్వికత్వము బలము ఇంద్రియము పుట్టుకతోఁ బుట్టినగొప్పమహిమయు గలవాఁడై లీలాగ్రము ఈప్రపంచమును బుట్టించి పెంచి నశింపఁజేయుచు తా నాశములేక యెల్లబింబములలోఁ బ్రతిబింబితుఁడై యుండును. నాయనా! నీచిత్తమున రాగద్వేషములఁ జొరనీయక సమబుద్ధితోఁ జూడుము. ఇప్పుడు నీచిత్తము తప్పుదారిని బడిపోవుచున్నది. త్రోవదప్పినడచు మనమనస్సుకంటె మనకు శత్రువుగలదే? చిత్తమును బ్రతికూలముగాకుండ స్వాధీనపఱుచుకొమ్ము, ఈ పొగరుబోతురాక్షసధర్మము వదలుము. నీయాశ్రితులందఱు నీకు వెఱచి మోమోటపడుదురుగాని నీయోగుబాగులను విచారించి నీశక్తియుక్తులగమనించి నీకు కొంచెమప్రియమైనను హితమైనమాటఁ జెప్పఁజాలరు.

ఉ. లోకములన్నియుఁ గడియలోన జయించినవాఁడ వింద్రియా
నీకముఁ జిత్తముఁ గెలువ నేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకరశత్రు లార్వురఁ బ్రభిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁ డొకఁడు నేర్పునఁ జూడుము దానవేశ్వరా.

టీ. దానవేశ్వరా = రాక్షసరాజా, లోకములన్నియుఁ = ఎల్లలోకములు, గడియలోనఁ = అర్ధముహూర్తమాత్రమున, జయించినవాఁడవు,

ఇంద్రియానీకముఁ = ఇంద్రియములసమూహమును, చిత్తముఁ, గెలువ నేరవు, నిన్ను, నిబద్ధుఁ = సంసారమునఁ జిక్కుకొనువానినిగా, చేయు, ఈ, ఆర్వురు, భీకరశత్రులు= భయంకరమైన విరోధులను, ప్రభిన్నులఁ = ఓడినవారిగా, చేసినఁ = చేసితివేని, ప్రాణికోటిలోఁ=జీవసమూహములో, నీకు, ఒకఁడును, విరోధి = శత్రువు, లేఁడు, నేర్పునఁ=తెలివితో, చూడుము = యోచించుము.

తా. నాయనా! నీవు లోకములన్నియు ఒకగడియలో జయించిన గొప్పశూరుఁడవు. ఈనీచము లైనయింద్రియములను మనస్సును జయింపఁజాల కున్నావు. ఇవియే ఇంతటి బలవంతుఁ డైననిన్ను గట్టివేయును. నీవు ఈ క్రూరశత్రువుల నార్వురను జయింపఁ గలిగెదవేని ఇఁక వేఱుగా నీకుఁ గాని వా రుండరు. తెలివితో గమనించి చూడుము.

క. పాలింపుము శేముషి ను
న్మాలింపుము కర్మబంధముల సమదృష్టిం
జాలింపుము సంసారముఁ
గీలింపుము హృదయమందుఁ గేశవభక్తిన్. 268

టీ. శేముషిఁ = బుద్ధిని, పాలింపుము = కలుషము గాకుండ రక్షించుము, సమదృష్టిఁ = సమానభావముతో, కర్మబంధములఁ = కర్మములకట్టులను, ఉన్మాలింపుము = త్రెంచివైచికొమ్ము, సంసారము, చాలింపుము, హృదయమందు = చిత్తమున, కేశవభక్తిఁ = నారాయణునియందలి భక్తిని, కీలింపుము = నాటుకొనఁజేయుము.

తా. తండ్రీ తెలివితెచ్చుకొనుము. అన్నిటియందు సమభావముగలిగి కర్మబంధములఁ దొలఁగించుకొనుము. సంసారసంబంధముఁ బాపుకొనుము. మనస్సునందు శ్రీమన్నారాయణభక్తిని దృఢముగాఁ బాదుకొల్పుము.

వ. అనినఁ బరమభాగవతశేఖరునకు దోషాచరశేఖరుం డి ట్లనియె. 269

టీ. దోషాచరశేఖరుఁడు = రాక్షస (రాత్రులందిరుగువారు) రాజు, పరమభాగవతశేఖరుండు = ఉత్తములైనహరిభక్తులలో మేలైనవాఁడు.

క. చంపినఁ జచ్చెద ననుచును
గంపింపక యోరి పలువ కఠినోక్తుల నన్
గుంపించెదు చావునకుం
దెంపరి వై వదరువాని తెఱఁగునఁ గుమతీ. 270

టీ. ఓరి, పలువ = తుంటవా, కుమతీ = ఓరిదుర్బుద్ధి గలవాఁడా, చంపినన్=చంపెనేని, చచ్చెదను, అనుచును = అనితలఁచుకొనుచు: కంపింపక = బెదరక, చావునకున్, తెంపరివై = తెగించినవాఁడై, వదరువాని తెఱఁగున్ = నోరికొలఁది ప్రేలువానివలె, కఠినోక్తులన్ = గడుసుమాటలచేత, నను, కుంపించెదు=మీఱెదవు.

తా. ఓరీ దురాత్మా! ఒకవేళ చంపినను జత్తము ఇంతకంటె వీఁడేమి చేయును లెమ్మని తెగఁబడి రాజదండాదులచేఁ జావనున్నవాఁడు ఎవరిని లెక్కచేయక నోరికొలఁది ప్రేలినట్లు, నదురు బెదురు లేక ఈవిధముగా కారులఱచి నన్ను దిరస్కరించుచున్నావురా మూర్ఖా!

శా. నాతోడం బ్రతిభాష లాడెదు జగన్నాథుండ నాకంటె నీ
భూతశ్రేణికి రాజు లేఁ డొకఁడు సంపూర్ణప్రభావుండు మ
ద్భ్రాతం జంపిన మున్ను నే వెదకితిం బల్మాఱు నారాయణుం
డేతద్విశ్వములోన లేఁడు మఱి వాఁ డెందుండురా దుర్మతీ.

టీ. దుర్మతీ=చెడ్డబుద్ధిగలవాఁడా, నీవు, నాతోడ, ప్రతిభాషలు=ఎదురువాదములు, ఆడెదవు, నేను, జగన్నాథుండను = లోకములకుఁ బ్రభుఁడను, ఈభూతశ్రేణికి, నాకంటెన్, సంపూర్ణప్రభావుండు=నిండిన (ఎక్కువ) మహిమగల, ఒకఁడు, వేఱొక, రాజు=దొర, లేఁడు, నారాయణుఁడు, మున్ను, మద్భ్రాతన్=నాతమ్ముని, చంపినన్= చంపఁగా, నేను,

పల్కెదు, వెదకితిని, వాఁడు, ఆవిష్ణువు, ఏతద్విశ్వములోనన్ = ఈప్రపంచములో, లేఁడు, మఱి=ఇఁకను, ఎందుండురా=ఎక్కడనున్నాఁడురా.

తా. ఓరీదుర్బుద్ధీ! నీవునాకేమోయెదురు చెప్పెదవు. నేన యీయెల్ల ప్రపంచమునకు దొరను. నాకు మించినరాజు లేఁడు. నీవు తేపకు నారాయణుఁ డొక్కఁడున్నాఁడని పేర్కొెదవు. వాఁడు నాతమ్ముని జంపినాఁ డని వాని జంపుదునని నేను ఎల్లతావులు వెదకి విసికితిని ఎక్కడలేఁడు ఇఁక వాఁ డెక్కడ నున్నాఁడురా మూఢా!

క. ఎక్కడఁ గలఁ డేక్రియ నే
చక్కటి వర్తించు నెట్టిజాడను వచ్చుం
జక్కడుతు నిన్ను విష్ణునిఁ
బెక్కులు ప్రేలెదవు వానిభృత్యునిపగిదిన్. 272

టీ. విష్ణుఁడు, ఎక్కడన్, కలఁడు, ఏక్రియన్=ఏవిధముగా, ఏచక్కటిన్ = ఏస్థలమందు, వర్తించును, ఎట్టిజాడను = ఏలాటిత్రోవను, వచ్చును, నిన్ను, నీవిష్ణుని, చక్కడుతున్=సంహరింతును, వానిభృత్యుని పగిదిన్=వానిబంటువలె, పెక్కులు=పలుమాటలు, ప్రేలెదవు=కూసెదవు.

తా. ఓరీ విష్ణు వెక్కడ నున్నాఁడు. అతఁ డెచ్చోటు యేవిధముగా నుండును. ఏమార్గమునవచ్చును. చూపుము. నిన్ను వానినిగూడ రూపుమాపెదను. వానిబంటువలె చాలఁ ప్రేలుచున్నావు.

వ. అనిన హరికింకరుండు శంకింపక హర్షపులకాంకురసంకలిత విగ్రహుండై యాగ్రహంబు లేక హృదయంబున హరిం దలంచి నమస్కరించి బాలవర్తనంబున నర్తనంబు సేయుచు నిట్లనియె. 273

టీ. హరికింకరుండు=నారాయణునిదాసుఁడు, శంకింపక=జంకక, హర్ష... హుండై=సంతోషమువలన నయినగగుర్పాటు గలిగినమేనుగలవాఁడై, బాలవర్తనంబునన్=పిల్లతనముతో, నర్తనంబు=నాట్యము.

మ. కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోతచంద్రాత్మలం
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం
గలఁ డీశుండు కలండు తండ్రి వెదకంగా నేల నీయూయెడన్.

టీ. తండ్రి = నాయనా, ఈశుండు = దేవుఁడు, అంభోధిన్ = సముద్రమందు, కలఁడు, గాలిన్ = వాయువునందు, కలఁడు, ఆకాశము నందు, కలఁడు, కుంభినిన్ = భూమియందు, కలఁడు, దిశలన్=దిక్కుల యందు, పగళ్లన్ = దినములలో, నిశలన్=రాత్రులలో, ఖద్యోతచంద్రాత్మలన్ = సూర్యచంద్ర ఆత్మలయందును, ఓంకారమున, త్రిమూర్తులన్ = బ్రహ్మ విష్ణు శివస్వరూపములలో, త్రిలింగవ్యక్తులన్ = ఆఁడుది మగ వాఁడు నపుంసకములందును, అంతటను, కలఁడు, ఈయాయెడన్ = ఇక్కడ అక్కడ, వెదకంగాన్ ఏల=వెదకుట యెందులకు?

తా. నాయనా! యీశ్వరుఁ డెల్లప్రపంచమందు నిబిడముగా నావరించియున్నాఁడు. నీళ్లు, గాలి, ఆకాశము, భూమి, అగ్ని, పగలు, రాత్రి, సూర్యుఁడు, చంద్రుఁడు, ఆత్మ, ఓంకారము, బ్రహ్మ విష్ణు రుద్రులు, స్త్రీపున్నపుంసకవ్యక్తులు, ఇవి బ్రహ్మ మొదలు పరమాణువుదాఁక ఎల్లపదార్థములలోఁ గలఁడు. అట్టిసర్వపూర్ణుని ఇక్కడ నక్కడ నేల వెదకవలెను?

క. ఇందుఁ గలఁ డందు లేఁ డని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెం దెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే. 275

టీ. దానవాగ్రణి = రాక్షసరాజా, చక్రి = విష్ణువు, ఇందున్ = ఇక్కడ, కలఁడు = ఉన్నాఁడు, ఇందు, లేఁడు, అని, సందేహము =

అనుమానము, వలదు, అతఁడు, సర్వోపగతుండు = అన్నిటియందుండు వాఁడే, ఎందెందుఁ, వెదకి, చూచినను, అందందే, కలఁడు, వింటివా.

తా. రాక్షసరాజా! శ్రీహరి యిందుండును. అందుండఁడు. అని వ్యవస్థ లేదు. ఆయన సర్వగతుఁడు. కాన మన మెందుఁజూచిన నందె కనఁబడును. ఇందుల కేసంశయమును లేదు.

వ. అని యివ్విధంబున. 276

మ. హరి సర్వాకృతులం గలం డనుచుఁ బ్రహ్లాదుండు భాషింప స
త్వరుఁడై యెందును లేఁడులేఁడనిసుతుఁ దైత్యుండుదర్జింప శ్రీ
నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానాజంగమస్థావరో
త్కరగర్భంబుల నన్ని దేశముల నుద్దండప్రభావంబునన్. 277

టీ. హరి=విష్ణువు, సర్వాకృతులందుఁ=ఎల్లరూపములందును, కలఁడు, అనుచుఁ, ప్రహ్లాదుండు, భాషింపఁ = పలుకఁగా, సత్వరుఁడై = తొందరగలవాఁడై, ఎందును, లేఁడు లేఁడు, అని, దైత్యుండు = రాక్షసుఁడగు హిరణ్యకశిపుఁడు, తర్జింపఁ = బెదరింపఁగా, అచ్యుతుఁడు = నాశములేని శ్రీమన్నారాయణుఁడు, శ్రీనరసింహాకృతిఁ = సంపదగలనరసింహరూపముతోడ, నానా...బులఁ=పలుదెఱఁగు లగుచరాచరజంతువుల గర్భములందును, అన్ని దేశంబులఁ=ఎల్లచోటులయందును, ఉద్దండప్రభావంబునఁ = గొప్పమహిమతో, ఉండెను.

తా. ఇట్లు ప్రహ్లాదుఁడు దేవుఁ డంతట నున్నాఁ డనియు, హిరణ్యకశిపుఁడు లేఁడనియు, వాదించుచుండఁగా నప్పుడు శ్రీహరి నరసింహరూపముతో సర్వత్ర నిండియుండెను.

వ. అయ్యవసరంబున నద్దానవేంద్రుండు. 278

టీ. దానవేంద్రుఁడు = రాక్షసరాజు.

క. డింభక సర్వస్థలముల
నంభోరుహనేత్రుఁ డుండు ననుచు మిగుల సం
రంభంబునఁ బలికెద వీ
స్తంభంబునఁ జూపఁ గలవె చక్రిన్ గిక్రిన్. 279

టీ. డింభక = ఓరిపట్టా! అంభోరుహనేత్రుఁడు = విష్ణువు, సర్వస్థలములన్ = అన్నిచోటులను, ఉండును, అనుచును, మిగుల, సంరంభమునన్ = ఆటోపముతోడ, పలికెదవు. ఈ స్తంభంబునన్ = ఈయగపడు స్తంభమున, చక్రిన్, గిక్రిన్, చూపఁగలవె = చూపఁజాలుదువా.

తా. ఓరీ విష్ణుఁ డెల్లెడలఁ గలఁడని మహాహంకారముతోఁ జెప్పుచున్నావు. ఈస్తంభములోఁ జూపించఁ గలవా?

క. స్తంభమునఁ జూప వేనిం
గుంభిని నీశిరముఁ ద్రుంచి కూల్పఁగ రక్షా
రంభమున వచ్చి హరి వి
స్రంభంబున నడ్డపడఁగ శక్తుం డగునే. 280

టీ. స్తంభమునన్ = ఈ స్తంభమందు, చూపవేనిన్ = చూపించఁజాలవేని, నీశిరము = నీతల, త్రుంచి = నఱికి, కుంభినిన్ = నేలయందు, కూల్పఁగన్ = కూలఁజేయఁగా, హరి = విష్ణువు, రక్షారంభమునన్ = కాపాడుపూనికతో, వచ్చి, విస్రంభంబునన్ = నమ్మకముతో, అడ్డపడఁగన్ = అడ్డపడుటకు, శక్తుండు = చాలినవాఁడు, అగునా.

తా. ఈ స్తంభములోఁ జూపించకపోయిన నీతల నఱికి నేలఁ గూల్చెదను. అప్పుడు విష్ణువు సమయమున వచ్చి యడ్డపడి నిన్ను గాపాడఁగలఁడా? అట్లు నీకు నమ్మకము గలదా చెప్పుము?

వ. అనిన భక్తవత్సలునిభటుం డిట్లనియె. 281

టీ. భక్తవత్సలునిభటుండు = తనను నమ్ముకొనినభక్తులయందు ప్రీతిగల శ్రీహరియొక్క దాసుఁడు.

శా. అంభోజాసనుఁ డాదిగాఁగఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబున నుండుప్రోడ విపుల స్తంభంబునం దుండఁడే
స్తంభాంతర్గతుఁ డయ్యు నుండుటకు నేసందేహముం లేదు ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁ బ్రత్యక్షస్వరూపంబునన్.

టీ. అంభోజాసనుఁడు = విష్ణువు, ఆదిగాఁగన్ = మొదలుగా, తృణపర్యంతంబు = గడ్డిపోఁచలదాఁక, విశ్వాత్ముఁడై = సర్వప్రపంచరూపము గలవాఁడై, సంభావంబునన్ = ఆదరముతో, ఉండుప్రోడ = ఉండు నట్టి నేరుపుకాఁడు, విపుల స్తంభంబునందు = పెద్ద స్తంభమున, ఉండఁడే, స్తంభాంతర్గతుఁడు అయ్యున్ = స్తంభములో నున్న వాఁడుగాఁగూడ, ఉండుటకున్, ఏసందేహమున్ = ఏయనుమానమును, లేదు, నేఁడు = ఈదినమున, నిర్దంభత్వంబునన్ = టక్కులేక, ప్రత్యక్షస్వరూపంబునన్ = కనులకగపడునిజరూపముతో, కానఁబడును.

తా. తండ్రీ! బ్రహ్మమొదలు తృణము (లేక పరమాణువు) దాఁక వ్యాపించియుండుస్వామి ఇంత పెద్ద స్తంభములో నుండుట ఒక ఆశ్చర్యమా! ఈ స్తంభములోను తప్పక ఉండియే తీఱును. ఇందు కనుమానపడవలదు. ఆదేవుఁడు నేఁడు మోసములేక మనకు నిజరూపముతోఁ బ్రత్యక్షము కాఁగలఁడు.

వ. అనిన విని కరాళించి గ్రద్దన లేచి గద్దియ డిగ్గ నుఱికి యొఱఁ బెట్టినఖడ్గంబు వెఱికి కేల నమర్చి జళిపించుచు మహాభాగవత శిఖామణి యైనప్రహ్లాదుని ధిక్కరించుచు. 283

టీ. కరాళించి = బొబ్బరిల్లి (గద్దించి), గ్రద్దనన్ = తటుక్కున, లేచి, గద్దియ = సింహాసనము, డిగ్గన్ ఉఱికి = దిగ దుమికి, ఒఱన్ = గవుసెనలో, పెట్టిన ఖడ్గంబు, వెఱికి = దూసి, కేలన్ = చేతియందు, అమర్చి = పట్టుకొని, జళిపించుచున్ = త్రిప్పుచు, మహాభాగవత శిఖామణి = గొప్పహరిదాసులలో శ్రేష్ఠుండైన, ప్రహ్లాదుని, ధిక్కరించుచున్ = తిరస్కరించుచు. (వైపద్యముతోఁ గలియును).

మ. వినరా డింభక మూఢచిత్త గరిమన్ విష్ణుండు విశ్వాత్మకుం
డని భాషించెద వైన నిందుఁ గలఁడే యంచున్ మదోద్రేకియై
దనుజేంద్రుం డఱచేత వ్రేసెను మహాోదగ్రప్రభాశుంభమున్
జనదృగ్భీషణదంభమున్ హరిజనుస్సంరంభమున్ స్తంభమున్.

టీ. దనుజేంద్రుండు=రాక్షసశ్రేష్ఠుఁడు, డింభక = ఓరిపట్టా, మూఢచిత్త = తెలివిమాలినవాఁడా, గరిమన్ = గొప్పతనముతో, విష్ణుండు= హరి, విశ్వాత్మకుఁడు = సర్వప్రపంచరూపుఁడు, అని, భాషించెదవు= పలికెదవు, ఐనన్ = అలాగైనచో, ఇందు = ఈ స్తంభమున, కలఁడే అంచున్, మదోద్రేకియై = గర్వాతిశయముగలవాఁడై, మహో...భమున్= గొప్పకాంతులచేఁ బ్రకాశించుచున్న, జనదృగ్భీషణదంభమున్= ప్రజలచూపులకు భయము బుట్టించునట్టి, హరి జనుస్సంరంభమున్ = (నృసింహరూపుఁడగు) విష్ణువుయొక్క ఆవిర్భావముయొక్క ఆటోపముగల, స్తంభమున్, అఱచేతన్, వ్రేసెన్ = గుద్దెను.

తా. ఆహిరణ్యకశిపుఁడు ఓరీ పెట్టిబాలుఁడా విష్ణు వంతటఁ గలఁ డని మిగుల దొడ్డగాఁ జెప్పుచున్నావు. కాని యీ స్తంభమునఁ గలఁడా అని మదాంధుఁడై దివ్యము లైనప్రకాశములతో వెలుఁగుచు, చూచువారలకు భయమును గలిగించుచున్నదియు నృసింహమూర్తి ఆవిర్భవించఁబోవుచున్న ఆసభయందలి స్తంభమును అఱచేత గుద్దెను.

వ. ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణవైరుండును వైరానుబంధజాజ్వల్యమాన రోషానలుండును రోషానలజంఘన్యమాన విజ్ఞానవినయుండును వినయగాంభీర్య ధైర్య జేగీయమాన హృదయుండును హృదయచాంచల్యమాన తామసుండును దామసగుణచంక్రమ్యమాణ స్థైర్యుండును నై విస్రంభంబున హుంకరించి బాలుని ధిక్కరించి హరి నిందుఁ జూ

ఫు మని కనత్కనకమణిమయకంకణ క్రేంకారశబ్దపూర్వకం బుగా దిగ్దంతిదంతభేదనపాటవప్రశస్తం బగుహస్తంబున సభామండపస్తంభంబు వ్రేసిన వ్రేటుతోడన దనదశదిశలను మిడుంగుఱులు సెదరం జిటిలి పెటిలిపడి బంభజ్యమానంబగు నమ్మహాస్తంభంబువలనఁ బ్రళయవేళాసంభూతసప్తస్కంధబంధురసమీరణసంఘటితఘోరజోఘుష్యమాణమహావలాహకవర్గనిర్గతనిబిడనిష్ఠురదుస్సహనిర్ఘాతసంఘనిర్ఘోషనికాశంబులైన ఛటచ్ఛటస్ఫుటస్ఫుటధ్వనిప్రముఖభయంకరారావపుంజంబులు జంజన్యమానంబు లయి యెగసి యాకాశకుహరాంతరాళంబు నిరవకాశంబు సేసి నిండినం బట్టు సాలకదోధూయమానహృదయంబు లయి పరవశంబు లైనపితామహామహేంద్ర వరుణ వాయు శిఖి ప్రముఖ చరాచరజంతుజాలంబులతోడ బ్రహ్మాండకటాహంబు పగిలి పరిస్ఫోటితంబుగాఁ బ్రఫుల్లపద్మయుగళ సంకాశ భాస్వర చక్రచాపహల కులిశ జలచర రేఖాంకితచారుచరణతలుండును జరణచంక్రమణఘనవినమిత విశ్వంభరాభార ధౌరేయ దిక్కుంభికుంభీనస కుంభినీధర కూర్మకులశేఖరుండును దుగ్ధజలధిజాత శుండాల శుండాదండ మండితప్రకాండ ప్రచండ మహోరుస్తంభయుగళుండును ఘణఘణాయమాన మణికింకిణీగణముఖరిత మేఖలావలయ వలయిత పీతాంబరశోభితకటిప్రదేశుండును నిర్జరనిమ్నగావర్తవర్తుల కమలాకర గంభీరనాభివివరుండును ముష్టిపరిమేయ వినుతతనుతరస్నిగ్ధమధ్యుండును గులాచల సానుభాగ సదృశ కర్కశ విశాలవక్షుండును దుర్జనదనుజభటధైర్యలతికాలవిత్రాయమాణ రక్షోరాజవ

క్షోభాగ్ర విశంకట తీక్ష్ణవిలేఖన చుంచులాంగలాయమాన ప్రతాపజ్వలన జ్వాలాయమాన శరణాగతనయనచకోరచంద్రరేఖాయమాణ వజ్రాయుధ ప్రతిమానభాసమాననిశాతనఖరతరముఖనఖరుండును శంఖచక్రగదాఖడ్గకుంతతోమర ప్రముఖ నానాయుధ మహిత మహోత్తుంగ మహీధరశృంగసన్నిభవీరసాగరవేలాయమానమాలికా విరాజమాననిరర్గళానేకశతభుజార్గళుండును మంజుమంజీర మణిపుంజరంజిత మంజులహార కేయూరకంకణకిరీటమకరకుండలాది భూషణభూషితుండును త్రివళీయుతశిఖరాభ పరిణద్ధబంధురకంధరుండును ప్రకంపనకంపిత పారిజాతపాదపపల్లవప్రతీకాశకోపావేశసంచలితాధరుండును శరత్కాలమేఘజాలమధ్యధగద్ధగాయమానతటిల్లతాసమాన దేదీప్యమానదంష్ట్రాంకురుండును కల్పాంతకాలసకల భువనగ్రసనవిలసన విజృంభమాణసప్తజిహ్వాజిహ్వాతులిత తరళతరాయమాణ విభ్రాజమానజిహ్వుండును మేరుమందరమహాగుహాంతరాళ విస్తారవిపులవక్త్రనాసికావివరుండును నాసికావివరనిస్సరన్నిబిడనిశ్వాసనికరసంఘట్టనసంక్షోభితసంతప్యమానసప్తసాగరుండును బూర్వపర్వతవిద్యోతమాన ఖద్యోతమండలసదృశసముంచితలోచనుండును లోచనాంచలసముత్కీర్యమాణ విలోలకీలాభీలవిస్ఫులింగవితానరోరుధ్యమానతారకాగ్రహ మండలుండును శక్రచాపసుచిరోదగ్రమహాభ్రూలతాబంధబంధుర భయంకరవదనుండును ఘనతరగండశైలతుల్యకమనీయగండభాగుండును సంధ్యారాగరక్తధారాధరమాలికాప్రతిమమహాభ్రూంకషతంతన్యమానపటుతరసటాజాలుండును సటాజాలసంచా

లసనసంజాతవాత డోలాయమాన వైమానికవిమానుండును నిష్కంపిత శంఖవర్గమహోర్ధ్వకర్ణుండును మంథదండాయమాన మందరవసుంధరాధరపరిభ్రమణ వేగసముత్పద్యమాన వియన్మండలమండితసుధారాశికల్లోల శీకరాకారభాసుర కేసరుండును బర్వాఖర్వ శిశిరకిరణమయూఖగౌరతనూరుహుండును నిజగర్జానినద నిర్దళిత కుముద సుప్రతీక వామ నైరావణ సార్వభౌమప్రముఖదిగిభరాజకర్ణకోటరుండును ధవళధరాధరదీర్ఘదురవలోకనీయ దేహుండును దేహప్రభాపటలనిర్మథ్యమాన పరిపంథియాతుధాననికురుంబ గర్వాంధకారుండును బ్రహ్లాదహిరణ్యకశిపురంజనభంజననిమిత్తాంతరంగబహిరంగజేగీయమాన కరుణావీరరససంయుతుండును మహాప్రభావుండును నయినశ్రీనృసింహదేవుం డావిర్భవించినం గనుంగొని. 285

టీ. దానవేంద్రుండు=రాక్షసరాజు, పరిగృహ్యమాణవైరుండును = చలపట్టినవాఁడును, వైరా..లుండును = విరోధముయొక్క సంబంధము చేత మండుచున్న కోపాగ్ని గలవాఁడును, రోషా...వినయుండును = కోపాగ్నిచేఁ గొట్టఁబడిన వివేకము అడఁకువ గలవాఁడును, వినయ...హృదయుండును = అడఁకువ గంభీరత ధైర్యము వీనిచేఁ బొగడఁబడిన మనస్సు గలవాఁడును, హృదయ.. సుండును = మనస్సున రేఁగుచున్న తమోవృత్తిగలవాఁడును, తామస... స్థైర్యుండును = తమోగుణముచేతఁ గ్రమ్మఁకొనఁబడిన దిట్టతనము గలవాఁడును, ఐ, విస్రంభంబునన్ = దేవుఁడు కానరాఁడనునమ్మకముతో, హుంకరించి = హుం అని కేకవెట్టి, బాలుని = ప్రహ్లాదుని, ధిక్కరించి = తిరస్కరించి, హరిన్ = విష్ణుని, ఇందు = ఈ స్తంభమున, చూపింపుము, అని, కన...పూర్వకంబుగాన్ = మెఱయుచున్న రత్నఖచితములైన ముఱుఁగుల క్రేంకారము బుట్టునట్లుగా, దిగ్దంతి...

ప్రశస్తంబు=దిగ్గజములను బగులమోఁదు బలిమిచేఁ బేరు వడసిన, అగు, హస్తంబునన్ = చేతితో, సభామంటప స్తంభంబు = కొలువుకూటమున నున్న ఆ స్తంభమును, వేసినన్ = కొట్టఁగా, వేఁటుతోడన = దెబ్బవెంబడినే, దశదిశలను = పదిదిక్కులయందును, మిడుంగుఱులు = నిప్పుకణుకులు, చెదరన్, పెటిలిపడి = చిట్లిపడి, బంభజ్యమానంబు = బద్దలుకొట్టఁబడినది, అగునమ్మహాస్తంభంబునన్ = అయిన యాగొప్ప స్తంభమందు, ప్రళయ...నిర్ఘాతంబులు = ప్రళయకాలమందుఁబుట్టిన యేడుమొత్తములనిబిడ వాయువులచేఁ గూర్చఁబడిన్న భయంకరముగా గర్జిల్లుచున్న గొప్ప మేఘముల సమూహములనుండి వెడలిన దట్టములై కఠినములై సహింపరాని పిడుగులమొత్తములమ్రోఁతతో సమానములు, ఐన, ఛట...పుంజంబులు=ఛటఛట ఫటఫటధ్వనులు మొదలగు భయంకరములైన మ్రోఁతలసమూహములు, జంజన్యమానంబులు=ఎడలేక పుట్టుచున్నవి, అయి, ఎగసి, ఆకాశకుహరాంతరాళంబు=మిన్నురంధ్రముయొక్క మధ్యభాగమును, నిరవకాశంబు=సందులేనిదానిగా చేసి, నిండినన్, పట్టు=ఊఁత, చాలక, దోధూయమాన హృదయంబులు=బెదరుగుండెకలవి, అయి, పరవశంబులు=తమస్వాధీనమందు లేని, ఐన, పితామహ...తోడన్ = బ్రహ్మ ఇంద్రుఁడు వరుణుఁడు వాయువు అగ్ని మొదలుగా జంగమ స్థావరములైన జంతుసమూహములతోఁగూడ, బ్రహ్మాండకటాహంబు= బ్రహ్మాండ మనుగంగాళము, పగిలి, పరిస్ఫోటితంబుకాన్ = చెక్కలగునట్లుగా, ప్రఫుల్ల...తలుండును = విరియఁబూచిన తామరదోయివంటి మెఱయుచున్న చక్రము ధనుస్సు శాఁకలి వజ్రము చేప వీనిరేఖలతోఁ గూడిన యఱకాళ్లుగలవాఁడును, చరణ...శేఖరుండును = అడుగునూఁదుటచేత మిగుల కృంగిన సమస్తభూమండలమును మోయుదిగ్గజములు ఆదిశేషుఁడు కులపర్వతములు ఆదికూర్మము గలవాఁడును, దుగ్ధ...యుగళుండును = పాలసముద్రమునఁ బుట్టిన ఐరావతముయొక్క తుండమువలె మెఱయు మధ్యభాగము గల ఉగ్రములైన పెద్ద స్తంభములవంటి తొడలజంట గలవాఁడును, ఘణ...ప్రదేశుండును=ఘణఘణమ్రోఁగుచున్నరత్న

పుగజ్జైలసమూహముచేత ధ్వనించుచున్న మొలత్రాటి చుట్లచేఁ జుట్టఁబడిన పట్టుధోవతిచేఁ బ్రకాశించు మొలగలవాఁడును, నిర్ఝర...వివరుండును = ఆకాశగంగానది సుడివలె గుండ్రనై సరస్సువలె లోఁతైన బొడ్డురంధ్రము గలవాఁడును, ముష్టి...మధ్యుఁడును = పిడికిట నిముడ్చఁదగి పొగడఁబడిన మిగుల సన్నని నున్నని నడుము గలవాఁడును, కులా...వక్షుండును = కులగిరుల చరులతో సమానమైన వెడలుపుఱొమ్ము గలవాఁడును, దుర్జన...నఖరుండును = దుష్టులైన రాక్షసభటుల ధైర్యము లనుతీఁగలకు కొడవండ్లవంటివియు హిరణ్యకశిపునిఱొమ్మను విశాలమైనభూమిని బగుల దున్నుటయందు మిన్నలైననాఁగేళ్లవంటివియు శౌర్యాగ్నిమంటలవలె నున్ననివియు శరణము గోరివచ్చినవారి చూపును చకోరములకు వెన్నెలలవంటివియు సజ్జాగ్రియుధమునంటివియు నైన మెఱయుచున్న చీల్చుటయందు మిగులవాఁడిగల కొనలుగల గోళ్లు గలవాఁడును, శంఖ...భుజార్గళుఁడును = శంఖము చక్రము గద ఖడ్గము కుంతము తోమరము మొదలగు పలువిధములైనశస్త్రములకు నొప్పు గొప్పకొండకొమ్ములవంటి వీరరససముద్రము చెలియలికట్టలవంటి బాహులు తీఱి మెఱయుచున్న (పూలదండలుగల) అడ్డులేని పలునూఱుల గడియమ్రానులవంటి బాహువులు గలవాఁడును, మంజు...భూషితుండును=సొగసైనయందెలు రత్నసమూహములచే నలంకరించఁబడి హారములు భుజకీర్తులు కిరీటము మకరకుండలములు (మొసలినోరువలెఁ జేయఁబడిన పోఁగులు) మొదలగు సొమ్ములచే నలంకరింపఁబడినవాఁడును, త్రివళీ...కంధరుండును=మూఁడురేఖలతోఁ గూడి కొండనెత్తమువలె విశాలమైన చిక్కని మెడగలవాఁడును, ప్రకంపన...ధరుండును=గాలికిఁ గదలు పారిజాతపుఁజిగురుటాకువంటి కోపవేగముచే వణఁకుచున్న క్రిందిపెదవి గలవాఁడును, శరత్కాల...రుండును = శరదృతువునందలి మేఘములనడుమనున్న ధగధగలాడు మెఱుపుఁదీఁగెలతో సమానములయిన ప్రకాశించుచున్న మొలకదంతములు గలవాఁడును, కల్పాంత...జిహ్వుండును=ప్రళయకాలమం దెల్లలోకములను మ్రింగువేడుకతో రేఁగుచున్న కాలాగ్ని నాలుకలతోఁ బోల్చఁబడి

న క్షోరాడుచుఁ బ్రకాశించుచున్న మెఱయు నాలుక గలవాఁడును, మేరు... వివరుండును=మేరుపర్వతము మందరపర్వతము వీనిపెద్దగుహల నడిమిభాగములవలె విశాలములయిననోరు ముక్కురంధ్రములు గలవాఁడును, నాసికా... సాగరుండును = ముక్కురంధ్రములనుండి వెడలు దట్టములయిన నిశ్వాసవాయువులగుంపులతాఁకుడుచేఁ గలఁచఁబడి కాఁచఁబడుచున్న యేడుసముద్రములు గలవాఁడును, పూర్వ...లోచనుండును=తూరుపుకొండమీఁద వెలుఁగు సూర్యమండలమువలెనున్న యందములైన కన్నులు గలవాఁడును, లోచనాంచల...మండలుండును=కనుఁగొనలనుండి రాల్చఁబడుచున్న చలించుచున్న మంటలచే భయంకరములయిన మిణుఁగురులమొత్తములచే నడ్డపెట్టఁబడిన నక్షత్రములు గ్రహములు గలవాఁడును, శక్ర...వదనుండును=ఇంద్రధనుస్సులవలె వంకములై యుగ్రములైన పెద్దకనుబొమలముడిచే దిట్టమై భీతినిగలిగించు మొగముగలవాఁడును, ఘనతర...భాగుండును = పెద్దకొండ గుండులవంటి సుందరములయిన చెక్కిలిపట్టులు గలవాఁడును, సంధ్యా...జాలుండును = సంధ్యాకాలమందలి యెఱ్ఱదనముచే నెఱ్ఱనైన మేఘపంక్తులవంటి మబ్బునెరయుచున్న వెల్లివిరియుచున్న మిక్కిలిస్ఫుటములయిన జడల మొత్తములు గలవాఁడును, సటా...విమానుండును = జడలమొత్తమును జాడించుటవలనఁ బుట్టినగాడ్పులచే నుయ్యేల లూఁగుచున్న దేవతలవిమానములు గలవాఁడును, నిష్కం...కర్ణుండును = త్రిప్పఁబడిన పెద్దశంఖములవంటి చెవులుగలవాఁడును, మంథ...కేసరుండును=కవ్వముగానైన మందరపర్వతముయొక్క తిరుగుటయందైన తొందరచేఁ బుట్టుచున్న ఆకాశమున నిండి ప్రకాశించుచున్న పాలసముద్రపుతరంగముల తుంపురులవలె ప్రకాశించునందములైనవెండ్రుకలు గలవాఁడును, పర్వా...డును = పున్నమనాఁటిచంద్రునికిరణములవలె తెల్లనైన జూలు గలవాఁడును, నిజ...కోటరుండును = తనగర్జితధ్వనులచేఁ జీల్చఁబడిన కుముదసుప్రతీకవామనాది అష్టదిగ్గజముల కర్ణరంధ్రములు గలవాఁడును, ధవళ...దేహుండును = తెల్లనైన కొండవలె (కైలాసమువలె) పొడవై చూడనలవికాని దేహముగలవాఁడును,

దేహ... కారుండును = శరీరమందలికాంతులఁ గలఁచఁబడిన శత్రురాత్రు సుల సమూహములగర్వ మనుచీఁకటి గలవాఁడును, ప్రహ్లాద... సంయుతుం డును = ప్రహ్లాదుని సుఖింపఁజేయుటకును, హిరణ్యకశిపునిఁ జంపుటకుఁ గా రణములయిన లోపల వెలుపల నున్న పొగడఁబడిన కరుణారసము వీరరసము గలవాఁడును, మహాప్రభావుండును = గొప్పమహిమ గలవాఁడును, అయి న, శ్రీనృసింహదేవుండు = దివ్యప్రకాశముగల నృసింహస్వామి, ఆవిర్భవిం చినన్ = పుట్టఁగా, కనుంగొని = చూచి.

క. నరమూర్తి గాదు కేవల
హరిమూర్తియుఁ గాదు మానవాకారముఁ గే
సరియాకారము నున్నది
హరిమాయారచిత మగు యథార్థము సూడన్. 286

టీ. నరమూర్తి= మనుష్యరూపము, కాదు, కేవలహరిమూర్తియు = వట్టి సింగపురూపును, కాదు, మానవాకారము = మనుజరూపమును, కేసరి = సింహముయొక్క, ఆకారమును, ఉన్నది, చూడన్ = విచారిం చఁగా, ఇది, హరిమాయారచితము = విష్ణుమూర్తిమాయచే నిర్మించఁబడిన యొక అపూర్వసూతము, అగును, యథార్థము = నిజము.

తా. ఈపొడకట్టినరూప మచ్చ మనుష్యరూపముగాదు. వట్టి సింహ రూపముగాదు నరసింహరూపములు గలిసియున్నది. ఇది తప్పక విష్ణుమా యచే నాశ్చర్యకరముగాఁ గల్పింపఁబడిన యొకవింతజంతువు గానోపును.

ఉ. తెంపున బాలుఁ డాడినసుధీరత సర్వగతత్వముం బ్రతి
ష్ఠింపఁ దలంచి యుందు నరసింహశరీరముఁ దాల్చి చక్రి శి
క్షింపఁగ వచ్చినాఁడు హరిచేమృతి యంచుఁదలంతు నైన నా
సొంపును బెంపు నంచఁలనుజూడఁజరింతు హరింతుశత్రువున్.

టీ. తెంపునన్ = సాహసముతో (నిశ్చయముతో), బాలుఁడు = ప్రహ్లాదకుమారుఁడు, ఆడినసుధీరతన్ = పలికిన సత్యవాక్యబలమున, సర్వ

గతత్వముఁ = సర్వభూతాంతర్యామియగుటను, ప్రతిష్ఠింపఁ దలంచి = స్థాపింపఁగోరి, చక్రి = విష్ణువు, ఇందు = ఈ స్తంభమున, నరసింహాకారముఁ = నరసింహరూపమును, తాల్చి = ధరించి, శిక్షింపఁగఁ = దండించుటకు, వచ్చినాఁడు, హరిచేఁ = విష్ణువుచేత, నాకు, మృతి = చావు, కలుగును, అంచుఁ దలంతుఁ = అని తలఁచెదను, ఐనను, అందఱును = ఈచూపరులందఱు, నాసొంపును = నాయందమును, పెంపుఁ = బలమును, చూడఁ = చూచునట్లుగా, చరింతుఁ = తిరుగుదును, శత్రువుఁ = విరోధియైన యీమృగమును, హరింతుఁ = సంహరింతును.

తా. తనభక్తుఁడైనప్రహ్లాదుఁడు ధైర్యముతో విష్ణువు సర్వగతుఁ డని చెప్పినమాటను, నిజము సేయఁదలఁచి, యావిష్ణువే యిట్లు నరమానుషరూపమును బూని వచ్చినాఁడు. నా కిఁక వీనిచేతఁ జావక తప్పదు. అయినను ఎల్లరును నాశౌర్యధైర్యములు జూచి మెచ్చుకొనునట్లు పోరి యీమృగమును జంపఁజూచెదను.

వ. అని మెత్తంబడనిచిత్తంబున గద యెత్తికొని తత్తఱంబున నార్చుచు నకుంఠితకంఠీరవంబు డగ్గఱుగంధసింధురంబు చందంబున నక్తంచరకుంజరుండు నరసింహదేవున కెదురు నడచి తదీయదివ్యతేజోజాలసన్నికర్షంబునం జేసి దవానలంబు డగ్గఱిన ఖద్యోతంబునుం బోలెఁ గర్తవ్యాకర్తవ్యంబులు దెలియక నిర్గతప్రభుండయి యుండె నప్పుడు. 288

టీ. అని పలుకుచు, మెత్తంబడనిచిత్తంబునఁ = సడలనిమనముతో, తత్తఱంబునఁ = తొందరపాటుతో, ఆర్చుచుఁ = కేకలిడుచు, అకుంఠితకంఠీరవంబుఁ = వెనుబడనిపరాక్రమము గలసింహమును, డగ్గఱు గంధసింధురంబుచందంబునఁ = సమీపించు మదపుటేనుఁగువలె, నక్తంచరకుంజరుండు = రాక్షసశ్రేష్ఠుఁడు, నరసింహదేవునకుఁ = నరసింహమూర్తికి, ఎదురు నడిచి, తదీయ దివ్యతేజోజాలసన్నికర్షంబునం జేసి = ఆనరసింహమూర్తియొక్క అమానుషమైన ప్రకాశసమూహము దాపువలన,

దవానలంబు = కార్చిచ్చును, డగ్గటిన ఖద్యోతంబునుంబోలెన్ = మిణుఁగుఱుఁబుర్వులాగున, కర్తవ్యాకర్తవ్యంబులు=చేయఁదగినదియు చేయఁదగనిదియు, తెలియక = తెలిసికోనేరక, నిర్గతప్రభుండు = పోయినతేజస్సు గలవాఁడు.

మ. ప్రకటంబై ప్రళయావసానమున మున్ బ్రహ్మాండభాండావరో
ధకమైయున్నతమిస్రమున్ జగమునుత్పాదించుచోఁ ద్రావిసా
త్త్వికతేజోనిధియైనవిష్ణునెడ నుద్దీపించునే నష్టమై
వికలంబై చెడుఁగాక తామసులప్రావీణ్యంబు రాజోత్తమా.

టీ. రాజోత్తమా = ధర్మరాజా, తామసుల ప్రావీణ్యంబు =తమోగుణప్రధానులనేర్పు, మున్ = మును, ప్రళయావసానమునన్ = ప్రళయాంతమందు, జగమున్ = లోకమును, ఉత్పాదించుచోన్ = పుట్టించునప్పుడు, ప్రకటంబై = బయలుపడినదై, బ్రహ్మాండభాండావరోధకమై = బ్రహ్మాండ మనుకటాహమును గ్రమ్ముకొన్నదై, ఉన్నతమిస్రమున్ = ఉన్నచీఁకటిని, ద్రావి= మ్రింగి, సాత్త్వికతేజోనిధి = సత్త్వగుణ సంబంధమైన తేజస్సుతోఁ గూడినవాఁడు,ఐన,విష్ణునెడన్ = అయిన శ్రీహరివిషయమై, నష్టము = నశించినది, ఐ, వికలము=చెదిరినది, ఐ, చెడును గాక = చెడిపోవునేగాని, ఉద్దీపించునే = తలచూపునా, చూపదు.

తా. ధర్మరాజా! పూర్వము ప్రళయావసానమున మరలప్రపంచసృష్టిచేయునప్పుడు బ్రహ్మాండమంతటను గ్రమ్ముకొన్న కటికిచీఁకటిని మ్రింగివైచి తనసత్త్వమును వెల్లడించిన ఆవిష్ణువుముందఱ ఈలాటి తమోగుణప్రధానులనేర్పు లేమిలెక్క? ఎందుకును గొఱగావు.

వ. అంత నద్దానవేంద్రుండు మహోద్దండం బగుగదాదండంబు గిరగిరంద్రిప్పి నరమృగేంద్రుని వ్రేసిన నతండుదర్పంబున సర్పంబు నొడిసిపట్టుసర్పపరిపంథినేర్పున దితిపట్టిం బట్టికొనిన మిట్టి

పడి దట్టించి బిట్టుకట్టలుక నయ్యసురవరుండు దృఢబలంబున నిట్టట్టు మిడిసి పట్టు దప్పించుకొని విడివడి దిటవు దప్పక కుప్పించి యుప్పరం బెగసి విహంగకులరాజచరణనిర్గళితభుజంగం బు తెఱంగునం దలంగ నుఱికి తనభుజాటోపంబున నరకంఠీరవుండు గుంఠితుం డయ్యెడి నని తలంచి కలంగక చెలంగుచుం దన్ను నిబిడనీరదనికరంబులమాటున నిలింపులు గుంపులుగొని డాఁగి మూఁగి క్రమ్మఱ నాత్మీయజీవనశంకాకళంకితులై మంతనంబులం జింతనంబులు సేయుచు నిరీక్షింప నక్షీణసమరదక్షతావిశేషం బుపలక్షించి ఖడ్గవర్మంబులు ధరియించి భూనభోభాగంబుల వివిధవిచిత్రలాఘవనాలాఘవంబులం బరిభ్రమణభేదంబులం గరాళవదనుం డయి యంతరాళంబునం దిరుగుసాళువపుడేగచందంబున సంచరించిన సహింపక. 290

టీ. అద్దానవేంద్రుండు = ఆహిరణ్యకశిపుఁడు, మహోద్దండంబు = మిక్కిలి భీషణమగు, గదాదండంబు, గిరగిరన్, త్రిప్పి, నరమృగేంద్రునిన్ = నరసింహమూర్తిని, వేసినన్ = కొట్టఁగా, దర్పంబునన్ = గర్వముతోడ, సర్పంబున్ = పామును, ఒడిసి, పట్టు, సర్పపరిపంథి నేర్పునన్ = గరుత్మంతునివలె, దితిపట్టిన్ = దితికొడుకును (హిరణ్యకశిపుని), మిట్టిపడి = ఎగిరిపడి, అయ్యసురవరుండు = ఆరాక్షసశ్రేష్ఠుఁడు, దట్టించి = అదలించి, బిట్టుకట్టలుకన్ = మించినరోషాతిశయముచేత, దృఢబలంబునన్ = మిక్కిలి యుక్కుతో, ఇట్టట్టు మిడిసి = ఎగిరి, పట్టు, తప్పించుకొని, విడివడి = తెగబడి, దిటవు = ధైర్యము, తప్పక = వీడక, కుప్పించి = దుమికి, ఉప్పరంబు ఎగసి = పైకెగిరి, విహంగ... తెఱంగునన్ = గరుత్మంతుని కాళ్లసందుననుండి తప్పించుకొన్న పామువలె, దలంగన్ ఉఱికి = తొలఁగఁ బాఱి, తనభుజాటోపంబునన్ = తన బాహుబలముచేత, నరకంఠీరవుండు = నరసింహమూర్తి, కుంఠి

తుండు=ఓడిపోయినవాఁడు, అయ్యేడిక్=అగును, అని, తలంచి, కలంగక= బెదరక, చెలంగుచున్=ప్రకాశించుచు, తన్ను, నిబిడ...మాటునన్=దట్టములైన మబ్బుతుట్టెలచాటున, నిలింపులు=దేవతలు, గుంపులుగొని=గుట్టలువడి, డాఁగి=దాఁగుకొని, మూఁగి=ముసురుకొని, క్రమ్మఱన్ = మరల, ఆత్మీయ...తులై=తమబ్రతుకుబడియందు అనుమానపడినవారై, మంతనంబులన్=తమహృదయములయందు,చింతనంబు సేయుచు = యోఁచించుచు, నిరీక్షింపన్=చూడఁగా, అక్షీణ...విశేషంబు=తగ్గిపోవని యుద్ధకౌశలము యొక్క అతిశయమును, ఉపలక్షించి=చూచి, ఖడ్గచర్మంబులు=కత్తిని జోడును, ధరియించి, భూనభోభాగంబులన్=నేలను ఆకసమునను, వివిధ...లాఘవంబులన్=పలుదెఱఁగులైనఆశ్చర్యములైనదూఁకుటయందలి నేర్పులతోడను, పరిభ్రమణభేదంబులన్=మండలగతి విశేషంబులచేతను, కరాళవదనుండు=భయంకరమైనముఖము గలవాఁడు అయి, అంతరాళంబునన్= ఆకాశమున, తిరుగు, సాళువపులుఁగచందంబునన్=అణుజువలె, చరించినన్=తిరుగాడఁగా, సహింపక=ఓర్వక.

సీ. పంచాననోద్ధూతపావకజ్వాలలు
భూనభోంతరమెల్లఁ బూరితముగ
దంష్ట్రాంకురాభీలధగధగాయితదీప్తి
నసురేంద్రునేత్రము లందములు గఁ
గంటకసన్నిభోత్కటకేసరాహతి
నభ్రసంఘము భిన్నమై చలింపఁ
బ్రళయార్కచంచలాప్రతిమభాస్వరములై
ఖరనఖరోచులు గ్రమ్ముదేర

తే. సటలు జళిపించి గర్జించి సంభ్రమించి
దృష్టి సారించి బొమలు బంధించి కెరలి

జిహ్వా యాడించి లంఘించి చేత నొడిసి
పట్టె నరసింహుఁ డాదితిపట్టి నధిప. 291

టీ. అధిప=రాజా, నరసింహుఁడు, ఆదితిపట్టిన్=దితికొడుకగు నా హిరణ్యకశిపుని, పంచా...జ్వాలలు=ఐదు మొగములనుండి పుట్టిన నిప్పుమంటలు, భూనభోంతరము ఎల్లన్=భూమి ఆకాశములసందున, పూరితము కన్=నిండుకోఁగా, దంష్ట్రా...దీప్తిన్=మొలకకోఱలయొక్క ధగధగ మనుకాంతిచేత, అసురేంద్రు నేత్రములు=హిరణ్యకశిపునికన్నులు, అంధములు కన్, కంటక...హతిన్=ముండ్లవంటివాఁడిరోమములతాఁకున, అభ్రసంఘము=మబ్బుగమి, భిన్నమై=విరిసినదై, చలింపన్=పరుగఁగా, ప్రళయాభ్ర...భాస్వరములు=ప్రళయకాలమందలి మేఘములయందలి మెఱుపులవలె సాటిలేక ప్రకాశించునవి, ఐ, ఖరనఖరోచులు=వాఁడిగోరులకాంతులు, క్రమ్ముదేరన్=వ్యాపించఁగా, సటలు=జూలు, జళిపించి=జాడించి, గర్జించి, సంభ్రమించి=రేఁగి, దృష్టి=చూపు, సారించి=నిగిడించి, బొమలు, బంధించి=ముడివైచి, కెరలి=కోపించి, జిహ్వా=నాలుక, ఆడించి, లంఘించి=పైకుటికి, చేతన్=చేతతో, ఒడిసిపట్టెను.

తా. ధర్మరాజా! అంతట నృసింహమూర్తి తనయైదు మొగములయందుండి బయలువెడలిన మంటలు భూమి ఆకాశము గ్రమ్ముకొనఁగా, భయంకరమైన కోఱలకాంతులచే హిరణ్యకశిపుని కనులు మిఱుమిట్లు గొనఁగా, ముండ్లవంటి రోమములతాఁకుడునే మేఘము లన్నియు పటాపంచలుకాఁగా, ప్రళయకాలమేఘములయందలి మెఱుపులవలె గోళ్లకాంతులు మెఱయఁగా, జూలు విదిర్చి గర్జించి ఆటోపమొంది దృష్టి నిగుడించి కనుబొమలు ముడివైచి నాలుక అల్లలనాడించి ఆహిరణ్యకశిపునిమీఁది కుటికి ఒడిసి పట్టుకొనెను.

క. సరకుగొనక లీలాగతి
నురగేంద్రుఁడు మూషికంబు నొడిసినపగిదిన్
నరకేసరి దను నొడిసిన
సురవిమతుఁడు ప్రాణభీతి సుడివడియె నృపా. 292

టీ. నృపా=రాజా, సురవిమతుఁడు=దేవతల శత్రువైన హిరణ్యక శిపుఁడు, నరకేసరి=నరసింహమూర్తి, సరకుగొనక=లెక్క సేయక, లీలాగతిన్=విలాసముగా, ఉరగేంద్రుఁడు=సర్పరాజము, మూషికంబున్=ఎలుకను, ఒడిసినపగిదిన్=పట్టుకొనినట్లు, తనున్, ఒడిసినన్=పట్టుకోఁగా, ప్రాణభీతిన్=ప్రాణభయముచేత, సుడివడియెన్=కలఁగెను.

తా. హిరణ్యకశిపుఁడు ఇట్లు పాము ఎలుకను బట్టుకొన్నట్లు తనను ఒకలెక్క సేయక చమత్కారముగా ఒడిసిపట్టఁగాఁ బ్రాణభయముచే మిగుల కొట్టుకాడెను.

క. సురరాజవైరి లోఁబడెఁ
బరిభావితసాధుభక్తపటలాంహునకున్
నరసింహునకు నుదంచ
త్ఖరతరజిహ్వునకు నుగ్రతరరంహునకున్. 293

టీ. పరిభావితె...హునకున్=క్రిందు జేయఁబడిన సజ్జనులైన భక్తసంఘముల పాపములు గలవాఁడును, ఉదంచత్...జిహ్వునకున్=మెఱయుచున్న గలుకునాలుక గలవాఁడును, ఉగ్రతరరంహునకున్ = భయంకరమైన బలముగల, నరసింహునకున్=నరసింహమూర్తికి, సురరాజవైరి=దేవేంద్రుని విరోధి యగుహిరణ్యకశిపుఁడు, లోఁబడెను = లొంగెను.

తా. పోఁగొట్టఁబడిన భక్తులపాపములుగలవాఁడును, మెఱయుచున్న గలుకునాలుక గలవాఁడును, భీకరబలసంపన్నుఁడైన ఆనరసింహమూర్తికి హిరణ్యకశిపుఁడు లోఁబడెను.

వ. అంత. 294

మ. విహగేంద్రుం డహి వ్రచ్చుకై వడి మహోహాద్వారమూర్తిన్ నృసిం
హుండు సాగ్రహుఁడై యూరువులందుఁ జేర్చి నఖసంఘా
తంబులన్ వ్రచ్చెదు, స్సహు దంభోళికఠోరదేహు నచలో
త్సాహున్ మహాబాహు నిం, ద్రహుతాశాంతకభీకరున్
ఘనకరున్ దైత్యాన్వయశ్రీకరున్. 295

టీ. నృసింహుండు = నృసింహమూర్తి, దుస్సహ...దేహుఁడు = ఓర్వరాని వజ్రాయుధమువలె కఠినమైనశరీరము గలవాఁడును, అచలోత్సాహుఁడు = కదలనిపూనికగలవాఁడును, మహాబాహుఁడు = గొప్పభుజములు గలవాఁడును, ఇంద్ర...భీకరుఁడు = ఇంద్రుఁడు అగ్ని యముఁడు వీరికి భయముపుట్టించువాఁడును, ఘనకరుఁడు = బల్లిదమైనచేతిలావుగలవాఁడును, దైత్యాన్వయశ్రీకరుఁడు = రాక్షసవంశమునకు వన్నెవెట్టువాఁడును అగుహిరణ్యకశిపుని, సాగ్రహుఁడై = రోషముతోఁ గూడినవాఁడై, విహగేంద్రుండు = గరుత్మంతుఁడు, అహిన్ = పామును, వ్రచ్చుకైవడిన్ = చీల్చులాగున, మహోద్వృత్తిన్ = గొప్పగర్వముతో, ఊరువులందున్ = తొడలమీఁద, ఆర్చి, నఖసంఘాతంబులన్ = గోటిపోటులచేత, వ్రచ్చెన్ = చీల్చెను.

తా. నరసింహమూర్తి గరుత్మంతుఁడు పామును జీల్చినట్లు ఓర్వరాని పరాక్రమము గలవాఁడును, చలించనిపూనిక గలవాఁడును, గొప్పభుజములు గలవాఁడును, ఇంద్రుఁడు అగ్ని యముఁడు వీరికి భయము గలిగించువాఁడును బలశాలియు నగుహిరణ్యకశిపుని మిక్కుటమైనకోపముతోఁ బట్టి తొడలమీఁదఁ బెట్టికొని క్రోధముతోఁ దనవాఁడిగోళ్లకొలఁదిని జీల్చివైచెను.

శా. చించున్ హృత్కమలంబు శోణితము వర్షించున్ ధరామండలిం, ద్రెంచుం గర్కశనాడికావళులుభేదించున్ మహావక్షము, న్ద్రుంచున్ మాంసము సూక్ష్మఖండములుగా దుష్టాసురున్ వ్రచ్చి ద, గ్ర్పించుం బ్రేవులు కంఠమాలికలు గల్పించున్ నఖోద్భాసియై. 206

టీ. నరసింహమూర్తి, హృత్కమలంబు = హిరణ్యకశిపుని కమలమువంటిహృదయమును, చించున్ = పగులఁ జీల్చును, ధరామండలిన్ = భూవలయముమీఁద, శోణితము = నెత్తురు, వర్షించున్ = కురియును, కర్కశనాడికావళులన్ = కఠినములైన నరములను, త్రెంచును, మహావక్షమున్ =

వెడఁదఱొమ్మును, భేదించుక్ = బద్దలుచేయును, మాంసము, నూత్కృఖండములుగాక్ = సన్నని ముక్కలుగా, దుర్చించుక్ = తునుకలు జేయును, నఖోద్భాసిదై = గోళ్లచే మెఱయువాఁడై, దుష్టాసురుక్ = పాపిరక్కసుని, ద్రచ్చి = చీల్చి, దర్పించుక్ = గర్వపడును, ప్రేవులు, కంఠమాలికలు = మెడలోహారములుగా, కల్పించుక్ = నిర్మించును.

తా. నరసింహమూర్తి గోళ్లచే మెఱయుచు ఇట్లు హిరణ్యకశిపుని చీల్చి కొంతసేపు హృదయము చించును; నేలనిండ నెత్తురు చల్లును, కఠినములైన నరములను దెగ్రింపును, పెద్దదైనఱొమ్మును బగులఁగొట్టును, మాంసము చిన్నచిన్నముక్కలుగాఁ జేయును, పేగులు హారములుగా మెడలోవేసికొనును, ఇట్లు నానావిధములుగా హింసించెను.

సీ. వక్షఃకవాటంబు వ్రక్కలు సేయుచో
ఘనకుఠారంబులకరణి నొప్పు
గంభీరహృదయపంకజము భేదించుచోఁ
గుద్దాలములభంగిఁ గొమరుమిగులు
ధమనీవితానంబు దవిలి ఖండించుచోఁ
బటులవిత్రంబులపగిది మెఱయు
జఠరవిశాలాంత్రజాలంబుఁ ద్రెంచుచోఁ
గ్రకచసంఘంబులగరిమఁ జూపు
తే. నంకగతుఁడైనదైత్యుని నాగ్రహమున
శస్త్రచయముల నొంపక సంహరించి
యమరునరసింహునఖరంబు లతివిచిత్ర
సమరముఖరంబులై యుండె జనవరేణ్య. 297

టీ. జనవరేణ్య = నరోత్తమా, అంకగతుఁడు = తొడయందున్నవాఁడు, ఐన, దైత్యునిక్ = హిరణ్యకశిపుని, ఆగ్రహమునక్ = కోపముతో, శస్త్రచయములక్ = బాణపరంపరలచే, ఒంపక = సుర్కక్కఁజేయక,

సంహరించి = చంపి, అమరు...బులు = ఒప్పుచున్న నరసింహమూర్తిగోళ్లు, వక్షఃకవాటంబు = వానితలుపువంటి ఱొమ్మును, వ్రక్కలుచేయుచో = ముక్కలుగాఁ జేయునప్పుడు, ఘనసారాంబులకిరణిన్ = పెద్దగొడ్డండ్లవలె, ఒప్పున్ = ప్రకాశించును, గంభీరహృదయపంకజము = లోఁతైనకమలమువంటిహృదయమును, భేదించుచోన్ = బ్రద్దలుచేయునప్పుడు, కుద్దాలములభంగిన్ = గుద్దళ్లవలె, కొమరుమిగులున్ = అందములగును, ధమనీవితానంబున్ = నరములను, తవిలి = పూని, ఖండించుచోన్ = కోయునప్పుడు, పటులవిత్రంబులపగిదిన్ = గట్టికొడవండ్లవలె, మెఱయున్ = ప్రకాశించును, జఠర...జాలంబున్ = కడుపులోనిపొడవైనపేగులపోగులను, తెగించుచోన్ = తునుముచు, క్రకచసంఘంబులగరిమన్ = రంపములపోలికను, చూపును, ఇట్లు, అతివిచిత్రసమరముఖరఁబులు = మిగులనబ్బురమైన యుద్ధమున నాశ్చర్యకరము లైనయుద్ధసాధనములుగా నుండెను.

తా. రాజా! ఇట్లు ఒక్కఆయుధమును లేకయే తొడమీఁదఁ బెట్టుకొని హిరణ్యకశిపుని జీల్చుచున్న ఆనరసింహమూర్తిగోళ్లు, వానిఱొమ్మును చెక్కలుసేయునప్పుడు గొడ్డండ్లవలెనుండెను. లోఁతైనహృదయమును బ్రద్దలు చేయునప్పుడు గుద్దళ్లవలెనుండెను. నరములను దెగించునప్పుడు గట్టికొడవండ్లవలెనుండెను. కడుపునందలి పేగులను దెగించునప్పుడు రంపములవలె నుండెను. ఇట్లు ఆయాపనులకుఁ దగిన విచిత్రము లైనఆయుధములుగా నొప్పుచుండెను.

క. స్ఫురితవిబుధజనముఖములు
పరివిదళితదనుజనివహపతితనుముఖముల్
గురురుచిజితశిఖిశిఖములు
నరహరిఖరనఖము లమరు నతజనసఖముల్. 208

టీ. స్ఫురిత...ముఖములు = ఆనందముచేఁ బ్రకాశింపఁ జేయఁబడిన దేవతలముఖములు గలవియు, పరి...ముఖముల్ = చీల్చఁబడిన రాక్షసస మూహమునకు రాజైన హిరణ్యకశిపుని శరీరమును ముఖమును గలవియు,

గురు...ములు=గొప్పకాంతిచే నోడించఁబడిన యగ్నిజ్వాలలు గలవియు, నతజనసఖముల్ = మ్రొక్కెడువారలకు హితములైన, నరహరిఖరనఖములు=నరసింహునివాఁడిగోళ్లు, అమరుఙ్ = ప్రకాశించును.

తా. దేవతా (పండిత) ముఖములను వికసింపఁజేయునవియు, రాక్షసరాజుయొక్క ముఖమును దేహమును జీల్చినవియు, గొప్పకాంతిచేత జయింపఁబడిన అగ్నిజ్వాలలు గలవియు, నమస్కరించినవారికి పరమహితములైన నరసింహునిగోళ్లు మిగులఁ బ్రకాశించుచుండెను.

వ. ఇట్లు కేవలపురుషరూపంబును మృగరూపంబునుం గాని నరసింహరూపంబున రేయునుం బవలునుం గానిసంధ్యాసమయంబున నంతరంగంబును బహిరంగంబునుం గానిసభాద్వారంబున గగనంబును భూమియునుం గానియూరుమధ్యంబునఁ బ్రాణసహితంబులును బ్రాణరహితంబులునుం గాని నఖంబులం ద్రైలోక్యజనహృదయభల్లుం డయినదైత్యమల్లుని వధియించి, మహోదహనకీలాభీలదర్శనుండును గరాళవదనుండును లేలిహానభీషణజిహ్వుండును శోణితపంకాంకితకేసరుండును నై ప్రేవులు కంఠమాలికలు గ ధరించి కుంభికుంభవిదళనంబు సేసి చనుదెంచుపంచాననంబునుంబోలె దనుజకుంజరహృదయకమలవిదళనంబు సేసి తదీయరక్తసిక్తంబు లయిననఖంబులు సంధ్యారాగరక్తచంద్రరేఖలచెలువు వహింప సహింపక లేచి తనకట్టెదుర నాయుధంబు లెత్తుకొని తత్క్షణంబున రణంబునకు నురవడించు రక్కసులం బెక్కుసహస్రంబులం జక్రాదికనిర్వక్రసాధనంబుల నొక్కనిం జిక్కకుండం జక్కాడి చె నివ్విధంబున. 299

టీ. కేవలపురుషరూపము = వట్టిమానవాకారము, మృగరూపంబు= మెకముపోలుపు, కాని నరసింహరూపంబునఙ్ = నరసింహరూపముతో,

రేయును=రాత్రియును, పగలును, అంతరంగంబును = ఇంటినడుమను, బహిరంగంబును=వెలుపలను, కాని, సభాద్వారంబునన్=కొలువుకూటము వాకిటిలో, గగనంబును = ఆకాశమును, భూమియును, కాని, ఊరు మధ్యంబునన్ = తొడలనడుమను, ప్రాణసహితములు = ప్రాణముతోఁ గూడినవి, ప్రాణరహితములు = ప్రాణములులేనివి, నఖంబులన్ = గోళ్ల చేత, త్రైలోక్య...భల్లుండు = ముల్లోకములయందలిజనుల హృదయములకు బల్లెమువంటివాఁడు, అయినదైత్యమల్లునిన్ = అయినరాక్షసశ్రేష్ఠుని, వధియించి = చంపి, మహా...దర్శనుండును = పెద్దఅగ్నియొక్కమంటలవలె భయంకరమైనచూపులు గలవాఁడును, కరాళవదనుండును = భయంకరమైన ముఖముగలవాఁడును, లేలిహానభీషణజిహ్వుండు = నాఁకుచున్న ఘోరమైన నాలుకగలవాఁడును, శోణిత...కేసరుండును = నెత్తురుబురదఁ బూయఁబడినజూలుగలవాఁడును, అయి, ప్రేవులు, కంఠమాలికలుగన్ = మెడలోని హారములుగా, ధరించి, కుంభి...నంబు=ఏనుఁగుకుంభస్థలపాటనమును, చేసి, చనుదెంచు పంచాననంబునుం బోలెన్=వచ్చుసింగమువలె, దనుజ...నంబు=రాక్షసరాజుయొక్క ఱొమ్ము చీల్చుటను, చేసి, తదీయ రక్తసిక్తంబులు=వానినెత్తురుచేఁ దడిసినవి, ఐన నఖంబులు=గోళ్లు, సంధ్యా...రేఖలచెలువునన్=సంధ్యాకాలమందలి యెఱ్ఱదనముచే నెఱ్ఱనైన చంద్రకళలయందమును, వహింపన్=తాల్పఁగా, సహింపక = ఓర్వక, కట్టెదురన్=కన్నులముందఱ, తత్తరంబునన్=సంరంభముతో, రణంబునకున్ = యుద్ధమునకు, ఉరవడించు=దుముకుచున్న, రక్కసులన్ = రాక్షసులను, పెక్కుసహస్రంబులన్=అనేకములైనవేలను, చక్రాది...బులన్=చక్రము మొదలగు అసంఖ్యాతములైన ఆయుధములతో, ఒక్కని, నైననుచిక్కకుండన్ = మిగులనట్లు, చక్కడిచెన్ = చంపెను.

శా. రక్షోవీరుల నెల్లఁ ద్రుంచి రణసంరంభంబు సాలించి దృ
ష్టిక్షేపంబు భయంకరంబుగ సభాసింహాసనారూఢుఁడై

యతీక్ష్ణాగ్రహుఁడై నృసింహుఁడు కరాళాస్యంబుతో నొప్పె దగ్
వీక్షింపం బలికింప నోడి యితరుల్ విభ్రాంతులై డాఁగఁగన్. 300

టీ. నృసింహుండు=నరసింహమూర్తి, రక్షోవీరులన్ = రాక్షసుల యందలిశూరులను, ఎల్లన్, ద్రుంచి=చంపి,రణసంరంభంబు=యుద్ధమందలి యాటోపమును, చాలించి, దృష్టిక్షేపంబు = చూపుల నిగుడ్చుట, భయంకరంబుగన్=బెదురుగలుగునట్లుగా, సభా...ధుఁడై=సభయందున్న సింహాసనమందుఁ గూర్చున్నవాఁడై,అతీక్ష్ణాగ్రహుఁడై=తగ్గనికోపముగలవాఁడై, తనను, ఇతరులు, వీక్షింపన్=చూచుటకును, పలికింపన్=మాటలాడించుటకును, ఓడి=భయమంది, విభ్రాంతులై=భ్రమ చెందినవారై, డాఁగఁగన్=దాఁగుకొనఁగా, కరాళాస్యంబుతోన్=భయంకరమైన మొగముతోడ, ఒప్పెన్=ప్రకాశించెను.

తా. ఇట్లు నరసింహమూర్తి రాక్షసులలో నెన్నికగలవా రందఱను మందునకైన లేకుండఁ జంపి యుద్ధసంరంభము చాలించి భయంకరముగాఁ జూచుచు నాసభయందలి సింహాసనమందు గూర్చుండి కోపము విడువక ఇతరులు తన్నుచూచుటకు పలుకరించుటకుఁగూడ శక్తులుకాక దాఁగుకొనఁగా భయంకరముఖముతో నుండెను.

క. సురచారణవిద్యాధర
గరుడోరగయక్షసిద్ధగణములలో నొ
క్కరుఁ డైన డాయ వెఱచును
నరహరి నయ్యవసరమున నరలోకేశా. 301

టీ. నరలోకేశా = మనుష్యలోకమునకు నాథుఁడ వైనయోధర్మరాజా, అయ్యవసరమునన్ = ఆసమయమున, సుర...గణములలోన్ = దేవతలు, చారణులు, విద్యాధరులు, గరుడులు, నాగులు, యక్షులు, సిద్ధులు వీరిసమూహములలో, ఒక్కరుఁడైనను, నరహరిన్ = నరసింహమూర్తిని, డాయన్ = సమీపించుటకు, వెఱచును = భయమందును.

తా. ఓధర్మరాజా! అట్లు కోపోద్రేకముతో నున్న ఆనరసింహామూ ర్తిని సుర చారణ విద్యాధరాది దేవతలలో నెక్కుడైన సమీపమునకుఁ బోవెఱచెను.

క. తర్షంబుల నరసింహుని
హర్షంబులఁ జూచి నిర్జరాంగనలు మహో
త్కర్షంబులఁ గుసుమంబుల
వర్షంబులు గురిసి రుత్సవంబుల నధిపా. 302

టీ. అధిపా = రాజా, నిర్జరాంగనలు = దేవవనితలు, తర్షంబులన్ = ఆదరములతో, హర్షంబులన్ = ఆనందములతో, నరసింహుని, చూచి, మహోత్కర్షంబులన్ = మిక్కిలి గొప్పతనములతో, ఉత్సవంబులన్ = సంతోషములతో, కుసుమంబుల వర్షంబులు = పూలవానలు, కురిసిరి.

తా. రాజా! దేవతాస్త్రీలు, ఆనరసింహామూర్తిని ప్రేమమీఱఁ జూచి ఆనందముతో నతిశయముగా వేడుకపడి పూలవానలు గురిసిరి.

వ. మఱియు నయ్యవసరంబున మింట ననేక దేవతావిమానంబులును గంధర్వగానంబులును నప్సరోగణనర్తనసంవిధానంబులును దివ్యకాహళభేరీపటహమురజాదిధ్వానంబులును బ్రకాశమానంబు లయ్యె సునందకుముదాదు లయినహరిపార్శ్వచరులును మహేశ్వర విరించి మహేంద్రపురస్సరు లగు త్రిదశకిన్నరకింపురుష పన్నగ సిద్ధసాధ్య గరుడ గంధర్వ చారణ విద్యాధరాదులును బ్రజాపతులును నరకంఠీరవదర్శనోత్కంఠు లయి చనుదెంచి. 303

టీ. అయ్యవసరంబునన్ = ఆసమయమందు, మింటన్ = ఆకాశమున, అనేక దేవతావిమానంబులును = లెక్కలేనిదేవతల ఆకాశయాన

ములును, గంధర్వ గానంబులును = గంధర్వులపాటలును, అప్సరో...బులును = అచ్చరలగుంపుల ఆటలతీరులను, దివ్య...బులును = దేవసంబంధములైన కాహళిలు భేరులు తప్పెటలు మద్దెలలు మొదలగువాని చప్పుడులును, ప్రకాశమానంబులు = వెలుఁగుచున్నవి, అయ్యెను, సునందకుముదాదులు = సునందుఁడు కుముదుఁడు మొదలైనవారు, అగు, హరి పార్శ్వచరులును = విష్ణుని పరిచారకులును, మహేశ్వర...రులు = శివుఁడు బ్రహ్మ ఇంద్రుఁడు మొదలగువారు, అగు, త్రిదశ...లును = దేవతలు అశ్వముఖులు అశ్వదేహులు నాగులు సిద్ధులు సాధ్యులు గరుడులు గంధర్వులు చారణులు విద్యాధరులు మొదలగువారును, ప్రజాపతులును = బ్రహ్మలును, నర...తులు = నరసింహమూర్తిని, చూచు వేడుకగలవారై, చనుదెంచి = వచ్చి,

క. కరకమలయుగళకీలిత
శిరులై డగ్గఱక భక్తిఁ జేసిరి బహుసం
సరణాబ్ధితరికి నఖరికి
నరభోజనహస్తిహరికి నరకేసరికిన్. 304

టీ. కర...శిరులై = కేలుఁదామరలజంటలచే ధరింపఁబడిన ఔఁదలుగలవారై, డగ్గఱక = దగ్గఱఁజేరక, బహు...తరికిన్ = విస్తారమైన సంసారసముద్రమునకు నావయగువాఁడును, నఖరికిన్ = గోళ్లుగలవాఁడును, నర...రికిన్ = మనుష్యులను జంపి తిను క్రూరరాక్షసుఁడను నేనుఁగునకు సింహమువంటివాఁడగు, నరకేసరికిన్ = నరసింహస్వామికి, భక్తిన్ = ప్రపత్తిని, చేసిరి = చూపిరి.

తా. ఆయింద్రాదులు అంజలులు ఫాలమున జేర్చుకొని దగ్గఱకు రావెఱచి దూరముననుండి అపారమైనసంసారసముద్రమునకు ఓడవంటివాఁడును, గోళ్లు గలవాఁడును, మనుష్యభక్షకుఁ డగునాహిరణ్యకశిపుఁడను నేనుఁగునకు సింహమువంటివాఁడగు నరసింహస్వామికి ప్రపన్నులై మ్రొక్కులిడిరి.

వ. ఆసమయంబున దేవతలందఱు వేఱువేఱ వినుతించి రందుఁ
గమలాసనుం డిట్లనియె. 305

టీ. వినుతించిరి = పొగడిరి, కమలాసనుండు = బ్రహ్మ.

మ. ఘనలీలాగుణచాతురిన్ భువనముల్ గల్పించి రక్షించి భే
దనముం జేయుదురంతశక్తికి ననంతజ్యోతికిం జిత్రవీ
ర్యునికిన్ నిత్యపవిత్రకర్మునికి నే నుత్కంఠతో నవ్యయా
త్మునికిన్ వందన మాచరించెదఁ గృపాముఖ్యప్రసాదార్థినై.

టీ. నేను, ఘన లీలాగుణచాతురిన్=గొప్పలైన వేడుకగాఁ దాల్చఁబడి సత్త్వాదిగుణముల నేర్పుచేత, భువనముల్ = లోకములను, కల్పించి=సృజించి, రక్షించి=కాపాడి, భేదనమున్=నాశమును, చేయు,దురంతశక్తికిన్=గొప్పసామర్థ్యముగలవాఁడును,అనంతజ్యోతికిన్=పరిమితిలేని దివ్యతేజముగలవాఁడును, చిత్రవీర్యునికిన్=ఆశ్చర్యమైన పరాక్రమము గలవాఁడును, నిత్యపవిత్రకర్మునికిన్ = ఎప్పుడు పావనములైన కర్మలు గలవాఁడును నగు, అవ్యయాత్మునికిన్ = నాశములేని యీయాత్మస్వరూపునికి, కృపాముఖ్యప్రసాదార్థినై = దయచేత ప్రధానమైన అనుగ్రహమును గోరినవాఁడనై, ఉత్కంఠతోన్ = వేడుకతోడ, వందనమాచరించెదన్ = నమస్కారముం జేయుచున్నాను.

తా. గొప్పవిలాసగుణముల మహిమచేత లోకములు బుట్టించి పెంచి సమయించుమహాసామర్థ్యము గలవాఁడును వర్ణింపశక్యముగాని దివ్యతేజము గలవాఁడును,విచిత్రమైన పరాక్రమముగలవాఁడును, శాశ్వతమై పావనమైన కర్మలుగలవాఁడును నాశరహితుఁడునగు పరమాత్మరూపునకు నే నాయన యనుగ్రహమును గోరి మ్రొక్కుచున్నాను.

వ. రుద్రుం డిట్లనియె. 307

చ. అమరవరేణ్య యీఁడట సహస్రయుగాంతమునాఁడు గానికో
పమునకు వేళ గాదు సురబాధకుఁడై నతమస్వినీచరున్

సమరమునఁ వధించితివి చాలుఁ దదాత్మజుఁ డైనవీఁడు స
ద్విమలుఁడు నీకు భక్తుఁడు పవిత్రుఁడు కావుము భక్తవత్సలా.

టీ. అమరవరేణ్య=దేవతలలో మేలైన యోస్వామీ, మీఁదటఁ= ఉత్తరకాలమున, సహస్ర...నాఁడుగాని=సహస్రయుగములు కడచనిన వెనుకగాని, (నేఁడే) కోపమునకు, వేళ = సమయము, కాదు, సురబాధకుఁడు = దేవతలను గారించువాఁడగు, ఐన, తమస్వినీచరుఁ = రాక్షసుని, సమరమునఁ = యుద్ధమందు, వధించితివి = చంపితివి, చాలును, తదాత్మజుఁడు = వానికొడుకు, ఐన, వీఁడు = ప్రహ్లాదుఁడు, సద్విమలుఁడు = మంచినిర్మలుఁడు, నీకు, భక్తుఁడు = దాసుఁడు, పవిత్రుఁడు=పావనుఁడు, కావున, భక్తవత్సలా = భక్తులయందు దయగలవాఁడా, వీనిని, కావుము, రక్షించుము.

తా. దేవతలకెల్ల మేలైన యోదేవుఁడా, సహస్ర మహాయుగములు గడచినమీఁదటఁగాని ఇప్పుడు కోపించి జగత్సంహారము సేయుటకు సమయముకాదు. నీ వెవనికొఱ కావిర్భవించినావో ఆదేవతలశత్రువును జంపితివి కదా. ఇఁక నీచేఁ జంపఁదగినవా రెవ్వరును లేరు. వాని కొడుకైన ఈ ప్రహ్లాదుఁడు అత్యుత్తముఁడు నీకు భక్తుఁడునుగాన భక్తులయందు పుత్రప్రేమ గల యోస్వామీ వీని రక్షించుము.

వ. ఇందుమిం డిట్లనియె. 309

సీ. ప్రాణిసంఘములహృత్పద్మమధ్యంబుల
నివసించి భాసిల్లు నీవ యెఱుఁగు
దింతకాలము దానవేశ్వరుచే బాధ
పడి చిక్కి యున్నయాపన్నజనుల
రక్షించితివి మమ్ము రాక్షసేశ్వరుఁ జంపి
క్రతుహవ్యములు మాకుఁ గలిగె మరల

మంటిమి నీసేవ మరగినవారలు
కైవల్యవిభవంబు కాంక్ష సేయ
ఆ. రితరసుఖము లెల్ల నిచ్ఛగింపఁగ నేల
యస్థిరంబు లివి యనంతభక్తిఁ
గొలువ నిమ్ము నిన్ను ఘోరదైత్యానీక
చిత్తభయదరంహ శ్రీనృసింహ. 310

టీ. ఘోర...రంహ=క్రూరులైన రాక్షసుల మందలకు భయమును బుట్టించు సంరంభముగల, శ్రీనృసింహ=నృసింహస్వామీ, ప్రాణి...బులఁ=జీవకోటుల హృదయకమలములనడుమ, నివసించి, భాసిల్లునీవు=ప్రకాశించు నీవే, ఎఱుఁగుదువు, ఇంతకాలము, దానవేశ్వరుచేఁ=హిరణ్యకశిపునిచేత, బాధపడి, చిక్కి=తగులుకొని, ఉన్న, ఆపన్నజనులఁ = అపాయపడిన వారలను, మమ్మును, రాక్షసేశ్వరుఁ=హిరణ్యకశిపుని, చంపి, రక్షించితి; మాకుఁ, మరలఁ, క్రతుహవ్యములు=యజ్ఞములయందలి హవిర్భాగములు, కలిగెను, మంటిమి=(నీదయచేత) బ్రతికినాము, నీసేవ, మరగిన వారలు=అలవడినవారు, కైవల్యవిభవంబు=మోక్షసామ్రాజ్యము, కాంక్ష సేయరు=కోరరు, ఇతరసుఖములు ఎల్ల=తదితరసుఖములన్నియు, ఇచ్ఛగింపఁగ=కోరఁగా, ఏల, ఎందులకు, ఇవి=ఈ తక్కిన అల్పసౌఖ్యములు, అస్థిరంబులు=చపలములు, నిన్ను, అనంతభక్తిఁ = తెంపులేని భక్తితో, కొలువనిమ్ము=సేవించునట్లు చేయుము.

తా. దుష్టరాక్షసులకు భయంకరమైన విక్రమము గలఓ నరసింహస్వామీ ! ఇన్నాళ్లనుండి, మేము ఈ హిరణ్యకశిపునివలనఁ బడిన బాధలు సర్వుల చిత్తములలో నివసించియుండు మీకుమాత్రము తెలియదా. వానికి వశమై బాధపడుచున్న మమ్మందఱను ఆదుర్మార్గుని జంపి రక్షించితివి. మరల మాకు యజ్ఞములలో హవిర్భాగములు దొరకఁగలవు. నీ దయవలన బ్రతికినారము. నీ కైంకర్య మలవడినవారు కైవల్యమునుసయితము కోరరు.

ఇఁక నితరములైన తుచ్ఛములైన పార్థివాదిసౌఖ్యములఁ జెప్పనేల? ఇవన్నియు స్థిరములుకావు కావున మాకివి యెవ్వియు వలదు. నీపాదములయందలి దృఢమైన భక్తిని ప్రసాదించినఁ జాలును.

వ. ఋషు లి ట్లనిరి. 311

మ. భవదీయోదరలీల లోకముల నుత్పాదించి రక్షింప నేఁ
డవి దైత్యునిచేత భేదితములై హ్రాస్వంబులై యుండ నీ
యవినీతుఁ నరసింహరూపమున సంహారంబు నొందించి వే
దవిధిం గ్రమ్మఱ నుద్ధరించితిగదా ధర్మానుసంధాయివై.

టీ. భవదీయోదరలీలఁ=నీసంబంధమైన ఉదరముతోడి విలాసముచేత, లోకములను, ఉత్పాదించి=పుట్టించి, రక్షింపఁ=కాపాడఁగా, నేఁడు, అవి =ఆలోకములు, దైత్యునిచేతఁ = హిరణ్యకశిపునిచేత, భేదితములు=చెఱుపఁబడినవి, ఐ, హ్రాస్వంబులు = క్షీణమైనవి,ఐ, ఉండఁ = ఉండఁగా, ఈయవినీతుఁ = ఈదురాత్ముని (హిరణ్యకశిపుని) నరసింహరూపమునఁ, సంహారంబునొందించి=చంపి, ధర్మానుసంధాయివి ఐ=ధర్మమును అనుసరించువాఁడవై, వేదవిధిఁ = వేదములలోనున్న ధర్మమును, క్రమ్మఱఁ=మరల, ఉద్ధరించితిగదా = నిలువఁబెట్టినావుగదా.

వ. పితృదేవత లిట్లనిరి. 313

టీ. పితృదేవతలు=అగ్నిష్వాత్తాదులు,

శా. చండక్రోధముతోడ దైత్యుఁడు వడిఁ శ్రాద్ధంబులఁ మత్సు
తుల్, పిండంబుల్ సతిలోదకంబులుగ నర్పింపంగ మాకీకయు
ద్దండత్వంబునఁ దానకైకొనుమహోదగ్రుండు వీఁడిక్కడఁ
ఖండింపంబడె నీనఖంబుల నుతుల్ గావింతు మాత్మేశ్వరా.

టీ. ఆత్మేశ్వరా=పరమాత్మరూపుఁడవైన ఓదేవా, దైత్యుఁడు = హిరణ్యకశిపుఁడు, చండక్రోధముతోడఁ = దారుణమైనకోపముతోడ,

పడిక్ = వేగముగా, మత్సుతుల్ = మాకొడుకులు, శ్రాద్ధంబులక్ = ఆబ్దికము మొదలైన పితృకర్మలలో, సతిలోదకంబులుగక్ = నువ్వులనీళ్లతోఁగూడ, సమర్పింపక్ = మమ్ముగూర్చి విడువఁగా, మాకు, ఈయక, ఉద్దండత్వంబునక్ = ధార్ష్ట్యముతోడ, తానే, కైకొనును, మహోదగ్రుండు = మిక్కిలి క్రూరుఁడు, వీఁడు = హిరణ్యకశిపుఁడు, ఇక్కడక్ = ఇచ్చోట, నీ నఖంబులక్ = నీగోళ్లచేత, ఖండింపంబడెక్ = చీల్చఁబడెను, నుతుల్ = స్తోత్రములను, కావింతుము = చేయుదుము.

తా. ఓనృసింహపరమాత్మా, ఈదుష్టరాక్షసుఁడు మాకొడుకులు మాకు తిలోదకముతోఁగూడ పిండప్రదానము చేయఁగా నవి మాకు చెంద నీయక గడుసుఁదనముతో నవి తానే అపహరించి మమ్ము పెట్టినబాధలు ఇన్నియని చెప్ప వీలుగాదు, ఇట్టి పరమదురాత్ముఁడు నేఁడు నీగోళ్ల వాతఁబడి ప్రాణములు విడిచినాఁడు ఓస్వామీ నీకు వేవేలు నమస్కారములు.

వ. సిద్ధు లి ట్లనిరి. 315

క. క్రుద్ధుం డై యణిమాదిక
సిద్ధులు గైకొనినదైత్యుఁ జీరితివి మహా
యోద్ధవు నీకృప మాకును
సిద్ధులు మరలంగఁ గలిగె శ్రీనరసింహా. 316

టీ. శ్రీనరసింహా = సంపద గల ఓనరసింహస్వామీ, క్రుద్ధుండు = కోపగించుకొనినవాఁడు, ఐ, అణిమాదికసిద్ధులు = అణిమ మొదలగు సిద్ధులను, కైకొనిన దైత్యుక్ = తీసికొన్న హిరణ్యకశిపుని, చీరితివి = చీల్చిచంపితివి, మహాయోద్ధవు = నీవుగొప్పయోధుఁడవు, నీకృపక్ = నీదయవలన, మాకుక్, మరలక్, సిద్ధులు = అణిమాదిసిద్ధులు, మరలంగక్ = మళ్లివచ్చుటకు, కలిగెను.

తా. ఓనరసింహస్వామీ! ఈదురాత్ముఁడు అకారణముగా కోపపడి మా అణిమాదిసిద్ధులను అపహరించెను.ఇట్టివానిని జంపితివి.నీవు మిగుల గట్టివాఁడవు. నీదయవలన మాసిద్ధులు మాకు దక్కినవి.

వ. విద్యాధరు లి ట్లనిరి. 317

క. దానవునిఁ జంపి యంత
ర్ధానాదికవిద్య లెల్ల దయతో మరలం
గా నిచ్చితివి విచిత్రము
నీనిరుపమవైభవంబు నిజము నృసింహా. 318

టీ. నృసింహా = నరసింహస్వామీ, దానవునిన్ = హిరణ్యకశిపుని, చంపి, అంత...విద్యలు ఎల్లన్ = మాటుపడుట మొదలగు మావిద్యలన్నియు, దయతోన్ = కరుణతోడ, మరలంగాన్ = తిరుగ, ఇచ్చితివి. నీ నిరుపమవైభవంబు = సాటిలేని నీప్రభావము, విచిత్రము =ఆశ్చర్యకరమైనది.

తా. ఓనృసింహస్వామీ ! ఈ హిరణ్యకశిపుదురాత్ముని జంపి వీనిచే నింతకు పూర్వ మపహరించఁ బడిన మాఅంతర్ధానము మొదలైన విద్యలన్నియు మరల మాకు స్వాధీనముగాఁ జేసితివి. నీప్రభావము అప్రమేయము.

వ. భుజంగు లి ట్లనిరి. 319

టీ. భుజంగులు = సర్పములు (నాగులు).

క. రత్నములను మత్కాంతా
రత్నంబులఁ బుచ్చికొన్నరక్కసునురమున్
యత్నమున వ్రచ్చి వైచితి
పత్నులు రత్నములుఁ గలిగి బ్రదికితి మీశా. 320

టీ. ఈశా = ఓజగన్నాయకా, రత్నములను = మణులను, మత్కాంతారత్నంబులన్ = మాభార్యలను, పుచ్చికొన్నరక్కసునురమున్= ఆఁచికొన్న రాక్షసుని ఱొమ్మును, యత్నములన్ = ప్రయత్నముతోడ, వ్రచ్చివైచితి = చీల్చివేసితివి. పత్నులు = భార్యలును, రత్నములు=మణులును, కలిగి=మరలఁజిక్కి, బ్రతికితిమి.

తా. దేవా. ఈపాపాత్ముఁడు మారత్నములను పెండ్లాలను దోఁచుకొని ఏడిపించుచుండెను. అతిప్రయత్నముతో నెట్లో పట్టుబట్టి వీనిజంపితివి. నీదయవలన మాపెండ్లాలు మామణులు మాకు తిరుగ లభించినవి అంతియ చాలును.

వ. మనువు లిట్లనిరి. 321

క. దుర్ణయుని దైత్యుఁ బోరిఁగొని
వర్ణాశ్రమధర్మసేతువర్గము మరలం
బూర్ణము సేసితి వే మని
వర్ణింతుము కొలిచి బ్రదుకువారము దేవా. 322

టీ. దుర్ణయునిన్ = దుర్నీతిగలవాఁడగు, దైత్యున్ = హిరణ్యకశిపుని, పోరిగొని = చంపి, వర్ణా...వర్గము = వర్ణములయు, ఆశ్రమములయు, ధర్మములను వంతెనల సమూహమును, మరలన్, పూర్ణము సేసితివి = లోపించిన భాగములను బాగుచేసినావు, నిన్ను, ఏమని, వర్ణింతుము = పొగడుదుము, నిన్ను కొలిచి బ్రతుకువారము.

వ. ప్రజాపతు లిట్లనిరి. 323

క. ప్రజలం జేయుటకై సృజించితి మముంబాటించి దైత్యాజ్ఞచేఁ
బ్రజలంజేయక యింతకాలము మహాభారంబుతో నుంటి మీ
కుజనున్ వక్షముఁ జీరి చంపితివి సంకోచంబు లే కెల్లచోఁ
బ్రజలంజేయుచు నుండువారము జగద్భద్రాయమాణోదయా.

టీ. జగద్భద్రాయమాణోదయా = లోకక్షేమకరమైన అవతారముగలయో స్వామీ, మమున్ = మమ్ము, ప్రజలన్ = లోకములను, చేయుటకున్ ఐ, పాటించి = పూని, సృజించితివి, దైత్యాజ్ఞచేన్ = హిరణ్యకశిపుని యుత్తరువుచేత, ఇంతకాలము, ప్రజలను, చేయక = పుట్టింపక, మహాభారంబుతోన్ = గొప్పదుఃఖభారముతోడ, ఉంటిమి = కాలము ద్రోయుచుంటిమి, ఈకుజ

నుఁ=ఈదుర్మార్గుని, వక్షము=ఱొమ్ము, చీఱి = చీల్చి, చంపితివి, ఇఁక, సంకోచంబు=అనుమానము, లేక, ఎల్లచోఁ=అంతటను, ప్రజలను, చేయుచు, ఉండువారము=ఉందుము.

తా. స్వామీ! మమ్ము లోకములు నిర్మింపుఁడని మనస్సునతో సృజించితివి. మేమును అట్లె నీయాజ్ఞచొప్పునఁ బ్రవర్తించుచుంటిమి. ఇంతలో ఈ మిడిమేలపురక్కసుఁ డొకఁ డడ్డపడి మాయత్నముల సాగనీయఁ డయ్యెను. ఇద్దురాత్ముని జంపి మాయడ్డుదీర్చితివి. ఇఁక నన్నిశంకలు బాసి నీదయవలన మాసృష్టి మేము సలిపికొనుచుందుము.

వ. గంధర్వు లి ట్లనిరి. 325

క. ఆడుదుము రేయుఁ బగలం
బాడుదుము నిశాటునొద్ద బాధించు దయం
జూడఁడు నీచే జమునిం
గూడె మహాపాతకునకుఁ గుశలము గలదే. 326

టీ. రేయుఁబగలుఁ = రాత్రిపగలును, నిశాటునొద్దఁ = హిరణ్యకశిపునికొలువున, ఆడుదుము, పాడుదుము, అయినను ఎప్పుడు బాధించును. దయఁజూడఁడు. వీఁడు నీచేత, జమునిఁ=యముని, కూడెను = చేరెను, మహాపాతకునకుఁ = అతిపాపాత్మునకు, కుశలము = క్షేమము, కలదే=లేదు.

తా. అయ్యా! మేమందఱము ఆహిరణ్యకశిపునొద్ద రేయుంబవలు విరామము లేక నిర్బంధముతో నాడుచుఁబాడుచు నుందుము. అట్లైనను వాఁడు మాతుసురులు తీయుచుండును. నీదయచే ఆదుర్మార్గుఁడు యమునిదగ్గఱ జేరినాఁడు. అబ్బో లేకున్న అంతటిదురాత్ముఁడు క్షేమపడునా? పడఁడు.

వ. చారణు లి ట్లనిరి. 327

క. భువనజనహృదయభల్లుఁడు
దివిజేంద్రవిరోధి నేఁడు దెగె నీచేతన్
భవరోగనివర్తక మగు
భవదంఘ్రియుగంబుఁ జేరి బ్రదికెద మీశా. 328

టీ. ఈశా, భువనజనహృదయభల్లుఁడు = లోకమందలి ప్రజల హృదయములకు బల్లెమువంటివాఁడగు, దివిజేంద్రవిరోధి = ఇంద్ర శత్రువగు హిరణ్యకశిపుఁడు, నేఁడు, నీచేతన్, తెగెను = చచ్చెను. ఇఁకను, భవ...వర్తకము = సంసారతాపనివారకము, అగు, భవదంఘ్రి యుగంబున్ = నీపాదయుగమును, చేరి, బ్రతికెదము.

తా. స్వామీ! త్రిలోకములయందలి జనులకు హృదయశూలమైన యీ రాక్షసుఁడు నీచేతఁ జచ్చెను. ఇఁక మేమందఱము సంసారనాశకమగు నీపాదద్వంద్వముఁ జేరి బ్రతుకుదుము.

వ. యక్షు లి ట్లనిరి. 329

ఉ. భ్రంశము లేనినీభటుల భంగవిముక్తుల మమ్ము నెక్కి ని
స్సంశయవృత్తి దిక్కులఁ బ్రచారముసేయుచునుండువీఁడు ని
స్త్రింశముతోడ వీనిఁ గడతేర్చితి వాపద మానె నోచతు
ర్వింశతితత్త్వశాసక త్రివిష్టపముఖ్యజగన్నివాసకా. 330

టీ. ఓచతు...శాసక = ఇరువదినాలుగు తత్త్వములను బాలించునో స్వామీ, త్రివి...వాసకా = స్వర్గము మొదలుగా నెల్లలోకములయందు వసించువాఁడా, వీఁడు = హిరణ్యకశిపుఁడు, భ్రంశము = కలఁత, లేని, నీభటులన్ = నీకింకరులమైన, భంగవిముక్తులన్ = పరాభవమెఱుఁగని, మమ్మున్ = ఎక్కి, నిస్సంశయవృత్తిన్ = అనుమానములేని గతితో, దిక్కులయందు, ప్రచారము చేయుచునుండున్ = సంచరించుచుండును, నిస్త్రింశముతోడన్ = కత్తితో(కత్తినిబోలుగోళ్లతో), వీనిని, కడతేర్చి తివి = చంపినావు, ఆపదమానెన్ = మాకష్టము మీడేఱినది.

తా. స్వామీ! చతుర్వింశతి తత్త్వస్వరూపా! స్వర్గాదిలోకముల లో నంతట నివసించువాఁడా! ఎన్నఁడు ఆపదయనునది యెట్టిదో యెఱుఁగని నీదాసులమైన మాపై సిక్కి నిర్భయముగా నెల్లచోటుల స్వారిచేయు చుండును. నీకత్తిగోరులచే వీనిఁ జంపి మానూడు దీర్చితివి. స్వామీ మాకష్టములు కడముట్టినవి.

వ. కింపురుషు లిట్లనిరి. 331

క. పురుషోత్తమ నేరము కిం
పురుషుల మల్పులము నిన్ను భూషింపఁగ దు
ష్పురుషుఁ సకలసుజనహృ
త్పరుషుం జంపితివి జగము బ్రదికె నధీశా. 332

టీ. పురుషోత్తమ = ఓవిష్ణూ, కింపురుషులము = కింపురుషజాతి వారము (నీచమానవులము), అల్పులము = అధములము, నిన్ను, భూషింపఁగ = పొగడుటకు, నేరము = ఎఱుఁగము, అధీశా = సర్వజగన్నాయకా, సకల...పరుషుఁ = ఎల్లజనులహృదయములకు కఠినుఁడైన, దుష్పురుషుఁ = దురాత్ముని, చంపితివి, జగము, బ్రతికెను.

తా. స్వామీ! అధములైన కింపురుషులము మేము ని న్నేమిపొగడఁ గలము. మాకు యోగ్యతలేదు. సమస్తజనులను బాధించుచున్న యీ క్రూరుని జంపితివి. లోకములు నిలచెను.

వ. వైతాళికు లిట్లనిరి. 333

టీ. వైతాళికులు=మేలుకొలుపులు బాడువారు.

క. త్రిభువనశత్రుఁడు వడియెను
సభలందును మఖములందు జగదీశ్వర నీ
శుభగీతములు పఠించుచు
నభయుల మై సంచరింతు మార్తశరణ్యా. 334

టీ. జగదీశ్వర=లోకనాయకా, త్రిభువనశత్రుఁడు=మూఁడులోకములకు భయంకరమైన శత్రువు, పడియెను=చచ్చెను. ఆర్తశరణ్యా=దీనరక్షకా, సభలయందును, మఖములందును=యజ్ఞములయందును, నీ శుభగీతములు=నీమంగళగానములను, పఠించుచున్=పాడుచు, అభయులము=భయములేనివారము, ఐ, సంచరింతుము=తిరిగెదము.

తా. దేవా! ముల్లోకములకు శత్రువైన యీదుర్మార్గుఁడు నీచేతఁ జంపఁబడెను. ఇఁక మేము ఎల్లచోటులను జంకులేక నీపావనగీతములను బాడుకొనుచు తిరిగెదము.

వ. కిన్నరు లి ట్లనిరి. 335

క. ధర్మము దలఁపఁడు లఘుతర
కర్మము సేయించు మమ్ముఁ గలుషాత్మకు దు
ష్కర్మునిఁ జంపితి వున్నత
శర్ములమై నీదుభక్తి సలిపెదము హరీ. 336

టీ. హరీ, ధర్మము=న్యాయము, తలఁపఁడు = విచారించఁడు, మమ్మును, లఘుతరకర్మము=నీచపుఁబనిని, చేయించును, కలుషాత్మకున్=పాపాత్ముఁడైన, దుష్కర్మునిన్ = క్రూరకర్ముఁడైన రాక్షసుని, చంపితివి, ఉన్నతశర్ములమై=గొప్పసుఖముగలవారమై, నీదుభక్తి, సలిపెదము=చేసెదము.

తా. శ్రీహరీ, న్యాయము విచారించక మమ్ము బహుబాధలఁ బెట్టిన దుష్టరాక్షసుని జంపి మేలొనర్చితివి. నీదయవలన నిఁక నిశ్చింతముగా బ్రతికి నీభక్తి గలిగియుండెదము.

వ. విష్ణుసేవకు లి ట్లనిరి. 337

ఉ. సందితవిప్రశాపమునఁ జండనిశాచరుఁ డైనవీని శి
క్షించుట కీశు గాదు కృప సేసితి వీశ్వర భక్తితోడ సే

వించుటకంటె వైరమున వేగమ చేరఁగ వచ్చు నిన్ను నీ
యంచితనారసింహతను వద్భుత మాపదఁ బాసి రందఱున్.

టీ. సంచితవిప్రశాపమునన్=పూర్వజన్మమందు ఆర్జించఁబడిన బ్రాహ్మణశాపముచేత, చండనిశాచరుఁడు = క్రూరరాక్షసుఁడు, ఐనవీనిన్, శిక్షించుట = దండించుట, కీడు = అపకారము, కాదు, కృపచేసితివి = దయఁజూచితివి, ఈశ్వర=ఓప్రభూ, నిన్ను, భక్తితోడ, సేవించుటకంటెన్, వైరమునన్=శత్రుత్వముచేత, వేగమే, చేరఁగన్ వచ్చున్=పొందవచ్చును, నీ అంచితనారసింహతనువు = ఒప్పుచున్న నరసింహరూపము, అద్భుతము= ఆశ్చర్యము, అందఱును, ఆపద=అపాయమును, పాసిరి=తొలంగిరి.

తా. నారాయణా! సనకాదులశాపము చేత రాక్షసుఁడై పుట్టినవీని నీవు దండించుట వానికి క్షేమమే కాని ఎగ్గుగాదు. నిన్ను భక్తిగలిగి సేవించిన వారికంటె విరోధమును సాధించినవారే త్వరగా కడతేఱుదురు. ఈ నీ నరసింహరూపము ఎందును కని విని యెఱుఁగని ఆశ్చర్యకరమైనది. నీ కృపచేత అందఱు కష్టములును తీఱినవి.

వ ఇట్లు బ్రహ్మరుద్రేంద్రసిద్ధసాధ్యపురస్సరు లైన దేవముఖ్యు లందఱు నెడ గలిగి యనేకప్రకారంబుల వినుతించి రందు రోషవిజృంభమాణుం డయిననరసింహదేవుని దగ్గఱఁ జేర వెఱచి లక్ష్మీదేవిం బిలచి యిట్లనిరి. 339

టీ. బ్రహ్మ... పురస్సరులు = బ్రహ్మ ఈశ్వరుఁడు మొదలగువారు, ఐన, దేవముఖ్యులు = దేవశ్రేష్ఠులు, అందఱును, ఎడకలిగి = దూరముగా నుండి, అనేకప్రకారంబులన్ = నానావిధములుగా, వినుతించిరి=పొగడిరి, అందు=వారలలో, ఒక్కఁడైనను, రోషవిజృంభమాణుండు = కోపము చేఁ జెలరేఁగియున్నవాఁడు, అయిన, నరసింహదేవుని, దగ్గఱన్ చేరన్ వెఱచి = దగ్గఱకుఁ బోవ భయపడి, లక్ష్మీదేవిని, పిలచి, ఇట్లనిరి.

క. హరికిం బట్టపుదేవివి
హరిసేవానిపుణమతివి హరిగతివి సదా
హరిరతివి నీవు సని నర
హరిరోషము డింపవమ్మ హరివరమధ్యా. 340

టీ. హరివరమధ్యా = సింహమునడుమువంటి నడుముగల ఓలక్ష్మీ, హరికిన్ = విష్ణువునకు, పట్టపుదేవివి, హరి.. మతివి = విష్ణుకైంకర్యమున నేర్పరియైనదానవు, హరిగతివి = శ్రీహరియే దిక్కుగాఁ గలదానవు, నీవు, చని, హరిరోషము = విష్ణునికోపమును, డింపవమ్మ = తగ్గించవమ్మా.

తా. ఓలక్ష్మీ! నీవు శ్రీహరికి ప్రియభార్యవును, ఆయనను సేవించి మెప్పువడసినదానవును, ఆహరియే దిక్కైనదానవును, హరియందే చిత్తముంచినదానవు గనుక ఇప్పుడు కోపముచేత అత్యుగ్రరూపుఁడైన ఈ నరసింహాకృతినిదాల్చిన విష్ణునికోపమును మెల్లగా తగ్గించుము అని వేఁడిరి.

వ. అనిన నియ్యకొని మహోత్కంఠతోడ నాకలకంఠకంఠి నర
కంఠీరవుని యుపకంఠంబునకుం జని. 341

టీ. ఇయ్యకొని = ఒప్పుకొని, మహోత్కంఠతోడన్ = గొప్ప కౌతుకముతో, కలకంఠకంఠి = కోకిలపలుకులవంటి పలుకులుగల ఆలక్ష్మీదేవి, నర...కంఠంబునకున్ = నరసింహస్వామిసమీపమునకు, చని = పోయి. (కోకిలపలుకు లనుటచే దుఃఖక్రోధాది సమయములందును మనోహరము లని భావము.)

సీ. ప్రళయార్కబింబంబుపగిది నున్నది గాని
నెమ్మోము పూర్ణేందునిభము గాదు
శిఖిశిఖాసంఘంబుచెలువు సూపెడుఁగాని
సూడ్కి ప్రసాదభాసురముగాదు
వీరరౌద్రాద్భుతావేశ మొప్పెడుఁగాని
భూరికృపారసస్ఫూర్తి గాదు

భయదదంష్ట్రాంకురప్రభలు గప్పెడుఁగాని
దరహసితాంబుజాతంబు గాదు
తే. కఠినఖరనారసింహవిగ్రహము గాని
కామినీజనసులభవిగ్రహము గాదు
విన్నదియుఁ గాదు తొల్లి నే విష్ణువలనఁ
గన్నదియుఁ గాదు భీషణాకార మనుచు. 342

టీ. నెమ్మోము = నిండుమొగము, ప్రళయార్కబింబంబుపగిదిన్ = అంతకాలమందలి సూర్యునివలె, ఉన్నదికాని, పూర్ణేందునిభము = పూర్ణచంద్రునివలె ప్రసన్నముగా లేదు. చూడ్కి = చూపు, శిఖి... చెలువు = నిప్పుమంటల ప్రోవులపోలికను, చూపెడున్ = చూపించును, కాని, ప్రసాదభాసురము = చల్లదనముచేఁ బ్రకాశించునది, కాదు, వీర... వేశము = వీరరసముచేత భయజనకమై ఆశ్చర్యమైన సంరంభము, ఒప్పెడున్ = కనుపట్టును, కాని, భూరికృపారసస్ఫూర్తి = మెండైన దయయొక్క పొందు, కాదు = లేదు, భయద...ప్రభలు = భయము బుట్టించు మొలకకోఱల కాంతులు, కప్పెడున్ = చుట్టుకొనును, కాని, దరహసితాంబుజాతంబు = కొంచెముగాఁ బూచి యున్నకమలమువంటిది, కాదు, కఠిన...హము = క్రూరము ఘోరమునైన నరసింహరూపము, కామినీ...గ్రహము = స్త్రీలకు వశమైన విలాసరూపము, తొల్లి = ఇంతకుముందు, నేను, విష్ణువలనన్ = విష్ణుమూర్తివలన, విన్నది, కన్నది = చూచినదియు, కాదు, భీషణాకారము = ఇదియొకభయంకరమైన క్రొత్తరూపము, అనుచు = అని చెప్పుచు.

తా. ముఖము ప్రళయకాలమందలి సూర్యునివలె నున్నది కాని పూర్ణచంద్రునివలె లేదు. చూపు మంటలు గ్రక్కుచున్నదేకాని చల్లఁగానుండదు. భయంకరమైన శౌర్యరసమున్నది గాని ఎచ్చటను దయారసము గనఁబడదు. క్రూరములైన కోఱలు గన్పట్టును గాని నగుమోము గానరాదు. క్రూరమైన నరసింహరూపము గాని ఆఁడువారు దగ్గఱకుఁ బోఁదగిన స్థితి లే

దు. ఇట్టి యవతారభేదము తన కున్న దని నాకు విష్ణుమూర్తియు ఎన్నఁడు చెప్పియుండలేదు. ఇది విన్నది చూచినది కాని క్రొత్త వింతజంతువు. అని జంకుచు.

క. పలికెద నని గమకముఁ గొనుఁ
బలికినఁ గడు నలుగు విభుఁడు ప్రతివచనములం
బలుకఁ డని నిలుచు శశిముఖి
బలువిడి హృదయమునఁ జనవు భయమును గదురన్. 343

టీ. శశిముఖి = చంద్రునివంటి మోముగల లక్ష్మీదేవి, పలికెదను = మాటలాడెదను, అని, గమకముఁగొనున్ = తలఁచును. పలికినన్ = మాటాడినచో, విభుఁడు = పతియైన హరి, కడున్ = ఇంకను ఎక్కువగా, అలుగున్ = కోపించును, ప్రతివచనంబుల్ = మాఱుమాటలు, పలుకఁడు. అని, హృదయమునన్ = మనస్సులో, బలువిడి = ఒకవిధముగా, చనవు = మచ్చికయు, భయమును, కదురన్ = అతిశయించఁగా, నిలుచున్ = నిలచియుండును.

తా. లక్ష్మీదేవి యిట్లు సమీపించి ఆ భయంకరరూపము చూచి మాటలాడిన నేమో మాటలాడకున్న నేమో మఱల మాటలాడునో లేదో ఏమిచెప్పిన నేమికసురునో యని భయపడి సందేహపడి మనస్సున నయాభయములు దోఁపఁగా నూరకుండెను.

వ. ఇట్లు నరహరిరూపంబు వారిజనివాసిని వీక్షించి శంకించి శాంతుం డైనవెనుక డగ్గఱెద నని చింతించుచున్న వారిజసంభవుం డద్దేవునిరోషంబు నివారింప నితరుల కలవి గాదని ప్రహ్లాదుం జీరి యిట్లనియె. 344

టీ. ఇట్లు, వారిజనివాసిని = లక్ష్మీదేవి, నరహరిరూపంబు = నరసింహమూర్తి ఆకారము, వీక్షించి = చూచి, శంకించి = అనుమానపడి, శాంతుండు = నెమ్మదినొందినవాఁడు, ఐనవెనుక, డగ్గఱెదను = సమీ

పింతును, అని, చింతించుచున్నన్ = ఆలోచించుచుండఁగా, వారిజసంభవుండు = బ్రహ్మ, అద్దేవునిరోషంబు = ఆనరసింహమూర్తి యాకారము, నివారింపన్ = శమింపఁజేయుటకు, ఇతరులకు, అలవి కాదు అనితలఁచి, ప్రహ్లాదుని, చీరి = చేరఁబిలచి.

క. తీండ్రపు మగురోషమున మీ
 తండ్రినిమిత్తమునఁ జక్రి దారుణమూర్తిన్
 వేండ్రము విడువఁడు మెల్లన
 తండ్రీ శీతలునిఁ జేసి దయ సేయఁ గదే. 345

టీ. తండ్రీ = నాయనా ప్రహ్లాదా, తీండ్రము= దారుణము, అగు, రోషమునన్ = కోపముచేత, మీతండ్రినిమిత్తమునన్ = మీయయ్యహిరణ్యకశిపునికారణమున, చక్రి = విష్ణువు, దారుణమూర్తిన్ = భయంకరమైన రూపముతో, వేండ్రము = కోపమువేఁడి, విడువఁడు= మానఁడు, మెల్లనన్ = తిన్నగా, శీతలునిన్ = చల్లనివానిఁగా, చేసి, దయ సేయఁ గదే = అనుగ్రహించుమా.

తా. నాయనా ప్రహ్లాదా! విష్ణువు మీతండ్రికారణమున అత్యుగ్ర రూపము దాల్చి వాని జంపియు ఇప్పటికిని తనకోపమును జాలింపఁడు. వత్సా నీవు తిన్నగా దగ్గఱజేరి శాంతిపఱుపుము. మమ్మందఱను రక్షింపుము. ఇప్పుడు నీకంటె నితరులు నరసింహుని కోపమును జల్లార్చువారు లేరు.

వ. అనిన నోఁగాక యని మహాభాగవతశేఖరుం డయినబాలకుండు గరకమలంబులు ముకుళించి మందగమనంబున నమందవినయవివేకంబుల నరసింహదేవునిసన్నిధికిం జని సాష్టాంగదండప్రణామంబు సేసిన భక్తపరాధీనుం డగునయ్యీశ్వరుం డాలోకించి. 346

టీ. మహాభాగవతశేఖరుండు = గొప్ప విష్ణుభక్తులలో మేలైన వాఁడు, బాలకుండు = ప్రహ్లాదకుమారుఁడు, కరకమలంబులు = తామరల వంటి చేతులను, మందగమనంబునన్ = చిన్నని నడకతో, అమందవినయ వివేకంబులన్ = తక్కువపడని అడఁకువచేతను, తెలివిచేతను, నరసింహ దేవుని సన్నిధికిన్ = నరసింహమూర్తిదగ్గఱకు, చని, సాష్టాంగదండప్రణామంబు = కాలు జేతులు ఱొమ్ము నొసలు భుజములు నేల దాఁకునట్లు కఱ్ఱవలె సాగిలఁబడి మ్రొక్కుటను, చేసినన్, భక్తపరాధీనుఁడు = సేవకులకు వశమైనవాఁడు, అగు, అయ్యీశ్వరుండు = ఆనరసింహమూర్తి, ఆలోకించి = చూచి.

ఉ. ప్రాభవ మొప్ప నుత్కట కృపామతి యై కదియంగఁ జీరి సం
శోభితదృష్టిసంఘములఁ జూచుచు బాలునిమౌళియందు లో
కాభినుతుండు వెట్టె నసురాంతకుఁ డుద్భటకాలసర్పభీ
తాభయదానశస్తము ననర్గళమంగళహేతుహస్తమున్. 347

టీ. ప్రాభవము = శీవి, ఒప్పన్ = మెఱయఁగా, ఉత్కటకృపామతి = అతిశయమైన దయగలవాఁడు, ఐ, కదియంగన్ = దగ్గఱగా, చీరి = పిలచి, సంశోభితదృష్టిసంఘములన్ = ఇంపుగాఁ బ్రకాశించు కన్నులతో, చూచుచు, లోకాభినుతుండు = లోకములచేఁ బొగడఁబడిన, అసురాంతకుఁడు = రాక్షసుల సంహరించు శ్రీనరసింహమూర్తి, బాలుని మౌళియందు = ప్రహ్లాదుని తలమీఁద, ఉద్భట...శస్తము = క్రూరమైనకాలసర్పమునకు భయపడినవారికి అభయమిచ్చుటయందు శ్రేష్ఠమైన, అనర్గళ...హస్తమున్ = అడ్డులేని శుభములకు కారణమైన హస్తమును, పెట్టెను.

తా. రాజసముమీఱ చేరఁబిలచి అతిశయమైన కరుణగలవాఁడై చల్లనిచూపులఁ జూచుచు, సర్వలోకములచేతను పొగడఁబడిన ఆ నరసింహమూర్తి సంసారభయభ్రాంతులకు అభయదానము చేయునట్టి తనపావన హస్తమును ప్రహ్లాదునిశిరమం దుంచెను.

వ. ఇట్లు హరికరస్పర్శనంబున భయవిరహితుండును బ్రహ్మజ్ఞాన సహితుండును బులకితదేహుండును సముత్పన్నసంతోష బాష్పసలిల ధారాసమూహుండును బ్రేమాతిశయగద్గద భాషణుండును వినయవివేకభూషణుండును నేకాగ్రచిత్తుం డును భక్తిపరాయత్తుండును నయి యద్దేవునిచరణకమలం బులు దనహృదయంబున నిలిపికొని కరకమలంబులు ముకు ళించి యిట్లని వినుతించె. 348

టీ. హరికరస్పర్శనంబునన్ = నరసింహునిచేతి తాఁకుడువలన, భయ విరహితుండును = భయము లేనివాఁడును, బ్రహ్మజ్ఞానసహితుండును = బ్రహ్మ స్వరూపమును దెలిసినవాఁడును, పులకితదేహుండును = గగుర్పాటు చెందిన శరీరముగలవాఁడును, సముత్పన్న...హుండును = పుట్టిన ఆనందబాష్ప జల ములధారలగుంపు కలవాఁడును, ప్రేమాతి...ణుండును = భక్తివిశేషము చేత డగ్గుత్తికపడిన మాటలు గలవాఁడును, వినయ వివేకభూషణుండును = అడఁకువ జ్ఞానము అలంకారములుగాఁ గలవాఁడును, ఏకాగ్రచిత్తుండును = విష్ణువునుండి తొలఁగనిమనస్సు గలవాఁడును, భక్తిపరాయత్తుండును = భక్తికి వశమైనవాఁడును, అయి, అద్దేవునిచరణకమలంబులు = ఆస్వామియడుగుఁ దామరలు, తనహృదయంబునన్ = తనమనస్సులో, నిలిపికొని = ఉంచుకొని, కరకమలంబులు = కేలుఁదామరలు, ముకుళించి = దోయిలించి, వినుతించెన్ = పొగడెను.

మ. అమరుల్ సిద్ధులుసంయమీశ్వరులు బ్రహ్మాదుల్ సతాత్పర్యచి త్తములన్ నిన్నుబహుప్రకారముల నిత్యంబున్ విచారించి పా రము ముట్టన్ నుతిసేయ నోపరఁట నే రక్షస్తనూజుండ గ ర్వమదోద్రిక్తుఁడ బాలుఁడన్ జడమతిన్ వర్ణింప శక్తుండనే.

టీ. అమరుల్ = దేవతలు, సిద్ధులు, సంయమీశ్వరులు = మునిశ్రేష్ఠులు, బ్రహ్మాదుల్ = బ్రహ్మ మొదలగువారు, సతాత్పర్యచిత్తములన్ = ఏకాగ్రత

గల మనస్సులతో, బహుప్రకారములన్ = పలువిధములచే, నిన్ను, విచారించి, పారముముట్టన్=తుదిదాఁక, నుతి = స్తోత్రము, సేయ నోపరఁట, నేను, (ప్రహ్లాదుఁడు) రక్షస్తనూజుండన్ = తమోగుణప్రధానుఁడైన రాక్షసునికొడుకును, గర్వమదోద్రిక్తుఁడన్ = అభిమానము పొగరు మెండుకొనియుండువాఁడును, బాలుఁడన్=చిన్నవాఁడను, జడమతిన్=మూర్ఖుని, స్తుతింపన్=పొగడుటకు, శక్తుండనే=సమర్థుఁడనా, కాను.

తా. స్వామీ! నిన్ను ఎల్లదేవతలు సిద్ధులు మునులు బ్రహ్మాదులుగూడ చక్కగా తెలిసి తుదముట్ట వర్ణింపఁ జాలకుండఁగా రాక్షసబాలుఁడను పొగరుబోతుఁదనమునుం గలవాఁడను శిశువును మూర్ఖుఁడను నేను నిన్ను చక్కఁగాఁ బొగడనేరుతునా దేవా కరుణింపుము. [గమున్,

మ. తపమున్ వంశముఁ దేజమున్ శ్రుతము సౌందర్యంబు నుద్యో
నిపుణత్వంబుఁ బ్రతాపపౌరుషములున్ నిష్ఠాబల ప్రజ్ఞలున్
జపహోమంబులుఁ జాల వీశ్వర భవత్సంతుష్టికై దంతియూ
థపుచందంబున భక్తిసేయ వలయుం దాత్పర్యసంయుక్తుఁడై.

టీ. ఈశ్వర=ఓ ప్రభూ, భవత్సంతుష్టికై = నిన్ను మెప్పించుటకొఱకు, తపమును, వంశము=కులమును, తేజమున్=కాంతియు, శ్రుతము = వేదశాస్త్రాధ్యయనమును, సౌందర్యంబు=అందమును, ఉద్యోగమున్=ప్రయత్నమును, నిపుణత్వంబు=నేర్పరితనమును, ప్రతాపపౌరుషములన్ = పరాక్రమము పురుషకారమును, నిష్ఠాబలప్రజ్ఞలున్ = మరణావధి పూనిక గలిగి వ్రతచర్యనుండుట, బలము సామర్థ్యమును, జపహోమంబులును, చాలవు=ప్రయోజకములు గావు, తాత్పర్యసంయుక్తుఁడై = తదేకధ్యానము గలవాఁడై, దంతియూథపుచందంబునన్ = గజేంద్రునివలె, భక్తి=పూజ్యానురాగము, చేయవలయును.

తా. దేవా! నిన్ను మెప్పించి నీదయ సంపాదించుటకు తపస్సు వంశము తేజస్సు శాస్త్రాధ్యయనము అందము ప్రయత్నము నేరుపు పరా

క్రమము పౌరుషము వ్రతచర్యలు బలము సామర్థ్యము జపము హోమము ఇట్టి వెన్నియైనను ఉపయోగములు గావు. గజేంద్రునివలె గాఢభక్తి గలిగినచోఁ దప్పక ఫలియించునుగాని ఇఁక నేవియు కొఱగావు.

మ. అమలజ్ఞానసుదానధర్మరతిసత్యక్షాంతినిర్మత్సర
త్వములన్ యజ్ఞతపోనసూయలఁ గడున్ దర్పించుధాత్రీసురో
త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోర్థప్రాణవాక్కర్మ
ముల్, సమతన్ నిన్ను నయించెనేని నిజవంశశ్రీకరుండౌఁదుదిన్.

టీ. అమల...త్వములన్=నిర్మలమైన జ్ఞానము మంచిదానము నీతి నిజము ఓర్పు ఒకరిపెంపునకు సూయపడకుండుట అనుగుణములచేతను, యజ్ఞతపోనసూయలన్ = యాగములు తపస్సు కోపములేకుండుట వీనిచేతను, కడున్ = మిగుల, దర్పించుధాత్రీసురోత్తముకంటెన్ = గర్వపడు బ్రాహ్మణశ్రేష్ఠునికంటె, మనోర్థ ప్రాణ వాక్కర్మముల్ = మనము ధనము ప్రాణము వాక్కును, నిన్ను, నయించెన్ ఏనిన్ = పొందించెనేని, శ్వపచుండు= (కుక్కలఁ జంపి తిను) మాలవాఁడు, ముఖ్యుండు = శ్రేష్ఠుఁడు, తుదిన్=అంతమున, నిజవంశశ్రీకరుండు=తనకులమునకు వన్నెదెచ్చువాఁడు, ఔను.

తా. దేవా! పరిశుద్ధమైనజ్ఞానము, దానము, ధర్మము, సత్యము, శమము, ఒకరిమేలునకు పగవకునికి, యాగములు, తపస్సు, ద్వేషము లేకుండుట అను సద్గుణములు గలవాఁడఁగదా యని గర్వపడు బ్రాహ్మణునికంటె మనస్సు ప్రాణము ధనము వాక్కు నీయధీనము లని నమ్మి భక్తిపరుఁడైన మాలవాఁడు మేలు. అట్టి యెడతెగని భక్తిగలవాఁడు తాను తరించి తన వంశమునకు కీర్తి తెచ్చును.

సీ. అజ్ఞుండు సేసినయపరాధములను జే
పట్టఁ డీశ్వరుఁడు కృపాళుఁ డగుటఁ

జేపట్టు నొకచోట సిద్ధ మీశ్వరునకు
నర్థంబు లేకుండు నతఁడు పూర్ణుఁ
డైన నర్థము లీశ్వరార్పణంబులు గాఁగఁ
జేయుట ధర్మంబు సేసెనేని
నద్దంబుఁ జూచిన నళికలలామంబు
ప్రతిబింబితం బగుపగిది మరల
తే. నర్థములు దోఁచుఁ గావున నధికబుద్ధి
భక్తి సేయంగ వలయును భక్తి గాని
మెచ్చఁ డర్థంబు లొసఁగెడు మేరలందుఁ
బరమకరుణుండు హరి భక్తిబాంధవుండు. 352

టీ. ఈశ్వరుఁడు=దేవుఁడు, అజ్ఞుండు = తెలియనివాఁడు, చేసిన, అపరాధములన్=తప్పిదములను, చేపట్టఁడు=గ్రహింపఁడు, కృపాళుఁడు=దయగలవాఁడు, అగుటచేత, ఒకచోటన్ = ఒకసమయమందు, అమూఢుని, చేపట్టును=చేరఁదీయును (దయసేయును). సిద్ధము=నిజము, ఈశ్వరునకున్=విష్ణునకు, అర్థంబు=ఒకయర్థమును, లేకుండును, అతఁడు=ఆదేవుఁడు, పూర్ణుఁడు = అంతట నిండియుండువాఁడు, ఐనను, అర్థములు = మనయొల్ల విషయములు, ఈశ్వరార్పణంబులుగాఁగఁజేయుట=ఈశ్వరునకు సమర్పించుట, ధర్మంబు=న్యాయము, చేసినన్=ఇట్లు సమస్తమును ఈశ్వరార్పితము సేయఁగా, అద్దము, చూడఁగా, అళికలలామంబు = నొసటిమీఁది చుక్క, ప్రతిబింబితము=మాఱురూపముగలవి, అగుపగిదిన్=అయినతీరున, మరల, అర్థములు=అభగవదర్పితములైన వస్తువులు, తోఁచును=లభించును, కావున, అధికబుద్ధిన్=మిక్కుటమైన ఆదరభావముతో, భక్తి, చేయంగ వలయును, హరి, అర్థంబులు=పదార్థములు, ఒసఁగెడి మేరలందున్=సమర్పించుపట్టుల, భక్తిగాని మెచ్చఁడు=మెచ్చుకొనఁడు, అతఁడు, పరమకరుణుండు=మిక్కిలి దయగలవాఁడు, భక్తిబాంధవుండు=భక్తికి చుట్టమైనవాఁడు.

తా. తెలియనివాఁడు చేసినతప్పులను దేవుఁ డొక లెక్కఁగొనఁడు. ఒకప్పుడు ఆయన అట్టివానియందు ప్రేమకలవాఁడే యగును. నిజముగా దేవునకు ఒకపదార్థము కావలసినదిలేదు. అతఁడు అన్నిటనిండియుండు వాఁడు. మనముమాత్రము మనయెల్ల అర్థములు ఈశ్వరార్పణము చేయవల సినదే. అట్లు చేసితిమేని అవియే మరల మనకు అద్దములోని ప్రతిబింబము వలె లభించును. అనఁగా ఈశ్వరుఁడు సర్వజంతువ్యాపి గనుక మన చేయు కార్యములు మనలోనే మనకు మరల నగపడు నని భావము. కనుక కర్మలు చేయుట అవి యీశ్వరున కర్పించుట ఒకపెద్దకాదు. ఎప్పుడును ఆదేవుని యెడ భక్తియే చేయవలయును. అతఁడు భక్తికి సంతసించినట్లు మనము ఏది సమర్పించినను సంతసింపఁడు. ఆయన చాలదయగలవాఁడు. భక్తి చుట్టమైనవాఁడు.

క. కావున నల్పుఁడ సంస్తుతిఁ
గావించెద వెఱపు లేక కలనేరుపునన్
నీవర్ణనమున ముక్తికిఁ
బోవు నవిద్యను జయించి పురుషుఁ డనంతా. 353

టీ. కావునన్ = అట్లగుటం జేసి, అల్పుడన్ = అధముఁడను, నేను, కలనేరుపునన్ = ఉన్నంత చమత్కారముతో, వెఱపు = భయము(సిగ్గు), లేక, సంస్తుతి గావించెదన్ = నీస్తోత్రము చేయుదును, అనంతా = అవ్యయుఁ డగు నోదేవా, పురుషుఁడు, నీవర్ణనమునన్ = నిన్ను స్తోత్రము చేయుటచేత, అవిద్యను = అజ్ఞానమును, జయించి, ముక్తికిన్ = మోక్షము నకు, పోవును.

తా. కనుక ఓయీశ్వరా మూఢబుద్ధినైన యేను నేర్పుకొలఁది నిన్ను స్తోత్రము చేసెదను. ఏపురుషుఁడైనను నిన్ను త్రికరణశుద్ధిగా స్తోత్ర ముచేసెనేని ఉత్తమగతి పొందును.

సీ. సత్త్వాకరుఁడ వైన సర్వేశ నీయాజ్ఞ
శిరముల నిడుకొని చేయువారు
బ్రహ్మాదు లమరులు భయ మందు చున్నారు
నీభీషణాకృతి నేఁడు సూచి
రోషంబు మాను నీ రుచిరవిగ్రహములు
కల్యాణకరములు గాని భీతి
కరములు గావు లోకములకు వృశ్చిక
పన్నగంబులభంగి భయముఁజేయు
తే. నసుర మర్దించితివి సాధుహర్ష మయ్యె
నవతరించినపని దీఱె నలుక యేల
కలుషహారివి సంతోషకారి వనుచు
నిన్నుఁ దలఁతురు లోకులు నిర్మలాత్మ. 354

టీ. సత్త్వాకరుఁడవు = సత్త్వగుణప్రధానుఁడవు, అయిన, సర్వేశ = సమస్తమునకు ఈశ్వరుఁడవైన ఓనరసింహా, నీయాజ్ఞ, శిరములన్ = తలలయందు, ఇడుకొని = ఉంచుకొని, చేయువారు, అయిన, బ్రహ్మాదులు = బ్రహ్మమొదలైన, అమరులు = దేవతలు, నేఁడు = ఇప్పుడు, నీభీషణాకృతి = నీభయంకరమైన ఆకారము, చూచి, భయమందుచున్నారు = భయపడుచున్నవారు, రోషంబు = కోపము, మానుము = వీడుము, నీరుచిరవిగ్రహములు=అందములైన నీ అవతారవిశేషములు, కల్యాణకరములు = మంగళప్రదములైనవి, కాని, భీతికరములు = భయమును గలిగించునవి, కావు, లోకములకు, వృశ్చి...భంగిన్ = తేళ్లు పాములవలె, భయము = బాధ, చేయు, అసురన్ = రాక్షసుని, మర్దించితివి=చంపినాఁడవు, సాధుహర్షము = సజ్జనులకు సంతోషము, అయ్యెను, అవతరించినపని, తీఱెన్ = ముగిసెను. అలుక = కోపము, ఏల = ఎందులకు, నిర్మలాత్మ=పరిశుద్ధ స్వరూపముగలయోస్వామీ, కలుషహారివి=పాపముల

నడచువాఁడవు, సంతోషకారివి = ఆనందమునిచ్చువాఁడవు, అనుచును, లోకులు, నిన్ను దలఁతురు.

తా. దేవా! నీవు రజోగుణము తమోగుణము కలుఁగక కేవలసత్త్వ గుణమే ముఖ్యముగాఁ గలవాఁడవు. ఎల్లప్పుడు నీయాజ్ఞ యనిన తలతోఁ జేయు నీబ్రహ్మాదిదేవతలందఱును నేఁడు నీభయంకరరూపము జూచి గడగడ వడఁకుచున్నారు. కావున కోప ముడుగుము. నీవెప్పుడును శుభకరమై అం దమైనరూపము గలవాఁడవుగాని భయంకరుఁడవుగావు. తేళ్లుపాములవలె లోకమునకు కంటకుఁడైన మాయయ్యను జంపితివి. సజ్జనులందఱు సంతసిం చినారు. నీవు ఎందుల కవతరించినావో ఆపని ముగిసినది. ఇంకను క్రోధ మెందులకు? లోకులందఱు నిన్ను క్రోధాదికలుషముల నడఁచువాఁడవని యు, సంతసమును గలుగఁజేయువాఁడవనియు తలఁతురు.

మ. ఖరదంష్ట్రాభ్రుకుటీసటానఖయు నుగ్రధ్వానయుఁ రక్తకే
సరయుఁ దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయునైన నీ
నరసింహాకృతిఁ జూచి నేవెఱవఁ బూర్ణక్రూరదుర్వారదు
ర్భరసంసారదవాగ్నికిఁ వెఱతు నీపాదాశ్రయుం జేయవే.

టీ. ఖర...నఖయుఁ = క్రూరములైన కోఱలు బొమముడి జడలు గోరులు గలదియు, ఉగ్రధ్వానయుఁ = భయంకరమైన గర్జితములు గలది యు, రక్తకేసరయుఁ = ఎఱ్ఱని జూలుగలదియు, దీర్ఘతరాంత్రమాలిక యుఁ = పొడవైన ప్రేవుల ప్రోవులు గలదియు, భాస్వన్నేత్రయుఁ = నిప్పులాలుకు కన్నులు గలదియు, ఐన, నీ నరసింహాకృతిఁ = నరసింహ రూపమును, చూచి, నేను, వెఱవఁ = భయమందను, పూర్ణ...గ్నికిఁ = తరుగని ఘోరమై ఆపరానిదియు సైఁపరానిదైన సంసారమను కార్చిచ్చు నకు, వెఱతును, నన్ను, నీపాదాశ్రయుఁ = నీపాదములే నివాసముగాఁగలవా నిఁగా, చేయవే.

తా. ఓ నరసింహామూర్తీ! భయంకరమైన కోఱలు బొమముడి జడలు గోళ్లు నిప్పులురాలు కన్నులుగల నీ నరసింహరూపముజూచి నే భయమొం

దుటలేదు. నా కెప్పుడు ఈ చెడ్డసంసారమువలననే భయము, కనుక నన్ను నీపాదములయందుఁ జేరిచి రక్షింపుము.

వ. దేవా సకలయోనులందును సుఖవియోగదుఃఖసంయోగ సంజనితం బైనశోకానలంబున దందహ్యమానుండ నై దుఃఖనివారకంబు గాని దేహాద్యభిమానంబున మోహితుండనై పరిభ్రమించుచున్నయేను నాకుం బ్రియుండవు సఖుండవుఁ బరదేవతవు నైననీ వగుబ్రహ్మగీతంబు లయిననీలావతారకథావిశేషంబులఁ బఠియించుచు రాగాదినిర్ముక్తుండ నై దుఃఖపుంజంబులఁ దరియించి భవదీయచరణకమలస్మరణసేవానిపుణు లైనభక్తులం జేరి యుండెద బాలునిఁ దల్లిదండ్రులును రోగిని వైద్యదత్తం బయినయౌషధంబును సముద్రంబున మునింగెడివాని నావయును దక్కొరులు రక్షింప నేరని తెఱంగున సంసారతాపసంతప్యమానుం డై నీచేత నుపేక్షితుం డయినవాని నుద్ధరింప నీవు దక్క నన్యుండు సమర్థుండు గాఁడు జగంబుల నెవ్వం డేయుకృత్యంబు నెవ్వనిచేతం బ్రేరితుండై యేయింద్రియంబులం జేసి యేమిటికొఱకు నెవ్వనికి సంబాధి యై యేస్థలంబున నేసమయంబునం దేమిరూపంబున నేగుణంబున నపరంబైన జనకాదిభావంబు నుత్పాదించి పరం బయినబ్రహ్మాదిభావంబున రూపాంతరంబు నొందించు నట్టివివిధప్రకారంబు లన్నియు నిత్యముక్తుండవు రక్షకుండవు నైననీవ నీయంశం బైనపురుషునికి నీయనుగ్రహంబునఁ గాలంబుచేతం బ్రేరితమై కర్మమయంబును బలయుతంబును బ్రధానలింగంబును నై నమనంబును నీమాయ సృజియించు నవిద్యార్పితవికారంబును వేదోక్తక

ర్మప్రధానంబును సంసారచక్రాత్మకం బైనయీమనమున నిన్ను సేవింపక నియమించి తరియింప నొక్కండును సమర్థుండు లేఁడు విజ్ఞాననిర్జితబుద్ధిగుణుండవు నీవు నీవలన వశీకృతకార్యసాధనశక్తి యైనకాలంబు మాయతోడం గూడ షోడశవికారయుక్తం బయినసంసారచక్రంబుఁ జేయుచుండు సంసారదావదహనతంతప్యమానుండ నగునన్ను రక్షింపుము. 356

టీ. సకలయోనులయందును = ఎల్ల జంతుదేహములయందును, సుఖ...జనితంబు=సుఖము తొలఁగుట, కష్టమువచ్చుటచేత పుట్టింపఁబడినది, ఐన, శోకానలంబునన్ = దుఃఖాగ్నిచేత, దందహ్యమానుండును = మిక్కిలి కాల్చఁబడినవాఁడును, దుఃఖనివారకంబు=దుఃఖములను మాన్పునది, కాని, దేహాద్యభిమానంబునన్=దేహము మొదలగువానియందలి మమకారముచేత, మోహితుఁడను = మోసపుచ్చఁ బడినవాఁడను, పరిభ్రమించు = తిరుగు, ప్రియుండవు=ఇష్టుఁడవు, సఖుండవు=స్నేహితుఁడవు, పరదేవతవు=ఉత్తమదైవతమవు, బ్రహ్మగీతంబులు=బ్రహ్మదేవునిచేఁ బొగడఁబడినవి, లీలావతారకథావిశేషంబులన్=విలాసముకొఱకైన పుట్టుకలయొక్క వృత్తాంతములు, చరియించుచు=తిరుగుచు, రాగాది నిర్ముక్తుండను=రాగద్వేషములు మొదలైనవి లేనివాఁడను, దుఃఖపుంజంబులు = కష్టములసమూహములను, తరియించి=దాఁటి, భవదీయ...నిపుణులు = నీపాదపద్మములను తలఁచుట కొలుచుట వీనియందు నెరవరులైనవారు, వైద్యదత్తంబు = వెజ్జుచే నీయఁబడినది, తక్కొరులు=ఇతరులు, సంసార...నుండు=సంసారపు వేఁడిమిచే నుడికినవాఁడు, ఉపేక్షితుఁడు = విచారించఁబడనివాఁడు, ఉద్ధరింపన్= కడతేర్చుటకు, సమర్థుఁడు=చాలినవాఁడు, కృత్యంబు=కార్యము, ప్రేరితుఁడు=పురికొలుపఁబడినవాఁడు, సంబంధి=సంబంధముగలవాఁడు, అపరంబు= మఱియొకటి, జనకాదిభావంబు = తండ్రి మొదలగువాని ధర్మము, ఉత్పా

దించి=పుట్టించి, బ్రహ్మాదిభావంబునన్=బ్రహ్మత్వము మొదలగుదానిచేత, రూపాంతరంబు=మఱియొక్క ఆకారము, వివిధప్రకారంబులు = పలుదెఱంగులు, నిత్యముక్తుఁడవు=ఎప్పుడేని విషయములఁ దగులువడనివాఁడవు, రక్షకుండవు=కాచువాఁడవు, నీయంశము=నీభాగము, నీయనుగ్రహంబునన్ = నీదయచేత, ప్రేరిత=ఉత్సాహింపఁబడినది, కర్మమయంబు=కర్మరూపము, బలయుతము=బలముతోఁగూడినది, ప్రధానలింగంబు = ముఖ్యమైనగుఱుతు గలది, సృజియించున్=పుట్టించును, అవిద్యాకల్పితవికారంబును = మాయ చేత కల్పించి పెట్టఁబడిన మార్పుగలదియు, వేదోక్తకర్మప్రధానంబు = వేదములలోఁ జెప్పఁబడిన కర్మలే ముఖ్యముగాఁగల, సంసారచక్రాత్మకంబు = సంసారసమూహరూపమైనది, నియమించి కట్టుపఱిచికొని, సమర్థుఁడు= నేర్చినవాఁడు, విజ్ఞాన...గుణుండవు=విశేషమైనజ్ఞానముచే జయింపఁబడిన బుద్ధికి స్వభావమైన జడత్వముగలవాఁడు, వశీ...శక్తి = స్వాధీనము చేసికోఁ బడిన పనులఁ జక్కఁ జేయునదియైనసామర్థ్యము గలది, షోడశవికార యుక్తంబు = పదునాఱుమార్పులతోఁ గూడినది, సంసార...నుండన్ = సంసార మనుకార్చిచ్చుచే మిక్కిలి కాల్పఁబడుచున్న నన్ను రక్షింపుము.

సీ. జనులు దిక్పాలురసంపదాయుర్విభ
వములు గోరుదురు భవ్యంబు లనుచు
నవి యంతయును రోషహాసజృంభిత మైన
మాతండ్రి బొమముడిమహిమఁ జేసి
విహతంబు లగు నట్టివీరుండు నీచేత
నిమిషమాత్రంబున నేఁడు మడిసెఁ
గావున ధ్రువములు గావు బ్రహ్మాదుల
శ్రీవిభవంబులు జీవితములుఁ

తే. గాలరూపకుఁ డగునురుక్రముని చేత
విదళితము లగు నిలువవు వేయు నేల

యితర మే నొల్ల నీమీఁదియెఱుక కొంత
గలిగియున్నది గొలుతుఁ గింకరుఁడ నగుచు. 357

టీ. జనులు = ఈలోకములోనివారందఱు, దిక్పాలుర సంపదాయు ర్వైభవంబులు = ఇంద్రుఁడు మొదలగు దిక్పతుల కలుములు ఆయుఃపరిమాణములు దొరతనములు, భవ్యంబులు = మంచివి, అనుచు, (తాము వానిని) కోరుదురు, అవి అంతయును, కోపహాసవిజృంభితము = కోపముచేత చేయఁబడిన నవ్వుచేత రేపఁబడినది, ఐన, మాతండ్రి బొమముడి మహిమన్ = మాయయ్య హిరణ్యకశిపుని మొగము చిట్లించుకొనుపాటి ప్రభావముతో, విహతంబులు = నష్టములు, అగును, అట్టివీరుండు = అంతటిశూరుఁడు గూడ, నీచేత, నిమిషమాత్రంబునన్ = ఱెప్పపాటుకాలములో, నేఁడు, మడిసెన్ = చచ్చెను, గనుక, బ్రహ్మాదుల శ్రీవిభవంబులు = బ్రహ్మ మొదలగువారి సంపదలు, దొరతనములు, జీవితములు = బ్రతుకుదెరువులు, ధ్రువములు = నిత్యములు, కావు, కాలరూపకుఁడు = కాలస్వరూపకుఁడు, అగు, ఉరుక్రమునిచేతన్ = గొప్పవ్యాప్తిగల విష్ణువుచేత, విదళితములు = కొట్టఁబడినవి, ఇతరము = నీభక్తికంటె ఇతరమైనదానిని, ఏను, ఒల్లను = ఒప్పుకొనను, నీమీఁదియెఱుక = నీయందలి వివేకము, కొంత, కలిగియున్నది, కాన, కింకరుఁడన్ = నీకు దాసుఁడను, అగుచును, కొలుతును = సేవింతును.

తా. స్వామీ! లోకులందఱును ఇంద్రాది దిక్పాలురసంపదలు వారి ఆయుఃకాలములు దొరతనములు చాలమేలైనవనియు అవి తమకు లభించిన చాలుననియు తలఁతురు. అది వట్టిపిచ్చి. ఇవన్నియును కన్నులముందఱనే మాతండ్రి కోపముతో ఒక్కవికారపునవ్వు నవ్వి మొగము చిట్లించినతోడనే నాశనమై ఎక్కడవక్కడపోఁగా మనము చూచియేయున్నాముగదా. ఇఁక అంతటిబలశాలి మాతండ్రియు చూచుచుండఁగనే గుడిచి కూర్చుండి భవిష్యమును ఎఱుఁగక ఱెప్పపాటుకాలములో నీచేతులోఁ జచ్చెను. కనుక బ్రహ్మాదులయు సంపదలు దొరతనములు మొదలగునవి శాశ్వతములు

కావు. అవన్నియు కాలాత్ముఁడైన సర్వవ్యాపనశక్తియుక్తుఁడైన విష్ణువి చేతఁ జెఱుపఁబడుచుండునుగాని ఉండవు. వేయి యేండుస స్వామీ నాకు నీపాదభక్తికంటె మఱియొకటి వలదు. నీదయవలన నీమీఁదితెలివి కొంత సంపాదించుకొనియున్నాను నీకు దాసుఁడనై కైంకర్యము చేయుచు ఉందును. నన్ను కరుణింపుము.

మత్తకోకిలము. ఎండమావులవంటిభద్రము లెల్లసార్థములంచుమ
ర్త్యుండు రోగనిధానదేహముతో విరక్తుఁడు గాక యు
ద్దండమన్మథవహ్ని నెప్పుడుఁ దప్తుఁడై యొకనాఁడుఁ జే
రండు పారము దుష్టసౌఖ్యపరంపరాక్రమణంబునన్. 358

టీ. మర్త్యుండు = మరణమే ధర్మముగాఁ గలమానవుఁడు, ఎండమావులవంటి, భద్రములు ఎల్లన్ = ఐహికశుభములన్నియు, సార్థములు = ప్రయోజన సహితములు, అనుచును, రోగనిధానదేహముతోడన్ = వ్యాధులకు నెలవైన శరీరముతోడ, విరక్తుండు = విరాగము గలవాఁడు, కాక, ఎప్పుడును, ఉద్దండమన్మథవహ్నిన్ = తీవ్రమైన కామాగ్ని చేత, తప్తుఁడు = క్రాఁగినవాఁడు, ఐ, ఒకనాఁడు = ఒకప్పుడును, దుష్ట...ణంబునన్ = నీచములైన ప్రక్చందన వనితాది సుఖముల సమూహముల గడపుటలో, పారము = తుద, ముట్ట నేరఁడు = పొందఁజాలఁడు.

తా. మరణమే ప్రకృతిగాఁ గలయీదేహి ఎండమావులవలె క్షణభంగురమైన యీ తుచ్ఛశుభములన్నియు నిజములని భ్రమసి రోగములపుట్టయైన తనదేహస్థితికి వగవక ఎప్పుడు తీఱనికామాగ్నికిఁ గ్రాఁగి నీచములైన వనితాదివిషయముల ననుభవించుచు ఒకప్పుడైనను దరి గాంచఁజాలఁడు.

ఉ. శ్రీమహిళామహేశ సరసీరుహగర్భులకైన నీమహా
ద్దామకరంబుచే నభయదానము సేయవు నేను బాలుఁడం
దామసవంశసంభవుఁడ దైత్యుఁడ నుగ్రరజోగుణుండ ని
స్సీమదయంగరాంబుజము శీర్షముఁ జేర్చుట చోద్యమీశ్వరా.

టీ. ఈశ్వరా = సర్వజగములకు ప్రభువైన ఓనారాయణా, శ్రీమహిళా...గర్భులకు ఐనన్ = శక్తిరూపిణియగు పార్వతికి భర్తయగుశివునకును బ్రహ్మకును ఐనను, నీ...కరంబున్ = నీమహామహిమగల హస్తముచేత, అభయదానము=అభయమునిచ్చుటను, చేయవు, నేను, బాలుఁడను, తామసవంశసంభవుఁడన్=మోటురక్కసిగులమునఁబుట్టినవాఁడను, దైత్యుఁడన్=దితిజులవంశమువాఁడను, ఉగ్రరజోగుణుండన్ = క్రూరమైన రజోగుణము కలవాఁడను, నిస్సీమదయన్=హద్దులేని కరుణచేత, కరాంబుజము=కేలుఁదామర, శీర్షమున్=నెత్తిని, నిల్పుట=ఉంచుట, చోద్యము=వింత.

వ. మహాత్మా సుజను లయినబ్రహ్మాదులందును దుర్జను లైన మాయందును సేవానురూపంబుగం బక్షపాతంబులు లేక కల్పవృక్షంబుచందంబున ఫలప్రదానంబు సేయుదువు కందర్పసమేతం బగుసంసారకూపంబునం గూలు చున్నమూఢజనులం గూడి కూలెడినేను భవదీయభృత్యుం డగునారదుని యనుగ్రహంబునంజేసి నీకృపకుఁ బాత్రుండ నైతి నన్నురక్షించి మజ్జనకుని వధియించుట నాయందులఁ బక్షపాతంబు గాదు దుష్టదనుజసంహారంబును శిష్టభృత్యమునిజనరక్షాప్రకారంబును నీకు నైజగుణంబులు విశ్వంబు నీవ గుణాత్మకం బయినవిశ్వంబు సృజియించి యందుం బ్రవేశించి హేతుభూతగుణయుక్తుండ వై రక్షకసంహారకాదినానారూపంబుల నుండుదువు సదసత్కారణకార్యాత్మకం బయిన విశ్వంబునకుం బరమకారణంబు నీవ నీమాయచేత వీఁడు దానని యెడిబుద్ధివికల్పంబు దోఁచుఁ గాని నీకంటె నొం డెద్దియు లేదు బీజంబునందు వస్తుమాత్రభూత సౌక్ష్మ్యంబును వృక్షంబునందు నీలత్వాది వర్ణంబునుం గలుగు తెఱంగున విశ్వంబునకు నీయంద జన్మస్థితిప్రకాశనాశంబులుం గలు

గు నీచేత నయినవిశ్వంబు నీయందు నిలుపుకొని తొల్లి ప్రళయకాలపారావారంబునం బన్నగేంద్రపర్యంకంబునం గ్రియారహితుండ వై నిజసుఖానుభవంబు సేయుచు నిద్రితుని భంగి యోగనిమీలితలోచనుండవై మెలంగుచుం గొంతకాలంబునకు నిజకాలశక్తిచేతం బ్రేరితంబు లై ప్రకృతిధర్మంబు లయినసత్త్వాదిగుణంబుల నంగీకరించి సమాధి సాలించి వెలుంగుచున్న నీనాభియందు వటబీజంబువలన నుద్భవించువటంబు తెఱంగున నొక్కకమలంబు సంభవించె నట్టికమలంబువలన నాల్గుమోముల బ్రహ్మ జన్మించి దిశలు వీక్షించి కమలంబునకు నొండయినరూపంబు లేకుండుటం జింతించి జలాంతరాళంబుం బ్రవేశించి జలంబులందు నూఱు దివ్యవత్సరంబులు వెదకి తనజన్మంబునకు నుపాదానకారణంబైననిన్ను దర్శింప సమర్థుండు గాక మఱలి కమలంబుకడకుం జని విస్మయంబు నొంది చిరకాలంబు నిర్భరతపంబు సేసి పృథివియందు గంధంబు గనుచందంబునం దనయందు నానాసహస్రవదన శిరోనయన నాసాకర్ణవక్త్రభుజకర చరణుండును బహువిధాభరణుండును మాయాకలితుండును మహాలక్షణలక్షితుండును నిజప్రకాశదూరీకృతతముండును బురుషోత్తముండు నయిననిన్ను దర్శించె నయ్యవసరంబున. 3౨0

టీ. సుజనులు=సాధువులు, దుర్జనులు = దుష్టులు, సేవానురూపంబుగన్ =కైంకర్యమునకుఁ దగినట్టులు, పక్షాపక్షంబులు=స్వీయ పరకీయ భావములు, లేక, కల్పవృక్షంబుచందంబునన్ = కల్పవృక్షమువలె, ఫలప్రదానము=ఐహికాముష్మికములు (పండ్లను) ఇచ్చుటను, కందర్పసమేతంబు = మన్మథునితోఁ గూడియున్నది. అగు, సంసారకూపంబునన్=సంసారమను నూతియందు, భవదీయభృత్యుండు=నీదాసుఁడు, నీకృపకున్ = నీదయకు,

పాత్రుండఁవై=తగినవాఁడను, మజ్జనకుని=మాయయ్యను, వధియించుట=చంపుట, పక్షపాతము=మమత్వము, దుష్టదనుజసంహారంబును = క్రూరులగు రాక్షసులఁ జంపుటయు, శిష్ట...కారంబును=సాధువులైనదాసులు మునులు వీరిని రక్షించు విధమును, నైజగుణంబులు=స్వభావసిద్ధములైన గుణములు, విశ్వంబు=ప్రపంచము, గుణాత్మకము = సత్వరజస్తమోగుణరూపమైనది, విశ్వంబు=ప్రపంచము, సృజియించి=పుట్టించి, ప్రవేశించి=చొచ్చి, హేతుభూతగుణయుక్తుండవు=కారణమైన గుణములతోఁ గూడినవాఁడవు, రక్షక...రూపంబులన్=కాపాడువాఁడు, చంపువాఁడు మొదలయిన బహుస్వరూపములచేత, ఉండుదువు. సద...త్మకంబు=ఉండునది లేనిది కారణము కార్యము అనురూపములుగల, విశ్వంబునకున్=ప్రపంచమునకు, పరమకారణంబు=ముఖ్యహేతువు, వీఁడు=ఇతరుఁడు, తాను, బుద్ధివికల్పంబు=జ్ఞానభేదము, ఒండు=వేఱు, బీజంబునందు=విత్తుయందు, వస్తుమాత్రసౌక్ష్మ్యంబును=అణువుగానైన పదార్థముయొక్క సూక్ష్మత్వమున్ను, నీలత్వాదివర్ణంబును=నలుపు మొదలగు రంగును, కలుగుతెఱంగునన్=కలుగునట్లుగా, జన్మస్థితిప్రకాశనాశంబులు=పుట్టుట బ్రతుకుట విజృంభించుట నశించుట, తొల్లి=పూర్వము, ప్రళయకాలపారావారంబునన్=ప్రళయకాలమందలి సముద్రమందు, పన్నగేంద్రపర్యంకంబునన్ = శేషశయ్యయందు, క్రియారహితుండవు=పనులు మానినవాఁడవు, నిజసుఖానుభవంబు=ఆత్మసుఖము ననుభవించుట, నిద్రితునిభంగిన్=నిద్రబోయినవాని యట్టులు, యోగనిమీలితలోచనుండవు=ధ్యానముచేత మూయఁబడిన కన్నులు గలవాఁడవు, కొంతకాలంబునకున్=కొంతసేపటికి, నిజకాలశక్తిచేతన్ = నీసంబంధమైనకాలము యొక్క ప్రభావముచేత, ప్రేరితంబులు=పురికొలుపఁబడినవి, ప్రకృతిధర్మంబులు = అవిద్యాగుణములు, సత్త్వాదిగుణంబులన్ = సత్త్వము మొదలగు గుణములను, అంగీకరించి=ఒప్పుకొని, సమాధి=ఏకాగ్రత, నాభి = బొడ్డు, వటబీజంబు=మఱ్ఱివిత్తు, వటంబు=మఱ్ఱిచెట్టు, ఒక్క-కమలంబు = ఒక్కతామర, నాల్గుమోములబ్రహ్మ=నాలుగు మొగములు గలసృష్ట్యధిష్ఠానదైవము,

జన్మించి=పుట్టి, వీక్షించి=చూచి, కమలంబునకున్ = ఒకనాభియందలి తామరకంబె, ఒండు, ఇతరము, చింతించి=యోచించి, జలాంతరాళంబు= నీటినడుము, ప్రవేశించి=చొచ్చి, దివ్యవత్సరంబులు=దేవతాసంవత్సరములు, వెదకి, తనజన్మంబునకున్=తనపుట్టుకకు, ఉపాదానకారణంబు=ముఖ్యహేతువును, నిన్ను, (విష్ణుని), దర్శింపన్=చూచుటకు, సమర్థుండు = చాలినవాఁడు, కాక, మగిడి=మరలి, చని=పోయి, విస్మయంబు = ఆశ్చర్యము, చిరకాలంబు=చాలకాలము, నిర్భరతపంబు=పూర్ణమైన తపస్సు, చేసి, పృథివియందు=భూమిమీఁద, గంధంబు=వాసనను, కనుచందంబునన్= చూచునట్లు, తనయందున్=తనలో, నానా...చరణుండు = పెక్కువేల ముఖములు తలలు కన్నులు ముక్కులు చెవులు నోరులు బాహువులు చేతులు కాళ్లుగలవాఁడు, బహువిధాభరణుండు=పలువన్నెలసొమ్ములు గలవాఁడు, మాయాకలితుఁడు=మాయతోఁ గూడినవాఁడు, మహాలక్షణ లక్షితుండు= గొప్ప దివ్యలక్షణములచేఁ బ్రకాశించువాఁడు, నిజ...తముండు=తనకాంతి చే పోఁగొట్టఁబడిన అజ్ఞానమను అంధకారముగలవాఁడు, పురుషోత్తముండు= పురుషశ్రేష్ఠుఁడును, ఐన, నిన్ను, దర్శించెన్ = చూచెను, అయ్యవసరంబునన్ = ఆసమయమందు.

క. ఘోటకవదనుఁడ వై మధు
కైటభులం ద్రుంచి నిగమగణముల నెల్లం
బాటించి యజున కిచ్చిన
కూటస్థుఁడ వీశ్వరుఁడవు కోవిదవంద్యా. 361

టీ. కోవిదవంద్యా=పండితులచేత నమస్కరించఁదగిన ఓ స్వామీ, నీవు, ఘోటకవదనుఁడవు = గుఱ్ఱపుమోముగలవాఁడవు, అయి, మధుకైటభులన్=మధువు కైటభుఁడు అనురాక్షసులను, త్రుంచి=చంపి, నిగమగణములను=వేదసమూహములను, ఎల్లన్, పాటించి=ఉద్ధరించి, అజునకున్= బ్రహ్మకు, ఇచ్చిన, కూటస్థుఁడవు=సర్వకాల సర్వావస్థలయందు వికారము

నొందక ఒక్కతీరున శాశ్వతుఁడుగా నుండువాఁడవు, ఈశ్వరుఁడవు=ప్రభువవు.

తా. విద్వాంసులచే స్తోత్రము చేయఁదగిన ఓనారాయణా, నీవు గుఱ్ఱపుమొగముగలవాఁడవై (హయగ్రీవావతారమెత్తి) మధుకైటభులను రాక్షసులను జంపి, వేదములన్నియు బ్రహ్మకుఁ దెచ్చియిచ్చి అవికారరూపుఁడై సనాతనుఁడైన ఈశ్వరుఁడవు నీవేకదా.

వ. ఇవ్విధంబునఁ గృతత్రేతాద్వాపరంబు లనుమూఁడుయుగంబులందును దిర్యఙ్మానవమునిజలచరాకారంబుల నవతరించి లోకంబుల నుద్ధరించుచు ధరించుచు హరించుచు యుగానుకూలధర్మంబులం బ్రతిష్ఠించుచు నుండుదువు దేవా యవధరింపుము. 362

టీ. తిర్య...కారంబులన్=మృగపక్ష్యాదులు మనుజులు మునులు జలజంతువులు వీనిరూపములచేత, అవతరించి=పుట్టి, ఉద్ధరించుచున్=కాపాడుచు, ధరించున్=తాల్చుచు, హరించుచున్=నశింపఁజేయుచు, యుగానుకూలధర్మంబులన్=యుగములకు అనురూపములైన న్యాయములను, ప్రతిష్ఠించుచున్=పాదుకొలుపుచు, ఉండుదువు, దేవా = క్రీడయే ముఖ్యోద్దేశముగాఁ గల యోస్వామీ, అవధరింపుము=చిత్తగించుము.

సీ. కామవార్తాదిసంకలితమై చిత్తంబు
భవదీయచింతనపదవి సొరదు
మధురాదిరసముల మరగి చొక్కుచు జిహ్వ
నీవర్ణనమునకు నిగుడ నీదు
సుందరీముఖములఁ జూడఁ గోరుచుఁ జూడ్కి
తావకాకృతులపైఁ దగులువడదు

వివిధదుర్భాషలు వినఁ గోరులీనులు
　　వినవు యుష్మత్కథావిరచనములు
తే. ఘ్రాణ మురవడిఁ దిరుగు దుర్గంధములకుఁ
దవులు గొలుపదు వైష్ణవధర్మములకు
నడఁగి యుండవు కర్మేంద్రియములు పురుషుఁ
గలఁచు సవతులు గృహమేధిఁ గలఁచునట్లు. 363

టీ. చిత్తంబు=మనస్సు, కామహర్షాది కలిలితము=కోరికలు వేడుకలుమొదలగువానిచేఁ గలఁతపడినది, ఐ, భవదీయచింతనపదవి=నిన్నుచింతించుత్రోవను, సారదు=చనదు, జిహ్వా=నాలుక, మధురాదిరసములు=తీపిమొదలగురుచులను, మరగి, చొక్కుచు=మిథ్యానందమునొందుచు, నీవర్ణనమునకున్=నిన్ను స్తుతించుటను, నిగుడనీదు=తలఁచుటకైననీయదు, చూడ్కి=చూపు, సుందరీముఖములన్=సొగసుకత్తెలముద్దుమొగములను, చూడన్, కోరుచు, తావకాకృతులపైన్=నీరూపములమీఁద, తగులువడదు=చిక్కదు, వీనులు=చెవులు, వివిధదుర్భాషలన్=పలుదెఱఁగులచెడ్డమాటలను, వినన్, కోరును, యుష్మత్కథావిరచనములు=నీగాథలవర్ణనలు, వినవు, ఘ్రాణము=ముక్కు, ఉరవడిన్=వేగముగా, దుర్గంధములకున్=చెడువాసనలకు, తిరుగును, వైష్ణవధర్మములకున్=విష్ణుప్రీతికరములైనప్రాణాయామాదికృత్యములకు, తగులుకొలుపదు=ఒప్పనీయదు, కర్మేంద్రియములు=వాక్కు చేతులు కాళ్లు గుదము ఉపస్థము అనుఇంద్రియములు, అడఁగి=వశములై, ఉండవు, సవతులు, గృహమేధిన్=గృహస్థుని, కలఁచునట్లు=కలఁతనొందించునట్లు, పురుషున్=దేహిని, కలఁచున్=కలియఁబెట్టును.

తా. మనస్సు కోరికలు మొదలగువానిచే కలఁతపడి నిన్ను ధ్యానించుత్రోవ ద్రొక్కదు. నాలుక తీపిమొదలగువానిరుచి మరగి నీస్తుతి కియ్యకొనదు. చూపు సొగసుకత్తెలఁ జూడ పరువులిడుఁగాని నీదివ్యమంగళవిగ్రహములఁ జూడనొప్పదు. చెవులు పాడుసొదెలు వినునుగాని నీకథావర్ణనములను విననొల్లవు.

ముక్కు దుర్వాసనలకుఁ బోవునుగాని మంచి (ప్రాణాయామాదికార్యముల) పనులకుఁ బోదు. కర్మేంద్రియములా సవతులందఱు గృహస్థుని జిక్కులఁ బెట్టి నట్లు పురుషుని వేధించును.

వ. ఇవ్విధంబున నింద్రియంబులచేతఁ జిక్కువడి స్వకీయపరకీయ శరీరంబులందు మిత్రామిత్రభావంబులు సేయుచు జన్మమ రణంబుల నొందుచు సంసారవైతరణీనిమగ్నంబయినలో కంబు నుద్ధరించుట లోకసంభవస్థితిలయకారణుండ వైననీ కుం గర్తవ్యంబు భవదీయసేవకుల మయినమాయందుఁ బ్రి యభక్తు లయినవారల నుద్ధరింపుము. 364

టీ. స్వకీయ...బులందుఁ=తమవి ఇతరులవియునగు దేహములయం దు, మిత్రామిత్రభావంబులు=చెలిమిపగయును, సేయుచు, జన్మమరణం బులఁ=పుట్టుచావులను, పొందుచు, సంసారవైతరణీనిమగ్నంబు=సంసా రమనునిప్పులయేఱులోబడి మునిఁగినది, లోకంబుఁ=జనమును, ఉద్ధరించు ట=కడతేర్చుట, లోక...ణుండవు=లోకములపుట్టుకపెంపు చావులకు హేతువవు, ఐన, నీకుఁ, కర్తవ్యంబు=చేయఁదగినది, భవదీయసేవకులము= నీకింకరులము, అయినమాయందుఁ, ప్రియభక్తులు=ఇష్టభృత్యులు, ఉద్ధరిం పుము=గట్టునకుఁ జేర్పుము.

మ. భగవద్దివ్యగుణానువర్తనసుధాప్రాప్త్యైకచిత్తుండ నై
బెగడన్ సంసరణోగ్రవైతరణికిన్ భిన్నాత్ముఁడై తావకీ
యగుణస్తోత్రపరాఙ్ముఖత్వమున మాయాసౌఖ్యభావంబులన్
సుగతిం గాననిమూఢులం గని మదిన్ శోకింతు సర్వేశ్వరా.

టీ. సర్వేశ్వరా=ఎల్లలోకములకుఁ బ్రభువైనయో దేవా, నేను, భగవ ...చిత్తుండన్=షడ్గుణైశ్వర్యవంతుఁడవైన నీయమానుషగుణములఅనుసంధాన ముచేనైన అమృతమును మరగినమనము గలవాఁడనై, సంసరణోగ్రవైతరణి

కిఁ=సంసారమనుభయంకరమైన నిప్పులయేఱునకు, బెగడఁ=భయమందను, భిన్నాత్ములై=భేదబుద్ధిగలవారై, తావకీయ...మునఁ = నీవగుకల్యాణగుణములు మంగళస్తోత్రములు వీనికి పెడమోముపెట్టి, మాయాసౌఖ్యభావంబులఁ=మిథ్యాసుఖమును సుఖముగాఁదలఁచుటచేత, సుగతిఁ=ఉత్తమగతిని, కానవిమూఢులఁ = పొందనిఅజ్ఞానులను, కని=చూచి, మదిఁ=నామనస్సున, శోకింతుఁ=దుఃఖపడెదను.

తా. స్వామీ నీకల్యాణగుణముల చింతనామృతముచేఁ దృప్తచిత్తుండనైనందున నేనంతగా సంసారమనునిప్పులయేఱునకు భీతిల్లను. పాపము ఈ మూఢమానవులందఱు భేదబుద్ధితో నీగుణవర్ణనమునకు ద్వేషపడి మిథ్యాసౌఖ్యములను సౌఖ్యములనినమ్మి ఉత్తమగతిని పొందనేరకపోయిరిగదా యని అనిశము చింతనొందువాఁడను.

వ. దేవా మునీంద్రులు నిజవిముక్తకాములయి విజనస్థలంబులందపంబు లాచరింతురు కాముకత్వంబు నొల్లకయుండువారికి నీకంటె నొండు శరణంబు లేదు గావున నిన్ను సేవించెదఁ గొందఱు కాముకులు గరద్వయకండూతిచేతం దనియనిచందంబునఁ దుచ్ఛంబయి పశుపక్షిక్రిమికీటసామాన్యం బయినమైథునాదిగృహమేధిసుఖంబులం దనియక కడపట నతిదుఃఖవంతులగుదురు నీప్రసాదంబు గలుగుగుణుండు నిష్కాముండయి యుండు మౌనవ్రతజపతపశ్శ్రుతాధ్యయనంబులును నిజధర్మవ్యాఖ్యానవిజనస్థలనివాససమాధులును మోక్షహేతువు లగు నయిన నివిపదియు నింద్రియజయంబు లేనివారికి భోగార్థంబు లయి విక్రయించువారికి జీవనోపాయంబు లయి డాంబికులకు వార్తాకరంబు లయియుండు సఫలంబులు గావు భక్తి లేక భవదీయజ్ఞానంబు లేదు రూపరహితుండవైననీకు బీజాంకురంబులకై వడిఁ గారణకా

ద్యంబులయిన సదసద్రూపంబులు రెండును బ్రకాశమానంబులగు నా రెంటియందును భక్తియోగంబున బుద్ధిమంతులు మథనంబున దారువులందు వహ్నిం గనియెడు తెఱంగున నిన్నుం బొడగందురు పంచభూతతన్మాత్రంబులును బ్రాణేంద్రియంబులును మనోబుద్ధ్యహంకారచిత్తంబులును నీవ సగుణంబును నిర్గుణంబును నీవ గుణాభిమాను లయిన జన్మమరణంబుల నొందువిబుధు లాద్యంతంబులు గానక నిరుపాధికుండ వైనని న్నెఱుంగరు తత్త్వజ్ఞు లయినవిద్వాంసులు వేదాధ్యయనాదివ్యాపారంబులు మాని వేదాంతప్రతిపాద్యుండ వగునిన్ను సమాధివిశేషంబుల నెఱింగి సేవింతురదిగావున.

టీ. నిజవిముక్తకాములు = స్వభావముచేత నేవిడువఁబడిన కోరికగలవారు, విజనస్థలంబులన్ = గుంపుచేరనిరహస్యదేశములందు, ఆచరింతురు = చేయుదురు, కాముకత్వంబు = కోరికలుగోరువానిధర్మము, కాముకులు = కోరికలుగోరువారు, కరద్వయకండూతిచేతన్ = రెండుచేతులదురదచేత, తనియనిచందంబునన్ = గోఁకికొని తృప్తిచెందనిలాగున, తుచ్ఛంబు = నీచము, పశు... సామాన్యంబు = గొడ్లు పిట్టలు పురుఁగులు వీనికితుల్యము ఐన, మైథునాదిగృహమేధిసుఖంబులన్ = సురతము మొదలగు కాఁపుసౌఖ్యములచేత, తనియక = తృప్తిచెందక, కడపటన్ = తుదను, అతిదుఃఖవంతులు = మిగులదుఃఖముగలవారు, అగుదురు. తీఁటపట్టినవాఁడు తగ్వాత నుప్పిమంటయెత్తునని విచారింపక నెత్తురుగాఁబరికి చివరకు అతిబాధ చెందునట్లు ముందువచ్చుకష్టముగానక తుచ్ఛములైనమైథునాదిసుఖములఁజెందువారు తుదకుఁగష్టపడుదురనిభావము. నీప్రసాదంబునన్ = నీయనుగ్రహము, కలసుగుణుండు = కలిగినసజ్జనుఁడు, నిష్కాముండు = కోరికలేనివాఁడు, మౌన...నంబులును = మాటలాడకుండుట వ్రతములు జపము తపము వేదశాస్త్రములు చదువుకొనుట, నిజ...సమాధులు = స్వ(నీ)ధర్మములను వివరించుకొనుచు రహస్యమైనతావునగూర్చుండుట

చిత్తైకాగ్ర్యమును, మోక్షహేతువులు=ముక్తిసాధనములు, అగును. ఇంద్రియజయంబు=అంతరింద్రియ బహిరింద్రియనిగ్రహము, లేనివారికి, భోగార్థంబులు=అనుభవైకప్రయోజనములు, విక్రయించువారికిన్=అమ్మువారికి, జీవనోపాయంబులు=బ్రతుకుదెరువులు, డాంభికులకున్=దంభమును బూనువారికి, వార్తాకరంబులు=జీవనహేతువులు, సఫలంబులు=మోక్షఫలముతోఁగూడినవి, కావు, భవదీయజ్ఞానంబు=నీసంబంధమైనయెఱుక, రూపరహితుండవు=ఏరూపము లేనివాఁడవు, బీజాంకురంబులకైవడిన్=విత్తు మొలకలవలె, కారణకార్యంబులు=హేతుహేతుమత్తులు, సదసద్రూపంబులు=శాశ్వతము భంగురమునైన రూపములు, ప్రకాశమానంబులు=వెలుఁగుచున్నవి, అగును, ఆరెంటియందును, భక్తియోగంబునన్=నిరంతరము భక్తిని అనుసంధించుటచేత, మథనంబునన్=తరచుటచేత, దారువులందున్=కట్టెలలో, వహ్నిన్=అగ్నిని, కనియెడు తెఱంగునన్=అగపడునట్లు, నిన్ను, పొడగందురు=చూతురు, పంచభూతతన్మాత్రంబులును=పృథివ్యాదుల లేశములైన శబ్దస్పర్శరూపరసగంధములు, ప్రాణేంద్రియంబులును=ప్రాణములు ఇంద్రియములును, మనోబుద్ధిచిత్తాహంకారములును, నీవే, సగుణంబును=గుణములతోఁగూడినది, నిర్గుణంబు=గుణరహితమైనది, నీవే, గుణాభిమానులు=గుణములయందు తగులుగలిగి, జన్మమరణంబులను=పుట్టుచావులను, ఒందు విబుధులు=పొందువిద్వాంసులు, ఆద్యంతంబులు=మొదలుతుదయు, కానక=చూడక, నిరుపాధికుండు=ఉపాధి (విషయసంగము) లేని, తత్త్వజ్ఞులు=నిజమెఱిఁగినవారు, విద్వాంసులు=పండితులు, వేదాధ్యయనాదివ్యాపారంబులు = వేదములుచదువుట మొదలైనపనులు, వేదాంతప్రతిపాద్యుండవు=వేదాంతములచే వర్ణింపఁదగినవాఁడవు, సమాధివిశేషంబులన్=ధ్యానభేదములచేత, ఎఱింగి=తెలిసికొని, సేవింతురు=పరిచర్యచేయుదురు.

సీ. నీగృహాంగణభూమి నిటలంబు మోవంగ
మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని

నీమంగళ స్తవనికర వర్ణంబులు
పలుమాఱు నాలుకఁ బలుకఁడేని
నీయధీనములుగా నిఖిలకృత్యంబులు
బ్రియభావమున సమర్పింపఁడేని
నీపదాంబుజముల నిర్మలహృదయుఁడై
చింతించి మక్కువఁ జిక్కఁడేని

తే. నిన్నుఁ జెవులార వినఁడేని నీకు సేవ
సేయ రాఁడేని బ్రహ్మంబుఁ జెందఁగలఁడె
యోగి యైనఁ దపోవ్రతయోగి యైన
వేది యైన మహాతత్త్వ వేది యైన. 367

టీ. యోగి = యోగము తెలిసినవాఁడు, ఐనను, తపోవ్రతయోగి = తపము వ్రతములు గలవాఁడైనను, వేది = వేదములు చదివినవాఁడు, ఐనను, మహాతత్త్వవేది = గొప్పపరతత్త్వవేత్త, ఐనను, నీగృహాంగణభూమి = నీగుడి ముందటివాకిట, నిటలంబు = నొసలు, మోపంగన్ = తాఁకునట్లు, నిత్యంబు = ఎల్లప్పుడు, మోదించి = తాఁకించి, మ్రొక్కఁడేనిన్ = నమస్కరింపఁడేని, నీమంగళ...బులు = నీ శుభములైన స్తోత్రముల సమూహములయందలి అక్షరముల సమూహములు, నాలుకన్ = నాలుకచేత, పలుమాఱు, అనేకపర్యాయములు, పలుకఁడు ఏనిన్, నిఖిలకృత్యంబులు = తాఁజేయు నెల్లపనులు, నీయధీనములుగాన్ = నీస్వాధీనములగునట్లు, ప్రియభావమునన్ = ప్రేమతో, సమర్పింపఁడు ఏనిన్, నిర్మలహృదయుఁడు ఐ = రాగాదికళంకములు లేనివాఁడై, నీపదాంబుజములన్ = నీపాదకమలములను, చింతించి = ధ్యానించి, మక్కువన్ = ప్రేమయందు, చిక్కఁడేనిన్ = తగులుకొనఁడేని, నిన్ను, చెవులారన్ = చెవులపండువుగా, వినఁడేనిన్, నీకు సేవసేయరాఁడేని, బ్రహ్మంబున్ = బ్రహ్మస్వరూపుఁడైన నిన్ను, చెందఁగలఁడే = పొందఁగలఁడా, పొందలేఁడు.

తా. స్వామీ ఎంత యోగియైనను తపము నోములు మొదలగునవి జరపువాఁడైనను, వేదములు చదివినవాఁడైనను, గొప్పతత్త్వవేత్తయైనను, నీ గుడివాకిట నొసలు దాఁకునట్లు పడి దండము పెట్టనివాఁడును, పలుమాఱు నీ స్తోత్రపాఠములు చదువనివాఁడును, తాఁజేయు నెల్లపనులు నీవే యని సమర్పించ నేరనివాఁడును, శుద్ధభావముతో నీపాదకమలముల ధ్యానించనివాఁడును, నిన్ను విననివాఁడును ఆదరముతో నీసేవ చేయనివాఁడును బ్రహ్మరూపుఁడైననిన్ను బొందఁగలఁడా, పొందఁజాలఁడనుట.

వ. కావున భవదీయదాస్యయోగంబు గృప సేయుమని ప్రణతుండైనప్రహ్లాదుని వర్ణనంబులకు మెచ్చి నిర్గుణుండైన హరి రోషంబు విడిచి యిట్లనియె. 358

టీ. భవదీయదాస్య యోగంబు=నీకైంకర్యములభించుతెరువు, కృప సేయుము=కరుణించుము, ప్రణతుండు = మ్రొక్కువాఁడు, వర్ణనంబులకున్ = స్తుతులకు, నిర్గుణుండు = రాగరోషాదిగుణములు లేనివాఁడు, రోషంబు = కోపము.

శా. సంతోషించితి నీచరిత్రమునకున్ సద్భద్రమౌఁ గాక నీ
యంతర్వాంఛితలాభ మెల్లఁ గరుణాయత్తుండనై యిచ్చెదం
జింతం జెందకు భక్తకాముఁడ నే సిద్ధంబు దుర్లోకుఁడన్
జంతుశ్రేణికి నన్నుఁ జూచినఁ బునర్జన్మంబు లే దర్భకా.

టీ. అర్భకా=పట్టీ, నీచరిత్రమునకున్ = నీనడువడికి, సంతోషించితిని, నీకు, సద్భద్రము=మంచి శుభము, ఔన్ కాక, కరుణాయత్తుండన్ ఐ=దయకులోఁగినవాఁడనై, నీయంతర్వాంఛితమున్ = నీమనస్సులో నీవు గోరుకొన్న కోర్కెలన్నియు, ఇచ్చెదను, చింతన్ = విచారమును, చెందకుము, నేను, భక్తకాముఁడన్ = భాగవతులకోర్కె లొసఁగువాఁడను, సిద్ధంబు = నిజము, జంతుశ్రేణికిన్ = శరీరులకు, దుర్లోకుఁడన్ =

చూడశక్యముకానివాఁడను, నన్ను, చూచినన్=కనుఁగొనినచో, పునర్జన్మంబు=మఱుపుట్టువు, లేదు.

తా. వత్సా, ప్రహ్లాదా, నీనడవడికి చాలఁగ సంతసించినాను, నీకు శుభము గలుఁగుఁగాక. నీవు కోరినదెల్ల నిచ్చుటకు సంసిద్ధుఁడనై యున్నాను విచారపడకుము. నేను భక్తులకోరికలను దీర్చువాఁడను. నీయందు నాకు అత్యంతప్రీతి గలదుగాన నీకు దర్శన మిచ్చినానుగాని నేను ఎల్లజంతువులకు చూడ నలవికానివాఁడను. నన్ను జూచినవారు మఱుపుట్టుకను జెందరు.

ఆ. సకలభావములను సాధులు విద్వాంసు
లఖిలభద్రవిభుఁడ నైననన్నుఁ
గోర్కు లిమ్మటంచుఁ గోరుదు రిచ్చెదఁ
గోరు మెద్దియైనఁ గుఱ్ఱ నీవు. 370

టీ. కుఱ్ఱా, సాధులు=సజ్జనులైన, విద్వాంసులు=పండితులు, సకలభావములన్=అన్నివిధములచేతను, అఖిలభద్రవిభుఁడన్ = సమస్తమంగళదాయకుఁడను, ఐననన్నున్, కోర్కులు, ఇమ్ము=ఈయుము, అటంచును, కోరుదురు, నీవును, కోరుము, ఎద్దియైనను, ఇచ్చెదను.

తా. కుఱ్ఱా, ఎంతటివారును మంగళకారణుఁడైననన్ను తమయెల్ల యర్థములచేతను కోరికలిమ్మని కోరుచుందురు. నేనును వారి కోరికల నిచ్చుచుందును. నీవును దేనినైన నీయిష్టమైనదానిం గోరికొనుము. ఇచ్చెదను.

వ. అని పరమేశ్వరుండు ప్రహ్లాదునియందుఁ గలసకామత్వంబుఁ దెలియుకొఱకు వంచించి యిట్లానతిచ్చిన నతండు నిష్కాముం డైనయేకాంతి గావునఁ గామంబు భక్తియోగంబునకు నంతరాయం బని తలంచి యిట్లనియె నుత్పత్తిమొదలు కామాద్యనుభవాసక్తి గలనాకు వరంబు లిచ్చెద నని వంచింపనేల సంసారబీజంబులును హృదయబంధకంబు లయినకామంబులకు వెఱచి ముముక్షుండనై నేమంబుకొఱ

కు నేమంబున నిన్నుం జేరితి కామంబులును నింద్రియంబులు
ను మనశ్శరీరధైర్యంబులును మనీషాప్రాణధర్మంబులును ల
జ్జాస్మరణలక్ష్మీసత్యతేజోవిశేషంబులును నశించు లోకం
బులందు భృత్యు లర్థకాములయి రాజుల సేవింతురు రా
జులుం బ్రయోజనంబు లర్థించి భృత్యులకు నర్థంబు లొసం
గుదు రన్యోన్యార్థంబునంగాదు నాకుం గామంబు లేదు నీకుం బ్ర
యోజనంబు లే దయినను దేవా వరదుండ వయ్యెదవేనిఁ
గామంబులు వృద్ధిఁ బొందనివరంబు గృపసేయుము కామంబు
లు విడిచినపురుషుండు నీతోడ సమానవిభవుం డగు నర
సింహ పరమాత్మ పురుషోత్తమ యని ప్రణవపూర్వకంబుగా
నమస్కరించిన హరి యిట్లనియె. 371

టీ. పరమేశ్వరుండు=నరసింహమూర్తి, సకామత్వంబు=కోరికలుగలిగియుండుట, వంచించి=మోసముచేసి, ఇట్లు, ఆనతిచ్చినన్=సెలవీయఁగా (చెప్పఁగా), నిష్కాముఁడు=కోరికలులేనివాఁడు, ఐన, ఏకాంతి=అంతరంగభక్తుఁడు, కామంబు=కోర్కె, భక్తియోగంబునకున్=భక్తినిబట్టుటకు, అంతరాయంబు=విఘ్నము, ఉత్పత్తి=పుట్టుక, కామాద్యనుభవాసక్తి=కామాదుల ననుభవించుతలఁపు, వరంబులు=ఇష్టములు, వంచింప నేల=మోసపుచ్చుటయెందుకు, సంసారబీజంబు=సంసారమునకుకారణములైనవి, హృదయబంధకములు=మనస్సును జ్ఞానమువంకఁబోకుండఁగట్టివేయునవి, ముముక్షుండను=ముక్తిబొందఁగోరువాఁడను, నేమంబు=మేలు, నేమంబునన్=నియమముతో, కామంబులు=కోరికలు, మనశ్శరీరధైర్యంబులు=చిత్తముదేహము బలము, మనీషాప్రాణధర్మంబులును=బుద్ధిప్రాణమున్యాయము, లజ్జా.. విశేషంబులు=సిగ్గు జ్ఞప్తి సంపద సత్యము వర్చస్సు, నశించు=క్షయమగు, భృత్యులు=సేవకులు, అర్థకాములు=డబ్బునుగోరినవారు, ప్రయోజనంబు=వారలవలనఁ గాఁదగినకార్యములు, అర్థించి=కోరి, ఒసంగుదురు=ఇత్తురు. అవ్వి

ధంబునన్ = ఆతీరున, కామంబు = కోరిక, ప్రయోజనము = నావలనఁ గావలసిన కార్యము, వరదుఁడవు = కోరినవానినిచ్చువాఁడవు, కృపసేయుము = ఇమ్ము, సమానవిభవుండు = తుల్యమైనయైశ్వర్యముగలవాఁడు, ప్రణవపూర్వకంబుగాన్ = ఓంకారము ముందు బలుకునట్లు

సీ. నీయట్టిసుజ్ఞాననిపుణు లేకాంతులు
కోర్కులు నాయందుఁ గోరనొల్ల
రట్లైనఁ బ్రహ్లాద యసురేంద్రభర్తవై
సాగి మన్వంతర సమయ మెల్ల
నిఖిలభోగంబులు నీవు భోగింపుము
కల్యాణబుద్ధి నాకథలు వినుము
సకలభూతములందు సంపూర్ణుఁ డగునన్ను
యజ్ఞేశు నీశ్వరు నాత్మ నిలిపి
ఆ. కర్మచయము లెల్ల ఖండించి పూజన
మాచరింపు మీశ్వరార్పణముగ
భోగముల నశించుఁ బుణ్యంబు వ్రతములఁ
బాపసంచయములు పాయునిన్ను. 372

టీ. ప్రహ్లాద, నీయట్టిసుజ్ఞాననిపుణులు = మంచిబ్రహ్మజ్ఞానమందు నేర్పుగలవారు, ఏకాంతులు = అంతరంగభక్తులు, నాయందు, కోర్కులు, కోరనొల్లరు, అట్లయినను, అసురేంద్రభర్తవు = రాక్షసశ్రేష్ఠులకుప్రభువు, ఐ, సాగి = నెగడి, మన్వంతరసమయమువెల్లన్ = ఈమన్వంతరకాలమంతయు, నిఖిల = సమస్తములైన, భోగంబులు = సుఖములు, భోగింపుము = అనుభవించుము, నాకథలు, కల్యాణబుద్ధిన్ = క్షేమబుద్ధితో, వినుము, సకలభూతములందున్ = ఎల్లజంతువులయందు, సంపూర్ణుఁడు = నిండియున్నవాఁడు, అగునన్ను, యజ్ఞేశున్ = యజ్ఞేశ్వరుని, ఈశ్వరుని, ఆత్మన్ = చిత్తములో, నిలిపి =

ఉంచి, కర్మచయములు=కర్మసమూహములు, ఎల్లను, ఖండించి=త్రుంచి, ఈశ్వరార్పణముగన్=ఈశ్వరసమర్పితముగా, పూజనము, ఆచరింపుము=పూజచేయుము, పుణ్యంబు=వెనుకటిపుణ్యకర్మము, భోగములన్=అనుభవించుటలచేత, వ్రతములన్=పావనములైనవ్రతములచే, పాపసంచయము=పాపసమూహములు, పాయును=తొలఁగును.

తా. ప్రహ్లాదా! నిత్యానిత్యవివేకము గలిగిన నీవంటి యంతరంగభక్తులు నన్ను కోరికలడుగరు అయినను నీవు రాక్షసులకెల్లరాజవై నెగడి యీమన్వంతరమంతయు నిచ్చట యెల్లభోగములననుభవించుచునుండి ప్రీతితో నాకథలు వినుచు సర్వభూతములయందు నిండిననన్ను నీచిత్తముతో నిలుపుకొని ఎల్లకర్మములుఛేదించి ఈశ్వరప్రీతిగాఁ బూజలు చేసి భోగములచేఁ బుణ్యశేషమును పుణ్యవ్రతములచేఁ బాపములను నివర్తింపఁగా నుండుము.

వ. మఱియు నటమీఁదఁ గాలవేగంబునం గళేబరంబు విడిచి త్రైలోక్యవిరాజమానంబును దివిజరాజగేయమానంబును బరిపూరితదశదిశంబును నయినయశంబుతోడ ముక్తబంధుండవై నన్ను డగ్గఱెదవు వినుము. 373

టీ. కాలవేగంబునన్=కాలగతిచేత, కళేబరంబు=శరీరము, విడిచి=వదలి, త్రైలోక్యవిరాజమానంబు=ముల్లోకములయందుఁ బ్రకాశించునది, దివిజరాజగేయమానంబు=దేవేంద్రునిచేఁ బొగడఁబడినది, పరిపూరితదశదిశంబును=పదిదిక్కులనిండినదియు, యశంబు=కీర్తి, ముక్తబంధుండవై=వీడినసంసారబంధముగలవాఁడవై, డగ్గఱెదవు=సమీపింతువు.

ఆ. నరుఁడు ప్రియముతోడ నాయవతారంబు
నీయుదారగీతనికరములను
మానసించునేని మఱి సంభవింపఁడు
కర్మబంధచయముఁ గడచి పోవు. 374

టీ. నరుఁడు=మానవుఁడు, ప్రియముతోడన్=ఆదరముతోడ, నాయవతారంబు=నానరసింహావతారమును, నీఉదారగీతనికరములను = నీగొప్పగానసమూహములను, మానసించును=మననముచేయును, ఏని, కర్మబంధచయముల్=కర్మపుముడులచిక్కులను, కడచిపోవున్=తప్పించుకొనును.

తా. ప్రహ్లాదా! ఏమానవుఁడైనను భక్తితో నీనానరసింహావతారమును నీపుణ్యగుణకీర్తనమును జేసెనేని పాపములు నశించును.

వ. అనినఁ బ్రహ్లాదుం డిట్లనియె. 375

సీ. దంష్ట్రివై తొల్లి సోదరుని హిరణ్యాక్షు
నీవు సంపుటఁ జేసి నిగ్రహమున
మాతండ్రి రోషనిమగ్నుఁడై సర్వలో
కేశ్వరుఁ బరము ని న్నెఱుఁగలేక
పరిపంథివగుచు నీభక్తుండ నగునాకు
నపకారములు సేసె నతఁడు నేఁడు
నీశాంతదృష్టిచే నిర్మలత్వము నొందెఁ
గావునఁ బాపసంఘంబువలనఁ

తే. బాసి శుద్ధాత్ముఁడు గాఁగ భవ్యగాత్ర
వరము వేఁడెద నానిమ్ము వనజనేత్ర
భక్తసంఘాతముఖపద్మపద్మమిత్ర
భక్తకల్మషవల్లికాపటులవిత్ర. 376

టీ. భక్త...మిత్ర=భక్తులసమూహము లనుకమలములకు సూర్యునివంటివాఁడా, భక్త...లవిత్ర=భక్తులపాపపుఁదీఁగెలకు కొడవలియగువాఁడా, వనజనేత్ర=కమలములవంటికన్నులుగలవాఁడా, భవ్యగాత్ర=దివ్యమంగళవిగ్రహముగలయోస్వామీ, మాతండ్రి = హిరణ్యకశిపుఁడు, నీవు, దంష్ట్రివై=వరాహావతారముఁ దాల్చినవాఁడవై, తొల్లి = మునుపు, హిరణ్యాక్షున్ = మాపినతండ్రిని, చంపుటంజేసి, నిగ్రహమునన్ = తిరస్కారము

తో, రోషనిర్మగ్నుఁడై=కోపములో మునిఁగినవాఁడై, సర్వలోకేశ్వరుఁ=ఎల్లలోకములకుఁ బ్రభువును, పరముఁ=పరాత్పరుఁడైన, నిన్ను, ఎఱుఁగలేక, పరిపంథిపగిదిఁ=శత్రువువలె, నీభక్తుండఁ=నీసేవకుఁడను, అగునాకు, అపకారములు=ద్రోహములు, చేసెను, అతఁడు=మాతండ్రి, నేఁడు, నిశాంతదృష్టిచే=పావనమైననీచూపుచేత, నిర్మలత్వమును=పవిత్రతను, ఒందెను, కావున, పాపసంఘంబువలనన్=పాపసమూహమునుండి, పాసి=తొలఁగి, శుద్ధాత్మకుఁడు=పావనుఁడు, కాఁగ = అగునట్లు, వరము=ఇష్టమును, వేఁడెదను, నాకు, ఇమ్ము=ఈయుము.

తా. ఓనరసింహమూర్తీ! నీవు పూర్వము వరాహావతారమెత్తి మాపినతండ్రిని జంపినందున మాయయ్య యలిగి తిరస్కారభావముతో సర్వలోకేశ్వరుఁడవు పరాత్పరుఁడవు అగునిన్ను తెలియఁజాలక నీభక్తుఁడనైననన్ను శత్రువువలె కష్టపెట్టెను. అట్టివాఁడు ఇప్పుడు పావనావలోకముచేత పవిత్రుఁడై యుత్తమగతిఁ గాంచెను గనుక అట్టిమాయయ్యకు సమస్తపాపములు తొలఁగి పవిత్రుఁ డగునట్లు వరము నొసంగుము.

వ. అనిన భక్తవత్సలుం డిట్లనియె. 377

టీ. భక్తవత్సలుండు=భక్తులయందు పుత్త్రప్రీతి గలవాఁడు.

మ. నిజభక్తుండవు నాకు నిన్ను గనుటన్ నీతండ్రి త్రిసప్తపూ
ర్వజులం గూడి పవిత్రుఁడై శుభగతిన్ వర్తించు విజ్ఞానదీ
పజితానేకభవాంధకారు లగుమద్భక్తుల్ వినోదించు దే
శజనుల్ దుర్గతు లైనశుద్ధులగుమీ సత్యంబు దైత్యోత్తమా.

టీ. దైత్యోత్తమా=రాక్షసశ్రేష్ఠుఁడైన యోప్రహ్లాదా, నీవు నాకు, నిజభక్తుండవు=దగ్గఱిసేవకుఁడవు, నీతండ్రి=హిరణ్యకశిపుఁడు, నిన్ను, కనుటన్=పడయుటచేత, త్రిసప్తపూర్వజులన్=తమపితరులు ఇరువదియొక్క తరమువారిని, కూడి=కలసి, పవిత్రుఁడై=పావనుఁడై, శుభగతిన్=క్షేమముమీఱ, వర్తించును, విజ్ఞాన...కారులు=జ్ఞానమనుదీపముచేఁ బోఁగొట్టు

కొ. బడిన బహుజన్మలయందలి పాపపుఁజీఁకటికలవారు, అగు మద్భక్తుల్ = నాకింకరులు, వినోదించు దేశజనుల్ = క్రీడించుదేశమున వసించువారలు, దుర్జనులు = పాపాత్ములు, ఐనను, శుద్ధులు = పవిత్రులుసుమా, సత్యంబు = నిజము.

తా. ప్రహ్లాదా! నాకు మిక్కిలి అంతరంగభక్తుఁడ వైననిన్ను కొడుకుగాఁ గనుటచేత నే తనకుముందు ఇరువదియొక్కతరములవారితోఁగూడఁ దాఁ గృతార్థుఁడయ్యెను. జ్ఞానదీపమున బహుజన్మార్జితము లైనపాపపుఁజీఁకటులను బోఁగొట్టుకొన్న నాభక్తవరు లేదేశమందుందురో అచ్చటిజను లెంత పాపులైనను పవిత్రు లగుదురుసుమా నిజము

సీ. ఘనసూక్ష్మభూతసంఘాతంబులోపల
నెల్లవాంఛలు మాని యెవ్వరయిన
నీచందమున నన్ను నెఱయ సేవించిన
మద్భక్తు లగుదురు మత్పరులకు
గుఱి సేయ నీవ యోగ్యుఁడ వైతి విటమీఁద
వేదచోదిత మైనవిధముతోడఁ
జిత్తంబు నామీఁదఁ జేర్చి మీతండ్రికిఁ
బ్రేతకార్యములు సంప్రీతిఁ జేయు
తే. మతఁడు రణమున నేఁడు నాయంగమర్శ
నమున నిర్మలదేహుఁడై నవ్యమహిమ
నపగతాశేషకల్మషుఁడై తనర్చి
పుణ్యలోకంబులకు నేఁగుఁ బుణ్యచరిత. 379

టీ. పుణ్యచరిత = పావన మైననడువడిగల ఓప్రహ్లాదా, ఘన... లోపలన్ = సూక్ష్మములు స్థూలములు నైనజీవకోటులలో, ఎవ్వరయినను, నీచందమున నే, ఎల్లవాంఛలు = ఎల్లకోర్కులును, మాని = వదలి, నన్ను, నెఱయన్ = పూర్తిగా, సేవించినన్, మద్భక్తులు = నాసేవకులు, అగుదురు, ఇటమీఁదన్ = ఇఁకపైన, మత్పరులకున్ = నాసేవకులకు, గుఱిసేయన్ = సాటి

చెప్పుటకు, నీవే, యోగ్యుఁడవు=తగినవాఁడవు, ఐతివి, చిత్తంబు, నాయిఁదఁజేర్చి, వేదచోదితము=వేదములలోఁ జెప్పఁబడినది,ఐన,విధముతోడన్=పద్ధతితోడ, మీతండ్రికి, ప్రేతకార్యములు=అపరకర్మములు, సంప్రీతిన్=వేడుకతో, చేయుము, అతఁడు=మీతండ్రి, నేఁడు, రణమునన్=యుద్ధమందు, నాయంగమర్శనమునన్=నాశరీరమును దాఁకుటచేత, నిర్మలదేహుఁడు=పాపములేనిశరీరముగలవాఁడు, ఐ, నవ్యమహిమన్=నూతనమైన వైభవముతోడ, అపగతాఖిలకల్మషుఁడు = పోఁగొట్టఁబడినయెల్లపాపములు గలవాఁడు, ఐ, తనర్చి=ఒప్పి, పుణ్యలోకంబులకున్, ఏఁగున్=పోవును.

తా. ప్రహ్లాదా, స్థూలసూక్ష్మజంతువులలో నెవ్వరైనను కోరికలన్నియుఁబరిత్యజించి నీవలెనన్ను సేవింతురో వారుగొప్పభాగవతులగుదురు. నీవు నాభక్తులకంటెఅను సాటిచెప్పఁదగినవాఁడవైతివి. ఇఁకఁదడవుచేయక మీతండ్రికి వేదచోదితమైనవిధి ననుసరించి ఉత్తరక్రియలు చేయుము. నీతండ్రి నేఁడు యుద్ధమందు నాశరీరసంపర్కము నొంది పవిత్రుఁడై అపూర్వమహిమతోడ ఎల్లపాపములను బోఁగొట్టుకొని ఉత్తమలోకములకుఁ బోనున్నాఁడు.

వ. అని యిట్లు నరసింహదేవుం డానతిచ్చిన హిరణ్యకశిపునకుం బ్రహ్లాదుండు పరలోకక్రియలు సేసి భూసురోత్తములచేత నభిషిక్తుం డయ్యె నయ్యవసరంబున బ్రసాదసంపూర్ణముఖుం డైన శ్రీనృసింహదేవునిం జూచి దేవతాప్రముఖసహితుం డైనబ్రహ్మదేవుం డిట్లనియె. 380

టీ. ఆనతిచ్చినన్=ఆజ్ఞసేయఁగా, పరలోకక్రియలు=అపరకర్మలు, భూసురోత్తములచేతన్ = బ్రాహ్మణులచేత, అభిషిక్తుండు =పట్టాభిషేకము చేయఁబడినవాఁడు, అయ్యెను, ఆయ్యెడన్=ఆసమయమున, ప్రసాదసంపూర్ణముఖుండు = అనుగ్రహముచే సుముఖుఁడు, దేవతాప్రముఖసహితుండు = దేవతలు మొదలగువారితోఁ గూడినవాఁడు.

సీ. దేవదేవాఖిలదేవేశ భూతభా
వన వీఁడు నాచేత వరము వడసి
మత్సృష్టజనులచే మరణంబు నొందక
మత్తుఁడై సకలధర్మములుఁ జెఱచి
నేఁడు భాగ్యంబున నీచేత హతుఁ డయ్యెఁ
గల్యాణ మమరె లోకములకెల్ల
బాలు నీతని మహాభాగవతశ్రేష్ఠుఁ
బ్రదికించితివి మృత్యుభయముఁ బాపి
తే. వరము కృప సేసితివి మేలు వారిజాక్ష
నీనృసింహావతారంబు నిష్ఠతోడఁ
దగిలి చింతించువారలు దండధరుని
బాధ నొందరు మృత్యువుబారిఁ బడరు. 381

టీ. దేవదేవ = ఉపాసించఁదగిన దేవతలకెల్ల దేవుఁడైనవాఁడా, అఖిలదేవేశ = ఎల్లయింద్రాదులగు దేవతలకు ప్రభువైనవాఁడా, భూతభావన = సర్వజంతువులను గాపాడుసంకల్పము గలవాఁడా, వీఁడు = ఈహిరణ్యకశిపుఁడు, నాచేత, వరము = ఇష్టము, వడసి = పొంది, మత్సృష్టజనులచేన్ = నాచేఁ బుట్టించఁబడినజీవులచేత, మరణంబు నొందక = చావక, మత్తుఁడు = గర్వించినవాఁడు, ఐ, సకలధర్మములుఁన్ = ఎల్లయాచారములను, చెఱచి, భాగ్యంబునన్ = మాయందలియదృష్టబలమున, నేఁడు, నీచేత, హతుఁడు = చంపఁబడినవాఁడు, అయ్యెను, లోకములకు ఎల్లన్ = సమస్తలోకములకును, కల్యాణము = క్షేమము, అమరెను, బాలున్ = పిల్లవాఁడును, మహాభాగవతశ్రేష్ఠున్ = గొప్పవిష్ణుభక్తశ్రేష్ఠుఁడగు, ఈతనిని = ఈప్రహ్లాదుని, మృత్యుభయమును, పాపి, బ్రతికించితివి, వరము = ఇష్టమైన అర్థమును, కృపచేసితివి = ఇచ్చినావు, మేలు = లెస్స, వారిజాక్ష = కమలములవంటి కన్ను

లు గలవోస్వామీ, నీనృసింహావతారంబుఁ = నీనరసింహరూపమును, నిష్ఠ తోడఁ = అమరణము స్థిరమైన పూనికతో, తగిలి = తదేకరతులై, చింతించువారలు, దండధరునిబాధఁ = యమయాతనను, ఒందరు, మృత్యువు బారిఁ = చావువాతను, పడరు.

తా. ఓనరసింహమూర్తీ! ఈరాక్షసుఁడు ముందుయోచించక నేనిచ్చిన వరములవలన గర్వించి నాసృష్టిలోని యెల్ల జంతువులవలనను ప్రాణభయములేనివాఁడై వేదవిహితము లైనఆచారవ్యవహారములన్నియు పాడుచేసి, మాయందఱపుణ్యబలమున నీచేతిలోఁ జచ్చెను. లోకములన్నియు నిఁక సుఖించును. ఈపుణ్యాత్ముఁడైన ప్రహ్లాదుని మృత్యువునోటఁ బడకుండఁ దప్పించినావు. ఇంకను కోరినదాని నిచ్చినావు. బలే! నీనరసింహావతారమును మంచి నిష్ఠతోఁబనివడిస్మరించువారుయమబాధలఁ బొందరు మృత్యువుపాలుగారు.

వ. అనిన నరసింహదేవుం డిట్లనియె. 382

క. మన్నించి దేవశత్రుల
కెన్నఁడు నిటువంటివరము లీకుము పాపో
త్పన్నులకు వరము లిచ్చుట
పన్నగముల కమృత మిడుట పంకజగర్భా. 383

టీ. పంకజగర్భా = విష్ణునాభివలనఁ బుట్టిన ఓబ్రహ్మ, దేవశత్రులకుఁ = రాక్షసులకు, మన్నించి = గౌరవించి, ఎన్నఁడును, ఇటువంటి వరములు = ఇట్టిఈయరానివరములను, ఈయకుము, పాపోత్పన్నులకుఁ = నీచజన్మము గలవారలకు, వరములు = ఇష్టములు, ఇచ్చుట, పన్నగములకుఁ = పాములకు, అమృతమును, ఇడుట = ఇచ్చుటవంటిది.

తా. ఓచతురాననా! ఇఁకమీఁద నిట్లెన్నఁడును క్రూరరాక్షసుల నెక్కు పెద్దగాఁ జేసి ఇట్టి యీయఁగూడనివరము లీయకుము. దుర్మార్గులకు అడిగినదాని నిచ్చుట పాములకు అమృతముఁ బోయుటతో సమానము.

వ. అని యి ట్లానతిచ్చి బ్రహ్మాదిదేవతాసమూహంబుచేఁ బూజితుండై భగవంతుం డైనశ్రీనృసింహదేవుండు దిరోహితుండయ్యెఁ బ్రహ్లాదుండును శూలికిఁ బ్రణమిల్లి తమ్మిచూలికి వందనంబులు సేసి ప్రజాపతులకు మొ్రక్కి భగవత్కళ లైన దేవతలకు నమస్కరించినం జూచి బ్రహ్మదేవుండు శుక్రాది మునీంద్రసహితుం డై దైత్యదానవరాజ్యంబునకుం బ్రహ్లాదుం బట్టంబు గట్టి యతనిచేతఁ బూజితుం డై దీవించె నంత నీశానాదినిఖిలదేవతలు వివిధంబు లగునాశీర్వాదంబుల చేత నాప్రహ్లాదునిఁ గృతార్థుం జేసి తమ్మిచూలిని ముందట నిడుకొని నిజస్థానంబులకుఁ జని రిట్లు విష్ణుదేవుండు నిజపార్శ్వచరు లిరువురు బ్రాహ్మణశాపంబునం జేసి ప్రథమజన్మంబున దితిపుత్త్రు లై నహిరణ్యాక్ష హిరణ్యకశిపులను వరాహనారసింహరూపంబుల నవతరించి వధియించె ద్వితీయభవంబున రాక్షసజన్మంబు దాల్చినరావణకుంభకర్ణులను శ్రీరామరూపంబున సంహరించెఁ దృతీయజన్మంబున శిశుపాలదంతవక్త్రు లనుపేరులం బ్రసిద్ధి నొందినవారలను శ్రీకృష్ణరూపంబున ఖండించె నివ్విధంబున మూఁడుజన్మంబుల గాఢ వైరానుబంధంబున నిరంతరసంభావితధ్యాను లై వారలు నిఖిలకల్మషవిముక్తు లై హరిం గదిసి రని చెప్పి నారదుం డిట్లనియె. 384

టీ. బ్రహ్మాది దేవతాసమూహంబుచేన్ = బ్రహ్మ మొదలైన దేవతలయొక్క సమూహముచేత, పూజితుండు = పూజింపఁబడినవాఁడు, ఐ, భగవంతుండు=షడ్గుణైశ్వర్యసంపన్నుఁడు, ఐన, నృసింహదేవుండు=నరసింహస్వామి, తిరోహితుండయ్యెన్ = అంతర్ధానమును జెందెను, ప్రహ్లాదుం

డును, శూలికిన్ = శివునకు, ప్రణమిల్లి = మ్రొక్కి, తమ్మిచూలికిన్ = తామరయందు బుట్టినబ్రహ్మకు, వందనంబులు చేసి = నమస్కారములు చేసి, ప్రజాపతులకున్ = నవబ్రహ్మలకు, మ్రొక్కి, భగవత్కళలు = విరాట్టుని అంశలైన, దేవతలకు, నమస్కరించినన్ = మ్రొక్కఁగా, చూచి, బ్రహ్మదేవుండు, శుక్రాది మునీంద్రసహితుండై = శుక్రుఁడు మొదలగు మునిశ్రేష్ఠులతోఁ గూడినవాఁడై, దైత్య దానవరాజ్యంబునకున్ = దితిజాలు దనుజాలు నను నిరువెఱంగుల రక్కసులరాజ్యమునకు, ప్రహ్లాదుని, పట్టంబుగట్టి, అతని తేన్ = ప్రహ్లాదుని తే, పూజితుండు = పూజింపఁబడినవాఁడు, ఐ, దీవించెను. అంతన్ = తర్వాత, ఈశానాదినిఖిలదేవతలు = ఈశ్వరుఁడు మొదలగు సమస్తదేవతలును, వివిధంబులు = నానావిధములు, ఆశీర్వాదంబులచేతన్ = దీవనలచేత, ఆప్రహ్లాదుని, కృతార్థునిన్ = ధన్యునిగా, చేసి, తమ్మిచూలిని = తామరకొడుకగు బ్రహ్మను, ముందఱ నిడికొని, నిజస్థానంబులకున్, తమచోటులకు, చనిరి = పోయిరి, నిజపార్శ్వచరులు = తనప్రక్కల మెలఁగు సేవకులు, బ్రాహ్మణశాపంబునం జేసి = బ్రాహ్మణులైన సనకాదుల శాపమువలన, ప్రథమజన్మంబునన్ = మొదటిపుట్టుకయందు, దితిపుత్త్రులు = దితికొడుకులు, ద్వితీయాభవంబునన్ = రెండవజన్మమందు, రాక్షసజన్మంబు = రక్కసిపుట్టువును, సంహరించెన్ = చంపెను, తృతీయజన్మంబునన్ = మూఁడవ పుట్టుకలో, గాఢవైరానుబంధంబునన్ = ఎడతేని వైరసంబంధమువలన, నిరంతరసంభావితధ్యానులు = ఎల్లప్పుడును అలవడిన ధ్యానముగలవారు, నిఖిలకల్మషవిముక్తులు = సమస్తపాపములనుండి విడుపఁబడినవారు, హరిన్ = శ్రీవిష్ణువును, కదిసిరి = చేరిరి.

ఉ. శ్రీరమణీయమైననరసింహవిహారము నింద్రశత్రుసంహారము బుణ్యభాగవతుఁడైననిశాచరనాథపుత్త్రసంచారము నెవ్వఁడైన సువిచారత విన్నఁ బఠించినన్ శుభాకారముతోడ నేభయముఁ గల్గనిలోకముఁ జెందు భూవరా.

టీ. భూవరా = ధర్మరాజా, శ్రీరమణీయము = సంపదచే మనోజ్ఞమైనది, ఐన, నరసింహవిహారమున్ = నరసింహస్వామి క్రీడయును, ఇంద్రశత్రు సంహారము = దేవేంద్రుని శత్రువైన హిరణ్యకశిపుని జంపుటయు, పుణ్యభాగవతుఁడు = పావనుఁడైన భగవద్భక్తుఁడు, ఐన, నిశాచరనాథపుత్త్రిసంచారమున్ = ప్రహ్లాదుని నడవడియు, ఎవ్వఁడైనను, సువిచారతన్ = చక్కనివిమర్శతో, విన్నను, పఠించినన్ = చదివినను, శుభాకారముతోడన్ = మంగళవిగ్రహముతోడ, ఏభయమును, కల్గని, లోకమును, చెందును.

తా. ధర్మరాజా! ఈపావనమైననరసింహావతార కీర్తనమును, పవిత్రుఁడైనప్రహ్లాదకుమారుని నడవడియు ఎవఁడు భక్తితో ననుసంధానము చేయునో వాఁడు దివ్యమంగళవిగ్రహము గలవాఁడై భయరహితమైనలోకమును బొందఁగలఁడు.

మ. జలజాతప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషావళిం
బలుకన్ లేనిజనార్దనాహ్వయపరబ్రహ్మంబు నీయింటిలోఁ
జెలియై మేనమఱందియై సచివుఁడై చిత్తప్రియుండై మహా
ఫలసంధాయకుఁడై చరించుటలు నీభాగ్యంబు రాజోత్తమా.

టీ. రాజోత్తమా = ధర్మరాజా, జలజాతప్రభవాదులున్ = బ్రహ్మ మొదలగు దేవతలును, మనములోన్ = చిత్తమందు, చర్చించి = తలఁచి, భాషావళిన్ = వాక్కులచేత, పలుకన్, లేని, జనార్దనాహ్వయపరబ్రహ్మంబు = విష్ణురూపమైన పరమాత్మ, నీయింటిలోన్, చెలియై = మిత్త్రుఁడై, మేనమఱందియై = మేనత్తకొడుకై, సచివుఁడై = ఎల్లపనులలో మంత్రియై, చిత్తప్రియుండై = హృదయమున కిష్టమైనవాఁడై, మహాఫలసంధాయకుఁడు = గొప్ప ఐహికాముష్మికము లైనఫలములను గూర్చువాఁడై, చరించుటలు = మెలఁగుటలు, నీభాగ్యంబు = నీయదృష్టము.

తా. రాజా, బ్రహ్మాదులును మనమున నిష్కృష్టముగా ధ్యానించలేక వాక్కులతో చెప్పఁజాలకున్న అనిర్వాచ్యమై అచింత్యమైన శ్రీకృష్ణపరమాత్మ నీకు మిత్త్రుఁడై గాదిలిమఱందియై అన్నిట మంత్రియై మనస్సున కిష్టుఁడై గొప్పఫలమును గూర్చువాఁడై మెలఁగుట నీయదృష్టముకదా.

## త్రిపురాసురసంహారము.

క. బహుమాయుఁ డైన మయుచే
విహతం బగు హరుని యశము విఖ్యాతజయా
వహముగ నీభగవంతుఁడు
మహితాత్ముఁడు ము న్నొనర్చె మనుజవరేణ్యా. 387

టీ. మనుజవరేణ్యా = మానవులలో శ్రేష్ఠుఁడ వైనఓధర్మరాజా, మున్ను = పూర్వము, మహితాత్ముఁడు=పూజ్యమైన స్వరూపముగల, ఈభగవంతుఁడు = విష్ణువు, బహుమాయుఁడు = పలుమాయలుగలవాఁడు, ఐన, మయుచేన్ = మయునిచేత, విహతంబు = భంగపఱచఁబడినది, అగు, హరునియశము = శివునికీర్తి, విఖ్యాతజయావహముగన్ = ప్రసిద్ధమైన గెలుపునకు నెలవైనదానిఁగా, ఒనర్చెన్ = చేసెను.

తా. రాజా! పూర్వము మాయావి యైనమయాసురుని చేతఁ జిక్కులు పెట్టఁబడిన శివుని ఈ విష్ణువు వాని మాయలఁ దొలఁగించి సుఖము గలవానిఁగాఁ జేసెను.

వ. అనిన ధర్మనందనుం డి ట్లనియె. 388

టీ. ధర్మనందనుండు = యమధర్మరాజుకొడుకగు ధర్మరాజు.

క. ఏకర్మంబున విభుఁ డగు
శ్రీకంఠునియశము మయునిచే సుడివడియెన్
వైకుంఠుఁ డెవ్విధంబునఁ
గైకొని తత్కీర్తి చక్కఁగా నొనరించెన్. 389

టీ. ఏకర్మంబునన్ = ఎట్టిపనిచేత, విభుఁడు = ప్రభువు, అగు శ్రీకంఠునియశము = అయిన విష్ణునికీర్తి, మయునిచేన్ = మయాసురుని చేత, సుడిఁగడియెన్ = నశించెను, వైకుంఠుఁడు = విష్ణువు, ఎవ్విధంబునన్ = ఏలాగున, కైకొని = పూని, తత్కీర్తి = వానియశము, చక్కఁగాన్ = శ్రేష్ఠముగా, ఒనరించెన్ = చేసెను.

తా. నారదా! ఏకార్యమువలన మయుఁడు శివునికీర్తికి భంగము గలిగించెను. దాని నెట్లు విష్ణువు చక్కఁబఱిచెనో తెలియ నానతిమ్ము.

వ. అనిన నారదుం డి ట్లనియె. 390

క. చక్రాయుధబలయుతు లగు
శక్రాదుల కోహటించి క్రోధమున నసురుల్
సక్రోధంబుగ నరిగిరి
విక్రమములు మాని మయుని వెనుకకు నధిపా. 391

టీ. అధిపా = రాజా, అసురుల్ = రాక్షసులు, చక్రాయుధబలయుతులు = విష్ణునిప్రాపు గలవారు, అగు, శక్రాదులకున్ = ఇంద్రుఁడు మొదలగు దేవతలకు, ఓహటించి = వెనుకతగ్గి (ఓడి), సక్రోధంబుగన్ = కోపముతోఁ గూడునట్లు, విక్రమములు=పరాక్రమములు, మాని = వదలి, మయుని వెనుకకున్ = మయాసురుని చాటునకు, అరిగిరి=పోయిరి.

తా. రాజా ! రాక్షసులందఱు దేవతలపై దాడి వెడలి విష్ణునిబలము వలన విజృంభితులైనవారిధాటి కోర్వఁజాలక యుద్ధము మాని క్రోధముతోఁ బోయి మయునిచాటునకుఁ జేరిరి.

వ. ఇట్లు రక్కసులు దనవెనుకఁ జొచ్చిన మాయానిలయుండును దుర్జయుండును నైనమయుండు దనయోగంబున నయోరజతసువర్ణమయంబులై యెవ్వరికిని లక్షింపరానిగమనాగమనంబులును వితర్కింప రానికర్కశపరిచ్ఛదంబులు

ను గలిగిన త్రిపురంబుల నిర్మించి యిచ్చిన నక్తంచరు లందఱు
నందుఁ బ్రవేశించి కామసంచారులై పూర్వవైరంబుఁ దలం
చి సనాయకంబు లయినలోకంబుల నస్తోకం బయిన
నిజబలాతిరేకంబున శోకంబు నొందించిన. 312

టీ. మాయానిలయుండు = మోసమునకుఁ జోటైనవాఁడు, దుర్నయుండు = చెడ్డనీతి గలవాఁడు, తనయోగబలంబునన్ = తనమాయాప్రభావముచేత, అగో...మయంబులు = ఉక్కు వెండి బంగారువికారములు, ఐ, ఎవ్వరికిని, లక్షింపన్ = గుఱుతించుటకు, రానిగమనాగమనంబులును = వీలుకాని రాకపోకలును, వితర్కింపన్ = ఊహించుటకు, రాని, కర్కశ పరిచ్ఛదంబులును = కఠినములైన కోటలును, కలిగిన, త్రిపురంబులన్ = మూఁడుపట్టణములను, నిర్మించి = ఏర్పఱచి, నక్తంచరులు = (రాత్రులయందు దిరుగు) రాక్షసులు, అందున్ = ఆత్రిపురములలో, ప్రవేశించి = చొచ్చి, కామసంచారులు ఐ = యథేష్టముగాఁ దిరుగువారై, పూర్వవైరంబు = వెనుకటిపగ, సనాయకంబులు = లోకపాలురతోఁగూడిన, లోకంబులను = జగములను, అస్తోకంబు = అధికము, ఐన, నిజబలాతిరేకంబునన్ = తనబలముయొక్క అతిశయముచేత, శోకంబున్ ఒందించినన్ = బాధ పెట్టఁగా,

క. లోకాధినాథు లెల్లను
శోకాతురు లగుచు శరణు జొచ్చిరి దుష్టా
నీకవిదళనాకుంఠున్
శ్రీకంఠున్ భువనభరణచిత్తోత్కంఠున్. 313

టీ. లోకాధినాథులు ఎల్లను = లోకపాలకులందఱును, శోకాతురులు = దుఃఖముచేఁ బీడింపఁబడినవారలు, అగుచున్, దుష్టానీకవిదళనాకుంఠున్ = దుష్టుల సమూహములను మర్దించుటయందు అనర్గళుఁడైనవాఁడును, భువనభరణచిత్తోత్కంఠున్ = లోకములను గాపాడుటయందు ప్రీతి గల హృదయముగల, శ్రీకంఠున్ = శివుని, శరణు జొచ్చిరి.

తా. అంతటలోకపాలకులందఱును దుఃఖాక్రాంతులై దుర్జన దనుజ మర్దనుఁడును లోకభరణదీక్షయం దాసక్తి గలవాఁడు నగుసాంబమూర్తిని శరణు జొచ్చిరి.

వ. ఇట్లు సకలలోకేశ్వరుం డగుమహేశ్వరుం జేరి లోకపాలకులు ప్రణతులై పూజించి కరకమలంబులు ముకుళించి. 394

టీ. సకలలోకేశ్వరుండు = ఎల్లలోకములకుఁ బ్రభువైనవాఁడు, ప్రణతులు = నమ్రులు, ఐ, పూజించి = పూజలుచేసి, కరకమలంబులు = కేలుఁదామరలు, ముకుళించి = ముడిచి, అంజలిచేసి యనుట.

క. త్రిపురాలయు లగుదానవు
లపరాజితు లగుచు మాకు నశ్రాంతంబుఁ
వపురాదిపీడఁ జేసెద
రపరాధికులను వధింపు మగజాధీశా. 395

టీ. అగజాధీశా = పార్వతికి ప్రియుఁ డగుఓసదాశివా, త్రిపురాలయులు = త్రిపురములు కాఁపురముగాఁ గలవారు, అగు, దానవులు=రాక్షసులు, అపరాజితులు =ఓడనివారు, అగుచు, మాకుఁ, అశ్రాంతంబుఁ = ఎల్లప్పుడును, వపురాదిపీడఁ = శరీరము మొదలయినవానికి అపాయమును, చేసెదరు, అపరాధికులను = అట్టిజగద్ద్రోహులను, వధింపుము=చంపుము.

తా. ఓపార్వతీశ్వరా! త్రిపురములలోఁ గాఁపురమున్న రాక్షసులు బలవంతులై మమ్ము పలువిధముల బాధించుచున్నారు. ఆక్రూరులను సంహరించి మమ్ము గాపాడుము.

క. దీనులము గాక యుష్మ
ద్ధీనుల మై యుండుమేము దేవాహితద్రో
హీనుల మైనారము బల
హీనుల మగుమమ్ముఁ గావు మీశాన శివా. 396

టీ. ఈశాన = ఈశ్వరా, శివా, దీనులము = అల్పులము, కాక, యుష్మదధీనులము = నీకు స్వాధీనులము, ఐ, ఉండు మేము, దేవాహిత దోర్లీలలము = రాక్షసుల చేతులలో నణఁగి పోయినవారము. ఐనారము, బలహీనులము = శక్తిలేనివారము, మమ్ములన్, కావుము = రక్షించుము.

తా. ఎప్పుడు ఏయాపదలను నెఱుఁగక నీప్రాపుచేత నిరంకుశులమై యున్న మాకు నేఁ డీరాక్షసుల చేతులలో నిట్టిపాట్లు గల్గినవి. ఇట్టియశక్తుల మైనమమ్ము రక్షింపుము.

వ. అనిన భక్తవత్సలుం డగుపరమేశ్వరుండు శరణాగతు లైన గీర్వాణుల వెఱవకుం డని దుర్వారబలంబున బాణాసనంబుఁ గేల నందికొని యొక్కదివ్యబాణంబు సంధించి త్రిపురంబులపయి నేసిన మార్తాండమండలంబున వెలువడు మయూఖజాలంబులచందంబునఁ దద్బాణంబువలన దేదీప్యమానంబు లై యనేకబాణసహస్రంబులు సంభవించి భూనభోంతరాళంబులు నిండి మండి తెప్పలుగాఁ గుప్పలుగొని త్రిపురంబులపయిఁ గప్పె నప్పుడు తద్బాణపావకహేతిసందోహ దంద హ్యమానులై గతాసు లైనత్రిపురపురనివాసులం దెచ్చి మహాయోగి యైనమయుండు సిద్ధరసకూపంబున వైచిన. 317

టీ. భక్తవత్సలుండు = భక్తులయందు ప్రేమగలవాఁడు, అగు, పరమేశ్వరుండు = శివుఁడు, శరణాగతులు = రక్షణముగోరి వచ్చినవారు, ఐన, గీర్వాణులన్ = దేవతలను, వెఱవకుండుఁడు=భయమందకుఁడు, అని దుర్వారబలంబునన్=అపరానిసామర్థ్యముతోడ, బాణాసనంబున్=ధనుస్సును, కేలన్=చేతితో, అందికొని, ఒక్కదివ్యబాణంబు = దేవతాసంబంధమైన బాణమును, సంధించి=పూన్చి,త్రిపురంబులపయిన్, ఏసినన్ = ప్రయోగింపఁగా, మార్తాండ మండలంబునన్ = సూర్యమండలమందు, మయూఖజాలంబుచందంబునన్ = కిరణములగుంపువలె, తద్బాణానలంబు

లన్ = ఆబాణాగ్ని చేత, దేదీప్యమానంబులై=మిగులమండుచున్నవై, అనేక బాణసహస్రంబులు = వేనవేలు బాణములు, సంభవించి=పుట్టి, భూనభోంతరాళంబులు = భూమి ఆకాశములు, నిండి, మండి, తెప్పలుగాన్ = తుట్టెలుగా, కుప్పలుగొని = గుంపులై, తద్బాణ...మానులు=ఆయీశ్వరుని బాణములయందలి అగ్నిబాణములగుంపులచే మిగులఁ గాల్చఁబడినవారు, గతాసులు=పోయినయూపిరిగలవారు, త్రిపురపురనివాసులన్=త్రిపురములఁ గాఁపురమున్న రాక్షసులను, మహాయోగి = గొప్పమణిమంత్రౌషధసిద్ధుఁడు, ఐన, మయుండు=మయాసురుఁడు, సిద్ధరసకూపంబునన్=అమృతరసము గలబావిలో, వైచినన్=పడవేయఁగా.

క. సిద్ధామృతరసమహిమను
శుద్ధమహావజ్రతుల్యశోభితతనులై
వృద్ధిం బొందిరి దానవు
లుద్ధతనిర్ఘాతపావకోపము లగుచున్. 398

టీ. సిద్ధామృతరసమహిమన్ = యోగసిద్ధమైనఅమృతద్రవముయొక్కబలముచేత, శుద్ధ...తనులు=మృత్యుబాధలేక వజ్రములవంటివై ప్రకాశించుశరీరములుగలవారు, ఐ, దానవులు=రాక్షసులు, ఉద్ధత...పములు=ఉగ్రములైనపిడుగులు నిప్పులును పోలికగలవారు, అగుచు, వృద్ధిన్ పొందిరి=పెంపొందిరి.

తా. ఇట్లు మయునిప్రభావముచేత రాక్షసులందఱు యోగలబ్ధమయిన అమృతద్రవసంపర్కముచేత బాధనుండి తొలఁగి వజ్రతుల్యములై ప్రకాశించుశరీరములు గలవారై పిడుగులవంటివారును నిప్పుకణుకులవంటివారు నై చెలరేఁగిరి.

క. కూపామృతరససంగతి
దీపితులై నిలిచి యున్న దేవాహితులన్

రూపించి చింత నొందెడు
గోపధ్వజుఁ జూచి చక్రి కుహనాన్వితుఁడై. 399

టీ. కూపా... దీపితులు=నూతియందలి యమృతద్రవము సంబంధమునఁ దెలివినందినవారు, ఐ, నిలిచి, ఉన్న, దేవాహితులన్ = రాక్షసులను, రూపించి=కనిపట్టి, చింతనొందెడు కోపధ్వజున్=వ్యసనపడు (కోపమే టెక్కెముగాఁగల) సాంబమూర్తిని, చూచి, చక్రి=విష్ణువు, కుహనాన్వితుఁడు=మోసముతోఁగూడినవాఁడు.

తా. ఇట్లు మయాసురునియోగముచే నేర్పడిన బావిలోని అమృతద్రవముఁ ద్రావి బ్రతికి ప్రబలులైన రాక్షసులం గాంచి యీశ్వరుండు దుఃఖించుచున్న శివునిం జూచి విష్ణుమూర్తి తనమాయావిలాసముతోఁ గూడినవాఁడై.

శా. ఉత్సాహంబున నొక్క పాఁడిమొదవై యూధంబు ఘ్రా
ణించుచున్, వత్సంబై తనవెంట బ్రహ్మ నడువన్ వైకుంఠుఁ
డేతెంచి యుద్యత్సత్త్వంబునఁ గూపమధ్యరసముం ద్రావెన్
విలోకించుచుం, దత్సౌభాగ్యనిమగ్నులై మఱచి రాదై
త్యుల్ నివారింపఁగన్. 400

టీ. ఉత్సాహంబునన్=వేడుకతో, ఒక్క, పాఁడిమొదవు=పాలిచ్చెడు ఆవు, ఐ, బ్రహ్మ, వత్సంబు=దూడ, ఐ, ఊధంబు=పొదుగును, ఘ్రాణించుచున్=మూర్కొనుచు, తనవెంటన్, నడువన్, వైకుంఠుండు=విష్ణువు, ఏతెంచి=పోయి, ఉద్యత్సత్త్వంబునన్=పొడముచున్న బలముచేత, కూపమధ్యరసమున్=అమృతపుబావిలోని యమృతమును, త్రావెను, ఆదైత్యుల్=అచ్చటిరాక్షసులు, విలోకించుచున్=ఆయావును చూచుచు, దత్సౌభాగ్యనిమగ్నులు = దానిచక్కఁదనమునఁ దగులుపడినవారై, నివారింపఁగన్=అడ్డగించుటకు, మఱచిరి.

తా. ఇట్లు వేడుకమీఱ విష్ణువు పాఁడియావై బ్రహ్మ దూడయై తన పొదుగు మార్కొనుచు వెంటరాఁగా వచ్చి గొప్పగడుసుదనముతో నచ్చోఁ గాచియున్న నారాక్షసులు చూచుచుండఁగనే వారి యమృతపుఁబావి లోని నీరంతయు ద్రాగెను. వారును ఆ యావునందమునకు లోనై దాని నావలఁ దోలక మోసముపాలయిరి.

వ. ఇట్లు విష్ణుండు మోహనాకారంబున ధేను వయి వచ్చి త్రిపురమధ్యకూపామృతరసంబు ద్రావిన నెఱింగి శోకాకులచిత్తు లైన రసకూపపాలకులం జూచి మహాయోగి యైనమయుండు వెఱఁగుపడి దైవగతిం జింతించి శోకింపక యిట్లనియె.

టీ. మోహనాకారంబునన్ = మోసపువేషముతో, ధేనువు = మొదవు, త్రిపురమధ్యకూపామృతరసంబు = త్రిపురముల నడుమనున్న బావిలోని యమృతద్రవమును, శోకాకులచిత్తులు = దుఃఖముచేఁ గలఁకపాఱిన మనసు గలవారు, రసకూపపాలకుల్ = అమృతపుబావికాపరులను, చూచి, మహాయోగి = గొప్పయోగము గలవాఁడు, వెఱఁగుపడి = ఆశ్చర్యమంది, దైవగతిన్ = విధివిలసితమును, చింతించి = విచారించి, శోకింపక = దుఃఖింపక.

ఆ. అమరు లైన దనుజు లైనను నరు లైన
నెంతనిపుణు లైన నెవ్వ రైన
దైవికార్థచయముఁ దప్పింపఁ గా లేరు
వలదు దనుజులార వగవ మనకు. 402

టీ. దనుజులార = రాక్షసులారా, అమరులు = దేవతలు, దనుజులు = రాక్షసులు, నరులు = మానవులు, నిపుణులు = నేర్పరులు, దైవికార్థచయముఁ = దైవమువలనఁ గలుగు ఇష్టానిష్టసముదాయమును, తప్పింపఁగాన్ లేరు = తొలఁగించుటకుఁ జాలరు, వగవన్ = దుఃఖపడుటకు, వలదు.

తా. రాక్షసులారా! సురాసురులును మానవులును ఎంతటియుపాయవంతులును ప్రజ్ఞావంతులును, దైవమువలన ప్రాప్తించిన మంచిచెడ్డలఁ దప్పించుకోఁజాలరు. గనుక మనము శోకింపఁ బ్రయోజనము లేదుగాన మానుఁడు.

వ. అని పలికె నంత విష్ణుండు నైజంబు లైనధర్మజ్ఞానవిద్యాతపోవిరక్తిసమృద్ధిక్రియాశక్తివిశేషంబుల శంభునికిఁ బ్రాధాన్యంబు సమర్పించి రథసూతకేతువర్మబాణాసనప్రముఖసంగ్రామసాధనంబులు సేసినం గైకొని. 403

టీ. నైజంబులు=తనవి, ధర్మ...విశేషంబులన్=న్యాయము తెలివి చదువు తపము విషయవిరతి పూర్ణత కర్మ సామర్థ్యము వీనియతిశయము చేత, ప్రాధాన్యంబు=ముఖ్యత్వము, సమర్పించి=ఇచ్చి, రథ...సాధనంబులు=తేరు సారథి టెక్కెము జోడు విల్లు మొదలగాఁగలయుద్ధపరికరములు, సేసినన్=కల్పించి యీయఁగా, కైకొని=పుచ్చుకొని.

మ. శరియై కార్ముకియై మహాకవచియై సన్నాహియై వాహియై
సరథుండై సనియంతయై సబలుఁడై సత్కేతనచ్ఛత్రుఁడై
పరమేశుం డొకబాణమున్ విడిచెఁ దద్బాణానలజ్వాలలం
బురముల్ గాలెఛటచ్ఛటధ్వనినభోభూమధ్యముల్ నిండఁగన్.

టీ. పరమేశుండు=శివుఁడు, శరి=బాణముగలవాఁడు, కార్ముకి=విల్లుగలవాఁడు, మహాకవచి=అభేద్యమైనజోడుగలవాఁడు, సన్నాహి=పూన్కిగలవాఁడు, వాహి=గుఱ్ఱములుగలవాఁడు, సరథుఁడు=రథముతోఁ గూడినవాఁడు, సనియంత=సారథితోఁ గూడినవాఁడు, సబలుఁడు=సైన్యముతోఁ గూడినవాఁడు, సత్కేతనచ్ఛత్రుఁడు=మంచిటెక్కెము గొడుగు గలవాఁడు, ఐ, ఒకబాణమున్, విడిచెను, తద్బాణానలజ్వాలలన్=ఆ బాణముల మంటలచేత, ఛటచ్ఛటధ్వని, నభోభూమధ్యముల్=ఆకాశము భూమి వీనినడుము, నిండఁగన్=నిండుకొనఁగా.

తా. సులభము.

వ. ఇట్లు హరుండు దురవగాహంబు లైనత్రిపురంబుల నభిజిన్ముహూర్తంబున భస్మంబు సేసి కూల్చిన నమరగరుడగంధర్వ

సిద్ధసాధ్య యక్షవల్లభులు వీక్షించి జయజయశబ్దంబులు సే
యుచుఁ గుసుమవర్షంబులు వర్షించిరి ప్రజలు హర్షించిరి బ్ర
హ్మాదులు గీర్తించి రప్సరసలు నర్తించిరి దివ్యకాహళదుందు
భిరవంబులును మునిజనోత్సవంబులును బ్రచురంబు లయ్యె
నిట్లు విశ్వజనీనం బగుత్రిపురాసురసంహారంబున నఖిలలో
కులును సంతసిల్లియుండె నయ్యవసరంబున. 405

టీ. దురవగాహంబులు=చొరరానివి, అభిజిన్ముహూర్తంబునన్ = (పగలు పనునాలుగు గడియలమీఁద) మిట్టమధ్యాహ్నమందు, కూల్చినన్= సంహరింపఁగా, అమర...వల్లభులు = దేవతలు, గరుడులు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు, యక్షులును, వీక్షించి=చూచి, జయజయశబ్దంబులు= జయజయ అను కేకలను, కుసుమవర్షంబులు=పూవులవానలు, వర్షించిరి=కురిపించిరి, హర్షించిరి=సంతసించిరి, బ్రహ్మాదులు=బ్రహ్మమొదలగువారలు, కీర్తించిరి=నుతించిరి, నర్తించిరి=ఆడిరి, దివ్య...బులు=దేవతల వగుకాహళలయొక్క భేరీలయొక్క మ్రోఁతలు, మునిజనోత్సవంబులు = మునుల వేడుకపనులును, ప్రచురంబులయ్యెన్ = వెల్లడియాయెను, విశ్వజనీనము = ఎల్లజనుల మేలుకొఱకైనది, త్రిపురాసురసంహారంబునన్=త్రిపురదానవుల నాశమువలన, అఖిల=సమస్తమైన, అయ్యవసరంబునన్=ఆసమయమందు.

ఆ. తృణకణములభంగిఁ ద్రిపురంబుల దహించి
పరముఁ డవ్యయుండు భద్రయశుఁడు
శివుఁడు పద్మజాదిజేగీయమానుఁ డై
నిజనివాసమునకు నెమ్మిఁ జనియె. 406

టీ. పరముఁడు=శ్రేష్ఠుఁడును, అవ్యయుండు=నాశములేనివాఁడును, భద్రయశుఁడు = శుభమైనకీర్తిగలవాఁడు, త్రిపురంబులను, తృణకణముల భంగిన్=గడ్డిపోఁచలవలె, దహించి=కాల్చి, పద్మజాది జేగీయమానుఁడు=

బ్రహ్మమొదలగువారిచే నుతింపఁబడినవాఁడై, నెమ్మిన్ = ప్రియముతో, నిజనివాసమునకున్ = తనతావునకు (కైలాసమునకు), చనియెన్ = పోయెను.

తా. పరాత్పరుఁడును నాశమెఱుఁగక యుత్తమశ్లోకుఁడైన యా యీశ్వరుఁడు ఇట్లు త్రిపురములను గడ్డిపోఁగులవలెఁ గాల్చివైచి బ్రహ్మాదులచేఁ గీర్తింపఁబడినవాఁడై కైలాసమునకు వేంచేసెను.

వ. ఇట్లు నిజమాయావిశేషంబున మర్త్యలోకంబున విడంబించుచున్నవిష్ణునిపరాక్రమవిధానంబులు మునిజనవంద్యమానంబులై సకలలోకకల్యాణప్రదానంబులై యుండు ననిన విని నారదునకు ధర్మనందనుం డిట్లనియె. 407

టీ. నిజమాయావిశేషంబునన్ = తనమాయయొక్క యతిశయముచేత, మర్త్యలోకంబునన్ = మనుష్యలోకమందు, విడంబించుచున్న = మానుషచర్యలను అనుసరించుచున్న, విష్ణుని, పరాక్రమవిధానంబులు = శౌర్యగతులు, మునిజనవంద్యమానంబులు = మునీశ్వరులచే మ్రొక్కఁబడినవి, సకలలోకకల్యాణప్రదానంబులు = ఎల్లలోకములకు మంగళములు నిచ్చునవి.

{ నారదుండు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మంబులు దెలుపుట. }

సీ. అనఘాత్మ సకలవర్ణాశ్రమాచారస
మ్మతధర్మ మెయ్యది మానవులకు
నేధర్మమున నరుం డిద్ధవిజ్ఞానము
భక్తియుఁ బ్రాపించుఁ బద్మజునకు
సాక్షాత్సుతుఁడవు సర్వజ్ఞుఁడవు నీకు
నెఱుఁగరానిది ధర్మ మింత లేదు
నారాయణపరాయణస్వాంతు లనఘులు
శాంతులు సదయులు సాధువృత్తి

ఆ. మెఱయుచున్నఘనులు మీవంటివా రెద్ది
పరమధర్మ మనుచు భక్తిఁ దలఁతు
రట్టిధర్మరూప మఖిలంబు నెఱిఁగింపు
వినఁగ నిచ్ఛ గలదు విమలచరిత. 408

టీ. అనఘాత్మ = పాపమెఱుఁగనివాఁడా, మానవులకు, సకల... ధర్మము = ఎల్లవర్ణములకు ఆశ్రమములకు విరోధముకాని యాచారము, ఎయ్యది = ఏది, నరుండు, ఏధర్మమునన్ = ఏయాచరణముచేత, ఇద్ధవిజ్ఞానము = మేలైన తెలివిని, భక్తియున్ = పూజ్యులయెడ ననురాగమును, ప్రాపించున్ = పొందును. నీవు, పద్మజునకున్ = బ్రహ్మదేవునకు, సాక్షాత్సుతుండవు = ఔరసపుత్త్రుఁడవు, సర్వజ్ఞుఁడవు = ఎల్లధర్మముల నెఱిఁగినవాఁడవు, నీకున్, ఎఱుఁగరాని = తెలియ నలవికాని, ధర్మము = సదాచారము, ఇంత = కొంచెమును, లేదు, నారాయణ... స్వాంతులు = విష్ణునియందు ఆసక్తమైన మనసుగలవారు, అనఘులు = పాపములంటని వారు, శాంతులు = నిశ్యశమసంపన్నులు, సదయులు = కరుణతోఁగూడిన వారు, సాధువృత్తిన్ = సద్వర్తనముచేత, మెఱయుచున్నఘనులు = ప్రకాశించుచున్న గొప్పవారు, మీవంటివారు, పరమధర్మము = మేలిస్వభావము, అనుచున్, భక్తిన్ = ఆదరముతో, తలఁతురు = ఒప్పుకొందురో, విమలచరిత = పావనమైన నడవడిగల యోనారదమునీంద్రా, అట్టి, ధర్మరూపము = ధర్మముయొక్కరీతి, అఖిలంబు = అంతయును, ఎఱిఁగింపుము = తెలియఁజేయుము, వినఁగన్ = వినుటకు, ఇచ్ఛ = కోరిక, కలదు.

తా. ఓనారదమునీంద్రా! మనుజులకు ఎల్లబ్రాహ్మణాదివర్ణములకు, అన్ని బ్రహ్మచర్యము మొదలుగాఁగలయాశ్రమములకు, అవిరోధమైన యుత్తమధర్మమేది? మనుజుఁ డేధర్మమనుష్ఠించి చక్కని తెలివి తేటలను భక్తిని బొందఁగలఁడు? నీవు సర్వభూతములకు నాదియు ఉత్పత్తికారణుఁడైన బ్రహ్మకు ప్రత్యక్షసుతుఁడవు. విజ్ఞాననిధి వగు నీకుఁ దెలియని దుండదు.

విష్ణురతులును, పాపరహితులును, నిత్యశాంతులును, దయగలవారును, మంచినడవడి గలమీబోంటివారు ఏది పరమధర్మ మని యనుష్ఠింతురో అట్టిదాని స్వరూపమంతయు మీవలన వినఁ గుతూహలినై యున్నాను. దయ చేసి యెఱింగింపఁ గోరెదను.

వ. అనిన నారదుండు ధర్మరాజుం జూచి దాక్షాయణియందు నిజాంశంబున నవతరించి భువనశోభనంబుకొఱకు బదరికా శ్రమంబునఁ దపోనిష్ఠుం డయి యున్న నారాయణునివలన సనాతనం బగుధర్మంబు వింటి నది సెప్పెద సకలవర్ణంబుల జనులకు సత్యంబును దయయును నుపవాసాదితపంబును శౌచంబును సైరణయు సదసద్వివేకంబును మనోనియమం బును బహిరింద్రియజయంబును హింస లేమియు బ్రహ్మచ ర్యంబును దానంబును యథోచితజపంబును సంతోషంబును మార్దవంబును సమదర్శనంబును మహాజనసేవయు గ్రామ్యం బు లయినకోరికలు మానుటయు నిష్ఫలక్రియలు విడుచు టయు మితభాషిత్వంబును దేహంబు గాఁ దన్ను వెదకికొను టయు నన్నోదకంబులు ప్రాణులకుం బంచియిచ్చుటయుఁ బ్రాణులందు దేవతాబుద్ధియు నాత్మబుద్ధిం జేయుటయు శ్రీ నారాయణ చరణస్మరణకీర్తన శ్రవణసేవార్చన నమస్కార దాస్యాత్మసమర్పణసఖ్యంబు లనియెడి త్రింశల్లక్షణంబులు గలుగ వలయు నందు సత్కులాచారుం డయి మంత్రవంతం బు లైనగర్భాధానాదిసంస్కారంబు లవిచ్ఛిన్నంబులుగాఁ గలవాఁడు ద్విజుండు ద్విజునకు యజనయాజనాధ్యయనా ధ్యాపనదాన ప్రతిగ్రహంబు లనుషట్కర్మంబులు విహితం బులు. రాజునకుఁ బ్రతిగ్రహావ్యతిరిక్తంబు లయిన యజనాది

కర్మంబు లయిదును ప్రజాపాలనంబును బ్రాహ్మణులు గాని
వారివలన దండశుల్కాదులు గొనుటయు విహితకర్మంబు
లు వైశ్యునికిఁ గృషివాణిజ్యగోరక్షణాదికర్మంబులును బ్రా
హ్మణకులానుసరణంబును విహితంబులు శూద్రునకు ద్విజ
శుశ్రూష సేయ వలయు. 409

టీ. దాక్షాయణియందుఁ = దక్షునికూఁతురైన మూర్తిదేవియం
దు, (ధర్మునకు) నిజాంశంబునఁ = తనకళతోడ, అవతరించి = పుట్టి,
భువనశోభనంబుకొఱకు=లోకములక్షేమముకొఱకు, బదరికాశ్రమంబునఁ=
బదరిక అనునొక ఆశ్రమమందు, తపోనిరతుఁడు = తపస్సునందు లగ్న
మైనచిత్తము గలవాఁడు, నారాయణుఁడనుఋషివలన, సనాతనము =
శాశ్వతము, అగుధర్మంబు, నేను, వింటిని, అది, నీకు, చెప్పెదను. సకల
వర్ణంబులకుఁ = అన్ని కులములవారలకును, సత్యంబు = అనృతమాడమి,
దయ = కరుణ, ఉపవాసాదితపంబు = నిరశనవ్రతము మొదలైనదియు,
శౌచము = సదాచారము, సైరణ = ఓరుపు, సదసద్వివేకంబు = మంచి
చెడ్డలమెఱుక, మనోనియమంబు = మనస్సును వశపఱచుకొనుట, బహి
రింద్రియజయంబు = వాక్పాణిపాదపాయూపస్థలను లోఁబఱచుకొనుట,
హింస = జీవహత్య, లేమియు, బ్రహ్మచర్యంబు = బ్రహ్మత్వమందలి
తలఁపును (బ్రహ్మచారి ధర్మమును), దానంబును = కలిగినదాని నిచ్చుట,
యథోచితజపంబును = దేశకాలములకుఁ దగినట్లు జపము చేయుట, సంతో
షంబును = తృప్తియు, మార్దవంబును = కఱకుఁదనము లేకుండుట, సమ
దర్శనంబును = సర్వభూత సమస్తవస్తువులయందు ఆత్మీయ పరకీయ
భ్రాంతిలేకుండుట, మహాజనసేవయు = ఉత్తముల కైంకర్యము, గ్రామ్యం
బులు = తుచ్ఛములు, నిష్ఫలక్రియలు = ప్రయోజనములేని పనులు,
(అనఁగా పుల్లలు త్రుంచుట, మట్టినలుపుట, గీఁతలు గీయుట, రాళ్లు రువ్వుట
మొదలగునవి) విడుచుటయు, మితభాషిత్వంబు = పొల్లులు రానీయక
తగినంతగా మాటలాడుట, దేహంబుకాని తన్ను వెదకికొనుట = దేహము

కంటె వేఱైన తనస్వరూపమును వెదకి కనుఁగొనుట, అన్నోదకములు = కూడు నీళ్లను, ప్రాణులకుఁ = జంతువులకు, పంచియిచ్చుట = పంచిపెట్టుట, ప్రాణులయందుఁ = జంతువులయందు, దేవతాబుద్ధియుఁ = దేవతస్వభావనయు, ఆత్మబుద్ధిఁ = ఆత్మభావనయు, చేయుటయు, శ్రీనారాయణ...సఖ్యంబులు = శ్రీహరి పాదస్మరణము, సంకీర్తనము, తత్కథాశ్రవణము, కైంకర్యము, పూజనము, మ్రొక్కుట, కొలుచుట, తనను సమర్పించుట, చెలిమిసేయుట, అనియెడి త్రింశల్లక్షణంబులు = అని చెప్పఁబడుముప్పది భాగవత శ్రీచిహ్నములు, కలుగవలయును, అందు = వానిలో, సత్కులాచారుండు = మేలైనకులము మంచియాచారము గలవాఁడు, అయి, మంత్రవంతంబులు=మంత్రపూతములు, ఐన, గర్భాధానాది సంస్కారంబులు = కర్మలు, అవిచ్ఛిన్నంబుగాఁ = తెంపుకలుగకుండ, కలవాఁడు = చేయఁబడియున్నవాఁడు, ద్విజుండు = బ్రాహ్మణుఁడు, (రెండుమాఱులు పుట్టినవాఁడు, బ్రాహ్మణాదిత్రివర్ణజుఁడు), ద్విజునకుఁ = బ్రాహ్మణునకు, యజన...గ్రహంబులు = యజ్ఞముచేయుట, చేయించుట, వేదశాస్త్రములు చదువుకొనుట, చదివించుట, ఇచ్చుట, పుచ్చుకొనుట, అను, షట్కర్మంబులు = ఆఱుకర్మలు, విహితంబులు = శాస్త్రముచే విధింపఁబడినవి, రాజునకుఁ = క్షత్త్రియునకు, ప్రతిగ్రహవ్యతిరిక్తంబులు = పుచ్చుకొనుటలేని, యజనాదికర్మంబులు, అయిదును, ప్రజాపాలనంబు = జనులఁబాలించుట, బ్రాహ్మణులు,కానివారవలనఁ, దండశుల్కాదులు = దండుగలు, సుంకములు కొనుటయును, విహితకర్మంబులు = యోగ్యములైనపనులు, వైశ్యునికిఁ = కోమటివానికి, (తృతీయవర్ణునకు), కృషి = వ్యవసాయము, వాణిజ్య = వ్యాపారము, గోరక్షణ = ఆవులఁబెంచుటయు, ఆది = మొదలగు, కర్మంబులు = పనులు, బ్రాహ్మణకులానుసరణంబును = బ్రాహ్మణజాతిని అనుసరించియుండుటయు, విహితములు, శూద్రునకుఁ, ద్విజశుశ్రూష = బ్రాహ్మణసేవ, చేయఁ వలయును = చేయఁదగును.

సీ. విను కర్షణాదికవృత్తింటెను మేలు
యాచింప నొల్లనియట్టివృత్తి
ప్రాప్తంబుఁ గైకొని బ్రదుకుకంటెను లెస్స
యనుదినంబును ధాన్య మడిగికొనుట
యాయవారముకంటె నధికకల్యాణంబు
పఱిగయెన్నులధాన్యభక్షణంబు
శిలవృత్తికంటెను శ్రేయ మాపణములఁ
బడ్డగింజలు దిని బ్రదుకఁ గనుట
ఆ. యెడరుచోట నృపతికీనాల్గువృత్తులుఁ
దగుఁ బ్రతిగ్రహంబు దగదు తలఁప
నాపదవసరముల నధముఁ డెక్కువజాతి
వృత్తి నున్న దోషవిధము గాదు. 410

టీ. వినుము, యాచింపనొల్లనియట్టివృత్తి = ఒకరినడుగని జీవనము, కర్షణాదికవృత్తికంటెన్ = దున్నుకొనుట, అడిగికొనుట మొదలగు వృత్తులన్నిటికంటెను, మేలు = మంచిది, ప్రాప్తంబు = తనకుఁ దాలభించిన దానిని, కైకొని = తీసికొని, బ్రతుకుకంటెను = జీవించుటకంటెను, అనుదినంబు = ప్రతిదినము, ధాన్యము, అడిగికొనుట = అడిగి తెచ్చుకొనుట, లెస్స = మంచిది, యాయవారముకంటెన్ = ధాన్యపుముష్టి యెత్తుటకంటెను, పఱిగయెన్నుల ధాన్యభక్షణంబు = చేలు కోసినవెనుక చేలలోరాలిన ఎన్నులగింజలేఱి తెచ్చుకొని తినుట, అధికకల్యాణంబు = మిగులశ్రేయము, ఆపణములన్ = అంగడులచెంతను, పడిన గింజలు, తిని, బ్రతుకఁ గనుట = జీవించుట, శిలవృత్తికంటెను = పఱిగ లేఱికొనుదానికంటె, శ్రేయము = మేలైనది, నృపతికిన్ = రాజునకు, ఎడరుచోటన్ = ఆపద సంభవించినప్పుడు, ఈనాల్గువృత్తులును, తగును = ఒప్పును, తలఁపన్ = విచారింపఁగా, ప్రతిగ్రహంబు = సమంత్రకముగాఁ బ్రతిగ్రహముపట్టుట, తగదు, ఆపదవసరములన్ = విపత్సమయ

ములలో, అధముఁడు=తక్కువజాతివాఁడు, ఎక్కువజాతివృత్తిన్=తనజాతి కంటె మేలిజాతివారిజీవికయందు, ఉన్నను, దోషవిధము=దోషముజాడ, కాదు.

తా. రాజా! దున్నుకొనుట మొదలగు వృత్తులకంటె అయాచిత వృత్తి మంచిది. దానికంటె ధాన్యమడిగికొనునది మంచిది. అంతకంటెను పఱిగ యెన్నులు ఏఱి తెచ్చికొనుట మఱియు మంచిది. దానికంటెను అంగడులలోఁ బడ్డగింజ లేఱికొనునది మంచిది. ఆపత్కాలములో నీ నాలుగువిధముల జీవనములును రాజునకుఁగూడ తగినవే. ఒకమంత్రసహితమైన ప్రతిగ్రహము మాత్రము ఎన్నఁటికిని కూడదు. యిక్కట్టువచ్చిన నొకవేళ నీచజాతి వాఁడు ఉత్తమజాతిజీవనము నవలంబించినను దోషముకాదు.

వ. వినుము శిలవృత్తియు నుంఛవృత్తియు ఋతమనియు నయాచితవృత్తి యమృతమనియు నిత్యయాచ్ఞావృత్తి మృతమనియుఁ గర్షకవృత్తి ప్రమృతమనియు నెన్నఁదు రట్టివృత్తుల జీవించుట మేలు వాణిజ్యంబు సత్యానృతమనియు శ్వవృత్తి నీచసేవయనియు బలుకుదురు సర్వవేదమయుండు బ్రాహ్మణుండును సర్వదేవమయుండు క్షత్రియుండు బ్రాహ్మణక్షత్రియులకు నీచసేవనంబు గర్హణంబు గాదు. 411

టీ. శిలవృత్తి = పొలముకడ రాలినగింజ లేఱికొనుట, ఉంఛవృత్తి= పఱిగ లేఱికొనుట, ఋతము(=సత్యము), అయాచితవృత్తి=ఒకరి నడుగకుండ బ్రతుకుట, అమృతము(=చావులేనిది), నిత్యయాచ్ఞావృత్తి=ఎల్లప్పుడు అడిగికొని బ్రతుకుట, మృతము (=చావుతోఁ దుల్యమైనది), కర్షకవృత్తి = దున్నుకొని బ్రతుకుట, ప్రమృతము(=నాతినింద్యము), వాణిజ్యము = వర్తకము, సత్యానృతము(=నిజము అబద్ధముగలసినది), నీచసేవ=హీనునిగొల్చుట, శ్వవృత్తి (= కుక్కబ్రతుకు), బ్రాహ్మణుండు, సర్వవేదమయుండు = ఎల్లవేదముల స్వరూపముగలవాఁడు, క్షత్రియుండు = రాజు, సర్వదేవ

మయుఁడు=అఖిలదేవతల స్వరూపము గలవాఁడు, బ్రాహ్మణక్షత్రియుల కుఁ=బాఁపలకు రాజులకును, నీచసేవనంబు = తక్కువవానిఁ గొల్చుట, కర్తవ్యంబు=చేయఁదగినది, కాదు.

క. దమమును శౌచముఁ దపమును
శమమును మార్దవముఁ గృపయు సత్యజ్ఞాన
క్షమలును హరిభక్తియు హ
ర్షము నిజలక్షణము లగ్రజాతికి నధిపా. 412

టీ. అధిపా=రాజా, అగ్రజాతికిఁ = బ్రాహ్మణునకు, దమము = బాహ్యేంద్రియనిగ్రహము, శౌచము=శుచిత్వము, తపము = కాయక్లేశపడి జపించుట, శమము=అంతరింద్రియనిగ్రహము, మార్దవము=సౌమ్యత, కృప =దయ, సత్య=నిజము, జ్ఞాన=తెలివి, క్షమ=ఓరుపు, హరిభక్తి = విష్ణుభక్తి, హర్షము=నిత్యసంతోషము, నిజలక్షణములు=స్వాభావికమైన గుణములు.

తా. ధర్మరాజా! బ్రాహ్మణజాతి అంతర్బహిరింద్రియనిగ్రహము, సదాచారము, తపస్సు, నెమ్మది, అక్రూరత, దయ, సత్యము, జ్ఞానము, ఓర్పు, విష్ణుభక్తి, నిత్యసంతోషము, ఇవి సహజగుణములుగా నుండనగును.

ఉ. శౌర్యముదానశీలముఁ బ్రసాదమునాత్మజయంబుఁ దేజముం
ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థముఁ గామముం బుధా
చార్యముకుంద సేవలును సత్క్రియయుం బరితోషణంబు స
ద్వీర్యము రక్షణంబుఁ బృథివీవరశేఖర రాజచిహ్నముల్.

టీ. పృథివీవరశేఖర=రాజోత్తమా, శౌర్యము = మగఁటిమి, దానశీలము=ఇచ్చుకోరిక, ప్రసాదము=కోపాదులులేక సౌమ్యతతోనుండుట, ఆత్మజయము=మనస్సును వశముజేసికొనుట, తేజము=ప్రతాపము, ధైర్యము=దిట్టతనము, దేవభక్తి=దేవతలయందుగుణి, ధర్మము=మంచి నడవడి, అర్థము=లాభము, కామము=కోరిక, బుధా... సేవలు = పండితులు గురు

వులు విష్ణువు వీరికై ంకర్యము, సత్కృతి = ఒరులను గౌరవించుట, పరితోషణంబు = సంతసిల్లఁ జేయుట, సద్వీర్యము = న్యాయమైన విక్రమము, రక్షణము = శిష్టపాలనము, రాజచిహ్నముల్ = రాచవాని కుండఁదగు గుఱుతులు.

తా. సుబోధమే.

క. ధర్మార్థకామవాంఛయు
నిర్మలగురుదేవవిప్రనివహార్చనముల్
నిర్మదభావముఁ బ్రమదము
శర్మకరత్వమును వైశ్యజనలక్షణముల్. 414

టీ. ధర్మార్థకామవాంఛ = ధర్మ అర్థ కామములఁ గోరుట, నిర్మల... ముల్ = శుద్ధమైన గురువులయు, దేవతలయు, బ్రాహ్మణులయు సంఘములను బూజించుట, నిర్మదభావము = గర్వములేకుండుట, ప్రమదము = సంతోషము, శర్మకరత్వము = కూడినంతవట్టొకరికి మేలు చేయుట, వైశ్యజనలక్షణముల్ = కోమటివానిగుఱుతులు.

తా. రాజా! ధర్మార్థకామముల నాసక్తితోఁ గూర్చుకొనుట, రాగాదిదోషరహితమైన దేవబ్రాహ్మణగురువుల సేవ, అడఁకువ, సంతోషము, ఒకరి కుపకారము చేయు బుద్ధి ఇవి కోమటి కుండవలసిన ధర్మములు.

ఉ. స్తేయము లేనివృత్తియు శుచిత్వము సన్నుతియుఁ నిజేశులన్
మాయలులేక డాయుటయు మంత్రము సెప్పక పంచయజ్ఞముల్
సేయుటయుఁ ధరామరుల సేవయు గోవులరక్షణంబు న, న్యా
యము లేమియుఁ మనుజనాథ యెఱుంగుము శూద్రధర్మముల్.

టీ. మనుజనాథ = ధర్మరాజా, స్తేయము = దొంగతనము, లేని వృత్తి = జీవనము, శుచిత్వము = మంచియాచారము, సన్నుతి = స్తుతి, నిజేశులన్ = తమదొరలను, మాయలు = టక్కులు, లేక, డాయుట = డగ్గఱుట, మంత్రము, చెప్పక = చదువక, పంచయజ్ఞముల్ = బ్రహ్మ, పితృ

దేవ, భూత, మనుష్యయజ్ఞములు, చేయుటయును, ధరామరులసేవయుఁ = బ్రాహ్మణులసేవ, గోవులరక్షణంబు = ఆలఁ గాఁచుట, అన్యాయము = అధర్మము, లేమి = లేకపోవుట, శూద్రధర్మములు, అని, ఎఱుంగుము.

తా. సుగమము.

సీ. నిలయమ్ము వాటించి నిర్మలదేహి యై
శృంగార మేప్రొద్దుఁ జేయవలయు
సత్యప్రియాలాపచతుర యై ప్రాణేశు
చిత్తంబు ప్రేమ రంజింపవలయు
దాక్షిణ్యసంతోషధర్మమేధాదుల
దైవత మని ప్రియుఁ దలఁపవలయు
నాథుఁ డేపద్ధతి నడచు నాపద్ధతి
నడచి సద్బంధుల నడపవలయు
ఆ. మార్దవమునఁ బతికి మజ్జనభోజన
శయనపానరతులు జరపవలయు
విభుఁడు పతితుఁ డైన వెలఁది పాతివ్రత్య
మహిమఁ బుణ్యుఁ జేసి మనుపవలయు. 416

టీ. నిలయమ్ము = ఇల్లు, వాటించి = అనుసరించి, నిర్మలదేహి = శుద్ధాత్మురాలు, శృంగారము = ప్రసాధనము, ఏప్రొద్దుఁ = ఎల్లప్పుడును, చేయవలయును, ప్రేమఁ = భక్తితో, సత్య...చతురయై = బొంకులేని ప్రియపుమాటలనేరుపు గలదై, ప్రాణేశు చిత్తంబు = భర్త మనస్సును, రంజింపవలయుఁ = సంతసింపఁ జేయవలయును, దాక్షిణ్య...దులఁ = ఓపిక తృప్తి న్యాయము తెలివి మున్నగువానిచే, ప్రియుఁ = మగని, దైవతము = దేవుఁడు, అని, తలఁపవలయుఁ = ఉద్దేశించవలెను, సద్బంధులఁ = ప్రియమైన చుట్టములను, నాథుఁడు = మగఁడు, ఏపద్ధతిఁ = ఏలాగున, నడచుఁ = మెలఁగునో, ఆపద్ధతిని, నడచి = చరించి,

నడపవలయును = విచారింపఁదగును. పతికిన్ = మగనికి, మార్దవమునన్ = మెత్తదనముతో, మజ్జన...రతులు = స్నానము నడుపు పడక రతి మీనిని, జరపవలయును, విభుఁడు = మగఁడు, పతితుఁడు = కులమునుండి భ్రష్టుఁడు, ఐనచో, వెలఁది = ఇల్లాలు, పాతివ్రత్యమహిమన్ = తనపతివ్రతాధర్మమహిమచేత, పుణ్యున్ = పావనుని, చేసి, మనుపవలయున్ = రక్షింపవలెను.

తా. పతివ్రత యైనయిల్లాలు, ఎప్పుడును, ఇల్లువిడువక కాచుకొని యుండి తాను పరిశుభ్రముగానుండి యింటిని చక్కగా నలంకారముజేసి పెట్టుకొనవలెను. అబద్ధముచెప్పక ప్రియముగాఁ బలుకుచు మగనిమనసు సంతోషపెట్టవలెను. ఓపిక తృప్తి నీతి తెలివిగలిగి మగని దేవునిగాఁ దలఁచవలెను. మగఁ డెట్లున్న తాను నట్లెయుండి యింటికివచ్చినచుట్టములకు మర్యాద చేయవలెను. అడఁకువతో మగనికి స్నానభోజనాదులు జరపి పరిచర్యసేయవలెను. మగఁడు కులము చెఱుచుకున్న తాను తనపాతివ్రత్యబలముచేత వానిని పవిత్రునిగాఁ జేసి కాపాడవలెను.

క. తరుణి దనప్రాణవల్లభు
హరిభావముగా భజించి యతఁడును దానున్
సిరికైవడి వర్తించును
హరిలోకమునందు సంతతానందమునన్. 417

టీ. తరుణి=ఆఁడుగూఁతురు, తనప్రాణవల్లభున్=తనమగనిని, హరిభావముగాన్=విష్ణుబుద్ధితో, భజించి=సేవించి, హరిలోకమునందున్ = విష్ణులోకమునందు, సంతతానందమునన్ = ఎడతెగని యానందముతోడ, సిరికైవడిన్=లక్ష్మివలె, వర్తించును=నివసించును.

తా. ఏ స్త్రీ యైనను తనభర్తను విష్ణుస్వరూపుఁడని నిష్కల్మషమైన భక్తితో సేవించునో ఆమె తనభర్తతోఁగూడి వైకుంఠమందు రెండవ లక్ష్మివలె నిత్యానందము గలిగియుండును.

క. ఉపవాసంబులు వ్రతములుఁ
దపములు వేయేల భర్త దైవత మని ని
ష్కపటతఁ గొల్చినసాధ్వికి
నృపవర దుర్లభము లేదు నిఖిలజగములన్. 418

టీ. నృపవర=ధర్మరాజా, ఉపవాసంబులు=అనశనవ్రతములు, వ్రతములు=నోములు, తపములు=జపములు, వేయి=పెక్కులు, ఏల, భర్త, దైవతము=దేవుఁడు, అని, నిష్కపటతన్=బొంకులేనిభావముతో, కొల్చిన సాధ్వికిన్=సేవించిన పతివ్రతకు, నిఖిలజగములన్=ఎల్లలోకములందును, దుర్లభము=పొందరానిది, లేదు.

తా. రాజా! ఉపవాసములని నోములని జపములని తపములని ఒక లక్ష యెందులకు. నిక్కమైన యాఁడుదానికి కల్లకపట మెఱుఁగకుండ భర్తయే దైవమని సేవించినచో నామెకు పొందరాని వస్తువే ఉండదు. అన్నియు కరతలామలకములే.

వ. మఱియు సంకరజాతు లయినరజక చర్మకారక నట బురుడ కైవర్తక మ్లేచ్ఛభిల్లు లనునంత్యజాతు లేడ్వురకును జండాల పుల్కస మాతంగజాతులకును నాయాకులాగతంబు లయిన వృత్తులఁ జౌర్యహింసాదులు వర్జించి సంచరింపవలయు మానవులకుఁ గ్రబలియుగంబున నైసర్గికంబు లైనధర్మంబులు రెండులోకంబులందును సుఖకరంబు లని వేదవిదు లైనపెద్దలు సెప్పుదురు కాఱుకాఱున దున్నెడుక్షేత్రంబు లావుసెడు నందుఁ జల్లినబీజంబులు నిస్తేజంబు లై యుండి లెస్సగ నంకురింపవు నిరంతరఘృతధారావర్షంబున దహనంబునకు దాహకత్వంబు లేక శాంతిం జెందు నందు వేల్చినహవ్యంబులు ఫలింపవు తద్విధంబున ననవరతకామానుసంధానం

బునఁ గామోన్ముఖుం డైనచిత్తంబు కామంబులం దనిసి నిష్కామం బై విరక్తి నొందుం గావున సత్త్వస్వభావంబు తోడ నెప్పుడుఁ దప్పక నిజవంశానుగతవిహితధర్మంబున వర్తించునరుండు మెల్లన స్వాభావికకర్మపరత్వంబు విడిచి ముక్తి నొందు జాతిమాత్రంబునఁ బురుషునికి వర్ణంబు నిర్దేశింపం బని లేదు శమదమాదివర్ణలక్షణవ్యవహారంబులఁ గనవలయు నని మఱియు నారదుం డిట్లనియె. 419

టీ. సంకరజాతులు=ఒకవర్ణముతో నసమానమైన మఱియొకవర్ణము కలియుటవలనఁ బుట్టిన నీచజాతులు, అయిన, రజక=చాకలి, చర్మకారక=మాదిగవాఁడు, నట=నట్టువవాఁడు, బురుడ=మేదరవాఁడు, కైవర్తక=చేఁపలఁబట్టువాఁడు (జాలరి), మ్లేచ్ఛ=యానపుళిందాదులు, భిల్ల=బోయవాఁడు, అంత్యజాతులు=నీచజాతులు, చండాల=మాలవాఁడు, పుల్కస=బోయలలో నొకతెగ, మాతంగ=మాలలలో నొకతెగ, కులాగతంబులు=వంశక్రమమునవచ్చినవి, చౌర్య=దొంగతనము, హింస=చంపుట, నైసర్గికము=స్వభావమునఁ గల్గినది, ధర్మంబులు=నడవడులు, సుఖకరంబులు = మేలు గూర్చునవి, వేదవిదులు=వేదముల నెఱిఁగినవారు, కాలుకాలనగ=ప్రతికాలునందును, క్షేత్రంబు=నేల, లావు, చెడును = నిస్సారమగును, చల్లిన బీజంబులు=విత్తినవిత్తులు, నిస్తేజంబులు=మెఱుఁగులేనివి, అంకురింపవు = మొలువవు, నిరం...బునగ = ఎడలేని నేయిధారలఁ గ్రుమ్మరించుటచేత, దహనంబునకుగ=నిప్పునకు, దాహకత్వంబు=కాల్చుశక్తి, శాంతింజెందును =చల్లారును, వేల్చినహవ్యంబులు=హోమము చేసినవస్తువులు, ఫలింపవు = పండవు, తద్విధంబునగ=అలాగుననే, అనవరత...బునగ=విడుమర లేని యిష్టానుభవమువలన, కామోన్ముఖము = ఇంకను కామంబులఁ గోరునది, తనిసి = తృప్తిచెంది, నిష్కామంబు = కోరికలేనిది, విరక్తిగ = అపరాగమును, ఎప్పుడు, సత్త్వస్వభావంబుతోడగ = సాత్త్వికధర్మముతో,

తప్పక = తొలఁగక, నిజ...బునన్ = తనకులమునకుఁ దగిన ఆచారము తోడ, వర్తించునరుండు = ప్రవర్తించుమనుజుఁడు, మెల్లనన్ = నెమ్మదిగా, స్వాభావిక కర్మపరత్వంబు = పుట్టుకతోఁ బుట్టిన కర్మ ప్రవణత్వమును, ముక్తినొందున్=కర్మబంధములనుండి విడచి మరలఁగాంచు ను, పురుషునికి, జాతి మాత్రంబునన్=పుట్టుకచేత నే, వర్ణంబు=కులము, నిర్దే శింపన్ = నిర్ణయించుటకు, శమ...బులన్ = అంతరింద్రియనిగ్రహము బహిరింద్రియనిగ్రహము మొదలగుజాతుల కుండఁదగు గుర్తులవాడుకలను, కనవలయును = పొందవలయును, మఱియు = ఇంకను.

క. క్రమమున వర్ణంబులచి
హ్నము లెల్లను జెప్పఁబడియె నాశ్రమములధ
ర్మము లెఱిఁగించెద నన్నియు
సమదాహితహృదయశూల సదమలశీలా. 420

టీ. సమదా...శూల=పొగరుపట్టిన శత్రువుల గుండెలకు గాలమైన వాఁడా, సదమలశీలా=నిర్మల స్వభావముగల యోధర్మరాజా, నాచేత, క్రమమునన్=వరుసతో, వర్ణంబులచిహ్నములెల్లను=జాతులగుర్తులన్నియు, చెప్పఁబడెను, ఆశ్రమముల ధర్మములు అన్నియును, ఎఱిఁగించెదను=తెలి యఁబఱతును.

తా. ధర్మరాజా! నీకు వరుసగా బ్రాహ్మణాది జాతిధర్మముల నన్ని టిని పూర్తిగాఁ జెప్పినాను ఇఁక బ్రహ్మచర్యాద్యాశ్రమముల లక్షణములఁ జెప్పెదను. శ్రద్ధగలిగి వినుము.

వ. వినుము బ్రహ్మచారి మౌంజీకౌపీనయజ్ఞోపవీతకృష్ణాజిన పలాశదండకమండలుధరుండును సంస్కారహీనశిరోరుహుం డును దర్భహస్తుండును శీలప్రశస్తుండును మౌనియు నై త్రి సంధ్యంబును బ్రహ్మగాయత్రి జపియించుచు సాయంప్రాత

రవసరంబుల నర్కపావకగురుదేవతోపాసనంబులు సేయుచు
గురుమందిరంబునకుం జని దాసునిచందంబున భక్తివినయ
సౌమనస్యంబులు గలిగి వేదంబులు సదువుచు నధ్యయనో
పక్రమావసానంబుల గురుచరణంబులకు నమస్కరించుచు
రేపుమాపును విహితగృహంబుల భిక్షించి భైక్షంబు గురు
వునకు నివేదించి యనుజ్ఞగొని మితభోజనంబు గావించుచు
విహితకాలంబుల నుపవసించుచు నంగనలందు నంగనాసక్తు
లందుం బ్రయోజనమాత్రభాషణంబు లొనర్చుచు గురుప
రాంగనలవలన నభ్యంగకేశప్రసాధనశరీరమర్దన మజ్జనరహ
స్యయోగంబులు వర్జించుచు గృహంబున నుండక జితేంద్రి
యత్వంబున సత్యభాషణుం డయి సంచరింపవలయు. 421

టీ. బ్రహ్మచారి = బ్రహ్మచర్యాశ్రమస్థుఁడు, మౌంజీ...ధరుండు=
మూఁడుపేటల ముంజెగడ్డిత్రాడును, గోఁచి, జందెము, జింకతోలు, మో
దుగబెత్తము, కమండలువు వీనిని ధరించినవాఁడు, సంస్కార...హుం
డు=దువ్వుట పూలుజుట్టుట, మెఱుఁగురాచుట మొదలగునదిలేని తలవెం
డ్రుకలు గలవాఁడు, దర్భహస్తుఁడు=దర్భపవిత్రమును జేతఁబెట్టుకొన్నవాఁ
డు, శీలప్రశస్తుఁడు=నడవడిలోఁ బొగ డ్తనందినవాఁడు, మౌని=హెచ్చుగా
మాటలాడనివాఁడు, త్రిసంధ్యంబును=మూఁడు సంధ్యలయందును, బ్రహ్మ
గాయత్రిన్=బ్రహ్మరూపమైనగాయత్రిని, సాయం...బులన్=సాయం
కాలమున బ్రొద్దునను, అర్క...బులు=సూర్యుఁడు అగ్ని, గురువు, దైవము
వీరిని ఉపాసించుట, గురుమందిరంబు=ఉపాధ్యాయునియిల్లు, దాసునిచం
దంబునన్=నౌకరివలె, భక్తి...బులు=అనురాగము అడఁకువ చిత్తనైర్మల్య
ములు, అధ్యయనో...బులన్=చదువు మొదలిడునప్పుడు చాలించునప్పు
డుకూడ, గురుచరణంబులకున్=ఉపాధ్యాయుని పాదములకు, రేపుమాపు
ను=పగలురాత్రియు, విహితగృహంబులన్=శాస్త్రమందు జెప్పినట్టి బ్రో

త్రియగృహములయందు, భిక్షించి=యాయవారమెత్తి, భైక్షము=మధుకరాన్నమును, గురువునకున్=ఉపాధ్యాయునకు, నివేదించి=చూపి, అనుజ్ఞగొని=ఈపదార్థములు భుజించవచ్చునని యాజ్ఞతీసికొని, మితభోజనంబు గావించుచు=పరిమితమైన యుండిని దినుచు, విహితకాలంబులన్=శాస్త్రోక్తసమయములయందు, ఉపవసించుచున్=ఉపవాసము సేయుచు, అంగనలందున్=జవ్వనులయందును, అంగనాసక్తులయందును = కామినులయెడ ననురాగము గలవారియందును, ప్రయోజనమాత్ర భాషణంబులు=పనికి తగినట్లు మాటలాడుట, ఒనర్చుచు=సేయుచు, గురుపరాంగనలవలనన్ = గురువుభార్య పరస్త్రీలు వీరివలన, అభ్యంగ...యోగంబులు=అభ్యంగము సేయించుకొనుట, తల దువ్వించుకొనుట, ఒడలు నలుగుపెట్టించుకొనుట, స్నానము సేయించుకొనుట, ఒంటరిగా మాటలాడుట వీనిని, వర్జించుచు=విడుచుచు, గృహంబునన్=ఇంటియందు, ఉండక, జితేంద్రియత్వంబునన్=ఇంద్రియజయము గలుగుటతోడ, సత్యభాషణుండు=అసత్యము గానిమాటలుగలవాఁడు, సంచరింపవలయున్=నడుచుకొనవలెను.

ఆ. పొలఁతి దావవహ్ని పురుషుఁ డాజ్యఘటంబు
కరఁగకుండరాదు కదిసెనేని
బ్రహ్మయైనఁ గూఁతుఁ బట్టక మానఁడు
వడుగు కింతిపొత్తు వలదు వలదు. 422

టీ. పొలఁతి=ఆఁడుది, దావవహ్ని=కార్చిచ్చు, పురుషుఁడు=మగవాఁడు, ఆజ్యఘటంబు=నేతికుండ, కదిసెనేనిన్=ఒకరికొకరు దగ్గఱఁ జేరిరా, కరఁగకుండరాదు=మెత్తబడకుండఁ దప్పించుకోరాదు. కరఁగిపోకుండ మానదు, కదిసెనేనిన్=సమీపించినచో, బ్రహ్మ=చతురాననుఁడు, ఐనను, కూఁతున్=తనకన్నబిడ్డనైనను, పట్టకమానఁడు=తగులకుండఁడు, కావున, వడుగునకు=బ్రహ్మచారికి, ఇంతిపొత్తు=ఆఁడుగూఁతురి సాంగత్యము, వలదు వలదు.

తా. రాజా! మగవాఁడు నేయి దుత్తవంటివాఁడు, ఆఁడుదో నిప్పు వంటిది. దానిపొత్తు గలిగినా ఎంతటివానికిని లోఁబడకుండ వశముగాదు. బ్రహ్మయైనను ఒంటరిపాటునఁ జిక్కినేని తనకూఁతునైనను విడువఁడు. కనుక బ్రహ్మచర్యవ్రతస్థుఁ డైనవాఁడును స్త్రీసాంగత్యము కూడదు.

వ. వినుము స్వరూపసాక్షాత్కారంబున దేహి బహిరింద్రియా దికం బయిన యింతయు నాభాసమాత్రంబుగా నిశ్చయించి యెందాఁక జీవుండు స్వతంత్రుం డయిన యీశ్వరుండు గా కుండు నంతదడవు నంగన యిది పురుషుండ నే నని యెడి బుద్ధి మానుట కర్తవ్యంబు గాదు బ్రహ్మచారియతిగృహస్థులం దెవ్వఁడైన జ్ఞానంబు పరిపక్వంబు గాక యద్వైతానుసంధా నంబు సేసిన మూఢుం డగుం గావున రహస్యంబునఁ బుత్రిక నైనం డాయ కుండ వలయు. 423

టీ. దేహి=జీవుఁడు, స్వరూపసాక్షాత్కారంబునన్=ఆత్మస్వరూ పముయొక్క ఎఱుకచేత, బహిరింద్రియాదికము=బాహ్యేంద్రియములు మొ దలయినది. ఇంతయును, ఆభాసంబు=అవిచారిత రమణీయము, స్వతంత్రుఁ డు=దేనికి లొంగనివాఁడు, అంతతడవు=అందాఁక ఇది, అంగన=ఆఁడు ది, నేను, పురుషుఁడను=మగవాఁడను, అనియెడిబుద్ధి=అనుతలఁపు, మాను ట=వీడుట, కర్తవ్యము=చేయఁదగినది, కాదు, బ్రహ్మచారి యతి గృహస్థుల యందు, పరిపక్వము=పరిణతము, అద్వైతానుసంధానంబు=స్త్రీపురుషాది భేదాభావభావనము, మూఢుఁడు=మందుఁడు, కావున తా నీశ్వరుఁడగు దాఁక, రహస్యంబునన్=ఒంటిగా, పుత్రికనైనన్=కూఁతునైనను, డా యక=సమీపింపక.

చ. శిరమున మేన సంస్కృతులు సేయక చందనభూషణాద్యలం కరణములెల్లమాని ఋతుకాలములన్ నిజభార్యఁ బొందుచుం

దరుణులఁజూడఁ బోలక ధృతవ్రతుఁడై మధుమాంసవర్జియై
గురుతరవృత్తితో మెలఁగు కోవిదుఁ డొక్క గృహస్థుభూవరా.

టీ. భూవరా=రాజా, శిరమునన్=శిలయందును, మేనన్=ఒడలి యందును, సంస్కృతులు=అభ్యంగ ఉపమర్దనాది సంస్కారములు, చేయక, చందన... ములు=గంధము సొమ్ములు మొదలగు మండనములన్ని విడచి, ఋతుకాలమునన్=ఋతురాత్రులయందు, నిజభార్యన్=తన పెండ్లమును, తరుణులన్=అన్యకాంతలను, చూడన్ పోలక=చూచుటకై పరుగులిడక, ధృతవ్రతుఁడై=నిష్ఠగలవాఁడై, మధుమాంస వర్జియై=కల్లుమాంసములను విడిచినవాఁడై, గురుతరవృత్తితోన్=పెద్దటికముతోడ, మెలఁగుకోవిదుఁడు=ప్రవర్తించు పండితుఁడు, ఒక్క గృహస్థు=ఒక గొప్పకాఁపు.

తా. రాజా! అభ్యంగాది సంస్కారములు చేసికొనక, గంధము పూలు సొమ్ములు తాల్పఁగోరక, ఋతుకాలము దప్పకుండ తనభార్యను గలియుచు అన్యకాంతల తెరువునకుఁబోక నిష్ఠగలవాఁడై మధుమాంసముల విడిచి గొప్ప ప్రవర్తనము గలిగియుండు నొక పండితుఁడే గృహస్థుఁ డని చెప్ప నొప్పును.

వ. మఱియు ద్విజుండు గృహస్థుండై గురువులవలన నుపనిషదంగసహితంబైన వేదత్రయంబును బఠియించి నిజాధికారాను సారంబుగ నర్థవిచారంబు సేసి తనబలంబుకొలంది గురువులకు నభీష్టంబు లొసంగి గృహంబున నొండె వనంబున నొండె నైష్ఠికత్వంబు నాశ్రయించి ప్రాణులతోడ జీవించుచు గురువునందు నగ్నియందు నాత్మయందు సర్వభూతంబులందు నచ్యుతదర్శనంబు సేయుచు నింద్రియవ్యసనాదిమగ్నుఁడు గాక మెలుక గలిగి వర్తించుచు పరబ్రహ్మంబు నొందు. 425

టీ. ఉపనిషదంగసహితంబు=ఉపనిషత్తులు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము నను షడంగములు వీనితోఁగూడినది,

పఠియించి=చదివి, నిజాధికారానుసారంబుగన్=తనయోగ్యతకుఁ దగినట్లు, అర్థవిచారంబు=తాత్పర్యనిర్ణయము,తనబలంబుకొలఁదిన్=తనసామర్థ్యమునకుఁ దగినట్టులు, గురువులకున్=ఉపాధ్యాయులకు, అభీష్టంబులు=కోరినవానిని, ఒసంగి=ఇచ్చి, గృహంబుననొండెన్=ఇంటియందుఁగాని, వనంబుననొండెన్=అడవియందుగాని, నైష్ఠికత్వంబున్=నియమము ధరించుటను, ఆశ్రయించి=పూని, ప్రాణులతోడన్=జీవులతోడ, జీవించుచు=బ్రతుకుచు, ఆత్మయందున్=తనయందును, సర్వభూతంబులయందున్ = ఎల్లజంతువుల యందును, అచ్యుత దర్శనంబు చేయుచున్=విష్ణుస్వరూపమును జూచుచు, ఇంద్రియవ్యసనాది మగ్నుండుకాక = వి..యాసక్తి మొదలగుదానియందు మునిఁగిపోక, ఎఱుక=తెలివి, వర్తించుచున్=మెలఁగుచు.

క. వినుము వనప్రస్థునకున్
మునికథితము లైననియమములు గల వాచొ
ప్పున వనగతుఁ డై మెలఁగెడి
ఘనుఁడు మహర్లోకమునకు గమనించు నృపా. 426

టీ. నృపా=రాజా, వనప్రస్థునకున్ = వానప్రస్థవృత్తియందుండు వానికి, మునికథితములు = మునులచేఁ జెప్పఁబడినవి, నియమములు = వ్రతములు, ఆచొప్పన = అలాగున, వనగతుఁడు = అడవిఁ జేరినవాఁడు, మెలఁగెడి ఘనుఁడు=సంచరించు ధన్యుఁడు, మహర్లోకమునకున్, గమనించున్ =పోవును.

తా. రాజా! వానప్రస్థాశ్రమమున నుండువానికి ప్రాచీనులగు ఋషులచేఁ గొన్నిధర్మములు చెప్పఁబడినవి. అట్లు ఆఋషికీర్తితములైన ధర్మముల ప్రకారము వానప్రస్థుఁడు నడచుకొనెనా వానికి మహర్లోకము సిద్ధించును.

వ. అటమీఁద గృహస్థాశ్రమంబు విడిచి వనంబునకుం జని దున్న
కపండెడినీవారాదికంబు లగ్ని పక్వంబు సేసి యొండె నామంబు

లు సేసి యెండె నర్కపక్వంబు లైనఫలాదులొండెభక్షించు
చు వన్యాహారంబుల నిత్యకృత్యంబు లయినచరుపురోడాశం
బులొనర్చుచుఁ బ్రతిదినంబును బూర్వసంచితంబులు పరిత్య
జించి నూతనద్రవ్యంబులు సంగ్రహించుచు నగ్నికొఱకుఁ
బర్ణశాల యైనఁ బర్వతకందరం బయిన నాశ్రయించుచు హి
మ వాయు వహ్ని వర్షాతపంబులకు సహించుచు నఖశ్మశ్రు
కేశతనూరుహంబులు ప్రసాధితంబులు సేయక జటిలుండై
వసియించుచు దండాజినకమండలువల్కలపరిచ్ఛదంబు ధరి
యించి పండ్రెండైన నెనిమిదైన నాలుగైన రెండైన నొక
వత్సరంబయినఁ దపఃప్రయాసంబున బుద్ధినాశంబు గాకుండ
మునియై చరించుచు దైవవశంబున జరారోగంబులచేతఁ జిక్కి
నిజధర్మానుష్ఠానసమర్థుండు గానిసమయంబున నిరశనవ్రతుం
డయి యగ్నుల నాత్మారోపణంబులు సేసి సన్న్యసించి యా
కాశంబునందు శరీరరంధ్రంబులును గాలియందు నిశ్వాసం
బును దేజంబులోపల నూష్మంబును జలంబుల రసంబును
ధరణియందు శల్యమాంసప్రముఖంబులును వహ్నియందు
వక్తవ్యంబుతోడ వాక్కును నింద్రునియందు శిల్పంబుతో
డఁ గరంబులును విష్ణునియందు గతితోడఁ బదంబులును
ప్రజాపతియందు రతితోడ నుపస్థంబును మృత్యువందు విస
ర్గంబుతోడ బాయువును దిక్కులందు శబ్దంబుతోడ శ్రో
త్రంబును వాయువందు స్పర్శంబుతోడఁ ద్వక్కును సూర్యు
నియందు రూపంబుతోడఁ జక్షువులును సలిలంబులందు
బ్రచేతస్సహిత యయినజిహ్వయు క్షితియందు గంధసహి
తం బయిన ఘ్రాణంబును జంద్రునియందు మనోరథంబుల

తోడ మనంబును గవి యైనబ్రహ్మయందు బోధంబుతోడ బుద్ధియు రుద్రునియం దహంకారంబుతోడ మమత్వంబును క్షేత్రజ్ఞునియందు సత్త్వంబుతోడం జిత్తంబును బరంబునందు గుణంబులతోడ వైకారికంబులను డిందించి యట మీఁదఁ బృథివియందుఁ బృథివిని జలంబునందు జలంబును దేజంబునందును దేజంబును వాయువునందును వాయువును గగనంబునందును గగనంబును నహంకారతత్త్వంబునందును నహంకారంబును మహత్తత్త్వంబునందును మహత్తత్త్వంబును బ్రకృతియందును బ్రకృతిని నక్షరుండైన పరమాత్మయందును లయంబు నొందించి చిన్మాత్రావశేషితుం డయినక్షేత్రజ్ఞుని నక్షరత్వంబున నెఱింగి ద్వయరహితుం డై దగ్ధకాష్ఠుం డైనవహ్నిచందంబునఁ బరమాత్మ యైననిర్వికార పరబ్రహ్మంబునందు లీనుండు గావలయును. 427

టీ. వనంబునకున్ = అడవికి, చని, నీవారాదికంబు = తృణధాన్యము మొదలయునది, అగ్నిపక్వంబు చేసియుండెన్=నిప్పులో వండిగానీ, ఆమంబులు చేసియుండెన్ = పచ్చిగాఁ జేసి గానీ, అర్కపక్వంబు = సూర్యునియెండకుడికినవి, ఐన, ఫలాదులొండెన్ = పండ్లు మున్నగువానిని గానీ, భక్షించుచున్ = తినుచు, వన్యాహారంబులన్ = అడవిని సంభవించు భోజనముల చేత, నిత్యకృత్యంబులు = ప్రతిదినము చేయఁదగిన, చరుపురోడాశంబులు = అన్నముపిండిని, ఒనర్చుచున్ = చేయుచు, ప్రతిదినంబును, పూర్వసంచితంబులు = తొలునాఁడు సంపాదించఁబడినవి, పరిత్యజించి = విడిచి, నూతనద్రవ్యంబులు = క్రొత్తపదార్థములు, సంగ్రహించుచు = సంపాదించుచు, అగ్నికొఱకున్ = అగ్నికార్యము కొఱకు, పర్ణశాల = ఆకుటిల్లు, పర్వతకందరంబు = కొండగుహ, ఆశ్రయించుచున్ = చేరుచు, హిమ...లకున్ = మంచు గాలి నిప్పు వాన ఎండలకు, సహించు

చుఁ = ఓర్చుకొనుచు, నఖ...బులు = గోళ్లు మీసములు తలవెంట్రుకలు ఒడలివెండ్రుకలు, ప్రసాధితంబులు = అభ్యంగాది సంస్కారంబులు, కత్తిరించుట చిమటవేయుట మొదలైనవి, చేయక, జటిలుఁడు = జడలు దాల్చినవాఁడు, వసియించుచు = నివసించుచు, దండా...బులు = కఱ్ఱ చర్మము కమండలువు నారచీర, ఉత్తరీయము, ధరియించి = తాల్చి, పండ్రెండైనను, ఎనిమిదైనఁ, నాలుగైనఁ, రెండైనఁ, ఒకవత్సరంబైనఁ = ఒక్కయేఁడైనను, తపఃప్రయాసంబునఁ = తపస్సుయొక్క క్లేశముతోడ, బుద్ధినాశంబు = చిత్తభ్రంశము, మునియై = మననముగలవాఁడై, చరించుచుఁ = తిరుగుచు, దైవవశంబునఁ = దైవయోగముచేత, జరారోగంబులచేతఁ = ముసలితనము రోగము వీనిచేత, చిక్కి, నిజధర్మానుష్ఠానసమర్థుండు = తనకులధర్మములను నడుపుకోఁదగినశక్తి లేనివాఁడు, కాని సమయంబునఁ = కానివేళయందు, నిరశనవ్రతుండు = అన్నము లేకుండనుండు వ్రతముగలవాఁడు, అగ్నులఁ, ఆత్మారోపణంబు చేసి = తనయందు నిలుపుకొని, సన్న్యసించి = ఎల్లకర్మలను విడనాడి, ఆకాశంబునందు, శరీరరంధ్రంబులు = ఒడలిసందులు, నిశ్శ్వాసంబు = ఊపిరి, తేజము = వెలుఁగు, ఊష్మము = శరీరమందలి యావిరి, జలంబులఁ = నీళ్లయందు, రసంబును = శరీరమునందలి ద్రవపదార్థమును, ధరణియందు = భూమిలో, శల్య...లును = ఎముకలు మాంసము మొదలైనవి, వహ్నియందు = నిప్పులో, వక్తవ్యము = పలుకఁదగినది, ఇంద్రునియందుఁ = దేవేంద్రునియందు, శిల్పము = చేతిపని, కరంబులు = చేతులు, విష్ణునియందు = వ్యాపనశీలుఁడగు నారాయణునందు, గతి = నడక, పదంబులు = కాళ్లు, ప్రజాపతి = బ్రహ్మ, రతి = గ్రామ్యధర్మము, ఉపస్థము = గుహ్యావయవము, మృత్యువు = యముఁడు, విసర్గము = ఉత్క్రమణము, వాయువు = ప్రాణము, శబ్దము = ధ్వని, శ్రోత్రము = చెవి, స్పర్శము = తగులుట, త్వక్కు = చర్మము, రూపము = తేజస్సు, చక్షువులు = చూపులు, సలిలంబులు = నీళ్లు, ప్రచేతస్సహిత = వరుణాంశముతోఁ గూడిన, జిహ్వా = నాలుక,

క్షితి=భూమి, గంధసహితంబు=వాసనతోఁ గూడినది, ఘ్రాణంబు=ముక్కు, మనోరథములు=తలఁపులు, మనంబు=చిత్తము, కవి=వర్ణనచతురుఁడు, బోధము = తెలివి, రుద్రునియందుఁ = శివునందు, అహంకారంబుతోడఁ = నేను నాయది యనుభావముతో, మమత్వంబును = మమకారమును, క్షేత్రజ్ఞునియందుఁ = జీవునియందు, సత్త్వంబుతోడఁ = సత్త్వగుణముతోడ, చిత్తంబును, చెందించి, అటమీఁదఁ = ఆతర్వాత, పృథివియందు = భూమిలో, పృథివిని = భూమిని, జలంబునందుఁ = నీళ్లయందు, తేజంబునందుఁ = అగ్నియందు, వాయువునందుఁ = గాలిలో, గగనంబునందుఁ = ఆకాశమున, అహంకారతత్త్వంబునందుఁ = అహంకారమున, మహత్తత్త్వంబునందుఁ = బుద్ధియందు, ప్రకృతియందుఁ = మూలప్రకృతిలో, ప్రకృతిని, ఇట్లు వీనినన్నిటిని, అక్షరుండు = నాశములేనివాఁడు, లయంబు = నాశము, చిన్మాత్రావశేషితుండు=జ్ఞాన మొక్కటియే మిగిలినవాఁడు, క్షేత్రజ్ఞుఁడు = జీవుఁడు, అక్షరత్వంబునఁ = అవికారభావమందు, ద్వయరహితుండై = తనకంటె వేఱులేనివాఁడై, దగ్ధకాష్ఠుండు = కాల్చఁబడిన కట్టెలుగల, వహ్నిచందంబునఁ = అగ్నివలె, పరమాత్మ = పరాత్పరుఁడు, నిర్వికారబ్రహ్మంబునందుఁ = మార్పులేని పరమాత్మయందు, లీనుండు = చేరినవాఁడు, కావలయును.

క. అనఘు వనప్రస్థుం డై
చని తద్ధర్మంబు లిట్లు సలుపుచు మఱియుఁ
మనెనేని సన్న్యసింపం
జను నటమీఁదటను ముక్తసంగత్వమునన్. 428

టీ. అనఘు=పాపములేనివాఁడా, వనప్రస్థుండు=అడవిని గాఁపురమున్నవాఁడు, ఐ, చని=పోయి, ఇట్లు=వెనుక చెప్పినట్లు, తద్ధర్మంబులు=ఆవానప్రస్థధర్మములు, సలుపుచుఁ = చేయుచు, మఱియుఁ = ఇంకను కొంతకాలము, మనెనేనిఁ=బ్రతికెనా, అటమీఁదటను=అంతమీఁదనైన, ము

క్తసంగత్వమునన్ = తగులములందగులమిచేత, సన్న్యసింపన్ చనును = సర్వకర్మములును వదలుకొనవలెను.

తా. ధర్మరాజా! ఇట్లు వానప్రస్థాశ్రమమందుండి శాస్త్రములందుఁ జెప్పినట్లు ఆయాశ్రమము ధర్మములు చక్కఁగా నడుపుకొనుచు నుండి యింకను గొన్నాళ్లు చావక బ్రతికె నేని సర్వసంగములు వదలుకొని సన్న్యసించవలెను.

వ. ఇట్లు వానప్రస్థాశ్రమంబు జరపి సన్న్యసించి దేహమాత్రావశిష్టుండును సర్వభూత నిరపేక్షుండును భిక్షుండును నిరాశ్రయుండును నాత్మారాముండును సర్వభూతసముండును శాంతుండును సమచిత్తుండును నారాయణపరాయణుండును నై కౌపీనం బను నాచ్ఛాదనమాత్రం బైన వస్త్రంబు ధరియించి దండాదివ్యతిరిక్తంబులు విసర్జించి యాత్మపరంబులు గాని శాస్త్రంబులు వర్జించి గ్రహనక్షత్రాదివిద్యల జీవింపక భేదవాదంబు లైన తర్కంబులు దర్కింపక యెందును బక్షీకరింపక శిష్యులకు గ్రంథంబులు వంచించి యుపన్యసింపక బహువిద్యల జీవింపక మత్తాదివ్యాపారంబుల నుల్లసిల్లక పెక్కుదినంబు లొక్కయెడ వసియింపక యూరూర నొక్కొక్క రాత్రి నిలుచుచుఁ గార్యకారణవ్యతిరిక్తం బైన పరమాత్మయందు విశ్వంబు దర్శించుచు సదసన్మయం బైన విశ్వంబునందుఁ బరబ్రహ్మం బయిన యాత్మ నవలోకించుచు జాగరణస్వప్న సంధిసమయంబుల నాత్మనిరీక్షణంబు సేయుచు నాత్మకు బంధమోక్షణంబులు మాయామాత్రంబులు గాని వస్తుప్రకారంబున లేవనియును దేహంబునకు జీవితంబు ధ్రువంబు గాదనియును మృత్యువు ధ్రువం బనియును నెఱుంగుచు భూత

దేహంబులసంభవనాశంబులకు మూలం బయినకాలంబుఁ బ్రతీక్షించుచు నవ్విధంబున జ్ఞానోత్పత్తిపర్యంతంబుఁ జరియించి యటమీఁద విజ్ఞానవిశేషంబు సంభవించినఁ బరమహంసుం డై దండాదిచిహ్నంబులు ధరియించి యుండెడు ధరియింపక యుండెడు బహిరంగవ్యక్తచిహ్నుండు గాక యంతరంగవ్యక్తుం డైనయాత్మానుసంధానంబుగలిగి మనీషి యై బాహ్యానుసంధానాభావంబున మనుష్యులకుఁ దనవలన నున్మత్తబాలమూకులతెఱంగుఁ జూపుచుండవలయును. 42౭

టీ. దేహమాత్రావశిష్టుండు=శరీరమొక్కటి మిగిలినవాఁడు, నిరపేక్షుండు=కోరికలేనివాఁడు, భిక్షుండు=ఉపాదానమెత్తువాఁడు, నిరాశ్రయుండు=ఇల్లులేనివాఁడు,ఆత్మారాముఁడు=తనలోఁ దాఁ గ్రీడించువాఁడు, సర్వభూతసముండు=ఎల్లజంతువుల నొక్కరీతిఁ జూచువాఁడు, శాంతుండు=నిత్యప్రసన్నుఁడు,సమచిత్తుఁడు=సుఖదుఃఖములయం దొక్కతీరున నుండు మనసు గలవాఁడు,నారా... డు=శ్రీహరియందు తలఁపుగలవాఁడు,కౌపీనంబు=గోఁచి,ఆచ్ఛాదనమాత్రంబు=మొలకట్ట మైనది,వస్త్రము=గుడ్డ,ధరియించి=కట్టుకొని, దండా... బులు=కఱ్ఱ కమండలువు మొదలైనదేహముకంటె వేఱైనవస్తువులను,విసర్జించి=వీడి,ఆత్మపరములు=పరమాత్మయందు లగించునవి, వర్జించి=విడచి, గ్రహనక్షత్రాదివిద్యలన్ = జ్యోతిషము ప్రశ్న చెప్పుట సాముద్రికము భూతచికిత్స మొదలగు దాంబిక విద్యలచేత,జీవింపక=పొట్టపోసికొనక, భేదవాదంబులు=జీవాత్మపరమాత్మలకు భేదముగలిగించు, తర్కంబులు=యుక్తిప్రయుక్తిగలవాదములు, తర్కింపక=వాదించక, ఎందును=ఏమతమందును, పక్షీకరింపక=పక్షము గ్రహింపక, వంచించి=మోసగించి, ఉపన్యసింపక=బోధించక, బహువిద్యలన్=అనేకవిద్యలలో, మత్తాదివ్యాపారంబులన్ = కల్లుద్రాపుట గంజాయి బంగీ హుక్కా మొదలయిన కైపువస్తువులను సేవించుట మొదలగుపనులచేత, ఉల్లసిల్లక=సంతోషించక,

పెక్కు దినంబులున్ = అనేకదినములు, ఒక్కయెడన్ = ఒకతావుననే, వసియింపక = నిలువక, ఊరూరన్ = ప్రతియూరను, ఒక్కొక్కరాత్రి, వసియించుచున్ = నిలుచుచు, కార్య...ంబు = కార్యమైన ఘటపటాదులకంటెను కారణమైన మృదాదులకంటెను వేఱైనది, విశ్వంబు = ప్రపంచమును, దర్శించుచున్ = చూచుచు, సదసన్మయంబు = నిత్యము అనిత్యమునైనది. అవలోకించుచున్ = చూచుచు, జాగరణ...బులన్ = మేలుకొన్నప్పుడు నిద్రబోవునప్పుడు కలఁతనిద్దురయందును, ఆత్మనిరీక్షణంబు = పరమాత్మను చూచుట, బంధమోక్షంబులు = పట్టువిడుపులు, మాయామాత్రంబులు కాని = మాయాకల్పితములే కాని, వస్తుప్రకారంబునన్ = పదార్థరీతినిబట్టి, జీవితము = బ్రతికియుండుట, ధ్రువంబు = నిత్యము, మృత్యువు = చావు, భూత...లకున్ = పంచభూతములు వానికూడికచే నైన జీవశరీరములు వీని రాకపోకలకు, మూలంబు = కారణము, అయిన కాలంబున్ = అయిన సమయమును, ప్రతీక్షించుచున్ = ఎప్పుడు వచ్చునా యని యెదురుచూచును, ఇవ్విధంబునన్ = ఈలాగున, జ్ఞానోత్పత్తి పర్యంతంబున్ = బ్రహ్మజ్ఞానము కలుగుదాఁక, చరియించి = మెలఁగి, అటమీఁదన్ = ఆపైని, విజ్ఞానవిశేషంబు = శ్రేష్ఠమైనతెలివి, సంభవించినన్ = కలుగఁగా, పరమహంసుండు = పరమహంసత్వమును బొందినవాఁడు, దండాదిచిహ్నంబులు = దండము మొదలగు గుర్తులు, ధరియించియుండెన్ = పూనిగానీ, బహిరంగావ్యక్తచిహ్నుండు = బాహ్యప్రపంచమున కెఱుఁగరాని లక్షణములు గలవాఁడు, అంతరంగవ్యక్తంబు = మనోమాత్రగోచరము, ఆత్మానుసంధానంబు = జీవబ్రహ్మైక్యభావన, మనీషి = తెలిసినవాఁడు, బాహ్యానుసంధానాదిభావంబునన్ = వెలుపలికి తెలియుధర్మములు మొదలయినదానిచేత, మనుష్యులకున్ = జనులకు, తనవలనన్ = తనయెడల, ఉన్మత్త... తెఱంగు = పిచ్చివారు చిఱుతవారు మూఁగవారు మొదలగువారివలె నుండుటను.

## ప్రహ్లాదాజగర సంవాదము.

క. మునివల్లభుఁ డజగరుఁ డను
సునయుండు హిరణ్యకశిపుసూనుండును ము
న్నొనరించినసంవాదము
విను మీయర్థంబునందు వెలయు నరేంద్రా. 43

టీ. నరేంద్రా = ధర్మరాజా, మున్ను = పూర్వము, మునివల్లభుఁడు = మునిశ్రేష్ఠుఁడు, అజగరుఁడు, అను సునయుండు = అను నీతిపరుఁడును, హిరణ్యకశిపు సూనుండును = ప్రహ్లాదుఁడును, ఒనరించిన సంవాదము = చేసిన సంభాషణము, ఈయర్థంబునన్ = ఈచెప్పిన సందర్భములో, వెలయున్ = ప్రకాశించును, వినుము.

తా. రాజా! పూర్వము మునిరాజైన అజగరుఁడును ప్రహ్లాదుఁడును చేసినసంవాదము ఇప్పుడు మనము మాటలాడు విషయమునకు సరిపడును. దానిం జెప్పెద వినుము.

వ. తొల్లి భగవత్ప్రియుం డయినప్రహ్లాదుండు గతిపయామాత్య సమేతుం డయి లౌకికతత్త్వంబు నెఱింగెడికొఱకు లోకంబుల సంచరించుచు నొక్కనాఁడు కావేరీతీరంబున సహ్యపర్వతతటంబున ధూళిధూసరితంబు లయినకరచరణాద్యవయవంబులతోడ గూఢం బైననిర్మలతేజంబుతోఁ గర్మాకారవచోలింగవర్ణాశ్రమాదుల నెవ్వరికి నెఱుంగఁ బడక నేల నిద్రించుచు నజగరవ్రతధరుం డైనమునిం గని డాయం జని విధివత్ప్రకారంబున నర్చించి మునిచరణంబులకు శిరంబు మోపి మ్రొక్కి యతనిచరిత్రంబు దెలియ నిశ్చయించి యిట్లనియె.

టీ. తొల్లి = పూర్వము, భగవత్ప్రియుండు = విష్ణునకు అంతరంగిక భక్తుఁడు, కతి...తుండు = కొందఱుమంత్రులతోఁ గూడినవాఁడు, లౌకికత

త్త్వంబు = లోకధర్మమును, లోకంబులన్ = దేశములయందు, సంచరించు చున్ = తిరుగుచు, కావేరీతీరంబునన్ = కావేరిగట్టున, సహ్యపర్వత తటంబునన్ = సహ్యపర్వతము వెంబడిని, ధూళిధూసరితంబులు = దుమ్ముగ ప్పినవి, కర...బులు=కాళ్లుచేతులు మొదలగు నవయవములు, గూఢంబు= లోపల దాఁగినది, నిర్మలతేజంబుతోన్ = శుద్ధప్రకాశముతో, కర్మా...దు లన్ = పనులు, రూపము మాటలు గుర్తులు జాతి ఆశ్రమము మొదలగువా నితోడ, ఎఱుంగఁబడక = తెలిసికొనరాక, నేలన్ = భూమిమీఁద, నిద్రించుచున్, అజగరవ్రతధరుండు = కొండచిలువయొక్క నడవడిని దా ల్చినవాఁడు, ముని=మననము చేయువాఁడు, డాయన్ చని = దగ్గఱకుఁ బోయి, విధివత్ప్రకారంబునన్ = శాస్త్రరీతిచేత, అర్చించి = పూజించి, ముని చరణంబులకున్ = ఆముని పాదములకు, శిరంబు = తల, మోపి = తాఁకించి, మ్రొక్కి, అతని చరిత్రంబు = ఆయన నడవడి, తెలియన్ = తెలిసికొనుటకు,

సీ. భూమి నుద్యోగియై భోగియై యుండెడి
నరునికై వడి ముని నాథ నీవు
ఘనశరీరము దాల్చి కదలవు చిత్ర ము
ద్యమయుక్తునకుఁ గాని ధనము లేదు
ధనవంతునకుఁ గాని తగుభోగములు లేవు
భోగికిఁ గాని సంపూర్ణ మైన
తనువు లే దుద్యోగధనభోగములు లేక
నేల నూరక పడి నిద్ర పోవు

ఆ. నీకు నెట్లు గలిగె నిరుపమ దేహంబు
సముఁడ వార్యుఁడవు విశారదుఁడవు
బుద్ధినిధివి జనులఁ బొగడవు దెగడవు
నిద్ర ప్రతిదినంబు నిలుపనేల. 432

టీ. మునినాథ = మునిశ్రేష్ఠుఁడా, నీవు, భూమిన్ = ప్రపంచమున, ఉద్యోగి = ప్రయత్నముగలవాఁడు, భోగి = సుఖానుభవము గలవాఁడు, ఐ, ఉండెడి, నరునికైవడిన్ = మనుజునివలె, ఘనశరీరము = గొప్పదేహమును, తాల్చి = ధరించి, కదలవు, చిత్రము = ఆశ్చర్యము, ఉద్యమయుక్తునకున్ కాని = పాటుపడువానికిఁ గాని, ధనవంతునకుఁ గాని = ద్రవ్యముగలవానికిఁగాని, తగుభోగములు = తగిన సుఖానుభవములు, భోగికిన్ కాని = సుఖానుభవముగలవానికిఁగాని, సంపూర్ణము = పుష్కలమైనది, తనువు = ఒడలు, ఉద్యోగ... ములు = ప్రయత్నము ద్రవ్యమును సుఖానుభవమును, నేలన్ = భూమియందు, ఊరక = నిష్క్రియుఁడవై, పడి = దొర్లి, నిద్రవోవునీకున్ = నిద్రించునీకు, ఈనిరుపమదేహంబు = సాటిలేని తనువు, ఎట్లు, కలిగెను, సముఁడవు = సర్వభూతములయందును సుఖదుఃఖాదులయందును సమానుఁడవు. ఆర్యుఁడవు = పూజ్యుఁడవు, విశారదుఁడవు = విద్వాంసుఁడవు, బుద్ధినిధివి = జ్ఞానాశ్రయుఁడవు, జనులను, పొగడవు, తెగడవు = నిందింపవు, ఇట్లు, ప్రతిదినమును, నిద్రన్ = నిద్రావస్థలో, నిలుపన్ ఏల = శరీరము నేల యుంచితివి.

తా. ఓమునీంద్రా! ప్రపంచమున పాటుపడి ద్రవ్య మార్జించి సుఖపడువానికిఁగాని శరీరము అందముగాఁ బెరుఁగదు. నీవు పెద్దశరీరము గలిగియున్నావు. అటు నిటు మెదలవు. అాశ్చర్యము. పాటుపడువానికిఁ గాని డబ్బు దొరకదు. డబ్బున్నఁగాని తగినసౌఖ్యము లేదు. సౌఖ్యమున్న నేకాని శరీరము బలువదు. నీవు ఉద్యోగము ద్రవ్యము సుఖము లేకయే మంచిదేహపుష్టి గలిగియున్నావు. వట్టినేలమీఁదఁ బడి నిద్రబోవుచుందువు నీకీయంద మైన దేహ మెట్లుకలిగెను. సర్వసముఁడవు. పూజ్యుఁడవు. పండితుఁడవు. మహాజ్ఞానివి. ఒకరిని బొగడవు. తిట్టవు. ఎప్పుడు ఇట్లు ఏల నిద్రపోయెదవో దయచేసి చెప్పుము.

వ. అని యిట్లు ప్రహ్లాదుం డడిగిన వికసితముఖుం డయి మునీంద్రుండు దదీయమధురాలాపసుధారసప్రవాహంబులు గర్ణంబులఁ బరిపూర్ణంబు లైన నతని నవలోకించి యిట్లనియె.

టీ. వికసితముఖుండు = ప్రకాశించుచున్న ముఖము గలవాఁడు, తదీయ...బులు = ఆప్రహ్లాదుని వైనతీయానిపలుకు లను నమృతప్రసూనలు, కర్ణంబులన్ = చెవులయందు, పరిపూర్ణంబులు = నిండినవి, అవలోకించి = చూచి.

సీ. ఆంతరంగికదృష్టి నంతయు నెఱుఁగుదు
వార్యసమ్మతుఁడ వీ వసురవర్య
విశ్వజంతువులప్రవృత్తినివృత్తిల
క్షణములు నీ యెఱుంగనివి లేవు
భగవంతుఁ డగుహరి పాయక నీమనో
వీథి రాజిల్లుచు వెలుఁగుఱేని
క్రమమున బహుళాంధకారంబుఁ బరిమార్చుఁ
బరమసాత్త్వికుఁడవు భద్రబుద్ధి
ఆ. వైననీవు నన్ను నడిగెదు గావున
విన్నధర్మ మెల్ల విస్తరింతు
నిన్నుఁ జూడఁ గలిగె నీతోడిమాటల
నాత్మశుద్ధి గలిగె ననఘచరిత. 434

టీ. అసురవర్య = రాక్షసులలో మేటివైన యో ప్రహ్లాదా, ఆర్యసమ్మతుఁడవు = పెద్దలకుఁ బ్రియమైనవాఁడవు, ఈవు = నీవు, ఆంతరంగికదృష్టిన్ = సూక్ష్మదృష్టిచేత, విశ్వ...ములు = సమస్తభూతములయు రాకపోకలరీతులు, నీ యెఱుంగనివి = నీకుఁ దెలియనివి, లేవు, భగవంతుఁడు = షడ్గుణైశ్వర్యయుక్తుఁడు, అగు, హరి = విష్ణువు, పాయక = విడువక, నీమనోవీథిన్ = నీచిత్తమున, రాజిల్లుచున్ = ప్రకాశించుచు, వెలుఁగుఱేనిక్రమమునన్ = చంద్రునివలె, బహుళాంధకారంబున్ = దట్టపుఁజీఁకటిని, పరిమార్చున్ = అడఁచును, పరమసాత్త్వికుఁడవు = గొప్పసత్త్వగుణప్రధానుఁడవు, భద్రబుద్ధివి = మేలైన బుద్ధిగలవాఁడవు, ఐన నీవు, నన్ను, అడిగెదవు కావున, విన్నధర్మము ఎల్లన్

=నేను పెద్దవారివలన వినినసంగతియంతయు, విస్తరింతున్ = వివరింతును, అనఘచరిత=పాపములేనినడవడికలవాఁడా, నిన్నున్, చూడన్ కలిగెను=చూచుట సంభవించెను, నీతోడిమాటలన్=నీతో సంభవించినమాటలవలన, ఆత్మశుద్ధి=చిత్తనైర్మల్యము, కలిగెను.

తా. ప్రహ్లాదా! సాధువులకు మోహము గూర్చువాఁడవైన నీవు జ్ఞానదృష్టిచే సమస్తము నెఱుఁగుదువు. ఎల్లజంతువుల పుట్టుచావుల వార్తలలో నీకుఁ దెలియనియంశ మొక్కటియు లేదు. శ్రీమన్నారాయణమూర్తి యెల్లప్పుడు నీమనసులో నిల్లుగట్టుకొని కాఁపురముసేయుచు చంద్రుఁడు చీఁకటిని బోఁగొట్టినట్లు నీయజ్ఞానమునంతయు బోఁగొట్టుచున్నాఁడు. శుద్ధసత్త్వమయుఁడవు, మంగళాశాసనుఁడవు నైన నీవు సర్వము దెలిసియు నన్నడుగుచున్నావుగావున నే విన్నంతలో నెల్లధర్మములు నీకుఁ దెలిపెదను. నా పుణ్యము మంచిదయియున్నందునఁ బరమభాగవతోత్తముఁడవైన నీయట్టివానిని గన్నులారఁ గాంచుట తటస్థమయ్యెను. నీతోడ కొంచెము సేపు మాటలాడినంతలోనే చిత్తశుద్ధి గలిగెను.

వ. వినుము ప్రవాహకారిణి యై విషయంబులచేతం బూరింపరానితృష్ణచేతం బడి కర్మంబులఁ బరిభ్రామ్యమాణుండ నైన నేను నానావిధయోనులందుఁ బ్రవేశించుచు వెడలుచు నెట్టకేలకు మనుష్యదేహంబు ధరియించి యందు ధర్మంబున స్వర్గద్వారంబును నధర్మంబున శునకసూకరాదితిర్యగ్జంతుయోనిద్వారంబుల నొంది క్రమ్మఱ మనుష్యుండై పుట్టవలయు నని వివేకించి సుఖరక్షణదుఃఖమోక్షణంబులకొఱకు ధర్మంబు సేయుదంపతులవ్యవహారంబు గని సర్వక్రియానివృత్తి గలిగినజీవుఁడు స్వతంత్రుండై ప్రకాశించు నని నిర్ణయించి భోగంబులు మనోరథజాతమాత్రంబులు గాని శాశ్వతంబులుగా వని పరీక్షించి నివృత్తుండనై యుద్యోగంబు

లేక నిద్రించుచుఁ బ్రారబ్ధభోగంబుల ననుభవించుచు నుండుదు నిశ్చయంబునఁ దనకు సుఖరూపం బైనపురుషార్థంబు దనయందుఁ గలుగుట యెఱుంగక పురుషుండు శైవాలజాల నిరుద్ధంబు లైనశుద్ధజలంబుల విడిచి యెండమావులు జలంబు లని పాఱెడుమూఢునివలెనువ్వున సత్యంబు గాని ద్వైతంబుఁ జొచ్చి ఘోరసంసారచక్రపరిభ్రాంతుం డై దైవతంత్రంబు లైనదేహాదులచేత నాత్మకు సుఖంబును దుఃఖనాశంబునుం గోరుచు నీశుం డైన వానిప్రారంభంబులు నిష్ఫలంబు లగు నదియునుం గాక మర్త్యునకు ధనంబు ప్రాప్తం బయిన నది దుఃఖకరంబు గాని సుఖకరంబు గాదు లోభవంతు లయిన ధనవంతులు నిద్రాహారంబులు లేక రాజ చోర యాచక శత్రుమిత్రాది సర్వస్థలంబులందును శంకించుచు దానభోగం బులు మఱచి యుండుదురు ప్రాణార్థవంతులకు భయంబు నిత్యంబు శోకమోహభయక్రోధరాగశ్రమాదులు వాంఛా మూలంబులు వాంఛ లేకుండవలయును. 435

టీ. ప్రవాహకారిణి = వేగగమనముగలది, విషయంబుల తెఁ = స్రక్చందనాది వస్తువులచేత, పూరింపరానితృష్ణచేతఁ = నిండింప నలవికాని యాశచేత, కర్మములఁ, పడి, పరిభ్రామ్యమాణుండను = తిరుగుచున్నవాఁడను, ఐన నేను, నానావిధ = పలుదెఱఁగులైన, యోనులయందుఁ = క్షేత్రముల యందు, ప్రవేశించుచుఁ = చొచ్చుచు, వెడలుచు, ఎట్టకేలకు = ఏదోఒక విధమున, అతిప్రయాసచేత, మనుష్యదేహంబు = మానిసిపుట్టువు, ధరియించి = తాల్చి, అందుఁ = దానిలో, ధర్మంబునఁ = న్యాయముచేత, స్వర్గద్వారంబును = స్వర్గపువాకిలిని, అధర్మంబునఁ = అన్యాయమార్గమున, శునక... బులఁ = కుక్కలు పందులు మొదలయిన జ్ఞానహీనజంతువుల యోనిరంధ్రములను, పొంది, క్రమ్మఱఁ = మరల, మనుష్యుండను = మనుజుఁడు, ఐ, పుట్ట

కలయును, అని, వివేకించి=విచారించుకొని, సుఖ...కొఱకుఁ= ఎప్పుడు సుఖమును బొందఁ గాపాడుకొనుట దుఃఖమును దొలఁగించుటవీనికొఱకు, ధర్మంబు=సద్వర్తనము, చేయు, దంపతుల వ్యవహారంబు=భార్యాభర్తల నడవడిని, కని=చూచి, అనఁగా, తమంతనేవచ్చు సుఖదుఃఖములను దెలియఁ జాలక సుఖమువచ్చుటకు దుఃఖముపోవుటకును వారువారు చేయు వ్యర్థ ప్రయత్నములనెఱిఁగి విచారించి యనుట. సర్వక్రియానివృత్తి=ఎల్లపనులుమానుట, స్వతంత్రుండై=ఒకదానికి లోఁబడనివాఁడై, ప్రకాశించుచుఁ=వెలుఁగుచు, నిర్ణయించి=నిశ్చయించుకొని, భోగంబులు= సుఖదుఃఖానుభవములు, మనోరథజాతమాత్రంబులు=తలఁపులలోఁ గల్గినవి, శాశ్వతములు=స్థిరములు, నివృత్తుండను=కోరికలనుండి మరలినవాఁడను, ఉద్యోగంబు= యత్నము, నిద్రించుచు, ప్రారబ్ధభోగంబులఁ=పూర్వసంచితకర్మానుభవములను, ఇవ్విధంబునఁ=ఈలాగున, తనకు, సుఖరూపంబు=సుఖమును, పురుషార్థంబు= వస్తువు, తనయందుఁ, కలుగుట, ఎఱుంగక = తెలియనేరక, శైవాల...బులు=పాఁచితుట్టెలచేఁ గప్పఁబడినవగు, శుద్ధజలంబులఁ=మంచినీళ్లను, ఎండమావులు=మృగతృష్ణలు, పాఱెడు మూఢునివడువునఁ=పరుగెత్తు నవివేకివలె, సత్యంబు=నిజము, ద్వైతంబు=భేదభావన, చొచ్చి=ప్రవేశించి, ఘోర...భ్రాంతుండు=దారుణమైన సంసారచక్రమునఁబడి తిరుగువాఁడు, దైవతంత్రంబులు=ఈశ్వరునిచేఁ గల్పించఁబడినవి, దేహాదులచేతఁ=దేహము గేహము మొదలగువానిచేత, ఆత్మకుఁ=జీవునకు, సుఖంబును, దుఃఖనాశంబును=ఆపన్నివృత్తియు, నిరీశుఁడు=ఈశ్వరునిదెలియనివాఁడు, ప్రారంభంబులు=కార్యారంభములు, నిష్ఫలంబులు=ప్రయోజనములేనివి, మర్త్యునకుఁ, ప్రాప్తంబు=దొరకినది, దుఃఖకరంబు = కష్టముగూర్చునది, సుఖకరంబు= మేలుసేయునది, లోభవంతులు=ఆశాబద్ధులు, అయిన, ధనవంతులు=సంపన్నులు, నిద్రాహారంబులు=కంటికికూర్కు కడుపునకన్నమును, లేక=కానక, రాజ.. లాదును=రాజు దొంగలు బిచ్చగాండ్రు విరోధులు ఆశ్రితులు మొదలుగా నెల్లయెడలను, శంకించుచుఁ=వారిమూలమున ధనహాని కలుగునేమో

యని భయపడుచు, దానభోగంబులు=ఒకరికి పెట్టుట, తాఁదినుట, మఱచి యుందురు, ప్రాణార్థవంతులకున్ = ప్రాణముగలజంతువులకును ధనికుల కును, భయంబు, నిత్యంబు=శాశ్వతము, పుట్టినజంతువులన్నిచచ్చుటన్యాయ ముగావున జీవులబ్రదుకు నిత్యముగాదు. క్షణక్షణమునను భయమే. అట్లే ధన వంతుల ధనము ఎన్ని రక్షణోపాయములు వెదకినను పోవుటకే దారివెదకు చుండును. శోక...దులు=వ్యసనము మోహము భీతి ప్రీతి కోపము అలఁత మొదలగునవియన్నియు, వాంఛామూలంబులు = తృష్ణవెంటఁబుట్టునవి, కావున, వాంఛ=విషయతృష్ణ, లేకుండవలయును.

మ. సరఘుల్ గూర్చిన తేనె మానవులకున్ సంప్రాప్తమైనట్లు లో
భరతుల్ గూర్చినవిత్తముల్ పరులకుం బ్రాపించుఁబ్రాప్తాశినై
తిరుగంబోనిమహోరగంబుబ్రదుకున్దీర్ఘాంగమైయుండియుం
జిరకాలంబును వానివర్తనములం జింతించి యేకాంతినై.

టీ. సరఘుల్ = తేనెటీఁగలు, కూర్చిన తేనె = కూడఁబెట్టినపుష్ప రసము, మకరందము, మానవులకున్ = జనులకు, సంప్రాప్తము = లభిం చినది, ఐనట్లు, లోభరతుల్ = ఆశాబద్ధులు, కూర్చిన విత్తముల్ = కూర్చినద్రవ్యములు, పరులకున్ = అన్యులకు, ప్రాప్తించున్ = చేరును, దీర్ఘాంగము = పెద్దమొదలు గలది, ఐ, ఉండియును, తిరుగన్ పోనిమ హోరగంబు = అటునిటు కదలక మెదలక యుండునట్టి కొండచిలువ, బ్రదుకున్ = ఎట్లో జీవించును, నేను, చిరకాలంబును = చాలకాలము, వానివర్తనములన్ = ఆయాజగరముల నడివడులను, చింతించి=తలపోసి, ఏ కాంతిన్ ఐ = ఒంటరివాఁడనై.

తా. ప్రహ్లాదా! లోభులైన మానవులు కూడఁబెట్టినవిత్తము తేనెటీఁ గలు కూడఁబెట్టినతేనె మనుజులపాలయినట్లు, అన్యులపాలై పోవును. కావున వారు ధనార్జనమునకయి చేసినయత్నము లన్నియు వ్యర్థములేగదా! ఏప్రయత్నములేకయే తా నున్నచోటు కదలక పెద్దశరీరముతో నుండి

కొండచిలువలు బ్రదుకుటలేదా అవి యెట్లు జీవించును? అని వానివృత్తి యెఱింగి తెలిసికొని నేనును సర్వసంగములు వదలి ఒంటిగా నున్నవాఁడనై.

క. అజగరమును జుంటీఁగయు
నిజగురువులుగాఁ దలంచి నిశ్చింతుఁడ నై
విజనస్థలిఁ గర్మంబుల
గజిబిజి లేకున్నవాఁడ గౌరవవృత్తిన్. 437

టీ. అజగరమును = కొండచిలువయు, జుంటీఁగయున్ = తేనెటీఁగయును, నిజగురువులుగాన్ = తనకు తత్త్వముఁజెప్పిన గురువులుగా, తలంచి = నిశ్చయించి, నిశ్చింతుఁడనై = విచారముఁ బాసినవాఁడనై, విజనస్థలిన్ = ఎవ్వరు లేనిచోట, కర్మంబులగజిబిజి = కర్మముల సంకులత, లేక, గౌరవవృత్తిన్ = మంచినడవడితో, ఉన్నవాఁడను.

తా. ప్రహ్లాదా! ఇట్లు అజగరమును, తేనెటీఁగను తత్త్వోపదేశకులైన గురువులనుగాఁ జేసికొని విచారము దక్కి ఒంటరిపాటున నిచ్చోఁ జేరి కర్మములసందడిఁ బాసి సుఖముగా నున్నాను.

సీ. అజినవల్కలదుకూలాంబరంబులు గట్టి
యొండెఁ గట్టకయును నొండె నుందు
నాందోళికారథహయనాగముల నెక్కి
యైన నెక్కక యైన నరుగుచుందుఁ
గర్పూరచందనకస్తూరికాలేప
మైన భూరజమైన నలఁదుచుందు
భర్మశయ్యల నైనఁ బర్వశిలాతృణ
భస్మంబులం దైనఁ బండుచుందు

ఆ. మానయుక్త మైన మానహీనం బైనఁ
దీయ నైన మిగులఁ దిక్త మైనఁ

గుడుతు సగుణ మైన గుణవర్జితం బైన
నల్ప మైనఁ జాల నధిక మైన. 438

టీ. అజిన...బులు = తోళ్లు నారబట్టలు వెలిపట్టుదోవతులు నూలుగుడ్డలు, కట్టియుండెడఁ = ధరించుకొని కానీ, కట్టకయునుఁ ఉండెడఁ = కట్టుకొనకుండఁగానీ, ఉందును, ఆందోళికా...ములఁ = పల్లకి బండి గుఱ్ఱము ఏనుఁగు వీనిని నెక్కిగానీ, యెక్కకగానీ, అరుగుచుందును = వెళ్లుచుందును, కర్పూర...లేపమైనఁ = కర్పూరము గంధము కస్తూరి వీని పూఁతను గానీ, భూరజమైనఁ = నేలదుమ్మును గానీ, అలఁదికొందుఁ = పూసికొనుచుందును, ధర్మశయ్యలఁ = బంగారు పఱుపులయందు, పర్ణ...బులందు = ఆకులు రాళ్లు గడ్డి బూడిదలలో, పండుకొందును, మానయుక్తము = మన్ననతోఁ గూడినది, మానహీనంబు = మన్ననలేనిది, తీయన = తీయనిది, తిక్తము = చేఁదు, సగుణము = మంచిగుణముగలది, గుణవర్జితము = గుణము (ప్రయోజనము) లేనిది, అల్పము = కొంచెము, అధికము = ఎక్కువ, కుడుతును = తిందును.

తా. ప్రహ్లాదా! నేను చర్మముగాని నారచీరెగానీ పట్టుకోకగానీ నూలుగుడ్డలుగానీ దొరకినగానీ దొరకకపోయినఁగానీ చింతనొందకుందును. ఇవి దొరకినప్పుడు కట్టుకొందును. లేకున్న నూరకుందును. పల్లకి బండి గుఱ్ఱము ఏనుఁగు చిక్కిన నెక్కెదను. చిక్కకున్న మానెదను. కప్పురము గంధము కస్తూరి దొరకినఁ బూసికొందును. ఇంతదు మైనను బూసికొందును. బంగారు పఱుపుగానీ వట్టినేలగానీ భేదమెంచక పండుకొందును. ఆదరముండనీ లేకపోనీ తీయనగా నుండినను చేఁదైయైనను మంచిగానీ చెడ్డగానీ కొంచెముగానీ గొప్పగానీ చాలినను జాలకపోయినను ఏదియైనను దిందును.

క. లేదని యెవ్వారి నడుగను
రాదని చింతింపఁ బహులు రప్పించినచోఁ

గాదని యెద్దియు మానను
ఖేదము మోదమును లేక క్రీడింతు మదిన్. 439

టీ. లేదు = నా కీవస్తువులేదు, అని, ఎవ్వరిని, అడుగను, రాదు = ఇదినాకు దొరకదు, చింతింపను, పరులు = ఇతరులు, రప్పించినచోన్ = పిలుపించఁగా, కాను = రానువీలులేదు, అని, ఎద్దియున్ = కర్మానురూపమయిన యేపనిని, మానను, మదిన్ = చిత్తములో, ఖేదము = దుఃఖము, మోదము = సంతోషము, లేక, క్రీడింతును = విహరింతును.

తా. నా కీవస్తువు లేదని యొకరి నడుగను. ఇది దొరకకపోయెఁగదా యని యేడువను. ఒకరు పిలచినఁ దప్పించుకొనను. కర్మారబ్ధమైన దేనిని నలదనను. మనస్సున నేవేళను దుఃఖముగాని సుఖముగాని లేక యానందించుచుందును.

క. నిందింపఁ బరుల నెన్నఁడు
వందింప ననేకపీడ వచ్చిన మది నా
క్రందింప విభవముల కా
నందింపఁ బ్రకామవర్తనంబున నధిపా. 440

టీ. పరులన్=ఇతరులను, ఎన్నఁడును, నిందింపన్ = దూషింపను, అనేకపీడ = ఎంతటి యిక్కట్టు, వచ్చినను, వందింపన్ = ఒకరికి మ్రొక్కను, మదిన్ = చిత్తములో, విభవములకున్ = సంపదలకయి, ఆక్రందింపన్ = ఏడువను, ప్రకామ వర్తనంబునన్ = ఇచ్చ వచ్చినట్లు మెలఁగుటచేత, ఆనందింపన్ = ఆనందపడను.

తా. నేను ఒకరి నెన్నఁడును నిందించను. ఎంత దుఃఖము వచ్చినను ఒకరిని వేఁడను. కలుములు లేకపోయెఁగదా యని యేడువను. తోఁచినట్లెల్ల కోరిక లనుభవించి సుఖముని యానందపడను.

వ. ఇట్లు కోరిక లేక యొక్కసమయంబున దిగంబరుండ నై పిశాచంబుచందంబున వర్తించుచుఁ బెక్కుదినంబులం గోలెఁ బెనుఁబాఁపవర్తనంబుఁ గైకొని నిమీలితలోచనత్వంబున నేకాంతభావంబున విష్ణునియందు వికల్పంబును భేదగ్రాహకచిత్తవృత్తులఁ జిత్తంబు నర్థరూపపరిభ్రమంబు గలమనంబునం దుమనంబును నహంకారంబునందు నహంకారంబును మాయయందు మాయను నాత్మానుభూతియందు లయంబు నొందించి సత్యంబు దర్శించుచు విరక్తి నొంది స్వానుభవంబున నాత్మస్థితుండ నై యుండుదు నీవు భగవత్పరుండవు గావున రహస్యం బైనపరమహంసధర్మంబు స్వానుభవగోచరం బైన తెఱంగున నీకు హృద్గోచరం బగునట్లు సెప్పితి ననిన విని.

టీ. దిగంబరుండను=దిసమొలవాఁడను, పిశాచంబుచందంబునన్=దయ్యమువలె, వర్తించుచున్ = మెలఁగుచు, పెక్కుదినంబులం గోలెన్ = చాలదినములనుండి, పెనుబాఁపవర్తనంబున్=కొండచిలువనడవడిని, కైకొని, నిమీలితలోచనత్వంబునన్=కనులు మూసికొని యుండుటచే, ఏకాంతభావంబునన్=నిశ్చలత్వముతో, విష్ణునియందున్=శ్రీహరియందు, చిత్తంబు=మనము, చేర్చి, భేదగ్రాహకచిత్తవృత్తులన్=భేదబుద్ధిని గలిగించుమనోధర్మములచేత, అర్థరూపపరిభ్రమంబు=వస్తురూపములయందలి తిరుగుడు, కలమనంబునందు, అహంకారంబునందున్ = నేను నాది యనుదానియందు, మాయయందు, మాయను, వీనిని, ఆత్మానుభూతియందున్ = ఆత్మసాక్షాత్కారమందు, లయంబు నొందించి = ఐక్యము చేసి, సత్యంబు = నిజమైనదానిని, దర్శించుచున్ = చూచుచు, విరక్తిన్ = విరాగమును, పొంది, స్వానుభవంబునన్ = ఆత్మానుభవముచేత, ఆత్మస్థితుండను = నాలోఁజేరినవాఁడను, భగవత్పరుండవు = భాగవతోత్తముఁడవు, పరమధర్మంబు = ఉత్తమ

తత్త్వము, స్వానుభవ గోచరం బైన తెఱంగునన్ = నాకుఁ దెలిసినట్లు, హృద్గోచరము = మనస్సుకెక్కునది, అగునట్లు, చెప్పితిని.

క. ఘను నజగరమునివల్లభు
దనుజేంద్రుఁడు పూజసేసి తగ వీడ్కొని నె
మ్మనమున సంతోషించుచుఁ
జనియెన్ నిజగేహమునకు శశికులతిలకా. 442

టీ. శశికులతిలకా = చంద్రవంశమున కాభరణమైనధర్మరాజా, ఘనున్=మహనీయుఁడైన, అజగరమునివల్లభున్ = అజగరమహామునిని, దనుజేంద్రుఁడు = రాక్షసులరాజయిన ప్రహ్లాదుఁడు, పూజచేసి = సత్కరించి, తగన్=యథోచితముగా, వీడ్కొని=సెలవుగొని, నెమ్మనమునన్ = అంతరంగములో, సంతోషించుచున్=ఆనందపడుచు, నిజగేహమునకున్=తన యింటికి, చనియెన్=పోయెను.

తా. ఓ ధర్మరాజా! ఇట్లు రాక్షసరాజైన ప్రహ్లాదుఁడు ఆ మహాత్ముఁడగు అజగరమహామునిని పూజించి సెలవుపుచ్చుకొని ఆయన బోధించిన సద్బోధకు మనస్సున చాలఁగ సంతోషించుచుఁ దనయింటికిఁ జేరెను.

వ. అనిన యుధిష్ఠిరుం డి ట్లనియె. 443

క. ననుబోఁటిజడగృహస్థుఁడు
మునివల్లభ యిట్టిపదవి మోదంబున నే
యనువునఁ జెందును వేగమ
వినిపింపుము నేఁడు నాకు విజ్ఞాననిధీ. 444

టీ. యుధిష్ఠిరుఁడు=ధర్మరాజు, మునివల్లభ=మునులలో మేటియైన యో నారదా, నను...స్థుఁడు=నావంటి యజ్ఞానియైనకాఁపు, ఇట్టిపదవి=ఈ ప్రహ్లాదాజగరులు పొందినట్టిదగు మంచిపదవిని, మోదంబునన్=సంతోసముతోడ, ఏయనువునన్=ఏరీతిగా, చెందును=పొందఁగలఁడో, విజ్ఞాననిధీ=

జ్ఞానమునకు నెలవైన యో మహామునీ, వేగముల=శీఘ్రముగా, నేడు= ఈవేళ, నాకు, వినిపింపుము.

తా. జ్ఞానసాగరుఁడవైనయో నారదమునీంద్రా! ఇప్పుడు మీరు చెప్పినవిధమున సర్వసంగపరిత్యాగరూపము క్తిని నాబోటిమూఢాత్ముఁడైన గృహస్థుఁడు బొంద వీలున్నదా? ఏదైన నొకతెరువు గలదేని దయతో శీఘ్రముగా సెలవిండు.

వ. అనిన నారదుం డి ట్లనియె గృహస్థుం డయినవాఁడు వాసు దేవార్పణంబుగా గృహోచితక్రియ లనుసంధించుచు మహా మునుల సేవించి వారలవలన నారాయణదివ్యావతారకథా శ్రవణంబు సేయుచు సద్యోవిహితకాలంబుల శాంతజనులం గూడి మెలంగుచుఁ బుత్త్రమిత్త్రకళత్రాదిసంగంబులు గలల వంటి వని యెఱుంగుచు లోపల నాసక్తి లేక సక్తుండైనవాని వెలుపలఁ బురుషకారంబు లొనర్చుచుఁ దగులంబు లేక విత్తంబు లిచ్చి జనక సుత సోదర సఖి జ్ఞాతిజనులచిత్తంబులు సమ్మోదాయత్తంబులు గావించుచు ధనధాన్యనిధానదైవలబ్ధం బులవలన నభిమానంబు మాని యనుభవించుచు గృహక్షే త్రంబులఁ జొచ్చి యుదరపూరణమాత్రంబు దొంగిలినవాని దండింపక భుజగమృగమూషకమర్కటమక్షికాఖరోష్ట్రం బుల హింసింపక పుత్త్రులభంగి నీక్షించుచు దేశకాలదైవం బులకొలందిని ధర్మార్థకామంబులఁ బ్రవర్తించుచు శునక పతితచండాలాదులకైన భోజ్యపదార్థంబులు దగినభంగినిచ్చు చు నిజవృత్తిలబ్ధంబు లగునశనాదులచేత దేవఋషిపితృ భూతమానవుల సంతర్పించుచు పంచమహాయజ్ఞావశేషంబుల నంతర్యామిపురుషయజనంబును నాత్మజీవనోపాయంబును సమర్థించుచు నుండవలయు.

టీ. వాసుదేవార్పణంబుగాన్ = శ్రీకృష్ణపరమాత్మకుఁ జెందునట్లుగా, గృహోచితక్రియలు = ఇంటఁ గావలసినయెల్ల పనులును, అనుసంధించుచున్ = చేయుచు, నారాయ.. ణంబు = శ్రీవిష్ణుని యమానుషములైన పుట్టుకయందలి యద్భుతకృత్యములవినికిని, అయ్యైవిహితకాలంబులన్ = తగినవేళలలో, శాంతజనులన్ = నెమ్మదిగానుండువారలను, మెలంగుచు = తిరుగుచును, పుత్త్రి...బులు = కొడుకులు చెలులు భార్యలు మొదలగువాని తగులములు, ఆసక్తి = మక్కువ, సక్తునికైవడిన్ = ప్రేమగలవానివలె, పురుషకారంబులు = పురుషుఁడు చేయఁదగుపనులు, ఒనర్చుచున్ = చేయుచు, తగులంబు = సంగము, విత్తంబులు = ద్రవ్యములు, జనక...బులు = తండ్రి కొడుకులు కూఁతుండ్రు అన్నదమ్ములు మిత్త్రులు దాయాదులు వీరి మనములను, సమ్మదాయత్తంబులు = సంతోషపూర్ణములైనవి, కావించుచున్ = చేయుచు, ధన...వలనన్ = ద్రవ్యము ధాన్యము గనులు దైవవశమున దొరకినపదార్థములు వీనివలన, అభిమానంబు = గర్వమును, గృహక్షేత్రంబులన్ = తనయింటనిగాని పంటచేనినిగాని, చొచ్చి = దూరి, ఉదరపూరణమాత్రంబు = కడుపునిండుపాటి అన్నాదిద్రవ్యమును, దొంగిలినవానిన్ = ముచ్చిలించినవానిని, దండింపక = శిక్షింపక, భుజగ...బులన్ = పాములు క్రూరజంతువులు ఎలుకలు క్రోఁతులు ఈఁగలు గాడిదలు ఒంటెలు వీనిని, హింసింపక = చంపక, పుత్త్రిలభంగిన్ = తనబిడ్డలమాదిరిని, ఈక్షించుచున్ = ఆదరముతో గనిపట్టుచు, దేశ...దిని = దైవమనుకూలించినంతలో దేశమునకుఁ గాలమునకుఁ దగినట్లుగా, ధర్మార్థకామంబులయందు, ప్రవర్తించుచున్ = మెలఁగుచు, శునక...కునైనన్ = కుక్కలు కులభ్రష్టులు మాలమాదిగలు వీరికైనను, భోజ్యపదార్థంబులన్ = తినఁదగిన అన్నము అంబలి మొదలగుదానిని, తగినభంగిన్ = ఉచితముగా, నిజవృత్తిలబ్ధంబులు = తనకులవృత్తిచేత దొరకినవి, అగునశనాదులచేతన్ = ఐన అన్నము పిండి శాకము మొదలైనవానిచేత, దేవ...వులన్ = దేవతలు మునులు పితరులు ఎల్లజంతువులు మనుజులు వీరిని, సంతర్పించుచున్ = తనియఁబెట్టుచు, పంచ...బులన్ = దేవయజ్ఞమాదిగాఁ బంచయజ్ఞములు చేయఁగా మిగిలినవాని

యందు, అంతర్యామిపురుషయజనంబును = లోపలిజీవాత్మకు ఆహుతి వేసి తృప్తిపఱచుటయు, ఆత్మజీవనోపాయంబును = జీవాత్మ నిరపాయముగా బ్రదుకు సదుపాయమును, సమర్థించుచుఁ = చక్కఁజేసికొంచును, ఉండవలయును.

ఆ. జనకగురుల నైనఁ జంపు నర్థమునకై
ప్రాణ మైన విడుచు భార్యకొఱకు
నట్టిభార్యఁ బురుషుఁ డతిథిశుశ్రూష సే
యించి గెలుచు నజితు నీశు నైన. 446

టీ. పురుషుఁడు = మనుజుఁడు, అర్థమునకై = ప్రాణములకొఱకై, జనకగురులనైనఁ = తండ్రినిగాని గురువునుగాని, చంపును, భార్యకొఱకుఁ = ఆలికై, ప్రాణమైనఁ = అత్యంతప్రియమైన ప్రాణమునైనను, విడుచును, అట్టిభార్య = ఆలాగున ప్రాణములనైన నిచ్చి పోషించుకొను భార్యను, అతిథిశుశ్రూష = వేళకు ఇంటికివచ్చిన [illegible], చేయించి, అజితుఁ = ఒకరిచే గెలువఁబడని, [illegible] ఐనఁ [illegible] శ్వరునిగూడ, గెలుచును.

తా. లోకములో [illegible] సవుఁడు ద్రవ్యమున కాశపడి త[illegible]డ్రినైనను గురువునైనను విచారించక [illegible] పెండ్లముకొఱకు ప్రాణాలైన [illegible]డుచును. ఇది నైజగుణము. ఇట్టి ప్రియ[illegible] పెండ్లాము [illegible]త నైన్లైన లాలి[illegible] వేళకు నిల్లుద్రొక్కుకొని వచ్చిన దైవస్వరూపులగు నతిథులకు పూ[illegible]జియించెనా ఆపుణ్యాత్ముఁడు దేవునిఁగూడ [illegible] నుడుట.

ఆ. పరముఁ డీశ్వరుండు బ్రాహ్మణముఖమున
నాహరించి తుష్టుఁ డయినభంగి
నగ్నిముఖమునందు హవ్యరాసులు గొని
యైనఁ దుష్టి నొందఁ డనఘచరిత. 447

టీ. అనఘచరిత = పావనమైన నడవడికల సౌ ధర్మరాజా, పరముఁడు = పరాత్పరుఁడు, ఈశ్వరుండు = సర్వనియామకుఁడగు శ్రీమన్నారాయణుఁడు, బ్రాహ్మణముఖమునన్ = బ్రాహ్మణుని ద్వారా, ఆహరించి = భుజించి, తృప్తుఁడు = తనివి నందినవాఁడు, ఐనభంగిన్ = ఐనట్లు, అగ్నిముఖంబునన్ = అగ్నిద్వారమున, హవ్యరాసులు = ఆజ్యాది హవిస్సుల గుట్టలను, కొని = గ్రహించి యైనను, తుష్టిన్ బొందఁడు = సంతోషపడఁడు.

తా. ధర్మరాజా! శ్రీవిష్ణురూప పరమాత్మ బ్రాహ్మణద్వారమున నిచ్చిన యింత అన్నోదకములచేఁ దృప్తిపడినట్లు అగ్నిద్వారమునఁ గొండలంతంత ఆజ్యాన్నాది హవిస్సుల రాసులను వేల్చినను దృప్తుఁడు కాఁడు. కావున అతిథిభోజనము గృహస్థున కన్నివిధముల శ్రేయస్కరము.

వ. కావున గృహస్థుండు బ్రాహ్మణులందును దేవతలందును మర్త్యపశుప్రముఖజాతులందును నంతర్యామియు బ్రాహ్మణాననుండును నైన క్షేత్రజ్ఞునందు నర్ఘ్యోదకాదికలు సమర్పించి సంతర్పణంబు సేయ వలయు భాద్రపదంబునఁ గృష్ణపక్షంబునందును దక్షిణోత్తరాయణంబులందును రేయింబగలు సమమైనకాలంబులందును వ్యతీపాతంబులందును దినక్షయంబులందును సూర్యచంద్రగ్రహణంబులందును శ్రవణద్వాదశియందును వైశాఖశుక్లతృతీయయందును గార్తికశుక్లనవమియందును హేమంతశిశిరంబులలోన నాలు గష్టకలందును మాఘశుక్లసప్తమియందును మాఘనక్షత్రంబులతోడం గూడి నపున్నమలందును ద్వాదశితోడం గూడిన యుత్తరాత్రయశ్రవణానూరాధలందును నుత్తరాత్రయసహితంబులయినయేకాదసులయందును జన్మనక్షత్రయుక్తదివసంబులందును మఱి

యుఁ బ్రశస్తకాలంబులందును జననీజనకబంధుజనులకు శ్రాద్ధంబులును జపహోమస్నానవ్రతంబులును దేవబ్రాహ్మణసమారాధనంబులును నాచరింపవలయు భార్యకుఁ బుంసవనాదికంబులను నపత్యంబునకు జాతకర్మాదికంబును దనకు యజ్ఞదీక్షాదికంబును బ్రేతజనులకు దహనాదికంబును మృతదివసంబున సాంవత్సరికంబును జరుపవలయు. 448

టీ. మర్త్య...గును=మానవసామాన్యులందును గొడ్డుగోదలు మొదలుగా సమస్తప్రాణులయందును, అంతర్యామి = లోనమిడిసియుండువాఁడు, బ్రాహ్మణానమం కు=బ్రాహ్మణులే నోరుగాఁగలవాఁడు, క్షేత్రజ్ఞునందుక్ = జీవరూపుఁడైన యీశ్వరునియందు, సంతర్పణంబు=మెప్పు, వ్యతీపాతంబు =ఒకయోగము, దినక్షయంబులు=అవమమొదలగునది, శ్రవణద్వాదశి=శ్రవణనక్షత్రముతోఁ గూడినయేకాదశి, తృతీయ=తదియ, అష్టకలు = శ్రాద్ధభేదములు, ప్రశస్తకాలము=పుణ్యపర్వకాలము, జననీ...లకుక్ = తల్లిదండ్రులు దాయాదులు మొదలుగా సర్వవర్గములబంధువులకును, శ్రాద్ధంబులు= (శ్రద్ధ చేసీయఁబడునవి) హిరణ్యాన్నశ్రాద్ధములును, జప...లును=తపస్సు హోమము పుణ్యతీర్థస్నానములు నోములును, దే...లును = దేవతాపూజలు బ్రాహ్మణసంతర్పణములును, ఆచరింపవలయుక్=చేయఁదగును, భార్యకుక్ =పెండ్లమునకు, పుంసవనాదికంబును=పుంసవనము (మగబిడ్డయేకలుగవలెనని చేయుకర్మము) సీమంతము మొదలయిన శుభకర్మను, అపత్యంబునకుక్ = బిడ్డకు, జాతకర్మాదికంబును=పుట్టినబిడ్డకుఁ జేయఁదగిన నామకరణము, కటిసూత్రధారణము,చౌలము కర్ణవేధము మొదలయిన శుభకర్మమును, తనకుక్, యజ్ఞదీక్షాదికంబును=క్రతువులో దీక్షఁ బూనుట మొదలయినది, ప్రేతజనులకుక్ = చనిపోయినసంబంధులకు, దహనాదికంబును=దహన సంచయన ప్రభృతి పావనసంస్కారంబులును, మృతదివసంబునక్= చనిపోయిన తిథియందు, సాంవత్సరికంబును = యేఁటేఁట జరపఁబడు శ్రాద్ధమును, జరపవలయును.

మ. వినుమే దేశములన్ దయాగుణతపోవిద్యాన్వితంబైన వి
ప్రనికాయంబు వసించు నేస్థలములన్ భాగీరథీముఖ్యవా
హినులుండున్ హరిపూజ లెయ్యెడల భూయిష్ఠప్రకారంబులం
దనరున్ భూవర యట్టిచోటులఁ దగున్ ధర్మంబులం జేయఁగన్.

టీ. భూవర = రాజా, వినుము, ఏదేశములన్ = ఏపుణ్యక్షేత్రములలో, దయా...న్వితంబు = కరుణ తపస్సు పాండిత్యము వీనితోఁగూడిన, విప్రనికాయంబు = బ్రాహ్మణ సంఘము, వసించున్ = కాఁపురముండునో, భాగీరథీముఖ్యవాహినులు = గంగ మొదలగు పుణ్యనదులు, ఉండునో, ఎయ్యెడలన్ = ఏతావులలో, హరిపూజ = విష్ణుపూజనము, భూయిష్ఠప్రకారంబునన్ = ఎక్కువ శ్రద్ధాభక్తుల కలయికతో, తనరున్ = పెంపొందునో, అట్టిచోటులన్ = అలాటిపుణ్యదేశములలో, ధర్మంబు = పేరును పెంపును గలిగించు ధర్మకార్యములు, చేయఁగన్ తగున్ = చేయవలయును.

తా. ధర్మరాజా! ఏక్షేత్రమున దయాతపస్సత్య శౌచాది సద్గుణసంతులైన బ్రహ్మవేత్తలగు బ్రాహ్మణు లుందురో, యెచ్చట గంగాది పుణ్యనదులు ప్రవహించుచుండునో, ఎచ్చట శ్రీహరికైంకర్యము విశేషభక్తిభావముతో జరుగుచుండునో అట్టిపావనస్థలములలోఁ జేయఁబడినధర్మము కొంచమైనను వటబీజమువడువున బహుళశాఖలమై వృద్ధినందును.

క. హరియందు జగము లుండును
హరిరూపము సాధుపాత్రమం దుండు శివం
కర మగుపాత్రము గలిగిన
నరయఁగ నది పుణ్యదేశ మనఘచరిత్రా. 450

టీ. అనఘచరిత్రా = పావనమైన నడవడిగల యోధర్మరాజా, హరియందున్ = విష్ణువునందు, జగములు = లోకములు, ఉండును, సాధుపాత్రమందున్ = యోగ్యమైన బ్రాహ్మణరూపక్షేత్రమందు, హరిరూపము =

విష్ణునిస్వరూపము, ఉండును, అరయంగన్ = విచారించంగా, శివంకరము = శుభము కలిగించునది, అగుపాత్రము = అయినపుణ్యబ్రాహ్మణుడు, కలిగినన్ = ఉన్న యెడల, అది = ఆమంచిపాత్రముగలది, పుణ్యదేశము = ఉత్తమమైనతీర్థస్థానము.

తా. రాజా! ఎల్లజగములు, శ్రీవిష్ణువునకు శరీరమైయుండును. ఆ విష్ణువో పావనమైన బ్రాహ్మణునియందు నివసించును. అట్టి యోగ్యుడై భగవద్భక్తుడైనబ్రాహ్మణుడున్నచోటు ఎల్ల తీర్థములకు మేలుబంతి యగును.

వ. మఱియుఁ గురుక్షేత్రంబును గయాశీర్షంబును బ్రయాగంబును బులహాశ్రమంబును నైమిశంబును ఫాల్గునంబును సేతువును బ్రభాసంబును గుశస్థలియును వారణాసియు మథురాపురియును బంపాబిందుసరోవరంబులును నారాయణాశ్రమంబును సీతారామాశ్రమంబును మహేంద్రమలయాదులైనకులాచలంబులును హరిప్రతిమార్చనప్రదేశంబులును హరిసేవాపరులైనపరమభాగవతులు వసించెడుపుణ్యక్షేత్రంబులును శుభకాములైనవారు సేవింపవలయు. 45

టీ. కురుక్షేత్రము = కురుపాండవులు యుద్ధముచేసిన తావు, గయాశీర్షము = గయాసురుని శిరస్సు గలపుణ్యదేశము, ప్రయాగము = త్రివేణీసంగమము గలచోటు, పులహాశ్రమము = పులహమహాముని యున్నచోటు, నైమిశంబు = ఒకయడవి, నారాయణాశ్రమము = నరనారాయణులు తపమొనర్చినతావు, సీతారామాశ్రమంబును, సీతయును రాముడును గొన్నాళ్లు కాపురముజేసిన పంచవటిలో నొకదేశము, హరిప్రతి...లును = విష్ణువిగ్రహపూజలు జరగెడు దివ్యదేవాలయస్థలములును, హరిసేవాపరులు = విష్ణుసేవచేయువారు, పరమభాగవతులు = ఉత్తములైనవిష్ణు

భక్తులు, వసించెడు పుణ్యక్షేత్రంబులును = ఉండెడు పావనస్థలములును, శుభకాముఁడు=మంగళమును గోరువాఁడు, సేవింపవలయున్ = వెళ్లి చూచి కొన్నాళ్లుండి యానందపడవలెను.

ఆ. భూవరేంద్ర యిట్టిపుణ్యప్రదేశంబు
లందు నరుఁడు సేయునట్టిధర్మ
మల్ప మైన నది సహస్రగుణాధిక
ఫలము నిచ్చు హరికృపావశమున. 452

టీ. భూవరేంద్ర=రాజుల కెల్ల రాజయిన యోధర్మరాజా, ఇట్టి, పుణ్యప్రదేశంబులందున్ = పావనస్థలములలోఁ జేయునట్టిధర్మము=పుణ్యకార్యము, అల్పము = కొంచెము, ఐనను, అ=అదిచేయఁబడిన ధర్మము, హరికృపావశమునన్ =విష్ణునిదయాబలము చేత, సహస్ర...ఫలమున్ = వేయిరెట్లు అతిశయమైన లాభమును, ఇచ్చును.

తా. ధర్మరాజా! ఇట్టి పుణ్యక్షేత్రములలో నేమానవుఁడైనను ధర్మ మేపాటిచేసినను వానియెడ శ్రీహరి కత్యంతకరుణ గలుగును గాన నాకారణముచేత వాఁడుచేసిన పుణ్యకార్య మెంతయల్పమైనను అది మహాఫల మిచ్చునది యగును.

వ. వినుము చరాచరం బయినవిశ్వమంతయు విష్ణుమయం బగుటం జేసి పాత్రనిర్ణయనిపుణు లైనవిద్వాంసులు నారాయణుండు ముఖ్యపాత్రం బని పలుకుదురు దేవఋషులును బ్రహ్మపుత్త్రు లైనసనకాదులును నుండ భవదీయరాజసూయంబున నగ్రపూజకు హరి సమ్మతుం డయ్యె ననేకజంతుసంఘాతసంకీర్ణం బైనబ్రహ్మాండపాదపంబునకు నారాయణుండు మూలంబు దన్నిమిత్తంబున నారాయణసంతర్పణం బు సకలజంతుసంతర్పణం బని యెఱుంగుము ఋషినరతి

ర్యగమరశరీరంబులు పురంబులు వానియందుఁ దారతమ్యం బులతోడ జీవరూపంబున భగవంతుం డయినహరి వర్తించు టంజేసి పురుషుం డనఁ బ్రసిద్ధుం డయ్యె నందుఁ దిర్యగ్జాతు లకంటె నధికత్వంబు పురుషునియందు విలసిల్లుటంజేసి పురు షుండు పాత్రంబు పురుషులలోన హరితను వైనవేదంబును ధరించుచు సంతోషవిద్యాతపోగరిష్ఠుం డైనబ్రాహ్మణుండు పాత్రంబు బ్రాహ్మణులలోన నాత్మజ్ఞానపరిపూర్ణుం డయిన యోగి ముఖ్యపాత్రం బని పలుకుదురు పరస్పరపాత్రంబులకు సహింపనిమనుష్యులకుఁ బూజనార్థంబుగాఁ ద్రేతాయుగం బునందు హరిప్రతిమలు గల్పింపఁబడియె కొందఱు ప్రతిమా ర్చనంబు సేయుదురు పాత్రపురుషద్వేషు లైనవారలకు నట్టిప్రతిమార్చనంబు ముఖ్యార్థప్రదంబు గాదు మందా ధికారులకుఁ బ్రతిమార్చనంబు పురుషార్థప్రదం బగును. 453

టీ. చరాచరము=కదలునది కదలనిది, అయిన, విశ్వమంతయుణ్= ప్రపంచమంతయును, విష్ణుమయంబు=శ్రీమన్నారాయణ స్వరూపము, పాత్ర నిర్ణయనిపుణులు=ఉత్తమానుత్తముల నేఱిగొను నేరవరులు, విద్వాంసులు=పం డితులు, నారాయణుండు=శ్రీమహావిష్ణువు, ముఖ్యపాత్రంబు=అనుత్తమమైన ధర్మనిక్షేపణస్థానము, దేవఋషులును, అమానుషలక్షణములుగల భృగ్వాది మునులు, బ్రహ్మపుత్త్రులు=బ్రహ్మకొడుకులు, సనకాదులు=సనకసనందన సనత్కుమార సనత్సుజాతులు, భవదీయ=నీసంబంధమైన, అగ్రపూజకుణ్= మొదటిగౌరవమునకు, హరి=కృష్ణుఁడు, సమ్మతుఁడు=ఒప్పుకొన్నవాఁ డు, అనేక...కీర్ణంబు=లెక్కలేని జంతువుల సమూహములచేఁ గిక్కిఱిసి యున్నది, ఐన, బ్రహ్మాండపాదపంబునకుణ్=బ్రహ్మాండ మను చెట్టునకు, నారాయణుండు=శ్రీమహావిష్ణువు, మూలంబు=ఉత్పత్తికారణము, తన్ని మిత్తంబునణ్=ఆకారణమువలన, నారాయణసంతర్పణంబు=విష్ణునిసమా

రాధనము, సకలజంతుతర్పణంబు=ఎల్లజంతువులను దృప్తిపఱచుట, ఋషి
...బులు=మునులు మనుజులు తిర్యగ్జంతువులు దేవతలు వీరిశరీరములు, పు
రంబులు=నగళ్లు, తారతమ్యంబులతోడన్=అంశలన్యూనాధికత్వములచేత, జీవరూపంబునన్ = జీవాత్మస్వరూపముతోడ, భగవంతుండు=షడ్గుణైశ్వర్యయుతుఁడు, వర్తించుటంజేసి=ఉండుటవలన, పురుషుండు=పురములోనుండువాఁడు, ప్రసిద్ధుఁడు=పేరుగాంచినవాఁడు, పురుషునియందున్=మానవునియందు, తిర్యగ్లోకంబునన్ = పశుపక్ష్యాదులకంటెను, అధికత్వము=గొప్పతనము, విలసిల్లుటంజేసి = ప్రకాశించుచున్నందున, పురుషుండు = మానవుఁడు, పాత్రంబు = యోగ్యవస్తువు లుంచఁదగినచోటు, హరితనువు = విష్ణునకు దేహతుల్యమైనది, ధరించుచున్ = తాల్చుచు, సంతోష...ష్టుండు=నిత్యతృప్తి చదువు తపము వీనిచే గొప్పవాఁడు, బ్రాహ్మణుండు = బ్రహ్మకులోత్పన్నుఁడు, పాత్రంబు = యోగ్యుఁడు, ఆత్మజ్ఞానపరిపూర్ణుండు = బ్రహ్మజ్ఞానసంపన్నుఁడు, యోగి = చిత్తనిరోధముగలవాఁడు, ముఖ్యపాత్రంబు=ఉత్తమోత్తమమైనపాత్రము, పరస్పరపాత్రంబులకున్=అన్యోన్యపాత్రములకు, సహింపని=ప్రియపడని, పూజనార్థంబుగాన్=పూజ సేయుటకుఁగా, త్రేతాయుగంబునందు, హరిప్రతిమలు=మృచ్ఛిలాదారురూపములగు విష్ణుమూర్తులు, కల్పింపంబడియెన్=నిర్మాణముచేయఁబడెను, ప్రతిమార్చనంబు=విగ్రహారాధనము, పాత్రపురుషద్వేషులు=యోగ్యులగు విష్ణురూపులైన పూజార్హులను, విరోధించువారలకు, అట్టి, ప్రతిమార్చనంబు=ప్రతిమరూపమును బూజించుట, ముఖ్యార్థప్రదంబు=ప్రధానఫలమునిచ్చునది, కాదు, మందాధికారులకున్=కొంచెముతెలివిగలిగి యింకను బరిపక్వముగాని యంతరంగము గలవారలకు, ప్రతిమార్చనంబు = ప్రతిమలనుబూజించుట, పురుషార్థప్రదంబు = ధర్మార్థకామముల నొసఁగునది.

ఆ. అఖిలలోకములకు హరి దైవతము సూడ
హరికి దైవతము ధరాధినాథ

పదపరాగలేశపంక్తిచేఁ ద్రైలోక్య
పావనంబు సేయు బ్రాహ్మణుండు. 454

టీ. ధరాధినాథ=భూపతీ, చూడఁగా=విచారింపఁగా, అఖిలలోకములకును=ఎల్లలోకములకును, హరి=శ్రీవిష్ణువు, దైవతము=దేవుఁడు, హరికిన్=విష్ణునకు, బ్రాహ్మణుఁడు, దైవము, కాన, వాఁడు, పద...చేన్=కాళ్లదుమ్మునందలి యణువులసమూహముచేత, త్రైలోక్యపావనంబు చేయున్=మూఁడులోకములను బవిత్రముగఁ జేయును.

తా. రాజా! సమస్తభువనములకు విష్ణువే దైవము. అవిష్ణువునకు బ్రాహ్మణుఁడు దైవము. కనుక ఆబ్రాహ్మణుఁడు యోగ్యుఁడౌనేని తనపాదధూళియందలి అణువులచేతనే సమస్తలోకములను పావనము చేయును.

వ. అట్టి బ్రాహ్మణజనులందుఁ గర్మనిష్ఠులుఁ దపోనిష్ఠులు వేదశాస్త్రనిష్ఠులు జ్ఞానయోగనిష్ఠులు నై కొందఱు వర్తింతు రందు జ్ఞాననిష్ఠుని కనంతఫలకాముఁ డైనగృహస్థుండు పితృజనుల నుద్దేశించి కవ్యంబులును దేవతల నుద్దేశించి హవ్యంబులును బెట్టుటకు ముఖ్యంబు దైవకార్యంబునకు నిరువుర నైన నొకరి నైనఁ బితృకార్యంబునకు మువ్వుర నైన నొకరి నైన భోజనంబు సేయింపవలయు ధనవంతుఁ డైనను శ్రాద్ధవిస్తారంబు గర్తవ్యంబు గాదు దేశకాలప్రాప్త కందమూలఫలాదికంబు లైనహరి నైవేద్యంబున విధిచోదితప్రకారంబుగా శ్రద్ధతోడఁ బాత్రంబునందుఁ బెట్టినయన్నంబు గామదంబు లయి యక్షయఫలకారి యగుధర్మతత్త్వవేది యైనవాఁడు శ్రాద్ధంబులందు మాంసప్రదానంబు సేయక భక్షింపక చరింపవలయుఁ గందమూలాదిదానంబున నయ్యెడిఫలంబు పశుహింసనంబున సంభవింపదు ప్రాణిహింస సేయక వర్తించు

టకంటె మిక్కిలి ధర్మంబు లేదు యజ్ఞవిదు లైనప్రోడలుని
ష్కాము లయి బాహ్యకర్మంబులు విడిచి యాత్మజ్ఞానదీపం
బులందుఁ గర్మమయంబు లయినయజ్ఞంబుల నాచరింతురు.

టీ. కర్మనిష్ఠులు = యాగాదికర్మలఁ జేయువారు, తపోనిష్ఠులు=తప స్సులను జేయువారు, వేదశాస్త్రనిష్ఠులు = వేదములయందును శాస్త్రములయందును నిరతులైనవారు, జ్ఞానయోగనిష్ఠులు = జ్ఞానసంగతియందుఁ దవిలియుండువారు, వర్తింతురు=మెలఁగుదురు, జ్ఞాననిష్ఠునికిన్=జ్ఞానమునఁ దవిలియున్నవానికి, అనంతఫలకామి=తుదగాంచనియర్థములగోరునట్టి, గృహస్థుండు=కాఁపు, పితృజనులను, ఉద్దేశించి=తలఁచి, కవ్యంబులను, పెట్టుట=ఇచ్చుట, ముఖ్యంబు=ఆవశ్యకము, దైవకార్యంబునకున్=దేవపూజకు, ఇరువురు=ఇద్దఱు, పితృకార్యంబునకున్ = తండ్రి తాతల తద్దినమునకు, ముగ్వురన్ ఐనన్, శ్రాద్ధవిస్తారంబు=శ్రాద్ధమందలి బ్రాహ్మణబాహుళ్యము, కర్తవ్యంబుకాదు=చేయఁదగదు, దేశ...కంబున్=తానుండుచోటునకు ఆకాలమునకుఁ దగినరీతిని దొరకిన దుంపలు వేళ్లు పండ్లు మొదలైనది, హరినైవేద్యంబునన్=విష్ణునివేదనమున, విధిచోదితంబు=గాన్ శాస్త్రోక్తప్రకారముగా, పాత్రంబు=పళ్లెరము, కామదంబు=కోరినదాని నొసఁగునది, అక్షయఫలకారి=నాశములేనిఫలమిచ్చునది, ధర్మతత్త్వవేది=ధర్మము నిజమెఱిఁగినవాఁడు, శ్రాద్ధంబులందున్=పితృమాత్రాదుల యాబ్దికములలో, మాంసప్రదానంబు సేయక=మాంసముఁ బెట్టక, భక్షింపక=తానుదినక, చరింపవలయున్=మెలఁగఁదగును, కందమూలాదిదానంబునన్=దుంపలు కాఁడలు బెట్టినందువలన, అయ్యెడిఫలంబు=కలుగుఫలము, పశుహింసవలనన్=జంతువులను వికసించుటవలన, సంభవింపదు=కలుగదు, ప్రాణిహింస=జీవవధము, ధర్మంబు=మంచిపని, యజ్ఞవిదులు=యాగవిధినిదెలిసినవారు, ప్రోడలు=నేర్పరులు, నిష్కాములు=కోరికలులేనివారు, బాహ్యకర్మంబులు=పయియెలుఁగుపనులు, ఆత్మ...లందున్=బ్రహ్మజ్ఞానాగ్నులయందు, కర్మంబులు=క్రియారూపములు, ఆచరింతురు=చేయుదురు.

క. పశువులఁ బొరిగొని మఖములు
విశదములుగఁ జేయుబుధుని వీక్షించి తమున్
విశసనము సేయునో యని
క్రశిమన్ బెగడొందు భూతగణము నరేంద్రా. 456

టీ. నరేంద్రా=రాజా, పశువులన్=అజాదిజీవులను, పొరిగొని=విశసనముచేసి, మఖములు=యాగములు, విశదములుగన్=ప్రకాశములుగా, చేయువిబుధునిన్=చేయుచున్నపండితుని, వీక్షించి=చూచి, భూతగణములు=జంతుజాలములు, తమున్=తమ్ముఁగూడ, విశసనము సేయునో=చంపునేమో, అని, క్రశిమన్=సందుటచేత, బెగడొందున్ = ఉత్తలపడును.

తా. రాజా! ఎప్పుడు చూచినను పశువులను విశసించి యజ్ఞములు చేయు నయ్యాగారిని జూచి యెల్లజీవులును దమనుగూడ ఆయన యట్లే చంపి క్రతువులు సేయునేమో యని విశేషముగా భీతిల్లి కలవరముఁ జెందుచుండును.

వ. అది గావున ధర్మవేది యయినవాఁడు దైవప్రాప్తంబు లయిన కందమూలాదికంబులచేత నిత్యనైమిత్తికక్రియలఁ జేయవలయు నిజధర్మబాధకం బయినధర్మంబును బరధర్మప్రేరితం బయినధర్మంబును నాభాసధర్మంబును బాషండధర్మంబును గపటధర్మంబును ధర్మజ్ఞుం డయినవాఁడు మానవలయు నైసర్గికధర్మంబు దురితశాంతిసమర్థం బగు నిర్ధనుండు ధర్మార్థంబు యాత్ర సేయుచు నైన ధనంబు గోరవలవదు జీవనోపాయంబునకు నిట్టట్టుఁ దిరుగక కార్పణ్యంబు లేక జీవించు మహాసర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముం డై యెద్దియుం గోరక బ్రదికెడిసుగుణునికిం గలసుఖంబు గామలోభంబుల దశదిశలం బరిధావనంబు సేయువానికి సిద్ధింపదు పాదరక్షలు గలవానికి శర్కరాకంటకాదులవలన

భయంబు లేక మెలంగ నలవడుభంగిఁ గామంబులవలన నివృత్తి గలవానికి నెల్ల కాలంబును భద్రం బగునుపస్థమునకును జిహ్వాదైన్యంబునకును బుభుక్షుండు గృహపాలకశునకంబుకై వడి సంచరించుచు సంతుష్టి లేక చెడు సంతోషి గాని విప్రునివిద్యాతపోవిభవయశంబులు నిరర్థకంబు లగు నింద్రియలోలత్వంబున విజ్ఞానంబు నశించు సకలభూలోకభోగంబులు భోగించియు దిగ్విజయంబు సేసియు బుభుక్షాపిపాసలవలనఁ గామపారంబును హింసవలనఁ గ్రోధపారంబును జేరుట దుర్లభంబు సంకల్పవర్జనంబునఁ గామంబును గామవర్జనంబునఁ గ్రోధంబును నర్థానర్థదర్శనంబున లోభంబును నద్వైతానుసంధానంబున భయంబును నాత్మానాత్మవివేకంబున శోకమోహంబులును సాత్త్వికసేవనంబున దంభంబును మౌనంబున యోగాంతరాయంబును శరీరవాంఛ లేమిని హింసయు హితాచరణంబున భూతజం బయినదుఃఖంబును సమాధిబలంబున దైవికవ్యథయు ప్రాణాయామాదికంబున మన్మథవ్యథయు సాత్త్వికాహారంబుల నిద్రయు సత్త్వగుణంబున రజస్తమంబులును నుపశమంబున సత్త్వంబును గురుభజనకుశలుండై శీలంబున జయింపవలయు.

టీ. ధర్మవేది = ధర్మతత్త్వమెఱిఁగినవాఁడు, దైవప్రాప్తంబులు = దైవవశమున దొరకునవి, కందమూలాదికంబులచేతన్ = గడ్డలువేళ్లు మొదలగువానిచేత, నిత్యనైమిత్తిక క్రియలన్ = నిత్యములయినవైశ్వదేవాదులను నిమిత్తప్రాప్తములైన హవ్యకవ్యములను, ధర్మజ్ఞుండు = ధర్మరహస్య మెఱిఁగినవాఁడు, ఐనవాఁడు, నిజధర్మబాధకంబు = తనసనాతనకులధర్మమును జెఱచునది, పరధర్మప్రేరితము = ఇతరధర్మముచేఁ బ్రేరేపఁబడినది, ఆభాస

ధర్మంబు = నైసర్గికధర్మంబు = సహజమైనధర్మము, దురితశాంతిసమర్థంబు = పాపముల నణఁపఁజాలునది, నిర్ధనుండు = బీద, ధర్మార్థంబు = ధర్మముకొఱకు, యాత్ర = పుణ్యక్షేత్రగమనము, చేయుచుఁ ఐనను, జీవనోపాయంబునకుఁ = బ్రతుకుదెరువునకు, కార్పణ్యంబు = నీచత్వము, (దైన్యము) మహాసర్పంబుతెఱంగునఁ = పెద్దపామువలె, ఆత్మారాముండు = తనలోఁ దాఁ గ్రీడించువాఁడు, బ్రదికెడిసుగుణునికిఁ = జీవించునీతిపరునకు, కామలోభంబులఁ = కోరికలచేత, ఆశచేతను, పదిదిశలఁ = పదిదిక్కులందును, పరిధావనంబు సేయువానికిఁ = పరుగెత్తువానికి, సిద్ధింపదు = కుదురదు, పాదరక్షలు = చెప్పులు, శర్కరాకంటకాదులవలనఁ = గులకరాళ్లు ముండ్లుమొదలగువానివలన, మెలంగఁ = నడచుటకు, అలవడు భంగిఁ = వీలైనట్లుగా, నివృత్తి = మరలుపాటు, భద్రము = కుశలము, (దుఃఖనాశము,) పురుషుండు = మానవుఁడు, గృహపాలశునకంబు కైవడిఁ = ఇంటఁగావలియుండు కుక్కవలె, ఉపస్థమునకును = గ్రామ్యధర్మముకొఱకును, జిహ్వాదైన్యంబునకును = నోటివాఁపిరిగొట్టుతనమునకును, సంచరించుచుఁ = తిరుగుచు, సంతుష్టి = తృప్తి, లేక, చెడును, విద్యా...బులు = చదువు తపము ఐశ్వర్యము కీర్తియు, నిరర్థకంబులు = కొరమాలినవి, ఇంద్రియలోలత్వంబునఁ = ఇంద్రియప్రీతిచేత, విజ్ఞానంబు = తెలివి, నశించును, సకల...బులు = పుడమిలోఁగలయెల్లసుఖములు, భోగించియుఁ = అనుభవించియును, బుభుక్షాపిపాసలవలనఁ = ఆఁకలిదప్పులవలన, కామపారంబును = కోర్కెల తుదను, హింసనలనఁ = జీవసంహారమువలన, క్రోధపారంబును = కోపము తుదను, చేరుట = చెందుట, దుర్లభంబు = పొందరానిది, సంకల్పవర్జనంబునఁ = మనోరథముల నుజ్జగించుటచేత, కామంబును = కోరికను, కామవర్జనంబునఁ = కోరికలవీడుటచేత, క్రోధంబును = కోపమును, అర్థానర్థదర్శనంబునఁ = నిత్యానిత్యవస్తువివేకముచేత, లోభంబును = పిసినారితనమును, అద్వైతానుసంధానంబునఁ = జీవేశ్వరుల యేకత్వభావనముచేత, భయమును, (సుఖదుఃఖభాజనుఁడై సంసారమున మ్రగ్గి ప్రతిదానివలన భయపడుజీ

వుఁడు తానే బ్రహ్మము తనవలననే దేహాదులు కల్పితములు గావున దేనికి భయమందరాదని తెలుసుకొన్న తర్వాత యెందునను భయము లేదని తా.) ఆత్మానాత్మవివేకంబునన్ = ఆత్మయొక్కయు అనాత్మయొక్క విచారముచేత, శోకమోహంబులును = దుఃఖము అజ్ఞానమును, సాత్త్వికసేవనంబునన్ = సాధుసాంగత్యముచేత, దంభంబును = డాంబికవృత్తిని, మౌనంబునన్ = మితభాషణమున, యోగాంతరాయంబును = నియమబాధయును, శరీరవాంఛ = ఒడలియందలి ప్రేమ, హింస = ప్రాణిహింసయును, హితాచరణంబునన్ = సర్వజంతువులయందును సమముగా వర్తించుటచేత, భూతజంబు = జంతువులనుండి కల్గినది, సమాధిబలంబునన్ = నియమధారణ ప్రభావముచేత, దైవికవ్యథయున్ = యాదృచ్ఛాప్రాప్తమైన దుఃఖమును, ప్రాణాయామాదికంబునన్ = ప్రాణనిరోధము మొదలయినదానిచేత, మన్మథవ్యథయున్ = కామవికారమును, సాత్త్వికాహారంబులన్ = సత్త్వగుణవర్ధకములయిన భోజనములచేత, నిద్రయును, సత్త్వగుణంబునన్, రజస్తమంబులును, ఉపశమంబునన్ = ఓర్పుచేత, సత్త్వంబును = బలోద్రేకమును, గురుభజనశీలుఁడై = పెద్దలసేవించు నైజముగలవాఁడై, శీలంబును = స్వభావమును, జయింపవలయున్ = నిగ్రహించవలయును.

క. హరిమహిమ దనకుఁ జెప్పిన
గురువున్ నరుఁ డనుచుఁ దలఁచి కుత్సితభక్తిం
దిరుగుపురుషుశ్రమ మెల్లను
కరిశౌచముక్రియ నిరర్థకం బగు నధిపా. 458

టీ. అధిపా = రాజా, తనకున్, హరిమహిమ = దేవదేవుఁడైన విష్ణుని ప్రభావము, చెప్పినగురువున్ = విప్పియుపదేశించినదేశికుని, నరుఁడు = మానవసామాన్యుఁడు, అనుచును, తలఁచి = భ్రమపడి, తిరుగు, పురుషుని, శ్రమము = తానుత్తమగతికేఁగుటకై చేయుయత్నమంతయు, కరిశౌచముక్రియన్ = గజస్నానప్రక్షాళనమువలె, నిరర్థకము = కొఱమాలినది, అగును. (ఏనుఁగు ఎంతనీ

ళ్లలోఁబడి మునిఁగినను గట్టునకు రాఁగానే మరల మదముకాటియాఁగలు తుమ్మెదలు ముసిరి యాత్మాళనము వ్యర్థపోయి గోఁతకొట్టుచుండును.

తా. రాజా! ఎవఁడు తనకు విష్ణుమహత్త్వముపదేశించి మేలొనర్చి నగురువును దనతోడిమనుజునిగాఁ దలఁచునో వాఁడుత్తమగతిఁ జేఁగుట కెన్ని పాట్లుబడినను అవియెల్ల వ్యర్థములే యగును.

ఉ. ఈవనజాతనేత్రుఁ బరమేశు మహాత్ముఁ బ్రధానపూరుషున్
దేవశరణ్యు సజ్జనవిధేయు ననంతుఁ బురాణయోగిసం
సేవితపాదపద్ముఁ దమచిత్తములన్ నరుఁ డంచు లోకు లి
చ్ఛావిధిఁ జూచు చుండుదురు సన్మతి లేక నరేంద్రచంద్రమా.

టీ. నరేంద్రచంద్రమా=రాజశ్రేష్ఠుఁడా, లోకులు=జనులు, సన్మతి=మంచితెలివి, లేక, తమచిత్తములన్=తమమనస్సులలో, ఈవనజాతనేత్రుఁడు=తామరలవంటికన్నులుగల యీవిష్ణువును, పరమేశున్=పరాత్పరుని, మహాత్మున్=మహానుభావుని, ప్రధానపూరుషున్=కూటస్థుని, దేవశరణ్యున్=దేవతలకుఁ గాపుదలయైనవానిని, సజ్జనవిధేయున్ = పూజ్యులకు వశమైనవానిని, అనంతున్=నాశములేనివానిని, పురాణ...పద్మున్=పూర్వపుమునీంద్రులచేఁ గొలువఁబడిన యడుగుఁదామరలుగలవానిని, విష్ణుని, నరుఁడు=సామాన్యమనుజుఁడు, అంచున్=అనితలఁచుచు, ఇచ్ఛావిధిన్=తమయిచ్ఛవచ్చినట్లు, చూచుచుండుదురు.

తా. ధర్మరాజా! లోకములోఁ గొందఱు మూఢమానవులు జ్ఞానవిహీనులై మహామహిముఁడైనయీకృష్ణపరమాత్మను తమతోడిమానవునిగా భావించుచుందురు.

వ. వినుము షడింద్రియంబులలోన నొకటియందుఁ దత్పరులై యిచ్ఛాపూరణవిధానంబులఁ జరితార్థుల మైతి మనువారలు ధారణాభ్యాససమాధియోగంబుల సాధింప లేరు కృషిప్రముఖంబులు సంసారసాధనంబులుగాని మోక్షసాధనంబులు గా

వు కుటుంబసంగంబునఁ జిత్తవిక్షేపం బగుఁ జిత్తవిజయప్రయత్నంబున సన్న్యసించి సంగంబు వర్జించి మితం బయినభిక్షాన్నంబు భక్షించుచు శుద్ధవివిక్తసమప్రదేశంబున నొక్కచో నాసీనుండై సుస్థిరత్వంబునఁ బ్రణవోచ్చారణంబు సేయుచు రేచకపూరకకుంభకంబులఁ బ్రాణాపానంబుల నిరోధించి కామహతం బయినచిత్తంబునఁ బరిభ్రమణంబు మాని కామవిసర్జనంబు సేసి మరలునంతకు నిజనాసాగ్రనిరీక్షణంబు సేయుచు నివ్విధంబున యోగాభ్యాసంబు సేయువాని చిత్తంబు గాష్ఠరహితం బయినవహ్ని తెఱంగున శాంతిం జెందుఁ గామాదులచేత వేధింపంబడక ప్రశాంతసమస్తవృత్తం బయిన చిత్తంబు బ్రహ్మసుఖసంస్పర్శనంబున లీనంబై మఱియు నెగయ నేరదు. 460

టీ. షడింద్రియంబులలోనన్ = ఆఱింద్రియములలో, ఒకదానియందు, తత్పరులై = ఆసక్తితోఁగూడినవారై, ఇచ్ఛాపూరణవిధానంబులన్ = కోరికదీర్చుకొను పనులచేత, చరితార్థులము = కృతకృత్యులము, ఐతిమి, అనువారలు, ధార...బులన్ = ఒకవిషయమును జ్ఞాపకమందుంచుకొనుట, కష్టముల సహించుకొనుట నియమములూనుట యనివిధులను, సాధింపలేరు, కృషిప్రముఖంబులు = దున్ని పైరుబెట్టుకొనుటమున్నగునవి, సంసారసాధనంబులు కాని = కూడుగుడ్డల సంపాదించుకొనుటకుఁ జాలినవే కాని, మోక్షసాధనంబులు = బంధవిముక్తికిఁ జాలినవి, కావు, కుటుంబసంగంబునన్ = దారాపుత్త్రాదిభరణప్రయాసముచేత, చిత్తవిక్షేపంబు = మనసుకలఁత, చిత్త...బునన్ = మనస్సును జయించుప్రాన్కితో, సన్న్యసించి = సర్వకర్మపరిత్యాగము గావించి, సంగంబు = తగులము, వర్జించి = వదలి, మితము = హెచ్చుతగ్గులు లేనిది, భిక్షాన్నము = బిచ్చపుఁగూడు, భక్షించుచున్ = తినుచు, శుద్ధ...బునన్ = నిర్మలమై యేకాంతమై నిమ్నోన్నతముకానిచోట, ఒక్కచోన్ = ఒక్క

యెడ, ఆసీనుండై=కూర్చున్నవాఁడై, సుస్థిరత్వంబునన్=కదలనిపూనికతో, ప్రణవోచ్చారణంబు=ఓంకారజపము, రేచకపూరకకుంభకంబులన్=విడుచుట నింపుట స్తంభించుటలచే, ప్రాణాపానంబులన్=ఊర్ధ్వాధశ్శ్వాసములను, నిరోధించి=బంధించి, కామహారంబు=మనోరథదూషితము, పరిభ్రమణంబు=త్రిప్పుడు, మాని=వదలి, కామవిసర్జనంబు=కోరికలవిడుమర, మరలుసంతతమున్=ప్రాణములు స్వస్థానమునకుఁ జేర్చునంతవఱకు, నిజనాసాగ్రవీక్షణంబుచేయుచు=తనముక్కుకొనఁజూచుకొనుచు, ఇవ్విధంబునన్=ఈలాగున, యోగాభ్యాసంబు=చిత్తవృత్తినిరోధముచేయునలవాటు, కాష్ఠరహితంబు=కట్టెలులేనిది, వహ్ని తెఱంగునన్=నిప్పువలె, శాంతిన్ చెందును=శమించును, కామాదులచేతన్=కోరికకోపముమొదలగువానిచేత, వేధింపంబడక=బాధజెందక, ప్రశాంతసమవృత్తంబు=నెమ్మదితోడి సమభావము గల, బ్రహ్మసుఖసమ్మర్శనంబునన్=బ్రహ్మానందానుభవవిచారమునందు, లీనంబు=లగ్నమయినది, ఐ, మఱియున్=క్రమ్మఱ, ఎగఱనేరదు=విషయములమీఁదికి రేఁగిపోఁజాలదు.

మ. ధరణీదేవుఁడు సన్న్యసించి యతియై ధర్మార్థకామంబులం
బరివర్జించి పునర్విలంబమునఁ దత్ప్రారంభియౌనేని లో
భరతిం గ్రక్కినకూడు మంచి దనుచున్ భక్షించి జీవించుదు
ర్నరుచందంబున హాస్యజీవనుఁ డగున్ నానాప్రకారంబులన్.

టీ. ధరణీదేవుఁడు=బ్రాహ్మణుఁడు, సన్న్యసించి=కర్మలను వదలి, యతి=యోగి, ధర్మా...బులన్=ధర్మఅర్థకామములను, పరివర్జించి=విడిచి, విలంబమునన్=తడవుగా, కాలాంతరమున, పునః=మరల, తత్ప్రారంభియౌనేనిన్=ఆవదలిన కర్మబంధములను మరలఁ దగిలించుకొనెనేని, లోభరతిన్=పిసినిగొట్టుతనముచేత, క్రక్కినకూడు=వాంతిచేసికొన్న యన్నము, మంచిది, అనుచున్, భక్షించి=తిని, జీవించుదుర్నరుచందంబునన్=బ్రతుకునీచమానవునివిధమున, నానాప్రకారంబులన్=పలుతెఱఁగుల, హాస్యజీవనుఁడు=పరిహసించఁ దగినబ్రతుకుగలవాఁడు, అగును.

తా. రాజా! బ్రాహ్మణుఁడు సర్వకర్మలను విడలి యతీశ్వరుఁడై ధర్మకామార్థములఁ బరిత్యజించి సుఖపడియు మరల మాయాబద్ధుఁడై కాలాంతరమున లోభియై మరల నీ ముతికిగుంటలోఁ బడి వాని నారంభించెనా వానిబ్రతుకు కక్కినకూడు మంచి దని తినినవానిబ్రతుకువలె పరిహాసము పాలగును.

క. మలమునఁ గ్రిమియును బడుక్రియ
నిలఁ బడు నొడ లాత్మగాదు హేయం బనుచుం
దెలఁతురు తజ్ఞులు పొగడుదు
రలసత నొడ లాత్మ యనుచు నజ్ఞు లిలేశా. 462

టీ. ఇలేశా=భూపతీ, క్రిమి=పురుగు, మలమునన్=విష్ఠలో, పడుక్రియన్=పడువిధమున, ఒడలు=దేహము, ఇలన్=నేలమీఁద, పడును, ఆత్మ=పరమాత్మ, కాదు, దీనిని, తజ్ఞులు = వస్తుస్వరూపము దెలిసినవారు, హేయంబుఅనుచున్=పాఱవేయఁదగినతుచ్ఛవస్తువని, తెలంతురు, అజ్ఞులు=తెలియనివారు, అలసతన్=మాంద్యముచేత, ఒడలు=శరీరమే, ఆత్మ=నిత్యమైన పరవస్తువు, అనుచును, పొగడుదురు=మెచ్చుకొందురు.

తా. రాజా! ఈ దేహము మలములోఁబడు పురుగులాగున నెప్పుడో పడిపోవు పరిహరించఁదగిన తుచ్ఛవస్తువేకాని ఆత్మకాదు అని దాని స్వరూపమెఱిఁగినవారు దానియెడఁ బ్రీతినుంచరు. మాయామోహితులైన మూఢులో ఇదియే నిత్యమైన దని ఎక్కువ దురభిమానముతో నీ దేహమందు మోహపడియుందురు.

ఆ. వ్రతము మానఁ దగదు వటుఁగుఁగుఱ్ఱనికిని
గ్రియలు మానఁ దగదు గృహగతునికి
దపసి కూర నుండఁ దగదు సన్న్యాసికిఁ
దరుణితోడిపొత్తు దగదు తగదు. 463

టీ. వడుగుఁగుఱ్ఱనికిని = బ్రహ్మచారిపిల్లకాయకు, వ్రతము=తనయాశ్రమమునకుఁ దగిన నియమము, మానఁ దగదు=విడువరాదు, గృహగతునికిన్=గృహస్థధర్మము నవలంబించియున్నవానికి, క్రియలు=నిత్యనైమిత్తికాదిక్రియలు, మానఁదగదు=విడువరాదు, తపసికిన్=తపోనిష్ఠకలవానికి (వానప్రస్థునకు), ఊరన్=గ్రామమందు, ఉండన్ తగదు = నిలువరాదు, సన్న్యాసికిన్ = యతికి, తరుణితోడిపొత్తు = స్త్రీతోడిసాంగత్యము, తగదు తగదు.

తా. రాజా! ఎన్ని సంకటములు వచ్చినను బ్రహ్మచారి తనయాశ్రమమునకు విహితములైన మౌంజీదండాజినాదులను ధరించుట గురుకులవాసము జేయుట మొదలయినధర్మములు విడువరాదు. గృహస్థుఁడు తన యాశ్రమోచిత మైన పంచయజ్ఞములు అతిథిపూజనము మొదలైనకర్మలను విడువక చేయుచుండవలెను. తపస్సు జేయువాఁడు గ్రామములో నివసింపఁగూడదు. యతియైనవాఁడు స్త్రీలను కనులతోనైనఁ జూడరాదు.

సీ. రథము మే నెల్ల సారథి బుద్ధి యింద్రియ
గణము గుఱ్ఱములు పగ్గములు మనము
ప్రాణాదిదశవిధపవనంబు లిరుసు ధ
ర్మాధర్మగతులు రథాంగకములు
బహుళేతరం బైనబంధంబు చిత్తంబు
శబ్దాదికములు సంచారభూము
లభిమానసంయుతుం డయినజీవుఁడు రథి
ఘనతరప్రణవంబు కార్ముకంబు
తే. శుద్ధజీవుండు బాణంబు శుభద మైన
బ్రహ్మమంచితలక్ష్యంబు పగలు రాగ
భయమద ద్వేషశోకలోభప్రమోహ
మానమత్సరముఖములు మానవేంద్ర. 464

టీ. మానవేంద్ర=రాజా, మేనెల్లన్=ఒడలంతయు, రథము=బండి, బుద్ధి, సారథి=రథమునడపువాఁడు, ఇంద్రియగణము= బాహ్యాంతరింద్రియముల సమూహము, గుఱ్ఱములు, మనము=చిత్తము, పగ్గములు, ప్రాణా... బులు=ప్రాణాపానాదులు, ధనంజయనాగకూర్మాదులు, ఇరుసు, ధర్మాధర్మగతులు = న్యాయాన్యాయవర్తనములు, రథాంగకములు=బండికండ్లు, చిత్తంబు, బహుళతరంబు=పెద్దది, బంధంబు=మోకుముడి, (పన్నగము)శబ్దాదికములు=శబ్దస్పర్శరూపరసగంధములు, సంచారభూములు=రథముతిరుగుడుతావులు, అభిమానసంయుతుండు=నేనునాదియనునహంకారముతోఁగూడినవాఁడు, అయిన, జీవుఁడు, రథి=రథమందుండుప్రధానపురుషుఁడు, ఘనతరప్రణవంబు=గొప్పఓంకారము, కార్ముకంబు=విల్లు, శుద్ధజీవుండు=నిర్మలుండైనజీవాత్మ, బాణంబు=అమ్ము, శుభదము=మోక్షసుఖదాయకము, పరబ్రహ్మము, అంచిత లక్ష్యంబు=ఒప్పిదమైనగుఱి, రాగ... ములు=తగులము భయము పొగరు పగ దుఃఖము ఆశ మోహము అభిమానము పరశ్రేయస్సహనము లేమి మొదలైనవి, పరులు=చంపఁదలఁచిన శత్రువులు.

తా. ధర్మరాజా! రథముతోఁ బోల్పఁబడిన యీ దేహమునకు బుద్ధి రథమునడపు సారథి. ఇంద్రియములన్నియు గుఱ్ఱములు. మనోవికారములు పగ్గములు. ప్రాణాదివాయువులు రథమును నిలుపుటకు నాధారమైనయిరుసు. న్యాయాన్యాయములు బండికండ్లు. చిత్తము మోకుతోఁ గట్టెడుముడి. శబ్దస్పర్శరూపాదులు రథము తిరుగుచోట్లు. అహంకారముతోఁగూడినజీవుఁడు రథికుఁడు. ఓంకారము విల్లు. అహంకారములేని నిర్మలజీవుఁడు బాణము. పరమాత్మ గుఱి. రాగద్వేషాదులు శత్రువులు.

వ. ఇట్లు మనుష్యశరీరరూపం బయినరథంబు దనవశంబు సేసి కొని మహాభాగవత చరణకమలసేవానిశితం బయినవిజ్ఞాన ఖడ్గంబు ధరియించి శ్రీమన్నారాయణకరుణావలోకనబలం బున రాగాదిశత్రునిర్మూలనంబు గావించి ప్రణవబాణాసనం

బున శుద్ధజీవశరంబును సంధించి బ్రహ్మ మనియెడిగుఱియం
దుఁ బడవేసి యహంకారరథికుండు రథికత్వంబు మాని నిజా
నందంబున నుండ వలయు నట్టివిశేషంబు సంభవింపనిసమ
యంబున బహిర్ముఖంబు లయినయింద్రియఘోటకంబులు
బుద్ధిసారథిసహితంబు లై స్వాభిమానరథికునిప్రమత్తత్వంబు
దెలిసి ప్రవృత్తిమార్గంబు నొందించి విషయశత్రుమధ్యంబు
నం గూల్చిన. 465

టీ. మనుష్యశరీరరూపంబు=మానవుదేహమనునది, రథంబు=బండి
ని, తనవశంబు=తనయాధీనము, చేసికొని, మహా...శితంబు=ఉత్తములైన
విష్ణుభక్తుల పాదకమలములను సేవించుటచే మాంద్యము దెగి పదునుగలిగిన,
విజ్ఞానఖడ్గంబు = బ్రహ్మజ్ఞాన మనుకత్తిని, ధరియించి=తాల్చి, శ్రీమ...బు
నన్=శ్రీహరికృపావలంబనసామర్థ్యముచేత, రాగాదిశత్రునిర్మూలనంబు=
రాగము మొదలగుపగతుల నాశనమును, కావించి=చేసి, ప్రణవబాణాసనం
బునన్=ఓంకారమను వింటియందు, శుద్ధజీవశరంబును=రాగాదులులేక నిర్మ
లుఁడైన జీవుఁడను వాఁడిబాణమును, సంధించి=గుచ్చి, బ్రహ్మము=పర
మాత్మ, అనియెడిగుఱియందు పడవేసి, జీవేశ్వరులయందు భేదబుద్ధిమాని
జీవునకు బ్రహ్మతో నైక్య మనుసంధించి, అహంకార రథికుండు=అహంకార
యుక్తుఁడైన జీవుఁడను రథగతపురుషుఁడు, రథికత్వము=రథికుఁడౌట, మా
ని, నిజానందంబునన్=సహజమైన బ్రహ్మానందమునందు, ఉండవలయును,
అట్టివిశేషంబు=అలాటిభాగ్యము, సమయంబునన్=వేళయందు, బహిర్ము
ఖంబులు=వెలిమొగముచున్న, ఇంద్రియఘోటకంబులు=ఇంద్రియము లనుగుఱ్ఱ
ములు, బుద్ధి...బులై=బుద్ధి యనుసారథితోఁ గూడి, స్వాభిమానరథికుని ప్ర
మత్తత్వంబు=తమ అహంకారసహితుఁ డగుజీవుఁ డనురథికునియొక్క ఏమ
ఱికను, తెలిసికొని, ప్రవృత్తిమార్గంబున్=కర్మములత్రోవను, ఒందించి=

పొందించి, తప్పదారి కీడ్చుకొనిపోయి యనుట. విషయశత్రుమధ్యంబునన్ = స్రక్చందనాది ఇంద్రియార్థములనెడు శత్రువులనడుమను, కూల్చినన్ = త్రెళ్లవేయఁగా.

ఆ. విషయశత్రులెల్ల విక్రాంతితోడ సా
రథిసమేతుఁ డయినరథికుఁ బట్టి
యుగ్రతిమిరమృత్యుయుత మగుసంసార
కూపమధ్యమందుఁ గూల్తు రధిప. 466

టీ. అధిప=రాజా, విషయశత్రులుఎల్లన్ =పూవులు చందనము స్త్రీలు మొదలగు నింద్రియార్థము లనుపగతులందఱును, విక్రాంతితోడన్ =పరాక్రమముతో, సారథిసమేతుఁడు=బుద్ధి సూతునితోఁగూడిన, రథికున్ =సాహంకార జీవుఁడను రథస్థుని, పట్టి, ఉగ్రతిమిరమృత్యుయుతము=చావనుభయంకరమైన కాఱుచీఁకటితోఁగూడిన, సంసారకూపమధ్యమందున్ =సంసారమను బావినడుమ, కూల్తురు.

తా. రాజా! యి ట్లేమఱిన జీవుని ఇంద్రియార్థము లనుపగతులందఱుఁ జుట్టుముట్టికొని సారథితోఁగూడ నీరథికునిఁ బట్టి భయంకరమై మృత్యువనుమహాంధకారముచే బంధురమైనపాడునూతిలోఁ ద్రోసివేయుదురు.

వ. వినుము వైదికకర్మంబు ప్రవృత్తంబును నివృత్తంబును నన రెండుదెఱంగు లయ్యె నందుఁ బ్రవృత్తంబునఁ బునరావర్తనంబును నివృత్తంబున మోక్షంబును సిద్ధించుఁ బ్రవృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబు లన రెండుమార్గంబులు గల వందు హింసాద్రవ్యమయకామ్యరూపంబు లయినదర్శపూర్ణమాస పశు వైశ్వదేవ బలిహోమప్రముఖంబులైన యాగాదికంబు లిష్టంబులు దేవతాలయ వనకూపతటా

కప్రముఖంబులు పూర్తంబులు ప్రవృత్తికర్మంబున దేహంబు విడిచి దేహాంతరారంభంబున దేహి హృదయాగ్రంబున వెలుఁగు వానితోడ నింద్రియంబులుం గూడ భూత సూక్ష్మయుక్తుం డై ధూమదక్షిణాయన కృష్ణపక్ష రాత్రి దర్శంబులవలన సోమలోకంబుఁ జేరి భోగావసానంబున విలీనదేహుం డై వృష్టిద్వారంబునఁ గ్రమంబున నోషధిలతాన్న శుక్ల రూపంబులం బ్రాపించి భూమియందు జన్మించు నిది పునర్భవరూపం బయినపితృమార్గంబు నివృత్తకర్మనిష్ఠుం డయినవాఁడు జ్ఞానదీప్తంబు లయిన యింద్రియంబులందుఁ గ్రియాయజ్ఞంబుల యజించి యింద్రియంబుల దర్శనాదిసంకల్పమూలం బయిన మనంబునందు వికారయుక్తం బయినమనంబును వాక్కునందు విద్యావిలక్షణ యయిన వాక్కును వర్ణసముదాయంబునందు వర్ణసముదాయంబును నకారాదిస్వరత్రయాత్మకం బయిన యోంకారంబునందు నోంకారంబును బిందువందు బిందువును నాదంబునందుఁ నాదంబును బ్రాణంబునందుఁ బ్రాణంబును బ్రహ్మమందు నిలుపవలయును దేవమార్గం బయినయుత్తరాయణ శుక్ల పక్ష దివాప్రాహ్ణ పూర్ణిమా రాకలవలన సూర్యద్వారంబున బ్రహ్మలోకంబునందుఁ జేరి భోగావసానంబున స్థూలోపాధి యైనవిశ్వుం డై సూక్ష్మంబునందు లయించి సూక్ష్మోపాధి యైనతైజసుం డై సూక్ష్మంబును గారణం

బునందు లయించి కారణోపాధి యైనప్రాజ్ఞుండై కారణాంబును సాక్షిస్వరూపంబునందు లయించి తుర్యుండై సూక్ష్మలయంబునందు శుద్ధాత్ముండై యివ్విధంబున ముక్తుండగును. 457

టీ. వైదిక కర్మంబు=వేదోక్తమైన కర్మము, ప్రవృత్తంబు=కర్మమార్గావలంబకమును, నివృత్తంబు=మోక్షమార్గావలంబకి మును, అనఁగ = అనువిధముగా, రెండు, తెఱఁగులు=రకములు, అయ్యెను. అందుఁగ=వానిలోఁ, ప్రవృత్తంబునఁగ=కర్మమార్గమందు, పునరావర్తనంబును=మరలఁబుట్టుటయు, నివృత్తంబునఁగ=నివృత్తిమార్గమున, మోక్షంబును=సంసారవిచ్ఛిత్తియు, సిద్ధించుఁగ=ఏర్పడును, ప్రవృత్తకర్మంబులలోనఁగ=ఆరబ్ధకర్మలలోఁ, ఇష్టాపూర్తంబులు=ఇష్టము పూర్తము, అనఁగ, రెండుమార్గంబులు=త్రోవలు, హింసా...పంబులు=విశసన రూపము, ద్రవ్యరూపము, కామ్యరూపము, అయిన, దర్శ=అమావాస్య, పూర్ణమాస=పున్నమ, వీనియందు చేయు ఇష్టులు, పశుయాగ=పశు విశసనముతోడి యజ్ఞమును, వైశ్వదేవ=పాకయజ్ఞము, బలిహరణము, ప్రముఖంబులు=మొదలైనవి, యాగాదికంబులు=యజ్ఞము మున్నగునవి, ఇష్టంబులు=ఇష్టనామముగలవి. దేవతాలయ=దేవాలయముల ను కట్టించుట, వన=తోఁపులువేయించుట, తటాక=చెఱువు ద్రవ్వించుట, ప్రముఖములు=మొదలయినవి, పూర్తమను పేరుగలవి, ప్రవృత్తకర్మంబునఁగ= ప్రవృత్తిమార్గములోఁ, దేహి=జీవుఁడు, దేహంబు=శరీరము, విడిచి, దేహాంతరారంభంబునఁగ=ఇతర దేహముదాల్చఁబోవునప్పుడు, హృదయాగ్రంబునఁగ= దహరాకాశమందు, వెలుంగువానితోడఁగ=ప్రకాశించువానితోఁగూడ, ఇంద్రియంబులనుకూడ, భూతసూక్ష్మయుక్తుండై = సూక్ష్మభూతములతోఁ గూడినవాఁడై, ధూమమార్గంబు=పొగతోడిదారి, అయిన, కృష్ణ.. వలనఁగ =కృష్ణపక్షమందలి చీకటి రాత్రి అమావాస్యలవలన, సోమలోకంబు=చంద్రమండలదేశమును, చేరి, భోగావసానంబునఁగ=పుణ్యపాపము లనుభవిం

-చిన పిదప, విలీనదేహుండు=జీవునిలో నిమిడియున్న దేహము గలవాఁడు, వృష్టిద్వారంబునన్=వర్షోదకముగుండ, క్రమంబునన్=వరుసగా, ఓషధి... బులన్=మొట్ట మొదట వరి మొదలగు పైరుగా నయి తర్వాత తీఁగగా నయి పిదపనన్నమును పదపడి స్త్రీపురుషుల శుక్లశోణితములరూపమును, ప్రాపించి =పొంది, భూమియందున్=మనుష్యలోకమున, జన్మించున్=పుట్టును, ఇది, పునర్భవరూపంబు = మరల పుట్టుటయను, పితృమార్గంబు = పితృదేవతల త్రోవ, నివృత్తికర్మనిష్ఠుండు = నివృత్తికర్మయందుండువాఁడు, అయినవాఁడు, జ్ఞానదీప్తంబులు=వివేకముచే భాసురములైనవి, అయిన, ఇంద్రియములందు, క్రియాయజ్ఞంబులన్=కర్మయజ్ఞముల చేత, యజించి=యాగము చేసి, దర్శనాది సంకల్పరూపంబు=చూచుట వినుట ఆఘ్రాణించుట మొదలయిన సంకల్పరూపమయినది, అయిన, మనంబునందు, వికారయుక్తము = నానావికారములతోఁగూడిన, మనంబును=చిత్తమును, వాక్కునందును, విద్యావిలక్షణ=చదువుచే సంస్కరింపఁబడినది, వాక్కును, వర్ణసముదాయంబునందున్=అక్షరముల సమూహమందును, అకా...కము=అకారఉకారమకారములతోఁ జేరినది, ఓంకారంబునందు, ఓంకారమును, బిందువందున్=అనుస్వారమందు, బింగువును, నాదంబునందున్=స్వరమందు, నాదంబును, ప్రాణంబునందున్, ప్రాణంబును, వీనినన్నిటిని, బ్రహ్మమందున్=పరమాత్మయందు, నిలుపఁలయును=లయింపఁజేయవలయును, దేవమార్గంబు=దేవతలదారి, అయిన, ఉత్తరాయణ, శుక్లపక్ష, దినా=పగలు, ప్రాహ్ణ=దినపూర్వభాగము, పూర్ణిమా=పున్నమ, రాక=సంపూర్ణచంద్రునితోఁగూడిన పున్నమ వీనివలన, సూర్య...లందున్=సూర్యలోకము బ్రహ్మలోకమందును, చేరి, భోగావసానంబునన్=కర్మానుభవ మయినతర్వాత, స్థూలోపాధి = స్థూలకారణుఁడైన, విశ్వుండై = విరాడ్రూపుఁడై, సూక్ష్మంబునందున్=సూక్ష్మాంశములో, లయించి=లీనమయి, తైజసుండై = తేజోరూపముగలవాఁడై, సూక్ష్మంబును=సూక్ష్మపదార్థమును, కారణంబునందు, లయించి=పొందఁజేసి, ప్రాజ్ఞుఁడు=తెలిసినవాఁడు, సాక్షిస్వరూ-

పంబునందుఁ=కూటస్థునియందు, లయించి=ఇమిడించి, తుర్యుండై=ఆత్మస్వరూపియై, సూక్ష్మలయంబునందుఁ=సూక్ష్మత్వముపోయిన వెనుక, శుద్ధాత్ముండై=పరిశుద్ధమైన దేహముగలవాఁడై, ఇవ్విధంబునఁ = ఈలాగున, ముక్తుండు=మోక్షమందినవాఁడు, అగును.

ఆ. అమరనిర్మితంబు లై యొప్పుపితృదేవ
సరణు లెవ్వఁ డెఱుఁగు శాస్త్రదృష్టి
నట్టివాఁడు దేహి యై మోహమున నొందఁ
డతిశయించు బుద్ధి నవనినాథ. 438

టీ. అవనినాథ=భూపతీ, అమరనిర్మితంబులు=దేవతలచేతఁ గల్పింపఁబడినవి, ఐ, ఒప్పు=వెలయు, పితృదేవసరణులు = పితృమార్గదేవమార్గములు (ప్రవృత్తినివృత్తులు), శాస్త్రదృష్టిఁ=తత్త్వవిచారముచేత, ఎవ్వఁడు, ఎఱుఁగుఁ=తెలియునో, అట్టివాఁడు, దేహియై=శరీరధారియై, మోహమునఁ పొందఁడు=మాయలోఁ జిక్కఁడు, బుద్ధిఁ=తెలివిలో, అతిశయించుఁ=మీఱును.

తా. రాజా! ఇట్లు దైవకల్పితము లైనయీప్రవృత్తి నివృత్తిమార్గముల నెవఁడు శాస్త్రప్రకారముగాఁ దెలిసికొనునో ఆలాటిపుణ్యాత్ముఁడు దేహధారియై త్రిప్పులఁబడక విశేషవిజ్ఞానవంతుఁడై కృతకృత్యుఁ డగును.

వ. వినుము దేహాదులకుఁ గారణత్వంబున నాదియందును నవధిత్వంబున నంతమందును గలుగుచు బహిరంగంబున భోగ్యంబును నంతరంగంబున భోక్తయుఁ బరంబునఁ బరంబును జ్ఞానంబున జ్ఞేయంబును వచనంబున వాచ్యమును నప్రకాశమునఁ బ్రకాశంబును నైనవస్తువునకు వేఱొండు లేదు ప్రతిబింబాదికంబు వస్తుత్వంబునంజేసి వికల్పితం బై తలంపఁబడు.

భంగి నైంద్రియకం బైనసర్వంబును నర్థత్వంబున వికల్పితం బయి తోఁచుంగాని పరమార్థంబు గాదు దేహాదికంబులు మిథ్యాత్మకంబులు వానికి హేతువు లయినజ్ఞప్తిప్రముఖం బులును మిథ్యాత్మకంబు లగుట సిద్ధంబు పరమాత్మకు నవిద్య చేత నెంతదడవు వికల్పంబు దోఁచు నంతదడవును భ్రమం బునుం దోఁచు నవిద్యానివృత్తి యైనసర్వంబును మిథ్య యయి శాస్త్రవిధినిషేధంబులు గలలోపల మేలు గన్న తెఱంగగు భావాద్వైత క్రియాద్వైత ద్రవ్యాద్వైతం బులు మూఁడు గల వందుఁ బటతంతున్యాయంబునఁ గార్యకారణంబులందు వస్తు వొక్కటి యై యుండు నని యెఱింగి యేకత్వాలోచనంబు సేసి వికల్పంబు లే దని భా వించుట భావాద్వైతంబు మనోవాక్కాయకృతంబు లైన సర్వకర్మంబులను ఫలభేదంబు సేయక పరబ్రహ్మార్పణంబు సేయుట క్రియాద్వైతంబు పుత్త్రమిత్త్రకళత్రాది సర్వప్రా ణులకుం దనకును దేహంబునకుం బంచభూతాత్మకత్వం బున భోక్త యొక్కండనుపరమార్థత్వంబున నర్థకామంబు లయెడ నైక్యదృష్టిం జేయుట ద్రవ్యాద్వైతంబు నేర్పన నాత్మతత్త్వానుభవంబున నద్వైతత్రయంబును విలోకించి వస్తుభేదబుద్ధియుఁ గర్మభేదబుద్ధియుస్వకీయపరకీయబుద్ధియు స్వప్నంబులుగాఁ దలంచి ముని యైనవాఁడు మాన వలయు.

టీ. దేహాదులకు = శరీరము మొదలగువానికి, కారణత్వంబునకు = ఉత్పత్తి కారణమగుటచేత, ఆదియందును = మొదటను, అనర్థత్వం

బునఁ = కాలపరిమాణము నిర్ణయించుటచేత, అంతమందును = కొనయందును, కలుగుచుఁ = పుట్టుచు, బహిరంగంబునఁ = బాహ్యప్రపంచమందు, భోజ్యంబును = అనుభవింపఁదగిన వస్తువును, అంతరంగంబునఁ = లోపల, భోక్తయుఁ = అనుభవించువాఁడును, పరంబునఁ = ఇతరమైనదానియందు, అపరంబును = ఇతరముకానిదియు, జ్ఞానంబునఁ = తెలివియందు, జ్ఞేయంబును = తెలియఁదగినదియు, వచనంబునఁ = మాటయందు, వాచ్యంబును = మాటాడఁదగినదియు, అప్రకాశమునఁ = వెలుఁగులేనిచోట, ప్రకాశంబును = వెలుఁగున్ను, ఐన, వస్తువునకుఁ = పరమాత్మకు, వేఱు = భిన్నము, ఒండు = మఱియొకటి, లేదు, ప్రతిబింబాదికంబు = అద్దములో నీడమొదలైనది, వస్తుత్వమునంజేసి = రూపమునుబట్టి, వికల్పితంబై = భేదముగా భావింపఁబడినదై, తలంపఁబడుభంగిఁ = నమ్ముఁబడునట్లు, ఐంద్రియకంబు = ఇంద్రియవికారమైన, సర్వంబును = అంతయును, అర్థత్వంబునఁ = వస్తువులనుభావముతో, వికల్పితంబు = భేదముగా భావించఁబడినది, ఐ, తోఁచుఁ కాని = తట్టునుగాని, పరమార్థంబు = సత్యమైనది, కాదు, దేహాదికంబులు = దేహముమొదలయినవి, మిథ్యాత్మకంబులు=అబద్ధములైనవి, వానికిఁ = ఆదేహగేహాదులకు, హేతువులు = కారణములు,అయిన,క్షితిప్రముఖంబులును=భూమి జలము మొదలైనవియు, మిథ్యాత్మకంబులు=అసత్యరూపములైనవి, అగుట, సిద్ధంబు = రూఢియైనది, పరమాత్మకుఁ, అవిద్యచేతఁ = అజ్ఞానమువలన, ఎంతవడవు = ఎంతసేపు, వికల్పంబు = భేదము, తోఁచునో, అంతవడవును, భ్రమంబును = భ్రాంతియును, తోఁచును, అవిద్యానివృత్తి = అజ్ఞాననాశము, ఐనఁ = కాఁగానే, సర్వంబును = అంతయు, మిథ్య = రిత్త, అయి, శాస్త్రి... బులు = శాస్త్రిమందలి ప్రవృత్తినివృత్తిలక్షణమార్గములు, కలలోపలఁ = స్వప్నమందు, మేలు = మంచి, కన్నతెఱంగుఅగుఁ = చూచినట్లగును. భావా...బులు=భావాద్వైతము, క్రియాద్వైతము, ద్రవ్యాద్వైతము, నని, మూఁడు, కలవు, అందుఁ = వానిలో, పటతంతున్యాయంబు

నన్ = గుడ్డలోని దారములవలె, కార్యకారణంబులన్ = కార్య మైన ఘటాదికమందు, కారణమైన మృదాదికమందును, వస్తువు = మృదాదిపదార్థము, ఒక్కటి, ఐ, ఉండును, అని, ఎఱింగి, ఏకత్వాలోచనంబుజేసి, ఒక్కటేయనితలపోసి, వికల్పంబు=భేదము, లేదు, అని, భావించుట = నిశ్చయించుట, భావాద్వైతంబు, మనోవాక్కాయకృతం బులు = మనస్సుచేతను మాటలచేతను శరీరముచేతను చేయఁబడిన, సర్వకర్మంబులను = ఎల్లపనులను, ఫలభేదంబు = ఫలములతారతమ్యము, చేయక, పరబ్రహ్మార్పణంబుచేయుట = పరబ్రహ్మయందు సమర్పించుట, క్రియాద్వైతంబు, పుత్త్రి...లకున్ = కొడుకులు, స్నేహితులు, పెండ్లము మొదలైన యెల్లజీవులకును, తనకును, దేహంబునకున్ = తనశరీరమునకును, పంచభూతాత్మకత్వంబునన్=పృథివ్యాదిపంచభూతస్వరూపుఁడగుటచేత, భోక్త = అనుభవించువాఁడు, ఒక్కఁడు, అనుపరమార్థతత్త్వంబునన్ = నిజతత్త్వముచేత, అర్థకామములయెడన్ = కోరిక ద్రవ్యము వీనియందు, ఐక్యదృష్టిన్ = ఒక్కటి యనుభావన, చేయుట, ద్రవ్యాద్వైతంబు, నేర్పునన్=చాతుర్యముతో, ఆత్మతత్త్వానుభవంబునన్=బ్రహ్మతత్త్వము సాక్షాత్కారముచేసికొనుటచేత, అద్వైతత్రయంబును = భావద్రవ్యక్రియాద్వైతములమూఁటిని, వస్తుభేదబుద్ధియున్=పదార్థము పలుదెఱఁగు లను భావనయు, కర్మభేదబుద్ధియు=పుణ్యపాపకర్మలు వేఱనుభావించుటయును, స్వకీయపరకీయబుద్ధియున్ = తనది యితరునిది అనుభావనయు, స్వప్నంబులు=కలలు, మిథ్యలు, కాన్, తలంచి=నిశ్చయించి, ముని=ఆత్మతత్త్వానుసంధానము చేయువాఁడు, మానవలయును = ఈభేదబుద్ధిని విడువవలయును.

క. వాదములు వేయు నేటికి
వేదోక్తవిధిం జరించువిబుధుఁడు గృహమం

దాదరమున నారాయణ
పాదంబులు గొలిచి ముక్తిపదమున కేఁగున్. 470

టీ. వాదములు = తర్కములు, వేయును, ఏటికి=ఏల, గృహమందునన్ = ఇంటిలో, వేదోక్తవిధిన్ = వేదములయందుఁ జెప్పినట్లుగా, చరించువిబుధుఁడు = నడుచుకొనుపండితుఁడు, ఆదరమునన్ = గాఢభక్తితోడ, నారాయణపాదములు = విష్ణుపాదములు, గొలిచి=సేవించి, ముక్తిపదమునకున్=మోక్షస్థానమునకు, ఏఁగున్ = పోవును.

తా. రాజా! వేయితర్కము లెందులకయ్యా? ఏయడవులపాలై పోవలసినదియు లేదు. జ్ఞానియైనవాఁడు ఫలమును ఈశ్వరార్పణముగాఁ జేయుచు సమస్తవేదోక్తకర్మలను జేయుచునే గృహమందే యుండి భక్తితో శ్రీమన్నారాయణుని కైంకర్యము సలిపి ముక్తి నందవచ్చును.

శా. భూపాలోత్తమ మీరు భక్తిగరిమస్ఫూర్తిన్ సరోజేక్షణ
శ్రీపాదాంబుజయుగ్మమున్ నియతులై సేవించికాదే మహో
గ్రాపత్సంఘములోనఁ జిక్కక సమస్తాశాంతనిర్జేతలై
యేపారంగ మఖంబు సేసితిరి దేవేంద్రప్రభావంబునన్. 471

టీ. భూపాలోత్తమ=రాజులలోమేటియైన యోధర్మరాజా, మీరు (పాండవులు), భక్తిగరిమస్ఫూర్తిన్=భక్తిగౌరవముకలిమిచే, సరో...మున్=శ్రీహరియడుగుఁదామరలజంటను, నియతులు=నియమముగలవారు, ఐ, సేవించి=కొలిచి, కాదే = కాదఁటయ్యా, మహో...లోనన్ = పెద్దభయంకరమైనపిలుఁగులలోఁ జిక్కుకొనక, సమస్తాశాంతనిర్జేతలై=ఎల్లదిక్కులను గెలిచినవారై, దేవేంద్రప్రభావంబునన్= ఇంద్రమహిమతో, ఏపారంగన్=పెంపుమీఱఁగా, మఖంబు=యజ్ఞము, చేసితిరి.

తా. రాజులకంటెను రాజవయిన యోధర్మరాజా! ఇంతయేల మీ యన్నదమ్ములైదుగురు ఈమహానుభావుఁడైన యీశ్రీకృష్ణపరమాత్మయొక్క పాదద్వంద్వము గాఢభక్తితో సేవించుటం బట్టియేకదా యేయిక్కట్టున కును లోనుగాక లోకములోఁ గలయెల్లరాజులను గెలిచి యింద్రవిభవము తో నింతటిమహాక్రతువును నిర్విఘ్నముగాఁ జేయఁగలిగినారు! కావున వి ష్ణుభక్తులగువారెన్నఁడును వ్యర్థులు గారు.

వ. వినుము పోయినమహాకల్పంబునందు గంధర్వులలోన నుప బర్హణుం డనుపేర గంధర్వుండనైననేను సౌందర్యమాధు ర్యగాంభీర్యాదిగుణంబుల సుందరులకుఁ బ్రియుండనై క్రీడిం చుచు నొక్కనాఁడు విశ్వస్రష్టలైనబ్రహ్మలు దేవసత్త్రమని యెడియాగంబులోన నారాయణకథలు గానంబు సేయుకొ ఱకు నప్సరోజనులను గంధర్వులనుం జీరిన. 472

టీ. పోయిన=కడచిన, మహాకల్పంబునందుఁ,గంధర్వులలోనన్=అశ్వముఖులలో, సౌందర్య...బులన్=సోయగము నేత్రప్రియత్వము రాజ సము మొదలగుగుణములచేత, సుందరులకున్=జవ్వనులకు, ప్రియుండన్=ఇష్టమైనవాఁడను, ఐ, క్రీడించుచున్=విహరించుచు, విశ్వస్రష్టలు=లో కములనిర్మించువారు, దేవసత్త్రము=ఒకయాగము, అప్సరోజనులు=అప్స రస్స్త్రీలు, చీరినన్=పిలుచనంపఁగా.

ఆ. క్రతువులోని కేను గంధర్వగణముతోఁ
గలసి పోయి విష్ణుగాథ లచటఁ
గొన్ని పాడి సతులఁ గూడి మోహితుఁడనై
తలఁగి చనితి నంత ధరణినాథ. 473

టీ. ధరణినాథ=యుధిష్ఠిరభూపాలా, ఏను, క్రతువులోనికిన్=యజ్ఞములోనికి, గంధర్వగణముతోన్=గంధర్వులసమూహముతో, అచటన్=ఆదేవసత్త్రమందు, కొన్ని విష్ణుగాథలు=హరికథలు, పాడి, సతులన్=జవ్వనులను, మోహితుఁడన్ = కామించినవాఁడను, అంతన్ = తర్వాత, తలఁగి చనితిన్ = తొలఁగిపోయినాను.

తా. రాజా! అట్లు స్త్రీలతోఁ గలసిపోయి ఆదేవసత్త్రయాగమందు కొంతసేపు సంగీతముఁ బాడి అంతట స్త్రీలమీఁది మోహముచే నాజవ్వనులను వెంటవేసికొని అక్కడనుండి లేచిపోయినాను.

క. వారిజగంధులపొత్తున
వారిం గైకొనక తలఁగి వచ్చినబుద్ధిన్
వా రెఱిఁగి శాప మిచ్చిరి
వారింపఁగ రానిరోషవశమున నధిపా. 474

టీ. అధిపా=రాజా! నేను, వారిజగంధులపొత్తునన్ = అచ్చరలకూటమితో, వారిన్ = ఆబ్రహ్మలను, కైకొనక = లక్ష్యపెట్టక, తలఁగి = తొలఁగి, వచ్చినన్, వారు, బుద్ధిన్ = మనస్సున, ఎఱిఁగి, వారింపన్ కన్ రానిరోషవశమునన్ = ఆపరాని కోపముచేత, శాపమిచ్చిరి.

తా. రాజా! నే నట్లు యజ్ఞమధ్యమున స్త్రీలోలుఁడనై లేచిపోయిన సంగతి వారు గ్రహించి అత్యంతాగ్రహమున నాకు శాపమిచ్చినారు.

ఆ. పంకజాక్షు నిచటఁ బాడక కామినీ
గణముఁ గూడి చనినకల్మషమున
దగ్ధకాంతి వగుచు ధరణీతలంబున
శూద్రజాతిసతికి సుతుఁడ వగుము. 475

టీ. ఇచటన్ = ఇమ్మహాక్రతువునందు, పంకజాక్షున్ = శ్రీహరిని, పాడక, కామినీగణముల్ = కాముకలైన స్త్రీలగుంపును, చనినకల్మషమునన్ = పోయినందునసైన పాపముచలన, దగ్ధకాంతివి = తఱిగిన వన్నెగలవాఁడవు, అగుచున్, ధరణీతలంబునన్ = భూమిమీఁద, శూద్రజాతిసతికిన్ = శూద్రస్త్రీకి, సుతుఁడవు = బిడ్డవు.

తా. ఇచ్చట క్రతుసమాప్తి యగుదాఁక నారాయణగుణకీర్తనముఁ జేయక మాతోఁ జెప్పకయే స్త్రీలను దగులుకొనిపోయిన పాపముచే నీవు భూలోకమున నొకశూద్రస్త్రీకడుపునఁ బుట్టుము.

వ. అని యిట్లు విశ్వస్రష్టలు శపించిన నొక్క బ్రాహ్మణదాసికిఁ బుత్రుండనై జన్మించి యందు బ్రహ్మవాదు లయినపెద్దలకు శుశ్రూష సేసినభాగ్యంబున నిమ్మహాకల్పంబునందు బ్రహ్మపుత్రుండనై జన్మించితి. 476

టీ. శపించినన్ = తిట్టఁగా, బ్రాహ్మణదాసికిన్ = బ్రాహ్మణులయింటి పనికత్తెకు, పుత్రుండు = కొడుకు, బ్రహ్మవాదులు = వేదపాఠమును జేయువారు, శుశ్రూష = సేవ, భాగ్యంబునన్ = మాహాత్మ్యముచేత, బ్రహ్మపుత్రుండన్ = బ్రహ్మమానసికపుత్రుండను, ఐ, జన్మించితిన్ = పుట్టితిని.

ఆ. కౌశలమున మోక్షగతికి గృహస్థుఁ డే
ధర్మ మాచరించి తగిలి పోవు
నట్టిధర్మమెల్ల నతివిశదంబుగాఁ
బలుకఁబడియె నీకు భవ్యచరిత. 477

టీ. భవ్యచరిత = మేలినడవడిగల యోధర్మరాజా, గృహస్థుఁడు = ఇల్లుగట్టి కాఁపురము సేయుమనుజుఁడు, కౌశలమునన్ = నేరుపుతో, ఏధర్మము, ఆచరించి = చేసి, మోక్షగతికిన్ = మోక్షమార్గమునకు, తగిలి = చొచ్చి, పో

వునో, నీకు, అట్టిధర్మమెల్లను, అతివిశదంబుగాన్ = మిగులఁ దేటతెల్లముగా, పలుకఁబడియెన్ = చెప్పఁబడెను.

తా. రాజా! గృహస్థుఁడు ఉపాయయుక్తుఁడై దేశకాలములకుఁ దగినట్లు ఏయుత్తమధర్మ మాచరించి మోక్షగామియగునో అట్టిధర్మస్వరూపమంతయు నతివిసరముగా నీకుఁ జెప్పితినిగదా?

మ. అఖిలాధారుఁ డజాదిదుర్లభుఁడు బ్రహ్మంబైనవిష్ణుండు నీ
మఖమందర్చితుఁడై నివాసగతుఁడై మర్త్యాకృతిన్ సేవ్యుఁడై
సఖుఁడై చారకుఁడై మనోదయితుఁడై సంబంధియై మంత్రియై
సుఖదుండయ్యెభవన్మహామహిమ దాఁ జోద్యంబు ధాత్రీశ్వరా.

టీ. ధాత్రీశ్వరా = భూమిపతీ, అఖిలాధారుఁడు = ఎల్లప్రపంచమునకుఁ బట్టైనవాఁడు, అజాదిదుర్లభుఁడు = బ్రహ్మాదులకు నందరానివాఁడు, బ్రహ్మంబు = పరమాత్మ, ఐన, విష్ణుండు, నీమఖమందు = నీయజ్ఞమందు, అర్చితుఁడై = ముందుపూజింపఁబడినవాఁడై, మర్త్యాకృతిన్ = మానవరూపముతో, నివాసగతుఁడై = నీయింటనున్నవాఁడై, సేవ్యుఁడై = కొలువఁదగినవాఁడై, సఖుఁడై = మిత్రుఁడై, చారకుఁడై = అన్నిపనులయందును నీబంటై (వేగరియై), మనోదయితుఁడై = చిత్తప్రియుఁడై, సంబంధియై = చుట్టమయి, మంత్రియై = సర్వకార్యములందునుమంత్రియై, సుఖదుండు = ఇహపరసుఖము లొసఁగువాఁడుగా, అయ్యెను. భవన్మహామహిమ = నీగొప్పప్రభావము, తాన్ = అది, చోద్యంబు = అద్భుతము.

తా. రాజా! ఎల్లజగములకు నిల్లైనవాఁడు, బ్రహ్మాదిదేవతలకు సయితము గోచరముకానివాఁడు, పరాత్పరుఁడైన శ్రీకృష్ణపరమాత్మ నీయింట వచ్చినిలచి నీచే నీయజ్ఞమున నగ్రపూజఁగొని లీలామానుషవిగ్రహుఁడై నీచేతఁ గొలిపించుకొనుచు నీకుస్నేహితుఁడై అన్నిపనులలో బంటువలె నుండి చిత్త

మునకు వచ్చినవాఁడై ఇష్టబంధువుఁడై సర్వకార్యములలోఁ గుశలత గలమంత్రియై యిహపరముల నిచ్చుచున్నాఁడు నీపుణ్యమేమయ్యా!

వ. అని యిట్లు నారదుండు సెప్పినవృత్తాంతం బాతయు విని ధర్మనందనుండు ప్రేమవిహ్వలుం డై వాసుదేవునిం బూజించె వాసుదేవధర్మనందనులచేతఁ బూజితుం డై నారదమునియు దేవమార్గంబునం జనియె నని శుకయోగీంద్రుండు పాండవపౌత్త్రునకుం జెప్పె నని సూతుండు శౌనకాదులకుం జెప్పిన. 479

టీ. వృత్తాంతము = కథ, ప్రేమవిహ్వలుండై = అనురాగముచే మైమఱచినవాఁడై, వాసు...చేతన్ = శ్రీకృష్ణునిచేతను ధర్మరాజుచేతఁగూడ, పూజితుండై = సత్కరింపంబడినవాఁడై, దేవమార్గంబునన్ = ఆకాశవీథిని, చనియెన్ = పోయెను, పాండవపౌత్త్రునకున్ = పాండుకుమారులమనుమఁడగు పరీక్షిన్మహారాజునకు.

క. రాజీవసదృశలోచన
రాజీవభవాది దేవరాజివినుత వి
భ్రాజితకీర్తిలతావృత
రాజీవభవాండభాండ రఘుకులతిలకా. 480

టీ. రాజీవసదృశలోచన = తామరలవంటికన్నులు గలవాఁడా, రాజీ...నుత = బ్రహ్మ మొదలగు దేవతలబారుచేఁ బొగడఁబడినవాఁడా, విభ్రా...భాండ = మెఱయుచున్న కీర్తి యనుతీఁగచే నల్లబడిన బ్రహ్మాండకటాహము (గంగాళము) గలవాఁడా, రఘుకులతిలకా = రఘుమహారాజువంశమునకు వన్నె దెచ్చిన యోశ్రీరామచంద్ర చక్రవర్తీ!

మాలిని. ధరణిదుహితృరంతా ధర్మమార్గానుగంతా
నిరుపమనయకాంతా నిర్జరారాతిహంతా
గురుబుధసుఖకర్తా కుంభినీచక్రభర్తా
సురభయపరిహర్తా సూరిచేతోవిహర్తా. 481

టీ. ధరణిదుహితృరంతా=పుడమికూఁతురగు సీతతోఁ గ్రీడించు వాఁడా, ధర్మమార్గానుగంతా = న్యాయమార్గము ననుసరించువాఁడా, నిరుపమనయకాంతా = సాటి లేనినీతిచే నందమయినవాఁడా, నిర్జరారాతిహంతా = దేవతలశత్రువు లగురాక్షసులను జంపినవాఁడా, గురుబుధసుఖకర్తా = గురువులకు పండితసాధువులకు మేలుచేయువాఁడా, కుంభినీచక్రభర్తా = భూమండలమునకు నాథుఁడా, సురభయపరిహర్తా = దేవతలభయమును బాఱఁదోలినవాఁడా, సూరిచేతోవిహర్తా = జ్ఞానుల చిత్తములలోఁ గ్రీడించు నో శ్రీరామచంద్రమహారాజా! దయమీఱఁ జిత్తగించుము.

శ్రీః శ్రీః శ్రీః.



# ప్రకటన.

---

ఈ సప్తమస్కంధమువలెనే అష్టమ నవమ దశమ స్కంధములను సులభ టీకాతాత్పర్యములతోడ ముద్రించెదము.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

| | |
|---|---|
| **192, ఎస్ప్లనేడ్** | చెన్నపురి. ఈ. |
| **828, తండియార్పేట** | |

